శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౫ { వ్యయ చైత్ర-భాద్రపదములు } సంచిక ౧-౩



కాకినాడ:

[illegible] ముద్రాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0.

1946-47.

# వి ష య సూ చి క.





శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౫ { వ్యయ<br>చైత్ర-భాద్రపదములు } సంచిక ౧-౩

## పార్థివ సంవత్సర వార్షికసభ.

శ్రీ జయపురాధీశ్వరుల అధ్యక్షభాషణము.

మహాజనులారా,

ఈ పవిత్రమగు పరిషదధ్యక్ష పీఠంబును నాకు మీరెల్ల నొసంగి నందులకై మీకు వందనంబు లర్పించువాడను.

సభాధ్యక్షుండు మొదటఁ బలుకు నేమమును పాటింప నిక్కడ నిలచితిని. అంతేకాని, నూతన విషయముల నుడివి తమరిని సంతసింపం జేయుటకు గాదు. తా మెఱుంగని విషయములు లేవు. శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాది సహితమని సాహిత్య శబ్దమునకు నిర్వచనము. అది పదమువలన శాస్త్రములును గ్రాహ్యములు. కనుక నిప్పటి తెనుఁగు భాష సమగ్రసాహిత్యసమన్విత మనలేము గదా !

“ఒకటి” “ఒకఁడు” “ఒకరితి” మొదలగు పదములకును, వర్తమానకృత్తులు వాడు క్రియాదులకును బెక్కురూపములు పరిదృశ్యములు.

ఒక శబ్ద మనేకరూపములను దాల్చుటకుఁ గారణము తత్ప్రయోక్తలు నియమరహితులగుటయె. పూర్వకవులలోఁ గూడఁ గొందఱు నియమరహితప్రయోగములను జేసినవారు గలరు. నియమరహితప్రయోగములు గ్రాహ్యములు గానేరవు. తప్పు తప్పే; అది యొప్పు గాఁజాలదు. నియమరహితరూపములు పెఱుఁగుటవలన భాష వెగటువుట్టునట్లుగా మాత్రమె యేర్పడును.

ఇప్పుడు వస్తునిచయము ప్రియముగా నున్నను, కవిగణము చౌకగా నున్నది. లోహఖనినుండి చాయలుగల లోహము నేఱునట్లు వర్తమాన కవిగణమునుండి నిక్కమగు కవి నేఱవలసియుండును.

మాటాడుభాష నియమరహితమైనను హాని కలుగదు. గ్రంథస్థభాష చిరస్థాయి యగుచు వివిధదేశజుల పాఠ్యమగుటవలన నది నియమసహితమైయె యుండవలెను.

అనువాదిత నవలా నాటకాదులందు స్వరచిత నవలా నాటకాదులందు సందర్భశుద్ధి సహితము మృగ్యమగుట శోచనీయము.

పుస్తకము పండితసమాలోచితమగుట శ్రేయస్కరము. సమాలోచకుఁడు పండితుఁడుగాను, పక్షపాతరహితుఁడుగా నుండవలెను. కాని, నేటి సమాలోచకులలోఁ గొందఱను జ్ఞానహీనులనియో, యసూయాగ్రస్తులనియో యనక తప్పదు.

నా [illegible] పెక్కు నాటికలతోఁ గాలహరణము [illegible] ప్రయ[illegible] సాఫల్యాన్వితములు మన్నింపఁబడునుగాక !

౧౦-౬ ౨౯. }

శ్రీ విక్రమదేవవర్మ.

# ధా రు ణి.

ఈనెల తే ౧౦ ది సభయందు శ్రీ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు "ధరుణి" యను జలమనియు, దానినుండి పుట్టిన దగుటవలన భూమికి ధారుణీనామము వర్తించుననియు నుడివిరిగదా !

"ధరుణ' అను పులింగరూపమునమాత్రమె జలార్థము గలిగి యున్నట్లు అష్ట నిఘంటువునందుఁ గలదు. 'ధరుణ యందు పుట్టినది ధారుణమగును. కాని ధారుణి గానేరదు. ప్రాచీన నిఘంటువునందు 'ధారుణి' యన్నరూపమున్నట్లు గలదు. మఱి యేనిఘంటువు నందును ధారుణీరూపముగాని ధరుణీరూపముగాని కానరాదు. అథర్వవేదమునం [illegible] ధరుణీశబ్దప్రయోగము గలదు. అది యే [illegible] యున్నను లోకవ్యవహారానర్హము.

[illegible] పర్యాయపదము వహ్ని కుంపటువలన జలమునందుఁబుట్టినది వహ్ని యనియే లోకవ్యవహారము. కాని భూమియను [illegible] యుండదే [illegible].

ఇట్లు
శ్రీ విక్రమదేవవర్మ.

# ANDHRA UNIVERSITY

## NINETEENTH CONVOCATION

## 6TH DECEMBER, 1945

## ADERESS BY THE PRO-CHANCELLOR

[Sree Sree Sree Maharajah Dr. Vikrama Deo Varma Garu,
Hon. D. Litt. (Andhra), Kala Pr apurna ]

శ్రీః

హరిః ఓమ్.

ప్రపంచమునందలి ప్రజాస్వామిక ప్రభుత్వములు సంతరింపబడి వ్యక్తిస్వాతంత్ర్యమునకు స్వస్తిఁజెప్పి, కుల జాతి వర్ణ వైషమ్యములను స్థిరపఱచి, ప్రపంచమున నియంతృత్వమను పేర నిరంకుశపాలనమును బాదుకొల్పుటకు బద్ధకంకణమయిన నాజీప్రభుత్వ మడుగంటినది. సకలజాతుల స్వేచ్ఛకును, ఎల్లవ్యక్తుల స్వాతంత్ర్యమునకును, నిబద్ధబుద్ధి యయిన మిత్రమండలియొక్క విజయపతాకలు లోకమునందంతట నెగురుచున్నవి. ఆ విజయపతాకల సాంద్రచ్ఛాయలలో నీ సుందర పురమున నేఁడు మనమందఱమును సమావేశమయియున్నాము. పెను గాలి వీచి ప్రపంచమునఁ గల్లోలమును గల్పించిన ప్రచండమగు తుపానువంటి యీ యుద్ధము శాంతించినతరువాత, నెవ్వరియాస్తులను వారు వెదకుకొని, కుదుటఁబడుటకుఁ బ్రయత్నించునట్లు, సకలజాతులును దమ తమ యుద్ధానంతర పునర్నిర్మాణకార్యక్రమమునకుఁ గడంగుచున్నారు. ఇట్టి యవస్థలో మన భారతీయులను దన భావిభాగ్యోన్నతికయి యాశాపూరితస్వాంతములతో, పాశ్చాత్యగగనమునకుఁ జూపులు నిగిడించుచున్నది. స్వాతంత్ర్యభానుని యుదయకాంతులు భారతీయ హృదయాంతరాళములను బెలుఁగొందఁజేయుచున్న నేఁడు, భావిశుభోత్కర్షతో మనవారల యుల్లములు పల్లవించుచున్న యీ నాఁడు, యువకులు, ఆశాపూరితులు, ఉన్నతాకాంక్షులు, అభివృద్ధి

...సులు, అతిశయితవిద్యావినయసంపన్నులు అయిన మీ తేజో ...ము ...ముఖావలోకనము ఎవరికి సంతోషకరము కాకుండును.

వివిధ పట్టభాయలయిన పట్టభద్రులారా! మీకందఱకును మనః పూర్వకమయిన నా యాశీర్వాదము. పురుషార్థముల నేమఱకుండ, ఆత్మగౌరవమును గాపాడుకొనుచు, ధర్మమార్గమును దప్పక, లోక క్షేమంకరమయిన నడతతో మీమీస్థానముల నలంకరించి లోక యాత్ర నడుపుఁడు. లోకమున మంచినడవడి కెల్లను వరునడిన్మొనసూత్ర మొకటియే గలదు: 'నీవు సుఖపడి యితరులను సుఖపెట్టుము.' ఇంత కంటె నుపదేశింపవలసినది వేఱు లేదు.

ఇప్పుడు మన కందఱకును సామానాధికరణ్యమును సంపాదింప హేతువయిన యీ విశ్వకళాపరిషత్తునకుఁ దిరిగి యొకసారి యుపా ధ్యక్షులుగా నెన్నుకోఁబడిన శ్రీయుతులు కట్టమంచి రామలింగారెడ్డి గారిని, పరిషత్సభ్యులను, ఈ సందర్భమున నేను మరల మరల నభినం దించుచున్నాను. కష్టపుఁ దుపానులలోను, ఆందోళనవాత్యలయందును దారి తప్పనీయక, తిరుగఁబడకుండ నీపరిషన్నౌకను నడపింపఁగలిగిన సుప్రసిద్ధకర్ణధారియయిన మన రెడ్డిగారిపట్ల నాంధ్రలోకము కృతజ్ఞతను వెల్లడింపవలసి యున్నది. యుద్ధవాతావరణమున విశ్వకళాపరిషత్తునకుఁ ... నికట ... సంప్రాప్తిల్లినవి. మొదటిది స్థానభ్రంశము. రెండవది ...రావాసము. సంకుచితప్రదేశమున అసంకుచితమయిన మేధతోఁ ...కార్యక్రమమును నడిపింపఁ గలిగిన సమర్థులు శ్రీ రెడ్డిగారు ...నసనే వారు విజయులైరి. మరల నీవిశ్వకళాపరిషత్తునకు యథా పూర్వమయిన స్థితిని సంపాదించి, యుత్తరోత్తరాధికమయిన వృద్ధిని, శ్రీ రెడ్డి గారు సంపాదింపఁ గలరని, నే నెఱుంగుదును. ఈవిశ్వకళాపరిషత్తునకు, ఉత్తరోత్తరమయిన వృద్ధికలుగఁగలదని, నేను దృఢముగ నమ్ముచున్నాను. దీనికి ...ము. ఉపాధ్యక్షుల యక్షయసామర్థ్యమే యనక తప్పదు.

విశ్వకళాపరిషత్తు, కార్యక్రమమును ప్రారంభించినప్పటి నుండియుఁ గాకున్నను సుమారు 14, 15 సంవత్సరములనుండి, అనర్ఘ విద్యావిధానమును, ఆచరణలోఁ బెట్టి పని సాగించుచున్నది. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఆంధ్రులకేమి చేసిన దని ప్రశ్నింపవచ్చును. ఆంధ్రుల భాగ్యోదయమే దీనికర్తవ్యము. ఆంధ్రయువకులకు ఉన్నతవిద్య నిచ్చుటయే యిచ్చటి బీజము విద్యకుఁ దగిన యవకాశము, అవకాశము నకుఁ దగిన యాదాయము, ఆదాయమునకుఁ దగిన యభ్యున్నతి. ఇది యొక్క నాఁటిపని గాదు. ఈపరిషత్తే—దారములలో, పండితప్రకాండములు విద్యాబీజములను విద్యార్థుల బుద్ధియందు నాఁటి, పెంపొందింపఁ జేయు చున్నారు. ఆవిత్తనములు మొలకెత్తి, సస్యములయి, ఫలించి, దేశ దేశములలో, విలువగలిగి వెలయుచున్నవి. ఎమ్. ఏ. పరీక్ష యందుఁ గృతార్థత నందుట కవకాశమును సంపాదించుకొనుటయే కృత్యాద్యవస్థ, జన్మసాఫల్యము, అనురీతిని భావించుకొనవలసిన యవస్థలో నుండిన యాంధ్రయువకులకు నేఁడు, ఎమ్ ... డి. యస్. సి. మొదలయిన బిరుదపట్టములు ... వనుటలో వింత లేదు. దీనికి నిదానము విశ్వకళాపరిషత్తు. దివ్యవిద్యాసంపన్నులయిన యువకులు పూర్వపశ్చిమ సముద్రములు ... నడుమ నాసేతుహిమాచలంబయిన భారతావనిని భిన్నభిన్న స్థల ములలో నున్నతస్థానములలో నున్నవారనుటకీ పరిషత్తే హేతువు. బొంబాయి పత్తనమునందలి ప్రకృతిసంస్థలలో పూనలోని ప్రభుత్వ యంత్రాగారములలోను, బెంగుళూరిలోని పరిశోధనాలయములయం దును, ఢిల్లీయందలి ప్రభుత్వస్థానములను నేఁడాంధ్రయువకుల హస్త చాలనకు, మేధావిధానమునకుఁ, గొంచెమో గొప్పయో అవకాశము కలిగియున్నది. ఇది యెంతయు ముదావహము. ఇంతియకాదు. ఇది బీజరూపమయిన విద్యావ్యాప్తిమాత్రమే.

పరిషత్కార్య స్థానమునఁ బ్రయోగశాలలలో, ఉపన్యాస వేది కలపయి, గ్రంథాలయమునందలి గదులలో జరుగు నిరంతర జ్ఞానాభివృద్ధి, పరిశోధనరూపమునఁ బండితప్రకాండులవలన జరుపఁబడుచునే యున్నది. అనేక శాఖ లభివృద్ధి నందుచున్నవి, మచ్చునకు మాత్రి మొక్కదానిని బేర్కొందును. మత్పూర్వుఁడైన జయపురాధీశ్వరుని పేర శ్రీరామచంద్రదేవ నామాంకిత మయిన యాచార్యపదవిని, అది యున్న శాఖను బరిశీలింపఁ దగినది. అత్యల్పారంభమున మొదలిడిన పదార్థవిజ్ఞానశాస్త్రశాఖ నేఁడు విశ్వకళాపరిషత్తునకు గర్వహేతువయినది. పరిశ్రమయందును, పరిశోధనయందును, భవ్యవిజ్ఞాన బోధనయందును, నవ్య విజ్ఞాన సాధనయందును నద్వితీయమయి యున్నది. భారతదేశమునకుఁ బ్రకృతిశాస్త్రసంబంధమయిన 'నోబిలు బహుమానము' అను జాహ్నవిని దీసికొనిరాఁగలిగిన చంద్రశేఖర రామను మహాశయునిచే "గురువును మించిన శిష్యుఁడు" అని పేర్కొనఁబడిన భగవంతము పంతులుచే నిర్వహింపఁబడుచున్న దీసంస్థ. పదార్థవిజ్ఞానశాఖ యౌన్నత్యమునకు యథార్థహేతువు రామచంద్ర దేవ నామాంకితాచార్యపదవియని యానందించు చున్నాను.

ఈ శాఖ క్షేమాత్రమును దగ్గిపోవని యితర శాఖలను గూడ నేను బేర్కొనఁగలను. నూతన పదార్థ విభజనము సేయుచున్న రసాయనశాస్త్రశాఖ, భూగర్భస్వరూప విజ్ఞానమును దెలుపుచున్న భూగర్భశాస్త్రశాఖయుఁ జక్కని పని చేయుచునే యున్నవి. ప్రకృతి శాస్త్రముల యందలి ప్రయోగములవంటివానిని నెఱపకపోయినను ఆలోచనాప్రయోగమాత్రమును జేయుచున్నవి. అయినను అర్థశాస్త్ర గణితశాస్త్ర వేదాంతశాస్త్ర వాణిజ్యశాస్త్ర భాషాశాస్త్రాదిశాఖలన్నియును దత్తదధికారుల సామర్థ్యమున నియతవ్యాపారములను బ్రఖ్యాతముగ నిర్వర్తించుచునే యున్నవి. న్యాయశాస్త్రమును బోధించు కళాశాల స్థాపింపఁ బడుటవలన నొకలోటు

దీఱినది. వ్యవసాయశాస్త్రి కళాశాలాస్థాపనమువలనఁ కృషిజ్ఞానాభి వృద్ధికి మార్గ మేర్పడినది. అచిరకాలములో నేర్పడనున్న ఇంజనేరింగు కళాశాలవలన కార్మికజ్ఞానాభివృద్ధియుఁ గాఁగలదు. ఇది యంతయును ఆంధ్రియువకుల యదృష్ట మనక తప్పదు.

మీా యుపాధ్యక్షులు శ్రీ రెడ్డిగారు నేఁడు ప్రతిసంవత్సరలక్ష సంఖ్యాకమైనద్రివ్యమును ప్రభుత్వమునుండి యదనముగ సంపాదించు కొని వచ్చియున్నారు. దీనివలన నిందలి యాచార్యుల కెల్లరకును దుష్టియుఁ గళాపరిషత్తునకుఁ బుష్టియుఁ గలుగుఁగావుత మని యాశీర్వ దించుచున్నాను. ఇంకను ద్రవ్యము గావలయును.

శ్రీ తుమ్మలపల్లి శ్రీ హరినారాయణగారు అన్నపాన వస్త్రి దానములకంటె శ్రేష్ఠతరమగు విద్యాదానముకొఱకు ఒసంగిన పదిఁది వేల రూప్యములను గూర్చి వారిని ప్రశంసించుచు ఆంధ్రదేశములోని ధనవంతులు వారిమార్గము ననుసరింపవలయునని కోరుచున్నాను.

మీా కెల్లరకును శుభమగుఁ గాత.

# కుమారసంభవ విమర్శము.

విద్వాన్. సా. భక్తవత్సలము, బి. ఏ.

---

(అనువృత్తము.)

మన్మథోద్యోగము భగ్నమై యతనినే బలిగొనినది. దేవతల దురుపాయ మిట్లు విఫల మగుడు, ఈశుని యీశత వారి చిత్తమున నాటుకొనెను. వేఱుపాయముల కాయన వశుఁడు కాఁడని నిశ్చయించుకొని వారు "రాక్షసులవలననుండి మమ్ముఁగావుము, వైరిసంహారకుని చమూపతిని బ్రసాదింపుము. అందులకై పరిణయ మంగీకరింపు" మని మొఱపెట్టుకొనుచు నీశ్వరుని శరణువేడిరి. [VI—27]. ఆర్తత్రాణపరాయణుఁడును భక్తవరదుఁడు నగు పరమేశుఁడు లోకక్షేమార్థము పరిణయమున కియ్యకొనెను. పార్వతియుఁ దపముచే శివుని మెప్పించి ప్రసన్నుఁడైన యాదేవుని తన ప్రయోజనమును దేవతల ప్రయోజనము నగు పరిణయమున కియ్యకొలిపెను. పరిణయము జరిగెను. దేవతల యీప్సిత మీడేఱెను.

111

ఇచ్చట నానుషంగికముగ నొక విశేషము నరయఁదగును. క్రొత్తపోకడల యందలి యభిమానముచే నందుమెలఁగువా రటుండ, ఒకరి ననుకరించినఁ దమతక్కువఁదనము బయల్వడు నేమో యను సంకోచముచేఁ గ్రొత్తపోకడలనే యభిమానించు కవులు గలరు. అనుకర్తలును పలువురు గలరుకదా! కాని యనుకరణములు అనుకార్యములకన్న నించుకైన న్యూనములుగ నుండుటయే యందఱ యనుభవము. అనుకార్యముల మించు ననుకరణము లరుదు. కాళిదాసుని యనుకరణములు మాత్ర మిట్టివేయనుట జగత్ప్రసిద్ధము. ఇతరులు చెప్పిన విషయములనే చెప్పునెడ వారి కందని సూక్ష్మవిశేషములను గొన్నిం

టిని తన వాక్యముల నతిచమత్కారముతో ధ్వనింపఁజేయుట కాళి దాసునకుఁ గర మలవడిన మార్గము. కుమారసంభవకావ్యమును దాని మూలంబులగు శివాగ్ని లింగాది పురాణములతోఁ బోల్చుచు శ్రీమదాది కళాప్రపూర్ణులు వేదము వేంకటరాయశాస్త్రిలవారు (కీర్తిశేషులు) ఇట్లానతిచ్చిరి :—"అడవిలోని పుష్పరసమునకును గిన్నెలోని తేనెకును, గనిలోని బంగారమునకును, బైఁడి తొడవునకును, తోఁటలోని చెఱుకునకును, జేతిలోని కలకండకును ఎట్టిభేదమో అట్టిభేదమే శైవాదిపురాణములకును కుమారసంభవ ప్రబంధమునకును గలదు." అని. అట్లే ప్రభవ పుష్య విభ వాషాఢ భారతులలో మాయన్నగారు (శ్రీ. నే. రామదాసుగారు) మేఘసందేశ కావ్యవిమర్శనమున "జలధర సమయే మానసం యాన్తి హంసాః" అను కవిసమయ నిర్వాహప్రకారముఁ జెప్పుచు 'ఈమేఘాగమహంసాపగమ యోగ పద్యముం గూర్చిన కవనమున సులువుగాఁదోఁచు శాత్రవసమర్థకమైన కల్పనకు ఉదాహరణము లెన్నియేని యున్నను ...... కాళిదాసు సర్వేతరకవివిలక్షణముగా మేఘహంసమైత్రిం గల్పించె"నని. ఇంక నట్టివిశేషములఁ గొన్నింటిని దెలిపిరి. ఈవిషయమునే యనుకరించుచు నైషధ శ్రీహర్ష శ్రీనాథులు శిబికాధరులు దమయంతిని వాసుకికడకుఁ జేర్చుటను మేఘములు హంసలనుమానససరస్సునకుఁ జేర్చుటతోఁ బోల్చిరఁట. కుమారసంభవముననుు నట్టి విశేషముల రెండింటి సరయుదము:—

(i) ఇంద్రుఁడు కొండల ఱెక్కలను ద్రక్కలించుటయు మైనాకుఁడు మాత్రము సముద్రముఁ జొచ్చి తప్పించుకొనుటయు—పురాణ ప్రసిద్ధమును ఇతిహాసప్రసిద్ధమును జగత్ ప్రసిద్ధము నగు కథ. ఇందు సులువుగఁ దోఁచునది సముద్రుని యాశ్రితత్రాణతత్పరతయే. అట్లే మహాభారత ప్రణేత సముద్రుని "వజ్రపాతన సంత్రస్తమైనాక స్యాభయ

ప్రదమ్" అని పొగడినాఁడు. భర్తృహరియు మైనాకునే తెగడి నాఁడు:—

వరం ప్రాణోచ్ఛేద స్సమదమఘవన్ముక్తకులిశ
ప్రహారై రుద్గచ్ఛద్బహుళదహనోద్గారగురుభిః!
తుషారాద్రే స్సూనోరహహా పితరి క్లేశవివశే
నచాసౌ సంపాతః పయసి పయసాం పత్యురుచితః.

I iii 29.

కాని కాళిదాసుని మైనాకవర్ణనముం గనుఁడు :-

అసూత సా నాగవధూపభోగ్యం
మైనాక మంభోనిధిబద్ధసఖ్యమ్
క్రుద్ధేఽపి పక్షచ్ఛిది వృత్రశత్రా
వవేదనాజ్ఞం కులిశక్షతానామ్.     1—20.

నాగవధూపభోగ్యుఁ డనుటచే మైనాకుని సౌభాగ్యము అంభోనిధి బద్ధలఖ్యుఁడనుటచే నతని మిత్రబలసంపదయు సూచితములు. శరణాగమనమును మఱుగు పఱచి మిత్రబలసంపన్నతారూపమగు మైనాకోత్కర్షయే ధ్వనించునట్లు చెప్పిన నేర్పు అనన్యాదృశము. అంతటి మిత్రబలసంపన్నుఁ డగుటచేతనే ఇంద్రునంతటివాఁడు కనలి పిడుగునే విసరినను, దానిదెబ్బ యితనిం దాఁకదు. మఱి మిత్రబలము కలిమి ఉత్కర్షయే యయినను మిత్రునివలనఁ గదా దెబ్బ తప్పిన దనుట యుత్కర్షం దగ్గింపదాయన్న, తగ్గింపదు రత్నమునకు విలువ కాన్తి వలననే యయినను రత్నమును వేఱుగఁ గొని విగుణ మని గ్రహింతురా ?

స్వయా దీప్త్యా రత్నం భవదపి మహార్ఘం న విగుణం
నకుంఠస్వాతన్త్ర్యం భవతి చ నచాన్యాహితగుణమ్.

(ii) అట్లే కామోద్యోగమునకుం గూడ కాళిదా సాక విలక్ష
ణతం గూర్చి యతని శీలము నాదర్శముగఁ జేసెను.

కాముఁడు విష్ణుదేవుని మానసపుత్త్రుఁ డని కొన్ని పురాణము
లును లక్ష్మీదేవికే పుట్టిన కుమారుఁడని మఱికొన్ని పురాణములును
జెప్పుచున్నవి. ఇతఁడు ప్రేమరసాధిదేవత. ఇతని ధ్వజమందలి జలచ
రము మీనమని కొందఱును మకరమని కొందఱును జెప్పుదురు, కా
వున మీనకేతనుఁ డనియు మకరధ్వజుఁ డనియుఁ గూడ నితనికిఁ బేరు
లయ్యెను. ఇతనికి ధనువు చెఱకుగడయని కాని పువ్వులనికాని చెప్పుట
కలదు, కాన నితఁడు ఇక్షుచాపుఁ డనియుఁ బుష్పధన్వుఁడనియుఁ జే
ర్కొనఁబడుచున్నాఁడు. బాణములును బుష్పములే యగుటచేఁ గుసు
మసాయకుఁడనియు నవియు నైదగుటచేఁ బంచబాణుఁడు విషమాస్త్రుఁ
డుననియు నితని కభిధానంబులు గల్గెను. ఇతని బాణము లైదింటికిని
అరవిందాశోకచూతనవమల్లికా నీలోత్పలములనియు మోహనోన్మా
దన సంతాపనశోషణ నిశ్చేష్టాకరణములనియుఁ బేర్లు. లోకప్రవృత్తికై
ప్రాణులకు విషయవాంఛను ప్రేమను ఉత్పాదించి మిథునముల కాక
ర్షణము నొనగూర్చుట యితనివిధి. అట్టి యాకర్షణము లోకప్రవృ
కావశ్యక మగుట లోకప్రవృత్తి యితనిపై నాధారపడి యున్నదనియు
నితఁడు లోకమునకై పాటుపడు నింద్రార్కాగ్నిరాయ్వాదులవంటివాఁ
డనియు వారిలో నొకఁడనియు నేర్పడుచున్నది. లోకప్రవృత్తికి వలసిన
మోహమును బ్రాణులకుఁ గల్గించువాఁడై యొక్కొక్కతఱి నామో
హము నస్థానమునను గల్గింప వలసినవాఁ డగుచుండును. అస్థానోత్పన్న
మయ్యు నామోహము లోకప్రవృత్తికి నుపకరించుచునే అస్థానోత్పన్న
మగుటచే నుత్పాదనుఁడగు మన్మథునికి దుఃఖములు గల్గించుచుండును.
స్వార్థనిఃస్పృహుఁడును లోకారాధన శీలుఁడునై యతఁ డట్టి దుఃఖము
లనుభవించుచుండును. బ్రహ్మదేవున కతని కూఁతురగు సరస్వతిపై
వలపుఁగొలుపుట యిందుల కుదాహరణము. అందులకై బ్రహ్మ కినిసి

కాముని శపించినాఁడు 'కాలకంఠుని కంటి మంటలనలంగు'మని. మదనుని కషాయము మూడిన జంతుసృష్టి నిలిచిపోవునని తలంచి ధర్ముఁడను ప్రజాపతి యాచింపఁగా నలువ యీతీఱున శాపావసాన మొసఁగెను: "ఈశ్వరుం డెప్పుడు పార్వతీతపంబుచే వశీకృతుఁడై యామెం జేపట్టి యానందంబునం బొందునో అప్పుడు మదనునికి మరల నతని దేహము నొసంగు"నని. [IV 40—44]. దేవతలు బ్రహ్మోపదిష్టులై యీశుఁడు పార్వతిం బరిణయమగునట్లు చేయుమని మన్మథుంబూన్చిరి. మహేశ్వరుఁడు దేనికిని లోఁబడనివాఁడును అన్నిటిని లోఁబఱచుకొనువాఁడును నగుటను బ్రహ్మయు దేవతలు మఱచినను, మన్మథుఁ డేని తనకు వినాశము గల్గునని యూహించుకొన లేకపోయినాఁడాయన్న బ్రహ్మశాపబలముచే నూహించుకొనలేకపోయెనని చెప్పఁదగియున్నను కాళిదా సట్లు చెప్పక, ఊహించుకొనియుఁ దనశరీరము నశించినను, నశించును గాక యను నిశ్చయముతోనే యతఁడు కడంగినట్లు చెప్పినాఁడు. ఇందువలన నతని శీలము కరము ప్రశంసనీయ మగుచున్నది! ఇంద్రుఁడు తనకు ప్రభువగుట నతని యాజ్ఞసాధ్యమగునా కాదా యని యోచింపక సాధ్యమేని సాధించుటయో అసాధ్యమేని తానే దానికి బలియగుటయో భృత్యధర్మమని నిశ్చయించి, ప్రాణవ్యయమునకు సైతమొడికట్టిన మన్మథుని నడవడిని, తాము శ్రమలకోర్చి పరార్థముల సాధింపఁ బాటువడు నెల్లసత్పురుషుల నడవడి నెట్లో యట్లు, పొగడక తప్పదు. కావుననే మహేశ్వరుఁడును తోలుతఁ దన యీశతం బ్రతిష్ఠించుకొనుటకై మరుని గాల్చి కూల్చినను, పార్వతిం బరిణయమైన యనంతరము మదనునికి మరల నతని దేహమిచ్చెను. దేవతలును దేవుని శరణు వొచ్చి తమమనోరథము నీడేర్చుకొనుటయే కాక తమకై తన్నర్పించుకొనిన మరుని యెడఁ గృతజ్ఞులై హరునికిం బ్రణమిల్లి శాపావసానమున లబ్ధశరీరుండగు పంచశరుని సేవ నంగీకరింపు

మని ప్రార్థించిరి. ఆభగవంతుఁడు నట్ల యంగీకరించుటయేగాక యటు పైనిఁ దనయెడనైతము మీనకేతనుని సాయకవ్యాపారము జరుగుట కనుమతించెను. [ VII 92-92 ]

IV

ఏడుసర్గల చిన్నకావ్యమున నొక్కసర్గను బూర్తిగా రతివిలాపమునకుం గాళిదాసు వినియోగించినాఁడన్న నతఁడు దానికిం గూర్చిన ప్రాముఖ్యమును వేఱుగ వర్ణింపనేల ?

అయినను దిక్ప్రదర్శనముగఁ గొంత :-

1. ఒకకావ్యమందలి సన్నివేశములకు సమాంతరములను బ్రత్యంతరములను నితరకావ్యములలో నొనగూర్చుట కాళిదాసునికిఁ బ్రియమును, అలవడినదియు. రఘువంశసప్తమసర్గలోని యజుఁడు నిదర్భం బ్రవేశించు ఘట్టమును, ఇందలి సప్తమసర్గలో శివుఁడు ఓషధిప్రస్థమును బ్రవేశించుఘట్టమును సమాంతరములు. ఇందలి రతివిలాపమందలి యజవిలాపము నొండొంటికిఁ బ్రత్యంతరములు. అది యాలిపై మగనిగోడు. ఇది మగనికై యాలిజాలి. 2. కామదహనకథ కొంతకనీతిని బయల్పఱచుట ఈ 'రతివిలాప' ప్రయోజనములలో మొదటిదిగాఁ గప్పుద్దిష్టమని తోఁచెడిని. లోకమునకుఁ దారకాసురునిబాధను మాన్పఁ గోరిన సురలు అంతులకుఁ బరమేశ్వరుని శరణు చొచ్చుట యను సదుపాయమును మాని యాదేవుని కామబాణములచే లోఁబఱచుకొన యత్నించు దురుపాయమును పన్నుటచే తొలికష్ట మట్లుండఁగా లోకమునకు మన్మథుఁడు లేకపోవుటయను పెనునష్టముకూడఁ గల్గినది. 3. ఈకథనే చెప్పుచు రామాయణమున వాల్మీకి మన్మథుని దుర్మతి యనెను. అట్లు కాక కాళిదాసు మన్మథుని ప్రభ్వారాధనశీలునిగా పరార్థము తన్నర్పించికొన్న మహోదారునిగా భావించినాఁడు. మన్మథుని యట్టి యుదాత్తత వ్యక్తపఱచుట 'రతివిలాప' ప్రయోజనములలో రెండవది. సూర్యచంద్రాగ్ని వాయ్వాదులపై నెంతో అంతకన్న

నెక్కుడుగనే మన్మథునిపై నీలోకప్రవృత్తి యాధారపడి యుండుటచే నట్టి కాముని దహనమువలన లోకమునకు వాటిల్లిన నష్టమును తత్పరిహారావశ్యకతయు, పరిహారప్రకారమును గాళిదాసు 'రతివిలాపము'నఁ దెలిపినాఁడు. ఈశ్వరుం డగ్గి చూచుచు మరుఁడు మంటఁ గలిసెనని చెప్పి యంతటితో నాఁగక 'రతివిలాపము'ను కరుణతమముగ వర్ణించుటచే నింతటికిని హేతుభూతమగు నీశ్వరుని నిగ్రహశక్తి మెఱుఁగుదేఱి కావ్యమున నాయకోత్కర్ష నినుమడింపఁజేయుట తన్ముఖ్యప్రయోజనములలో మూఁడవది. 5. మేనకాహిమవంతులయు పార్వతీపరమేశ్వరులయుఁ బ్రేమలకు పరభాగోత్కర్షఁ గూర్ప రతీమన్మథుల ప్రేమయు వలసియున్నందున దానిని వ్యక్తముసేయుట 'రతివిలాప' ప్రయోజనములలో నాలవది.

V

ఇఁకఁ బ్రసక్త మేమనఁగాఁ గాళిదాసు మువ్విధములుగఁ జిత్రించిన ప్రేమ :- 1. అందు మొదటి తెఱఁగు ప్రేమయిది ఇంద్రియసుఖాభిలాష యని చెప్పఁ దగును. [Sensuous love; passion.] దీనినే కామమనియు భోగలోలుపత్వమనియుఁ జెప్పుట కలదు. విశ్వవ్యాప్తమైయుండు ప్రేమ యిట్టిదే. సర్వప్రాణులును సామాన్యముగ దీనికే వశులై యుందురు. ఇది స్వభావతః తుచ్ఛమనియు క్షణభంగురసుఖనిమిత్తకమనియు నిట్టి యాకామము నణంచుకొనుట వివేకుల కర్తవ్యమనియు నార్యధర్మము ఉద్ఘోషించుచున్నది. ఈప్రేమను గాళిదాసు ఋతుసంహార మేఘసందేశ కావ్యములయందును మాళవికాగ్నిమిత్రవిక్రమోర్వశీయ నాటకములందును వర్ణించియున్నాఁడు. కుమారసంభవకావ్యమునఁ గూడ నీప్రేమను రతీమదనులయందు వర్ణించినాఁడు. రతీదేవిని భర్తృమరణమునకై వగచిన దెల్ల తద్ధేతుకమై వాటిల్లిన భోగవిచ్ఛేదమువలననే యని యామె విలాపాలాపముల

స్పష్టము. 2. కాళిదాసు వర్ణించిన రెండవరకపు ప్రేమను గృహస్థధర్మమని పేర్కొనఁ దగును. [The house-holders' love, dutiful love.] ఇది గృహస్థుఁడు తప్పక వహింపవలసిన యుదార భావమే కాని తుచ్ఛము కాదు. అపత్నీకునకును అపుత్రకునకును మానవత్వపూర్తి లేదని హిందూధర్మము. కావున మానవత్వపూర్తికై పత్నీపుత్రులతోఁడి దగు కౌటుంబికజీవనము విధింపఁబడిన దగుచున్నది. ఒక్కొక్క కుటుంబములోనివారు అన్యోన్యానురాగబద్ధులై యుంట భగవత్కుటుంబమగు నీవిశ్వములోని మన మెల్లరమును నట్లుంటకు మార్గదర్శకమై యున్నది. ఈయాంగ్లాభియుక్త వచనములం గనుఁడు : The life of the householder was religiously enjoined on every Aryan in the olden days. He learnt a necessary lesson in life by marrying and having children. Man meant man+wife+child. Matrimonial life adds sense of responsibility that raises man's moral level. Man as soon as he is wedded breaks the spell of isolation and begins to think more of his better half and his children than of his own comforts in life. It is in family life where he has to deny himself in ever so many ways that he learns the first lessons of unselfishness. Surely family life is the nursing ground for such loudable aspects of one's moral nature as regard for others, self-denial, self-sacrifice, unselfish devotion to the deserving one. Everyman is enjoined gradually to try to expand his love of wife and children into the love of his neighbours, city, country, nation and universe. prof. Mukherji says that the saints of India realized the Universal Soul through love and devotion. Swami Viveka nanda:

Who loves all beings without distinction
He indeed is worshipping best his God."

AWAKENED INDIA, January, 1944.

ఇట్టి యీగృహస్థుల ప్రేమను కాళిదాసు రఘువంశమహాకావ్యమునను అభిజ్ఞానశాకుంతలనాటకమునన్ను వర్ణించియున్నాఁడు. కుమారసంభవమున నీప్రేమను మేనకాహిమవంతులయందు వర్ణించినాఁడు. రఘువంశమున దిలీపమహారాజును ఇంద్రియార్థములయందుఁ దగులుకొనని వానినిగను వంశావిచ్ఛేదమాత్రాపేక్షిగను గవి వర్ణించినాఁడు. పెండ్లి యెందుల కనుప్రశ్నకు రఘువంశరాజుల పక్షమునఁ గవి చెప్పిన బదులు 'ప్రజాయై' 'సంతానముకొఱకే' అని. అదే ప్రశ్నకు మేనకాహిమవంతులవిషయమునఁ గాళిదా సిచ్చినజవాబు 'కులస్యస్థితయే' 'వంశప్రతిష్ఠకొఱకు' అని. శాకుంతలమునను దుష్యంతుఁడు అడలినది, సంతానవిచ్ఛేదమునకు, అలరినది సంతానప్రాప్తికిని.

3, కాళిదాసుని మూఁడవవిధంపుఁ బ్రేమను ఐకాత్మ్యమనియేని ఆత్మల యైక్యమనియేని చెప్ప నొప్పును. [Union of Souls: Spiritual Love: Divine Love.] ఇట్టిప్రేమ యపూర్వము, అనన్యాదృశము, అలోకసామాన్యము, ఉదాత్తతమము, ఆదిమదంపతీస్థితము. ఇందుం గూర్చి కీ. శే. డా. హరప్రసాదశాస్త్రులవా రిట్లు ప్రశంసించిరి - In the depiction of Parvati's love for Siva in the Kumara, Kalidasa reaches the highest height that love can reach in human conception. Love is here an absolutely divine sentiment and no passion. Parvati wants to be united to Siva, not a union of the flesh but a union of the spirit. Such an idea of lofty spiritual love is unknown in the literature of any country.

Vol. 9, INDIAN HISTORICAL QUARTERLY,

కావుననే ఈశ్వరుని బతిగాఁ గాంక్షించుచుండిన పార్వతి కామమును వదలినట్టి దని చెప్పుట పొసఁగినది. పార్వతీప్రేమయొక్క యట్టి యుత్కర్షను స్పష్టపఱచుటకే కాళిదాసు మన్మథుని బలియిచ్చి తపస్సును

సాధనముగా నిబంధించినది. మన్మథుఁడు లౌకికప్రేమరసాధిదేవత. అతఁడు దేనికిం బనిపడఁడో యట్టిప్రేమ యలౌకిక మనియు నతిలౌకిక మనియు నెఱుఁగనగును. మన్మథుని యుద్యమము విఫల మగుటయే కాక, యతఁడే దానికి బలి యగుటచే నతఁడు చెనకఁబూనుకొనిన మహేశుని జితేంద్రియతయు నిగ్రహామహిమయు స్పష్టమగుచున్నవి. మన్మథునికిం జొరరాని యాదేవునిచిత్తమున మొలకెత్తు ననురాగము పవిత్రతమమైన దని యేర్పడుచున్నది. తపస్సును సాధనముగాఁ జెప్పుటచేఁ బార్వతి సంపాదించుకొనిన యనురాగము యత్నాంతరాలభ్యమనియు, సౌందర్యాదిగుణసాపేక్షము కాదనియు, నన్యదురాప మనియు నేర్పడినది ఈశుని దాస్యమే తనకు ధారకముగాఁ గల్గి తపించుచుండిన పార్వతికి నీశునిపైఁ బ్రాభవమును, ఈమె యెడ నీశునికి దాస్యముం దుదకు సిద్ధించినవి.

అద్యప్రభృత్యవనతాఙ్గి తవాస్మిదాసః
క్రీతస్తపోభి రితి వాదిని చన్ద్రమౌళౌ
అహ్నాయ సా నియమజంక్లమ ముత్ససర్జ
క్లేశః ఫలేన హి పునర్నవతాం విధత్తే V—86.

ఈశతాదాస్యముల నిట్లు విపర్యస్తములఁ గావించినట్టి గరిమ యాప్రణయమునకుఁ గల్గినది యది ఘోరమహాద్భుతతపఃఫలమగుటచేత.

VI

ఈశ్వరుఁ డిట్లు పార్వతికిఁ దన్నర్పించుకొనుటకు ముందామెం బరిశీలించిన తెఱంగు రోమహర్షణము. 1. ఆమె ప్రేమచేత శివుని యర్ధదేహమును హరించుననియు సవతులు లేనిదై యాయనకు నేకభార్యగాఁ గ్రాలుచుండు ననియు నారదునాదేశము. దేవముని యశ్లాఘనతిచ్ఛియున్నందువలనను, మంత్రసంస్కృతమైన యాహుతిని బొందుటకు అగ్ని తప్ప కడమ తేజఃపదార్థములు తగనట్లే పార్వతిం జేపట్టుటకుఁ బరమశివుఁడు దక్క మఱియే వేల్పును తగనందువలనను, హిమవంతుఁడు

తనయకు నిండువయసు వచ్చినను మఱియొకని కీఁదలంపక యూర కుండెను. పార్వతికి వయసు మీఱుచున్నను బరమశివుఁడు వివాహముం బ్రస్తావింపకే యుండెను. అట్లుండుట పార్వతీపర్వతుల యోరిమిం బరిశీలించుటకే. 2. వేడికోలు వ్యర్థమగునేమో యను జంకుచేత నద్రిరాజు వేడక యూరకుండఁగా నీశ్వరుఁడే తపస్సునకై హిమవత్సానువుం జేరును. ఎదుటివారిని వివాహముం బ్రస్తావింపనీయని తపోవ్రతియై యట్లు పజ్జసేయుండుట వారి పరీక్షార్థమే. 3. అంతట నీశ్వరశుశ్రూషార్థము హిమవంతుఁడు నియమవతిని పార్వతిని జయావిజయలను నిరువురు సఖులు తోడుగా నియమించెను. తనసౌందర్యమునకును అస్ఖలితనిత్యకైంకర్యమునకును ఈశుండు వశుఁడగునని పార్వతి యెంచెను. కాని యామె తను సేవించుచుండుటకు ఒప్పుకొనియు శివుఁడామె తలంచినట్లు వటుఁడు గాక ధీరుఁడే యైయుండెను. ఆమె ప్రతిక్షణము నిట్లు తాత్కాలికముగ భంగపెట్టుటయు నొక పరీక్షయే. 4. ఈ లోఁగా దేవతలు పరమేశ్వరుని పెండిలి కియ్యకొలుపఁ గోరి యద్దేవుని మన్మథబాణములకు గుఱిసేయఁ దివిరిరి. ఈదురుపాయఫలితముగా మరుఁడు భస్మావశేషుఁ డగుటయేకాక తపఃప్రతికూలలగు స్త్రీల చెంతనుండరాదని ఈశ్వరుఁ డంతర్ధానమొందెను ఇట్లు దేవతలు నమ్ముకొని యుండిన స్మరబాణములను పార్వతి యాధారపడి యుండిన నిజసౌందర్యమును రెంటిని వ్యర్థపఱచి పరమశివుఁ డింకను పార్వతి యేమి సేయునోయని పరిశీలించెను. 5 పార్వతి శివుని చిత్తము కఠిన మనుకొనక తన రూపమునే నిందించుకొని యీశ్వరుఁడు తపోలభ్యుఁడే యని తీర్మానించుకొని పిత్రనుజ్ఞాతయై తపమునకుఁ బూనుకొనఁగా ఈశ్వరుఁడొకపాటి తపమునకుఁ దత్కాంక్షితం బొనఁగూర్పక యామె యేమి సేయునో పరిశీలింపఁ గోరెను. 6 అంత నామె శరీరసౌకుమార్యమును గణింపక తోయాగ్నిమధ్యవాస వ్రతాదిసనాథమగు కఠోరతప మారంభించెను. తమంతటఁ దామురాలిన తరుపర్ణముల నాహారముగాఁ

గాని జీవించుచుఁ దపించుట మునివృత్తికిఁ బరాకాష్ఠగా గణింపఁబడు చుండెను. తపఃకాలమునఁ బర్ణభక్షణము సైతము మాని యామె యపర్ణయను సార్థకనామము గడించెను. ఇంతటితో నేని ఈశ్వరుఁడు యథాస్వరూప మగపడక కుహనావటురూపమునఁ బొడసూపి పార్వతియెదుట శివుని కర మపకర్షించెను 7. ఆవటుదుర్వాదమునకుఁ బార్వతి పరమార్థభూతమగుసమాధానముం జెప్పి నిజేశ్వరప్రావణ్యమును జక్కఁగా బ్రకాశపఱచి, వాని యభినివేశమునకుఁ గినిసియు నిందింపక తొలంగి మూర్ఖు లసమాధేయు లను వివేకమును నిజక్షమాతిశయమును జూపెను. 8. ఇట్లు పరీక్షించి పరీక్షించి పరీక్షలలో మెఱుఁగులు తేఱిన యమేయప్రభావశాలినికి "నేఁటినుండి నేను నీదాసుఁడ" నని యీశుండుదన్నర్పించుకొంటయు నొకపరీక్షయే యాయెను. ఎట్లన వెంటనే తదంకము నధిష్ఠింపక జగజ్జనని పితృదత్తయయ్యే పరమేశ్వరుం బడయునదై యాస్వామి నందుల కియ్య కొలిపి అతనిని బ్రీతునింగావించి, పితృదత్తయె యాయనం జెందెను.

VII

ఈ కావ్యమున నాయికానాయకు లు పార్వతీపరమేశ్వరులు జగజ్జననీ జనకు లు. పరాత్పరులగు వారియంతటి యుదాత్తు లెవరు లెట్లగుదురు ? ఇకఁను వారి కన్న నుదాత్తులగు నాయికానాయకులు ఏ వాఙ్మయమం దుందురు ? కాళిదాసు వర్ణించినట్టివి పార్వతీదేవి యొక్క కల్యాణగుణగణౌఘ మహార్ణవ శీకరపరమాణువులు కొన్ని —
1 అభిజాత్యము: హిరణ్యగర్భుని ప్రసిద్ధాన్వయమునఁ బర్వతచక్రవర్తికిని పితరుల మానసిక పుత్త్రికి మహర్షులకు సైతము మాననీయకు మేనకకును జన్మించినది; కడలి చెలికాఁడును పిడుగువలన సైతము వెఱపు లేని వాఁడు నగు మైనాకుని చెలియలు. 2 పరత్వము. పూర్వదేహమును యోగముచే విడిచి పునర్జన్మమునకు మేనకను జేరినది. కావున స్వాధీనములగు జన్మాదులు గలది. చరాచర విశ్వసుఖావహాజన్మదినము

గలది హవిస్సు అగ్ని కేవల ఈశ్వరునకే తగినది. అన్వేషింపనిది. అన్వేషింపఁబడునదియు నగురత్నము పవిత్రుఁడగు హిమవంతుని బవిత్రీకరించునది. తపస్సుచేఁ దపస్వులను మించి యపర్ణ యాయెను. ఈమె తపోవనము జగత్పావనము. మెకములకు జాతివైరముం బోకార్చి తరువులకు సైతము అతిథిసత్కారసామర్థ్యమును గూర్చినది. హర శరీరార్ధమును హరించినది. 3 సౌందర్యము: అలోకసామాన్యము, రతీదేవికిం గూడ లజ్జఁగూర్చునట్టిది, మన్మథుని నష్టవీర్యమును పునర్జీవించునది, సకలశుభలక్షణసంపన్నము. 4 తత్త్వజ్ఞానము: కుహనాపటుకృతదూషణములకుఁ బరమార్థభూతములగు సమాధానములిచ్చి, అల్పైశ్వర్యు లని చతుర్దిగధిపతులను సరకుగొనక, సౌందర్యముచే వశీకరింపరానివాఁడును, మన్మథాంతకుఁడు నగు పినాకపాణిఁ గోరినది. 5. పాతివ్రత్యము: నియమవతియై ఈశుని కస్ఖలితనిత్యోపచారములు తాఁ గావించుచుండిన కాలమున నాదేవుఁడు మన్మథుం గూర్చి తిరోహితుఁడు కాఁగా పార్వతి నిజసౌందర్యమును నిందించుకొన్నదేగాని స్వామిచిత్తము కఠిన మనుకొనలేదు. తపఃకాలమునఁ గూడ విసుగుచేనైనఁ బతిని నిందింపక, తచ్చరిత్రము, పాడుకొనుచుఁ గాలము నిరీక్షించుచుండిన మనస్విని. 6. ఉదాత్తత: పితృదత్తయయ్యు పరమశివుని బొందఁగోరెను. అర్థకామములను వర్జించి ధర్మము నాచరించెను, అతిథిదేవతగానుండెను. 7. ప్రకృత్యుపాసనము: నిస్తంద్రయైన గిరీంద్రనందన తానె చిన్న చిన్న వృక్షములను ఘటస్తనపయస్సంచయములచే వృద్ధినొందించెను. ప్రథమలబ్ధజన్మములగు వానినిమీఁది కుమారునిని కుమారుఁడుసైతము మిగుల్పనేఁడాయెను.

ఈకావ్యమున నీశునియందును నివి వర్ణింపఁబడినవి—1. సారమ్యము: తపఃఫలప్రదాత, బ్రహ్మవిష్ణ్వపరిచ్ఛేద్యప్రభావవిశేషుఁడు, దిగీశసేవ్యుఁడు, అన్నిటికిఁ దాను పుట్టుకస్థానమై తన కెట్టి పుట్టుకస్థానమును లేనివాఁడు, ఆదిమధ్యాంతరహితుఁడు. 2. దివ్యప్రభావము:

స్వాంగసంపర్కముచే పాదబూడిదను సైతము పతితపావన మొనర్చు వాఁడు, ప్రసిద్ధనేపథ్యమును సంకల్పమాత్రముచే సంతరించిన యద్భుతానుభావుఁడు. ఆదేవునిం గూర్చిన యాథార్థ్యము దుర్జ్ఞేయము, యోగి యయ్యు భోగి, భోగి యయ్యు యోగి. ఆ స్వామిని దూషించు దూషకుని మాటల కాతని ప్రయత్నము లేకయు నివారింప రాకయు స్తుత్యర్థము కలుగును. 3. సౌందర్యము: భువనమోహనము; పార్వతికే తగినవాఁడు. 4. వీర్యము:- త్రిపురాసురసంహారకుఁడు, విష్ణుదేవునకు నజయ్యుఁ డగుతారకాసురుని కితని సిగయందలి చంద్రకళ యలభ్యము. ఇతని వీర్యాంశసంభవుఁడు కాక యన్యు లెవ్వరుఁ బాని కుని గెల్వఁజాలరు. ఇతనిని జూచినంతమాత్రముచేతనే వశీకృతి సర్వలోకుఁడగు మన్మథుఁడు విగతవీర్యుఁ డాయెను. మనసుచేత సైతము నిరింపరానివాఁడు. 5. ధీరత: వికారహేతువు లున్నను వికారమునకు లోనుగాక పార్వతిసేవ కంగీకరించినవాఁడు; ఇనుము సూదంటురాయికి లోఁబడున ట్లితఁడు ఉమాసౌందర్యమునకు లొంగునని బ్రహ్మదేవుని యంతటివాఁ డనుకొనుటయు వెఱ్ఱిగానే యైనది. వసంతావిర్భావమున నితరయోగులు కలఁత నంది ప్రయత్నముచేఁ జిత్తవికారము నిరోధించి స్థైర్యము నార్జింపఁగా, పరమేశుఁ డించుకేని కలఁగక పరబ్రహ్మను సంధాననిష్ఠ వీడకుండెను. మదనుఁ డితనిని లోఁబఱచుకొనలేని పోవుటయటుండ నాయత్నమునం దన్నే కోలుపోయెను. 6. ఉదాత్తత:-తపస్సున కమ్ముడువోయిన భక్తదాసుఁడు. సప్తర్షుల నెంతో యంత గౌరవంధతిని సంభావించిన సర్వసముఁడు. హిమవంతునకుఁ బితామహునకును ప్రణతుఁడు.

## VIII

కాళిదాస దేశకాలపరిస్థితులు ఈగ్రంథమునం గొంతకుఁ గొంత కానవచ్చుచున్నవి. వాని నింత పరామర్శించి ఈ వ్యాసమును ముగించెదను.

1. రాజకీయముగ: సప్తమసర్గలోని యోషధిప్రస్థవర్ణనమును, అందలి జనుల రాజానురక్తిని పురాన్తఃపురముల యేకకులోపమేయతను బట్టి చూడఁగా కాళిదాసుని దేశము సౌరాజ్యరమ్యమనియు నదియ ఉక్తవర్ణనలందుఁ బ్రతిఫలించుచున్నదనియు నెంచనగును. 2. మతవిషయమున: బ్రహ్మవిష్ణుమహేశ్వర నామరూపము లొక్క భగవంతునివే యని కాళిదాసు బల్లగ్రుద్ది చెప్పవలసియుంటం జూడఁగా నప్పుడును ఇప్పటివలె విష్ణువు దైవము కాఁడని శైవులును, శివుఁడు దైవము కాఁడని వైష్ణవులును పామరులై కలహించుచుండిరనుట యూహ్యమై యున్నది—3. సాంఘికముగ- (a) తపోవర్ణనము, తపఃప్రభావవర్ణనము, వటువును వేదవిదాంవరుఁడని కీర్తించుట, దూషించునతనిం బార్వతి కనియమి, సప్తర్షులకు ఈశ్వరుఁడును హిమవంతుఁడును చూపిన గౌరవము—ఇవి విప్రులపూజ్యతను బ్రతిపాదించుచుఁ గాళిదాసు బ్రాహ్మణుఁడై యుండు ననియు, కావుననే వారి మాననీయత కాదర్శముల నొనఁగూర్చినాఁడనియుం దలఁపించుచున్నవి. (b) పార్వతీ మహిమాభివర్ణనము, అరుంధతీప్రశంస, మేనకాదేవిమతిసాచివ్యమును గొప్పసేయుట- వీనివలనఁ గాళిదాసు సాధ్వీమతల్లులు లోకవంద్యలని యుపదేశించుటం జూడఁగా నాకాలమునను స్వార్థపరులు అజ్ఞానులు స్త్రీలను స్త్రీలైనంతమాత్రముచేతనే యగౌరవించుచుండిరా యని సందేహింపఁదగి యున్నది. (c) ఎందుఁగాని మార్గదర్శకము లగు నియమము లెప్పుడుగలవో అప్పుడే తెలిసి వానిని పాటించువారును తెలియక వాని నతిక్రమించువారును ఉందురు. ఇట్టి పరిస్థితినే కాళిదాసు తన చుట్టును జూచుకొని లోకోపదేశకముగ నుండుటకై పరమేశ్వరుఁడు సైతము వివాహనిర్వహణమున నాచారము నక్షరమాత్ర మేని దాఁటనట్లును పార్వతి ఘోరతపోలబ్ధుఁడగు నీశ్వరుని పితృదత్తయయ్యే చెందినట్లును వర్ణించి నట్లున్నది. (d) సన్న్యాసుల మైననే కాని ఘనత రాదనుభ్రాంతి పలువుర కప్పు డుండుటం జేసి కాఁబోలు కాళిదా

నా భ్రాంతిం బాపను గార్హస్థ్యమును సప్తమసర్గలోఁ బెద్దఁజేసెను.
(e) మృతు లగు పతులతో సహగమనముఁ జేసిన సతులు లోకాంతరమున నా పతులతో గలసికొందురను నమ్మక మప్పు డుండెడి దని రతీ సహగమనప్రయత్నప్రస్తావముచేఁ గవి సూచించినాఁడు. సహగమనము పతులతో సతులకే విహితము గాని సతులతోఁ బతులకుఁ గాదు. విహితము కాని సహగమనమునకు లోకాంతరమునఁ గలసికొనుఫలము లే దని కాళిదాసే రఘువులోఁ జెప్పినాఁడు.

ప్రమదా మను సంస్థిత శ్శుచా
నృపతి స్సన్నితి వాచ్యదర్శనాత్
స చకార శరీర మగ్నిసాత్
సహ దేవ్యా, నతు జీవితాశయా. VIII-౭౬.
రుదతా కుత ఏవ సా పున
ర్భవతా నానుమృతాఽపి లభ్యతే
పరలోకజుషాం స్వకర్మభి
ర్గతయో భిన్నపథా హి దేహినామ్ VIII ౮౫

(f) కన్యఋతుమతియై యామరణము తండ్రియింట నుండనైన నుండవచ్చునే కాని యామె ననర్హుఁడగు వరున కీఁజెల్లదని మను ధర్మశాస్త్రము:—

కామ మామరణా త్తిష్ఠేద్
గృహే కన్యర్తు మత్యపి
న చైవైనాం ప్రయచ్ఛేత్తు
గుణహీనాయ కర్హిచిత్ IX-89.

పార్వతికి వయసు మీఱుచున్నను ఈశ్వరునికై వేచియుంచిన గిరిరాజును సమర్థించు కాళిదాసు ఏ యుగధర్మము లాయుగమునకే యను నాఁటి పండిత విశ్వాసమును బ్రతిఫలింపఁ జేసిన ట్లెంచఁ దగును.

# శివలీలావిలాసము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీరమణీరమణీయవి
హారనవాకార నీరజాతతనీలో
దార పరిలిప్తచందన
దోరన్తర యల్లవిభుని దొడ్డమహీశా!

వ. అక్కథకుండు శౌనకాదిమహర్షుల కిట్లనియె.

### ఆయిదవలీల.

గీ. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డవధరించినట్టిలీల
చంద్రధారణాఖ్యఁ జదురొందు నది జగ
ద్ధితవిధావితానచతురసరణి.

వ. ఒక్కనాఁడు దక్షప్రజాపతి చంద్రు రావించి నిజకన్యాసముదయంబులోన నశ్విన్యాదులగు నిరువదియేడ్వురు వామలోచనలతనికిఁ బెండ్లిచేసి సముచితంబుగా నిట్లనియె.

క. సిరికి నిజస్థానంబవు
సరసుఁడవు సుధామయుఁడవు సత్కాంతి మనో
హరమూర్తివి శివకీర్తివి
పరిపూర్ణుఁడ వెల్లకళల భవ్యుఁడ వగుటన్.

క. ఇరువదియేడ్వురఁ గూఁతుల
వరుసన నీ కిచ్చినాఁడ వారల నెపుడున్
సరిగా మన్నించుచు శుభ
చరితంబున సత్యనిష్ఠ జరుపందఁగుఁగా.

ఉ. నావుఁడు శీతభానుఁడు మనంబున వేడ్క దలిర్ప దక్షు సం
భావనచేసి మీ రిటులు మన్నన నానతియిచ్చినట్ల నే
నీవనజాక్షులందుఁ జరియించెద నంచుఁ బ్రతిజ్ఞపల్కి యా
దేవులుఁ దాను నాత్మవసతిస్థలి కేఁగె సుఖానుమక్తుఁడై.

క. చని యాచందురుఁ డందుం
దనియక యాసతులతోడఁ దగవును సత్యం
బును మెఱయఁ గొంతకాలము
మనసిజతంత్రములఁ దేలె మానస మలరన్.

వ. అంత నంబుజముఖు లందఱయందును నమందచాతుర్య గుణరోహిణియగు రోహిణీకాంత యొక్కతెయ చంద్రునకుఁ బ్రాణ వల్లభ యయ్యె; నతండును గాముకతాపవశంబున సత్యధర్మంబులు విడిచి పాపకర్మంబున కొడిగట్టి యితరకామినులయెడ దుర్లభుండయ్యె; నిట్లు పతివిముక్తలగుచున్న తద్భార్య లిరువదియార్గురును నొక్క నాఁడు తండ్రిపాలికిం జని తమపరాభవంబు విన్నవించి పాలిండ్ల మీఁదఁ గాటుకకన్నీరు గారుకొన నక్కదుఃఖంబుల నేడ్చి రట్టియెడ,

క. తనయాపరాధియగుచుం
దనయాడిన నాఁటి సరవి దప్పినశశిపైఁ
గనలుచు దక్షుఁడు నిప్పులు
కనుగొనలను నిండి కురియఁగా ని ట్లనియెన్.

ఉత్సాహ. నలినసంభవాదిసురులు నాతపఃప్రభావసం
కలితతేజమునకు వెఱచి కన్నుసన్న మెలఁగఁగా
జలజరిపున కిట్లు మదము సంభవించె నక్కటా
తలఁపఁడయ్యె నన్ను జడుఁడు తారతమ్య మెఱుఁగకన్.

క. ఇది యేఁటికి ననుబోటికి
మది నునుపఁగ నిపుడయేని మానమదంబు
స్వదళించెద మామకకో
పదహనశిఖిశిఖలచేతఁ బాడఱి పోవన్.

వ. అని నిర్ణయించి చంద్రుఁ దలంచిన నతండును తత్క్షణంబ భయకంపమానమానసుండును, నితాంతచింతాభరపీడ్యమానుండును, నగుచు వచ్చి నమస్కరించి వడ వడ వడంకుచున్నఁ జూచి, యేచిన యాగ్రహాంబునఁ గటంబు లదర దక్షుండు భృకుటీభయంకరాక్షుం డగుచు నతనితో ని ట్లనియె.

క. ఓరీ! దోషాకర! యిటు
దూరీకృతభయుఁడ దగవు దొరఁగుచు నాకున్
వారక యవమతి దలఁచితి
వేరె కలరె దిక్కు నీకు వెస నే నలుగన్.

మ. అని దుర్వారసమగ్రకోపమునఁ దోయంబు ల్గరాబ్జంబునం
గొని, నానాఁటికి మోడి మోడి మిగుల న్ఘోరంపు దుఃఖాంబుధిం
దనియం దాపులఁగా మునుంగు మనుచు న్దక్షుండు శాపించెఁ జం
ద్రుని నానాభువనానురంజన విధాచార్యప్రభాసాంద్రునిన్.

వ. ఇట్లభిశప్తుం డగుచుఁ గువలయాప్తుం డక్కడం గదలి యరిగి, తచ్ఛాపంబునకుం బ్రతివిధానంబు గానక దినదినంబునకుం బరిక్షయించుటఁ గరంబు కృశతనొంది కందిన యంగంబును నెడతెగని విచారభయంబును గల్గి సిద్ధాశ్రమంబున నిలిచి యనన్యసామాన్య నియమంబు నడుపుచు మహాపదలకు నుపసంహారణంబు శివస్మరణంబు గావునఁ దద్భంగి యంగీకరించి యి ట్లనియె.

క. పరమేశ భర్గ శాశ్వత
పరమోక్షవిధాన భువనవల్లభ వేదాం
తరహస్యవేద్య మాద్య
తకరుణాపరతంత్ర నన్నుఁ గావు గిరీశా!

క. అవ్యయ యక్షర ద్వయ స
ద్భవ్య సదావ్యక్తరూప ఫాలాక్ష జగ
ద్దివ్యప్రభావశంకర
సేవ్య ననుం గావు మభవ శివ పాపహరా!

క. భక్తజనలోల యీశ్వర
రక్త విరక్తాత్మ విశ్వరంజనలీలా
సక్త వివిక్త నిరంతర
శక్త ననుం గావు మభవ సర్వజ్ఞ హరా!

వ. అని మఱియు ననేక ప్రకారంబులగు దాక్షాయణీవల్లభు దివ్యనామంబు లుగ్గడించుచు సహార్యంబగు స్వశరీరకార్శ్యంబునఁ గళా మాత్రంబు చిక్కి చందురుండు జీవితనిరాశుండై యున్న సమయంబున నమృతమయస్ఫురణంబున మెఱయు తదీయకిరణంబులచేఁ బ్రోది లేక యోషధులు విఫలత్వ మొందుటం జేసి లోకంబులకు దుర్గతి గవిసి ముఖంబులు గొదువపడుప బలహీనులగు నిర్జరులం దగిలి రాక్షసు లనేకవిధోపద్రవంబులు సేయఁదొడంగి రట్టియెడ, సమస్త రక్షణా (దురం) ధరుండగు నీశ్వరుండు దమదివ్యచిత్తంబునఁ జంద్రుదైన్యంబున నవధరించి తచ్ఛాంతికల్పనాచాతుర్యంబున,

మ. రజనీనాథునిపాలికిం బ్రమథవీరవ్రాతము ల్గొల్వఁగా
విజయంచేసెను జంద్రుఁ డత్తతి శుభావిర్భూతసందర్భపూ
తజటాజూటకిరీటపాటల విధాధారాభిషేకాభిర
మ్యజయల్లక్షణసూచితాశ్రితనరాగాత్మత్వసారంభుఁడై.

వ. ఇట్లు సన్నిధిచేసిన యీశ్వరునకు నున్నపాటన యుండి యయ్యుడు విభుండు జీవమాత్రశేషుఁడు గాన లేవలేక మ్రొక్కి, చేతు లల్లన యెత్తి మొగిచి నిలిచి.

చ. అభయము విశ్వనాథ యభయంబు నిరంజనతామనోహరా
యభయము దేవదేవ యభయంబు విసర్గచిరుజ్జ్వలాత్మకా
యభయము ఫాలనేత్ర యభయంబు జగత్పరిరక్షణవ్రతా
యభయము భక్తలోల యభయంబు దయాపరిషిక్తమానసా!

ఉ. వాలిన యాపదవర్ణవము వచ్చినవేళ సుపర్వసంఘముల్
గాలిడ నెందుఁ గానక బలంబఱి యూరక మున్గుచుండఁ బో
జాలిఁ బడంగనీక కడుఁ జాలి దయారసయానపాత్రలోఁ
దాలిచి దాని వెల్పఱచు దక్షుఁడ వీవకదయ్య శంకరా!

క. నినుఁ దక్క నితరశరణము
మనమునఁ బరికింప నెపుడు మామకభావం
బనుపమసాదరవీక్షణ
మునఁ జూడుమ యార్తి నింకఁ బొడ వఱకుండన్.

వ. అని మఱియుం బెక్కుదెఱంగులఁ గరంబుఁ గాని మొలుఁగునఁ బలుకుచందురునిం గనుంగొని యీశ్వరుండు వెఱవకు, నేఁ గలుగ నీకు నాపద లెక్కడివి, నీవు మదీయరూపభేదంబ వని తలంపక దక్షుచేసిన దురితంబు వానిక యుండుఁగాక యేను నీకళ యొకటి మదీయశిరంబునఁ దాల్పఁగలవాఁడ, దానఁజేసి భవదీయశరీరంబు

నకుం బదేనాళ్లు వృద్ధియు మీమామ యొసంగిన శాపఫలంబునం జేసి భవదీయశరీరంబునకుం బదేనాళ్లు హానియు సంఘటిల్లునవి యును సమరహితంబుగా నిర్ణీతి నని యుపధరించి యనంతర సమయంబున.

చ. అమ యనుపేర నింపలరునారజనీకరుసత్కళ ల్లసః
ప్రమద మెలర్పఁగా నిజశిరస్థ్సలిఁ దాల్చెను శంకరుండు భ
క్తమధురుఁ డుల్లసత్కరవికాసజటాచయరత్నపద్మసం
గమనవహంసశాబకము కైవడిఁ బైనది యుల్లసిల్లఁగన్.

క. ఆతూణచంద్రకళచేఁ
జేతఃప్రియకరనిరూఢి శివుఁ డింపలగన్
నూతన విలాసలీలా
స్ఫీతంబగు మొగలిరేకు చెన్నిన కరణిన్.

వ. ఆసమయంబున హరి విరించి ప్రముఖబృందారకులు విస్మయప్రకర్షంబుగాఁ గల్పకపుష్పవర్షంబులు గురియుచు నరుదెంచి భక్తరక్షాకళాధురంధరుండగు కళాధరు నడుగులకుఁ బ్రణమిల్లి యంజలి ఘటించి, దేవా భవదద్భుతచరితంబు గొనియాడ దరముగాదు దక్షుండిచ్చిన దారుణశాపదహనంబునం [illegible] నాటక కల్పనసూత్రధారత్వం బ్రపంచంబు నడుపుచున్నాఁడవు. వేదాంత శుద్ధాంతమహాగృహంబుల విహరించు దేవసింహంబవు నీవు. నిన్ను నస్మదాదులు దెలియంగ నెంతవారు. మాయామయుఁ బ్రసన్నుండవు గమ్మనుచు బహువిధంబులఁ బ్రస్తుతింప నప్పరమేశ్వరుండు వారలఁ గరుణావలోకనంబున నాదరించుచు నమృతాంశుని తోడ నింక నెమ్మది నీయధికారంబున కరిగి సుఖంబున నోషధులకుం బరివర్ధనంబు సేయుచుండు మని వీడ్కొలిపి నెయ్యంబునఁ జరించు మాటలాడి కమలాక్షు పూర్వసుపర్వసంతతుల ననిపి,

యభయవరదానముఖ్యచిహ్నములతోడ
దయదలిర్పంగ వచ్చి ప్రత్యక్షమయ్యె

క. పెన్నిధి యగ్రమహీస్థలి
సన్నిధి చేసినదరిద్రుచాడ్పున సతఁడు
న్నెన్నందు సంతసంబున
నన్నగమందిరుని నిర్మలాంఘ్రుల కెరఁగెన్.

వ. ఇట్లు ప్రణమిల్లి యంజలి ఫాలపట్టికం గదియించి.

ఉ. ఆరసిచూడఁ దావకపదాంబుజసేవ సమీపలబ్ధమం
దార ముదాపకీర్తిదానవిధాన ముదారము గొంగునందు బం
గారము మోక్షసంపద కగారముఁ గామ్యధనంబులిడ్డ భం
డారము జన్మపాదపకుఠారము భక్తులకు న్మహేశ్వరా!

ఉ. దక్షిణవామగాత్రములఁ దామరసాసనునిం జనార్దనుం
దక్షిణతావిజృంభణము తద్దయుఁ జేర సృజించి సృష్టిసం
రక్షణసత్ప్రభుత్వము గరంబు దిరంబుగ వారి కిచ్చి సా
రక్షణయుక్తలీల దనరం దనరారుదు నీవు శంకరా!

వ. అని మఱియువివిధభంగులంబ్రస్తుతివాక్యముఖగుండగు ధర్మపురుషు
ననుకంపదిలకింపఁబ్రసాదరససంపదనభిషేకించుచు నమ్మహేశ్వరుం
డతనితోడ వినుము నీవు నాయాజ్ఞభేదంబన్న, సకలభువనసంచ
యంబులకు నాధారభూతంబుగా నిన్నిట్లు ప్రభావంబునఁ గల్పించి
నాఁడఁ, దర్శింప నోర్కింతయు మనసులోపల వేఱులేదు. మఱి
యెద్దిగోరి యీదృశంపుఁదపంబు సలుపుచున్నాఁడవు. అడుగు నీ
య్యభిమతంబు విత్తంబుగా నలవరింతు; ననవుడుఁ గుతూహ
లంబున.

గీ. ధర్మపురుషుండు ప్రమ్మఱఁ దత్పదాంబు
జాతముల భూతలంబునఁ జాగి మ్రొక్కి
ఫాలమున రెండుచేతులు గీలుకొల్పి
వినయభర మొప్ప ని ట్లని విన్నవించె.

క. నీవాహనంబు నగుచు
న్సేవాతత్పరత గలిగి చిత్తం బలరం
దేవా చరింప వేడుక
భావాంతరసరణి నొందు బాయదు నాకున్.

క. ఏతద్వర మొక్కఁ౦గను
నాతతసదయత్వశీల ! యలవడనిమ్మం
చాతఁడు మ్రొక్కినఁ బ్రీతిం
జేతఃప్రముదంబు మెఱయ శివుఁ డి ట్లనియెన్.

గీ. విశ్వమయుఁడ నేను విశ్వంభరుఁడ వీవు
గలుగు నిక్కువంబుగాఁగ మనకు
కడఁక వాహివాహకత్వంబువిధమును
నిర్మలప్రభావ ధర్మదేవ !

వ. ఇట్లు గావున నీవు సురభి మొదలుగాఁ గలుగు దివ్యగోవులకు భర్తవగుచు వృషభరూపంబు ధరియించి మాకు వాహనంబవు గమ్మ; నీకు నణిమాదులగు నెనిమిది సిద్ధులు మత్సామీప్యంబును సారూప్యంబును నిచ్చితి; ననియె నప్పుడు—సముదీర్ణప్రభావపరిపూర్ణసుధాకరణ ముదాకరణకల్యారవళి మదాభదస్యదరీదృశ్యమానుండును, సదవష్టంభగుంభనపట్టఘురట్టఖురఖురపుట ప్రకటన నరీనృత్యమానుండును, సాంద్రమహేంద్రనీలరుగ్జాలవిశాలకచవికచగుణాలవాలవిజృంభమాణుండును, కైలాసగండశైలాభచండకుకుర కలకంఠసందర్భదరీదృప్యమానుండును, నగణ్యలావణ్య రససింధుబం

ధుర తరంగాడంబరాలంబగణకంబళజరీహ్యమానుండును, నన
కల్పకల్పావసానపవమాన కక్ష్యాలక్ష్యవిలాసి విశ్వాసనపరిహ్రియ
మాణుండును, నై ధారాధరసముత్కరంబునుంబోలె పుష్కరావర్త
కీర్తనీయం బై, రాకాశశాంకమండలంబునుబోలె సులభలక్షణప్రేక్ష
ణీయం బై, తుహినమహీధరంబునుంబోలె శివాధిరోహణోచిత
విధారమణీయం బై, రసాతలంబునుంబోలె నక్షుద్రచక్షుశ్శ్రవఃకమ
నీయం బై, తారాకాలంబునుంబోలె సుగ్రీవానందనీయం బై,
యామ్నాయసముదయంబునుంబోలెనవక్రమపదక్రమనిరూప్యం బై,
సత్త్వబంధనిబంధనంబునుంబోలె జనితమహాధ్వవిభూషణీయం బై,
పారావారంబునుంబోలె ననంతసత్త్వసేవనీయం బై, విచిత్రాలం
కారంబునుంబోలె చిన్మయాకారంబునుం గలిగి యనేక సహస్ర
యోజనంబుల పొడవునం దనరెడు వృషభవల్లభుం డయ్యె. నయ్యెడ
ననూనప్రణయంబున.

ఉ. రాజితభూధరేంద్రశిఖరం బధిరోహణ మాచరించు వి
భ్రాజితశారదాభ్ర మనుభంగిఁ బటీరతుషారమల్లికా
రాజవిచిత్రవర్ణరుచిరంబగు నవ్వృషభంబు నెక్కి యు
వ్యాజవిభూతిమై శివుఁ డుదంచితనిర్మలమూర్తిశాలి యై.

క. జలజాక్షు జలజగర్భా
దులు తత్సమయంబునం గుతూహలభావం
బుల వచ్చి యవ్విభుని యం
ఘ్రుల కెరఁగిరి నిజకిరీటరోచులు నిండన్.

వ. ఇట్లు ప్రణామంబు లాచరించి నిలిచి.

క శ్రీధామం బగుచుఁ దనరు
నీధర్మము వాహనముగ నిజసరణి సుజా

త్త్యేధుండగు నినుఁ గాంచుట
నోధూర్జటి మేము పుణ్యయుక్తుల మెందున్.

చ. రవి శశిమార్గరోధమునఁ బ్రాణుని హీనుని గూర్చి కుండలిం
బ్రవిమలభక్తి మేల్కొనినభావము మధ్యమహాంధమార్గతం
దవులు వడంగ నేకతమ తద్దయు నిర్మలబుద్ధి మానిపుం
గవు లనయంబు హంస ముని కాంతుడు ని న్వృషభేంద్రవాహనా!

వ. అనుచు బహుభంగులఁ బ్రస్తుతింప నమ్మహేశ్వరుండు వారలం బ్రసాదమధురావలోకనంబున నాదరించుచు నపూర్వతావిరాజమానంబగు వృషరాజయానంబునం దనచిత్తంబు ప్రమోదాయత్తంబుగా నక్కడఁ గదలి నిజాధివాసంబగు కైలాసంబునకు విజయంచేసి యథోచితవర్తనంబుల విహరించుచుండె.

గీ. వృషభవాహనాహ్వయమున వెలయునట్టి
యీసదాశివులీల సమిద్ధసరణి
వినినఁ జదివిన వ్రాసిన జనుల కొదవు
నలఘుతరధర్మలాభంబు లహరహంబు.

## ఏ డ వ లీ ల.

గీ. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డవధరించినట్టిలీల
యది దనర్చుచుండు నవనిభృంగి ప్రసా
దాహ్వయమునఁ గలిగి యంద మగుచు.

చ. వెలయు నధీతసాంగబహువిశ్రుతవేదుఁడు నిత్యసత్యసం
కలితమనోజ్ఞభావణనికామవినోదుఁడు పాపసక్రమ
స్ఖలితమహాతపశ్చరణసంస్కృతవేదుఁడు శంకరార్చనా
త్యలఘుగుణప్రమోదుఁడు శిలాదుఁడు నాముని యొక్క డుర్వరన్.

క. భృంగి యనుపేర నిర్మల
భంగివ్రతుఁ డతని కొప్పఁ బ్రభవించె సుతుం
డంగీకృత శివసేవా
మంగళసంగాంతరంగమహితుం డగుచున్.

క. నంది యనంగా మఱియు న
నిందితుఁ డాత్మజుఁడు సతతనిర్మలబోధా
స్పందిత శివభక్తిరస
స్యంది హృదయపంకజుండు సంభవ మొందెన్.

వ. ఆతనూజు లిరువురయందు

సీ. హరుని కర్పణముసేయనిపదార్థావలిం
దలఁపునసైన నంటని ప్రతిజ్ఞ
హరుఁ దక్క నవుల నెవ్వరిని వేలుపులఁగా
మఱపునసైన నమ్మని ప్రతిజ్ఞ
హరపదాంబుజయుగ్మ మనయంబు తలఁచుట
నగవులకైన మానని ప్రతిజ్ఞ
హరు నగరంబున కాదట నేఁగుట
కలలోన నైన దొలఁగని ప్రతిజ్ఞ

గీ. మసలె నిట్లు వీరమాహేశ్వరాచార
సారమార్గసంప్రచారకలన
పూర్ణపుణ్యగణ్యబోధక్రమాగాధ
సదమలప్రభావసంగి భృంగి.

ఉ. ఆడుఁ బినాకిసన్నిధి నవాభినయంబులు మీఱ నిచ్చలుం
బాడు మహేశులీలలుఁ బ్రబంధనిధానములం ఘటించుచుం
జూడఁడు శంభుతత్త్వగతి చొప్పడఁ జెప్పని శాస్త్రపద్ధతుల్
గూడఁడు రుద్రసేవలకుఁ గొల్వనిపందల నాతఁ డెన్నఁడున్.

సీ. ఒకవేళ చతురవేదోక్తమార్గంబున
శివసూక్తపఠనంబు చేయుచుండు
నొకవేళ నలఘుశాస్త్రోక్తమార్గంబున
శివపదస్మరణంబు సేయుచుండు
నొకవేళ నుపపురాణోక్తమార్గంబున
శివమంత్రజపములు సేయుచుండు
నొకవేళ వితతకల్పోక్తమార్గంబున
శివలింగపూజలు సేయుచుండు

గీ. కణఁక నొకవేళ నితిహాసకథితసరణి
శివమహాకథాకథనంబులు సేయుచుండు
గరిమ నొకవేళ వృథయును గాఁగనీక
విహితనిష్ఠాగరిష్ఠతామహితుఁ డతఁడు.

వ. ఇట్లు త్రిలోకసారంబగు శైవసదాచారంబు గలిగి దారుణతపంబు సలుపుచుండ ననేక దివ్యవర్షవ్రాతంబు లయ్యె; నంత నొక్క-సమయంబున.

సీ. ఏవేల్పుకింకరులెల్ల వేలుపులును
నేవేల్పునకుఁ బ్రతి యెన్నఁబోల
దేవేల్పు భజియింతు రెల్లయోగీంద్రులు
నేవేల్పునకు ధర్మ మెక్కి-రింత
యేవేల్పు సంస్తుతు లెల్లవేదంబులు
నేవేల్పునకుఁ బర మెఱుఁగఁ గూడ
దేవేల్పు తర్కి-ంచు నెల్లవేదంబులు
నేవేల్పునకు ముక్తి యానిక్రీడ

గీ. యరయ నేవేల్పు మూర్తు లీయఖిలజగము
నిపుడు దాఁగాచుచున్నది యిద్ధమహిమ
దనర, నావేల్పులీల ప్రత్యక్షమయ్యె
నభవుఁ డాతనిభక్తికి నాత్మ మెచ్చి.

గీ. ఇట్లు ప్రత్యక్షమగుటయు నీశ్వరునకు
వినయసంశ్రితమతి భృంగి వినుతిచేసె
తత్పదాంబురుహంబులదండఁ దనదు
మస్తకము నాత్మ భృంగాయమానముగను.

వ ఇట్లు ప్రణమిల్లి యంజలి రచియించి.

క. సత్యజ్ఞానానందమ
యాత్యలఘుశరీర యక్షరాద్వయతీలా
ప్రత్యయ నానాక్రమ శుభ
భూత్యమలవిహార దివ్యపుణ్యప్రభావా!

తరల. జయ పినాకమహాధనుర్ధర జన్మసంసృతిదూర్గరా
జయ లలాటతటస్థలోచన సర్వధర్మవివేచనా
జయ శిఖాశ్రయశస్త్రభూషణ సత్కృపాగుణభూషణా!
జయ వృషాంక శివా యనశ్వర శర్వ శంకర [illegible]శ్వరా!

క. అవ్యయ యతర్క్య యవిరళ
దివ్యయమేయప్రభావ దేవ నితాంతా
ప్రవ్యక్తాత్మవిధాయక
నవ్యామ్నాయాంతవిహరణప్రవర హరా!

వ అని మఱియు వివిధప్రకారంబులం బ్రస్తుతించిన భృంగిరిటిము[illegible]
బునం గలుగు నిజాంఘ్రిభక్తివిభవంబునకుఁ బరిణమించి వరంబు
వేడుమని యామహేశ్వరుం డవధరించినఁ బునఃప్రణతుండును,
ధృతాంజలినిటలస్థలుండును నగుచు నతండు.

గీ. దేవదేవ! యిట్లు దేవర నాకుఁ బ్ర
త్యక్షమగుటనే కృతార్థతముఁడ
నైనవాఁడ మున్నునైనను నింక నీ
వవధరింపు మొక్క యభిమతంబు.

క. చనునపుడు నిలుచునపుడును
గనునపుడును నిదుర మేనఁ గదిరినయపుడున్
మునుగాఁగ నెల్లయపుడును
నినుఁ దలఁపఁగనిమ్ము నాకు నిపుణత నీశా!

క. జననియు జనకుఁడు చుట్టం
బును విద్యయు సఖుఁడు నర్థమును మఱి సర్వం
బును నీవు నాకు నెప్పుడు
నినుఁ దక్కఁగఁ బరుని నెఱుఁగనేర మహేశా!

వ. అని విన్నవించుటయును శంకరుండు ప్రసన్నరసతరంగితం బగువీక్షితంబు లతనిమీఁద నిగుడించుచు నీకు నీయభిమతంబు నిసర్గసిద్ధంబు గావునఁ బునరుక్తంబుగా వాక్రువ్వం బనిలేదు. మావలన నీ వసాధారణభక్తుండవు, ననురక్తుండవు నగుటఁ గామరూపకామగమనంబులు గలిగి మత్ప్రకాశంబున నిలిచి నిర్మలోపదేశంబులు నడుపుచు నాకు నెన్నండు ప్రసాదపాత్రంబుఁ బరమపవిత్రంబును గమ్ము, చనుదెమ్ము రజతాచలంబున కనుచు నతనిఁ దోడుకొని నిజస్థానంబునకు విజయంచేసె; నది మొదలుగా నమ్మహానుభావుండు.

క. ఏకశివభక్తిసేవా
ప్రాకట తాత్పర్యధుర్యభావమున నిజ
శ్లోకము నితాంతచరితా
శాకంబుగ మెలఁగుచుండె సంచితభక్తిన్.

క. భృంగిప్రసాద మనఘ
భంగీకరణముగ వెలయు భవలీల జనుల్
సంగతి వినినను జదివిన
నుం గలుగు నభీష్టవస్తు నూతనసిద్ధుల్.

## ఎనిమిదవ లీల.

గీ. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డవధరించినట్టిలీల
నళువు మిగుల నదియు నందివాహనదాహ్వ
యంబు గలిగి బుధులు నభినుతింప.

వ. శిలాదసుతుండగు నంది మున్నందిన తపోవ్రతశీలంబు భావంబునం దళుకొత్త శ్రీపర్వతపార్శ్వభాగంబున కరిగి యక్కడ నొక్కచో నిలిచి యకంపానుకంపాసంపన్మనోహరుండును, గోమలప్రభావవిరామపిరాజమానరాజకళాశేఖరుండును, దాక్షాయణీకటాక్ష మధుర వీక్షణ మధుకరారవిందాయమానముఖసుందరుండును నగునీశ్వరుం దలంచుచుగరిష్ఠనిష్ఠాభరణంబుగా నియమాచరణంబునకుం దొడంగి యంగీకృతజలకణాశనంబున దివ్యసహస్రవర్షంబు గడిపి, మఱియు వాయుభోజనంబునను నిరాహారప్రసాదంబుననుంగా నంతకాలంబు జరిపి వెండియుం జరమఘోరప్రకారంబునఁ బంచాగ్ని మధ్యంబునను, నివాసరహితప్రదేశంబునను నాకంఠప్రమాణ జలాంతరంబునను నుండుచు నవ్వాటియు నన్నియొండ్లుపుచ్చి, కుది యసి తాత్పర్యధుర్యత విలసిల్లు సమయంబున.

సీ. నిండి తొలంకని నిజతేజ మావాల
సలిలంబుగాఁ జాల నెలమి మిగిలి
కడు నిడువులును సోగలు నగు బాహువుల్
శాఖలుగా వింతచదురు మిగిలి

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

# పార్థివసంవత్సర కార్యనివేదిక.

# 1945–46

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పిఠాపురంమహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు,
(కోశాధ్యక్షులు)

,, పిళ్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

,, కోటా శివనాథశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.

,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు కామరాజుగారు.

వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు ఎమ్. ఏ. (ఆనర్సు)

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## పార్థివసంవత్సరకార్యనివేదిక.

## 1945–46

పార్థివసంవత్సరముతోఁ బరిషత్తునకు ముప్పదినాల్గవ సంవత్సరము ముగిసినది. యుద్ధము సమాప్తినొందినను పూర్వపరిస్థితులు చేకూరనందునఁ బత్త్రికాముద్రణగ్రంథప్రకటనాదులు వెనుకటి సంవత్సరములందువలెనే తగ్గింపవలసివచ్చినది. నూతనగ్రంథప్రకటనము మాట యటుండ ముద్రణమునందున్న సీతారామచరిత్రము శివలీలావిలాసమును మొదటి యాశ్వాసముతో నాఁపవలసివచ్చినది. అచిరకాలముననే వాని ముద్రణమును బూర్తి చేయుదుమని సభ్యులకు విన్నవించుకొనుచున్నాము. మఱియుఁ బరిషత్ప్రకటితములగు చంపూరామాయణ కవిజనాశ్రయముల పునర్ముద్రణము గావింపవలసియున్నది. పరిషద్భాండాగారము క్రమక్రమముగ నభివృద్ధిగాంచుచున్నది. సంవత్సరాంతమున ముద్రితగ్రంథముల సంఖ్య 5177. తాళపత్త్రగ్రంథముల సంఖ్య 4678. విని మయపత్త్రికల సంఖ్య 50. వీనిని తగురీతిని బరిశోధించి యాంధ్రభాషాసేవ యొనర్చుట భాషాభిమానుల కర్తవ్యము. పండితబృందము సహాయము లేనిచో నముద్రితగ్రంథపరిశోధనము జరుగనేరదు. పెక్కు తాళపత్త్రగ్రంథములకుఁ బ్రతులు వ్రాయించుటకును, ప్రచారమునఁగల ముద్రితగ్రంథములకుఁ బాఠభేదములఁ బరిశీలించుటకును, ప్రత్యేకముగఁ బండితుల నియమింపవలసియున్నది. తాళపత్త్రప్రతులలోఁ గొన్ని జీర్ణావస్థయందున్నందున వ్రాఁతప్రతులను వెంటనే వ్రాయింపవలసియున్నది. అందుల కాంధ్రదేశమునఁగల ప్రభువర్యులు ధనవంతులును వలయుధనసహాయ మొనర్చి పరిషత్తును ఆంధ్రభాషను గౌరవింపఁ గోరుచున్నాము. పూర్వపరిషత్సంపుటములందుఁ బ్రకటింపఁబడిన తాళపత్త్రగ్రంథవివరణ మసంపూర్తిగ నుండుటచే వేర్వేఱు భాగములుగ విభజించి ఛందోవ్యాకరణాలంకారపట్టికను పరిషత్పుస్తకభాండాగారము మూఁడవభాగముగఁ బ్రకటించితిమి. మిగిలిన భాగములను గూడ యథాక్రమముగఁ బ్రకటింతుము.

శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురప్రభువరులచే నపారభాషాభిమానాదరణములఁ గనుపఱుపఁబడుచున్న శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువున నాల్గవ సంపుటము తవర్గాంతముగ ముద్రింపఁబడినది. మిగిలిన సంపుటములును శీఘ్రముగ ముద్రింపఁబడునని తెలుపుచున్నాము. పార్థివసంవత్సరపు టాయవ్యయపట్టిక యనుబంధమునఁ జేర్పఁబడినది. మూలధనముపైన వచ్చెడివడ్డీవలనను పుస్తకవిక్రయమునను బరిషత్కార్యములు నిర్వహించుట కష్టసాధ్యముగ నున్నది. అపారమగు తాళపత్త్రగ్రంథసంచయమును దగినరీతిని బరిశోధించి భాషాసేవ యొనర్చుటకును ముద్రితగ్రంథభాండాగారము ననువైనరీతి నభివృద్ధినొనర్చుటకు నితర పరిషత్కార్యనిర్వహణమునకును గావలసిన సహాయ మొనర్చి భాషాభిమానులు మాకుఁ దోడ్పడవలసియున్నది.

చిరకాలమునుండి మన మెదురుచూచుచున్న నూతనపరిషద్భవననిర్మాణము నేఁటికిఁ బూర్తిని గాంచినది. కీ. శే. ప్రభల సుందరరామయ్యగారి ధర్మపత్నియు, విదుషీమణియునగు శ్రీమతి ప్రభల వెంకటసుబ్బమ్మగారు మహోదారభావముతో నొసంగిన విరాళముతోఁ బరిషద్భవననిర్మాణ మొనరింపఁబడినది. పరమేశ్వరుఁ డామె కాయురారోగ్యైశ్వర్యాదు లొసంగి రక్షించుఁగాక. తద్భవనప్రవేశమహోత్సవమున కధ్యక్షత వహించుటకు శ్రీ శ్రీ శ్రీ జయపురాధీశ్వరులు సాహిత్యసమ్రాట్టు కళాప్రపూర్ణ శ్రీ విక్రమదేవవర్మ మహారాజవర్యు లంగీకరించుటచే మనభాగ్య మినుమడించినది. పరిషత్తు చేయవలసిన కార్యములు పెక్కులుగలవు. భాషాభిమానముఁ జూపి పరిషత్తునకుఁ దగు సహకార మొనర్ప విద్వద్బృందమును వేఁడుకొనుచున్నారము. పరిషత్కార్యనిర్వహణమున మాకు సహాయులైయున్న కార్యనిర్వాహకవర్గము వారికిని, దదితరభాషాభిమానులకును మా వందనములు.

ఇట్లు విధేయులు,

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి
అధ్యక్షులు.

కిళాంబి రాఘవాచార్యులు,
వింజమూరి వెంకన్నపంతులు,
కార్యదర్శులు.

# పార్థివనామసంవత్సర

## 1945

| ఆయము. | | రు అ పై |
|---|---|---|
| 1. సంవత్సరపు ప్రారంభనిలువ | | 161- 1-2 |
| 2. వడ్డీ - బ్యాంకి | | 1046- 2-0 |
| 3. సాధారణసభ్యుల చందాలు | | 40- 0-0 |
| 4. పత్రిక చందాలు | | 37- 0-0 |
| 5. విక్రయములు : | | |
| పుస్తకములు | 1152-14-6 | 1158-14-6 |
| విడిసంచికలు | 6- 0-0 | |
| 6. ఇతరజమలు | | 45- 0-0 |
| | | 2488- 1-8 |

పైని ఆదాయవ్యయముల లెక్క నిజమైనట్టిన్ని సరియైనట్టిన్ని స్థితినికనబఱచుచున్నదని నేనిందుమూలముగా తెలియంజేయుచున్నాను.

కాకినాడ,
5-6-46.

పళ్లె వెంకటహనుమంతరావు,
గవర్నమెంటు డిప్లమాహోల్డరు ఇన్ కార్సు
ఇన్‌కమ్‌టాక్సు ప్రాక్టీషనరు అండ్ ఆడిటరు.

# ఆయవ్యయ పట్టిక.

## —1946

| వ్యయము. | | | రు అ పై |
|---|---|---|---|
| 1 | ఉద్యోగుల జీతములు | | 679-13-6 |
| 2. | ,, ప్రయాణవ్యయములు | | 3- 8-0 |
| 3 | పోష్టుఖర్చులు : | | |
| | ఖర్చు | 54-14-0 | 22- 1-0 |
| | జమ | 32-13-0 | |
| | | 22- 1-0 | |
| 4. | పత్రికముద్రణము | | 100- 0-0 |
| 5 | ,, కాగితము | | 1- 4-0 |
| 6. | బైండింగు : | | |
| | చిల్లర | 33-12-0 | 488- 3-0 |
| | నిఘంటువు | 454- 7-0 | |
| 7. | పత్రికలకు చందాలు | | 36- 6-0 |
| 8. | పుస్తకములు కొనినవి | | 130- 8-6 |
| 9. | బ్యాంకి కమిషను | | 1- 0-0 |
| 10. | ఇతరవ్యయము | | 1- 0-0 |
| 11. | కొత్తపల్లి సుబ్రహ్మణ్యంగారికి | | 30- 0-0 |
| 12. | సాదరు, ఖర్చు | 616- 5-3 | 606- 9-0 |
| | జమ | 9-12-3 | |
| | | 606- 9-0 | |
| | సంవత్సరాంతమున నిల్వ | | 387-12-8 |
| | | | 2488- 1-8 |

కిళాంబి రాఘవాచార్యులు,

వింజమూరి వెంకన్నపంతులు,

# పార్థివనామసంవత్సరము.

## 1945—46

స్తకవిక్రయము,

| | |
|---|---|
| విప్రనారాయణ చరిత్రము | 7-13-9 |
| జైమినీభారతము | 4-0-0 |
| కవిజనాశ్రయము | 1-4-3 |
| యుద్ధమల్లుని శాసనము | 3-12-0 |
| జ్యోతిశ్శాస్త్రసారము | 1-5-0 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0-5-9 |
| సర్వేశ్వరశతకము | 0-5-6 |
| కావ్యాలంకారచూడామణి | 1-13-0 |
| అకారాదిసూచిక | 1-5-0 |
| ప్రాకృతభాషోత్పత్తి | 4-0-0 |
| శివతత్వసారము | 6-1-3 |
| చంద్రభాను చరిత్రము | 3-11-0 |
| శివరాత్రి మాహాత్మ్యము | 1'-4-0 |
| ఆర్యభాషావిభాగము | 1-12-0 |
| ప్రసంగములు | 0-14-0 |
| మన్నారుదాసవిలాసము | 2-4-0 |
| కాళిందీకన్యాపరిణయము 1వభా॥ | 5-2-0 |
| ,, 2వభా॥ | 2-9-6 |
| రెడ్లనాటిశాసనములు | 0-14-0 |
| ఆంధ్రధాతుమాల | 3-4-0 |
| శాసనపద్యమంజరి 1వ భాగము | 5-8-0 |
| ,, 2వ భాగము | 1-2-0 |
| శతకసముచ్చయము 1 భా॥ | 3-6-0 |
| ,, 2 భా॥ | 2-12-6 |
| పరిషత్పుస్తకభాండాగారము II వ భా॥ | 1-5-0 |
| ,, III ,, | 1-5-0 |
| సూత్రాంధ్ర వ్యాకరణము | 1-12-0 |
| రసాభరణము | 2-5-8 |
| ఆంధ్రశబ్ద చింతామణి | 3-3-0 |
| షోడశకుమారచరిత్రము | 2-3-0 |
| హంససందేశము | 0-5-8 |
| రాయవాచకము | 2-11-6 |
| సింహాసన ద్వాత్రింశిక I | 3-15-0 |
| II | 3-15-0 |
| నిఘంటుచరిత్రము | 0-14-6 |
| ఆంధ్రకౌముది | 2-12-0 |
| బాలభారతము | 1-15-6 |
| Dravidian Lexicography | 1-1-3 |
| Defence of Literary Telugu | 2-3-0 |
| చాటుధారాచమత్కారసారము | 2-5-0 |
| సాంబోపాఖ్యానము | 2-10-0 |
| రసార్ణవాలంకారము | 2-5-0 |
| కవిజనోజ్జీవని సమస్యలు | 1-7-0 |
| రఘునాథరామాయణము | 2-8-0 |
| రజతోత్సవసంపుటము | 4-10-0 |
| ఆంధ్రసాహిత్యపరిషద్వృత్తాంతము | 0-10-6 |
| అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము | 1-4-9 |
| లక్షణసారసంగ్రహము | 1-6-0 |
| లౌకికన్యాయ వివరణము | 1-11-0 |
| శ్రీసూర్యారాయాంధ్ర నిఘంటువు I | 261-10-8 |
| ,, II | 207-8-9 |
| ,, III | 224-0-9 |
| ,, IV | 278-8-9 |
| బాలరామాయణము | 0-2-0 |
| సీతారామ చరిత్రము | 0-14-6 |
| ఉత్తరరామచరిత్రము | 39-15-6 |
| అమరుకము | 1-11-0 |
| చంపూరామాయణము | 1-13-0 |
| ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి | 2-11-0 |
| విడిసంచికల విక్రయము | 6-0-0 |
| మొత్తము | 1158-14-0 |

కిడాంబి రాఘవాచార్యులు

వింజమూరి వెంకన్నపంతులు

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పిఠాపురం మహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం, ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు.

,, పిళ్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుఁడుగారు.

,, కోకా శివనాథశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుఁడుగారు, బి. ఏ.

,, వొంపటి రామబ్రహ్మముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాది భయంకరం పార్థసారధిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు కామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రమూర్తిగారు ఎమ్. ఏ. (ఆనర్సు)

,, కంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

## చతుర్థ సంపుటము.

పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁ గలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న్ర' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను, ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీ క్రింది వెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లును.

**Printed by N. Achutaramiah at the Cocanada Printing Works Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.**

# శ్రీ
# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక


కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౫. { వ్యయ ఆశ్వయుజ - పాల్గునములు } సంచిక ౪-౬





కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

1946 — 1947

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపబడును.

(Journal of the Telugu Academy.)

| | | |
|---|---|---|
| సంపుటము. ౩౫ | వ్యయ<br>ఆశ్వయుజ - ఫాల్గునములు | సంచిక ౪-౬ |


## శ్రీ వ్రభల సుందరరామ భవనప్రవేశమహోత్సవము
## నిర్మాణ నివేదిక.

ఆంధ్రుల నెల్లర నేకముఖముగఁ గూర్చునది యాంధ్రభాషయే. జాతిజీవనము సంస్కృతియు వాఙ్మయమునఁ బ్రతిబింబిత మగుచుండును. ఆంధ్రజాతీయౌన్నత్యమునకు, భాషాభివృద్ధియు వాఙ్మయసేవయు ముఖ్యమని గుర్తించి, వంగీయసాహిత్యపరిషత్తు మున్నగు సంస్థల నాదర్శముగఁ గొని శ్రీ జయంతి రామయ్యపంతులుగారు 1911 వ సంవత్సరమున మద్రాసునగరమున, కందుకూరి వీరేశలింగంపంతులుగారు, వేదము వేంకట్రాయశాస్త్రిగారు, కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు మున్నగు పండితులయొక్కయు, విద్యాభిమానులగు శ్రీ పీఠికాపుర, బొబ్బిలి, వేంకటగిరి సంస్థానాధీశ్వరులయొక్కయు సాహాయ్యముతో నాంధ్రసాహిత్యపరిషత్తును స్థాపించిరి. శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరులు మొదటినుండియుఁ బరిషత్తునకుఁ బట్టుగొమ్మలై, స్థాపనసమయమున విరాళముల నొసంగుటయేగాక, ఆంధ్రనిఘంటు

నిర్మాణమున కగు ధనవ్యయ మంతయు భరించుచున్నారు. 1925 వ సంవత్సరమువఱకుఁ బరిషత్కార్యస్థానము మద్రాసునగరమున నద్దె యిండ్లలో నుండినది.

మద్రాసునుండి యాంధ్రదేశమధ్యమున నొక నగరమునకు మార్చుట యావశ్యక మని గుర్తింపఁబడి 1925 లో నీకార్యాలయము కాకినాడకు మార్పఁబడినది. ఆంధ్రభోజు లగు శ్రీ శ్రీ శ్రీ పిఠాపురము మహారాజావా రుచితముగఁ బరిషత్కార్యస్థానమునకు భాండాగారమునకు నొసంగిన భవనమున నేఁటివఱకు నెలకొల్పఁబడియున్నది.

పరిషత్తు నానాఁటి కభివృద్ధిఁ జెంది యయిదువేల తాళపత్త్ర గ్రంథములను, 5 వేలకు మించిన ముద్రితగ్రంథములను సమాకరించినది. దినదినాభివృద్ధి నందుచున్న భాండాగారమునందలి ముద్రితాముద్రిత గ్రంథములకుఁ దగిన స్థలము లేకపోవుటచేతను, పరిశోధకులకు, పండితులకు, గ్రంథపరిశోధన మొనర్చుటకు, ప్రశాంతమును, నిర్మలమును, విశాలమును నగు వసతి లేకపోవుటచేతను మిక్కిలి యిబ్బంది కలుగుచుండెను గాలియు వెలుతురును దుర్లభమై బీటవాలు ప్రక్కలకిసి యుండెను.

అనుకూల మగు స్థిరావాసము కల్పింపవలె ననుకోర్కె సఫలము కాకుండఁగనే పరిషత్స్థాపకు లగు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు కాలధర్మ మందిరి. విదుషీమణియు, త్యాగినియు, మహాశయురాలు నగు శ్రీ ప్రభల వేంకటసుబ్బమ్మగారు పరిషత్తునకుఁ గల లోటుఁ దీర్ప సంకల్పించి నయాచితముగనే తన సోదరికుమారుఁ డగు శ్రీ చివుకుల నారాయణమూర్తిగారిచేతను, మా కార్యాలయ ప్రధానోద్యోగి యగు శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారిచేతను బరిషత్కార్యనిర్వాహకవర్గమువారికి భవననిర్మాణ ముత్తమ మని శుభసందేశ మంపిరి. అంతటఁ బరిషత్సభ్యులు, కార్యదర్శులును, గొందఱు

కార్యనిర్వాహకసభ్యులును శ్రీ వెంకటసుబ్బమ్మగారిని సందర్శించి తమ కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించిరి. వీరల నాదరముతో సత్కరించి, యమితానందముతో నాలువేలరూప్యముల ప్రావిన్షియల్ ల్యాండ్ మార్గేజి బ్యాంక్ డిబెంచరుపత్త్రముల నిచ్చి యాపత్త్రముల విక్రయించి పరిషద్భవనమును దమభర్తగారైన కీ. శే. ప్రభల సుందర రామయ్య, బి.ఏ., బి.ఎల్., గారి పేరట నిర్మింపవలసిన దని వారు కోరిరి. ఆ పత్త్రముల నిచ్చుతఱి,

"బ్రదుకవచ్చుగాక, బహుబంధనములైన, వచ్చుఁగాక లేమివచ్చుఁగాక, జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక, మాటఁదిరుగలేరు మానధనులు."

అని యామె చదివిన పద్యరత్నము నిరంతరము మా చెవులఁ బ్రతిధ్వనించుచునే యున్నది.

ఆ పత్త్రములు పరిషత్తుపేర మార్చి విక్రయించుటకుఁ గొంత కాలము పట్టినది. తుదకు శ్రీ నేతికంటి శ్రీనివాసకోనేటిరావుగారి సాహాయ్యమున రు 5460 లకు విక్రయింపఁగలిగితిమి. స్థలాన్వేషణ మునఁ గొంతకాలము గడచిపోయినది. మా కార్యనిర్వాహకసభ్యు లగు శ్రీ దివాన్‌బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుఁడుగారి నడిగించి రు 2750 లకు నీప్రదేశమును గొంటిమి. వారు దయతోఁ గ్రయధనమునుండి రు 500 లు తగ్గించి మాకు విక్రయించి నందులకు మేము వారికిఁ గృతజ్ఞులము. ఇంజనీయరు శ్రీ చల్లా కామేశ్వరరావుగారు గృహనిర్మాణమునకు వలయు ప్లానులను వ్రాసి యిచ్చి కట్టడపుఁ బనిని స్వయముగఁ బరిశీలించుచు మాకు మిక్కిలి తోడ్పడిరి. పునాదులు పూర్తియై కట్టడములు కొంతయెత్తునకు లేచుసరికి ధవళేశ్వరమునుండి విచ్చేసి శ్రీ వెంకటసుబ్బమ్మగారు పరిస్థితుల నెల్ల స్వయముగ విమర్శించి మరల రు 3080 ల నిచ్చి యుద్ధకారణమున విపరీతముగ ధరలు పెరిగినందులకు జంకవల దనియు, భవననిర్మాణ వ్యాగ

కుండఁ గొనసాఁగింపవలసిన దనియు మమ్ముఁ బ్రోత్సహించిరి. కట్టడపుసామగ్రి దొరకుట దుర్లభమైనను వారి నిరంతరప్రోత్సాహముచే భవనము చుట్టువరండాలును, వెనుకగదులును బూర్తియై వానిపై డాబాకూడఁద్వరితముగ నిర్మింపఁబడినది. యావదాంధ్రదేశమునకును సంబంధించిన సంస్థ యగుటచే సభలు జరుపుటకుఁగూడ ననుకూలముగ నుండుటకై విశాల మగు సభాంగణము నిర్మింప నుద్దేశింపఁబడినది. కాని, దొరతనమువారి నిరోధమువలన వలయు దూలములుగాని, యినుపకంబములుగాని లభింపలేదు. తుదకు గంగోలుసంస్థానాశ్రితు లగు బ్రహ్మశ్రీ హోతా వీరభద్రయ్యగారి చింతపల్లిమన్యాకుఁ జెందిన దుర్గమారణ్యముల వలయు కైవారము, పొడుగు గల మ్రాకులను గొని నఱికించితిమి. వానిని కాకినాడ చేర్చుటకు మిక్కిలి కష్టపడవలసివచ్చినది. దైవానుగ్రహమునఁ దుద కెట్లో వానిని కాకినాడ భవనమునొద్దకుఁ జేర్చితిమి.

ఈ కార్యమున మా కనిర్వచనీయ మగు కార్యదీక్షతోడను, బుద్ధికుశలతతోడను సహాయపడి యా మ్రాకుల దుర్గమారణ్యములను, పర్వతపంక్తులను దాటించి గోదావరీతీరమునకుఁ జేర్చి కృతకృత్యు లయిన గంగోలుయెస్టేటు ఉద్యోగులగు శ్రీ తణికెళ్ళ రామకృష్ణమూర్తిగారును, శ్రీ పుల్లాపంతుల వేంకటసుబ్బరాయ్‌గారును, పోలవరమునఁ దమ దేశసేవచే "ఆశ మను డాక్టరు" అని ప్రసిద్ధిబొందిన శ్రీ మాచిరాజు సత్యనారాయణగారును, నిరంతరస్మరణీయులు. అధికారబలము కాని, ధనవ్యయముగాని సాధింపలేని యా మహాకార్యమును వారికిఁ గల భాషాభిమానమే సాధించినది. వారిలో డాక్టరు సత్యనారాయణగా రాకస్మికముగ నిటీవల దివంగతులై యీశుభసమయమున లేకుండుట మిక్కిలి విషాదకరము.

గొప్పప్రయత్న మొనర్చి కాకినాడకు దూలములఁ జేర్చునంతలో యుద్ధసన్నాహములకై సగము నిర్మాణ మైనభవనమును యుద్ధ

కార్యవర్గమువారు తీపికొన యత్నించిరి. విద్యావిషయక మగుసంస్థ యగుటచే వా రాప్రయత్నమునుండి విరమింప, మిగిలిన భవననిర్మాణ కార్యముల నతిత్వరితముగఁ బూర్తియొనర్చి నేఁటి కీభవనమును బరిషత్తున కర్పింపఁగలిగితిమి. స్థలము క్రయధనము రు 2250 లు గాక భవననిర్మాణమునకుఁ బ్రత్యేకించి యింతవఱకు 15866-3-6 ల రూప్యము లయినవి. ఈ ద్రవ్య మంతయు శ్రీ వెంకటసుబ్బమ్మగారే వహించియున్నారు. వీరి వదాన్యత లోకుల కాదర్శప్రాయము వీరు రాజమహేంద్రవరమున క్షయపీడితులకై యేర్పడిన శానిటోరియమునకై పదివేలు వెచ్చించి రోగులకు వసతులు నిర్మించిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకును, తిరుపతిప్రాచ్యసంస్కృతకళాశాలకును గొప్ప విరాళముల నొసంగిరి. అన్నదానమునకై తిరుపతిలోను, ఇతరప్రదేశములందును పెక్కునిధుల నేర్పఱచిరి. ధవళేశ్వరమునఁ గల దేవాలయములను, పూరీజగన్నాథము మున్నగు క్షేత్రములందును దైవకార్యములకై విశేషద్రవ్య మొసంగిరి. బీదబాలురసహాయార్థము ధవళేశ్వరముహైస్కూలున నొక నిధి నేర్పఱచియున్నారు. ఈ పరిషద్భవనమునకై వీ రొసంగిన ద్రవ్యమునుగూర్చి యిదివఱలోఁ దెల్పియుంటిమి. అన్నిటికంటె మహత్తర మగు విషయ మేమన, వీరు తమకుఁ గల యాస్తినంతను దానధర్మములకుమాత్రమే వినియోగింప దృఢనిశ్చయులై యున్నారు. ఇట్టి యుదారస్వభావము గల నారీతిలకమును దలఁచి యాంధ్రదేశమంతయు గర్వింపవలసియున్నది. అడిగిన దిచ్చెడువారును, వేలు కోరిన పదివే లిచ్చెడువారును గలరు. కాని తమ సర్వస్వమును దానధర్మములకును, అందును, ముఖ్యముగ ఆంధ్రసారస్వతాభివృద్ధికి నర్పించి ధన్యజీవిత్వమును గాంచిన మహోదారు లుండుట యరుదు. దానికి నాంధ్రభాషాభిమాను లందఱిపక్షమున మేము ధన్యవాదము లర్పించుచున్నాము. వీరి యౌదార్యముచే నాంధ్రసాహిత్యపరిషత్తునకు స్థిరావాసము నేఁటికిఁ గల్గినది. దీనికిఁ జుట్టును ప్రాకా

రము నిర్మింపవలసియున్నది. ఇంకను గొన్ని గదులు నిర్మించినఁగాని పుస్తకభాండాగార మంతయు నిముడ్చుట దుష్కర మని తోఁచు చున్నది. ప్రస్తుతభవనమున నొకగదిలో మాత్రమే ముద్రితగ్రంథ ముల నుంచుటకై యేర్పాటొనరింపఁబడినది. తాళపత్రగ్రంథము లను విడివిడిగ నమర్చుటకుఁ దగిన బీరువాలను జేయింపవలసియున్నది. అందులకుఁ బ్రత్యేకించి ధనసహాయము కావలసియున్నది. ఈ స్థల మున కైన ద్రవ్యమునుగూడ సమకూర్పవలసియున్నది. మహోదారు లగు మీవంటి భాషాభిమానుల సాహాయ్యమునఁ బరిషత్తున కవియు నచిరకాలముననే లభింపఁగల వనియు, పరిషత్త్రిక మీఁద నితోఁధిక ముగఁ దన కార్యక్రమమును నిర్విఘ్నముగఁ గొనసాఁగించి జాత్యభి వృద్ధికిని, భాషాపోషణమునకును, వాఙ్మయసేవకును దోడ్పడఁగల దనియు విన్నవించుకొనుచున్నాము.

ఈ భవననిర్మాణమున నాకు సహాయ మొనర్చిన మిత్త్రు లందఱకును, అందును ముఖ్యముగ నాకు దుర్లభమైన చలువరాయి నొసంగిన శ్రీ ముప్పన అంకయ్యగారికిని నా కృతజ్ఞతాభివందనములు.

కాకినాడ,
3-6-46.

ఇట్లు,
పరిషద్భవన నిర్మాణోపసంఘము

# ప్రశంసా పద్యములు.

శ్రీః

## ఆశీశ్శ్లోకాః

శ్లో. శ్రీసజ్జయపురాధీశం పాయా చ్ఛ్రీవల్లభస్సదా
యదాశ్రితాఃకళాస్సర్వా వర్ధంతే హ్యాదయంగమాః ॥

శ్లో. నిపుణం కావ్యనిర్మాణే కవిగౌరవతత్పరం
ధీరం శాంతగుణోపేతం దూరీకృత రజోగుణమ్ ॥

శ్లో. గ్రాంథికాంధ్రప్రియం ప్రాజ్ఞం హృద్యార్థపదకోవిదం
ఛందోవ్యాకరణాభిజ్ఞం సద్విద్వద్వర్యశేఖరమ్ ।

శ్లో. శ్రుత్వాహ్వానం సదయహృదయః పాలయామాస యోనః
సర్వా నస్మా న్సువసునిచయై ర్మానయామాస తుష్టః
గీష్మే భీష్మే సుగుణనిలయో దూర మాయా త్ప్రసన్నః
తం శ్రీమన్తం ప్రభువర మమం సర్వదా భావయామః॥

శ్లో. శ్రీవిక్రమప్రభువరం సౌశీల్యగుణభూషణం
సంరక్షతు కృపాసింధు ర్భగవా న్పార్థసారథిః ॥

ఏవం విద్వద్విధేయః
కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రీ.

## పంచరత్ని

శ్లో. విక్రమదేవోవర్మా, వ్యక్మైవాశేషవిబుధవర్గస్య ।
సంరక్ష్యతాం త్రివిక్రమ, దేవే నాపమ్యతో రమామహిపః ।

శ్లో. నతు త్రివిద్యయా య, స్తథైవచ తు త్రివిద్యయా వర్ధితః ।
విక్రమదేవో జీయా, దవిక్రమో మార్గయాయిపురుషేషు ॥

శ్లో. విబుధానాం సమవాయే, సమవాయే నైవ స సమవేత్య ।
సమ్మోదయన్ సదా తాన్, విక్రమదేవ శ్చిరం జయతు॥

శ్లో. న్యాయే పదే ప్రమాణే, నైవ ప్రస్ఖలతి యన్మతిః క్వాపి ।
తాదృశ ఏవ భవిష్యన్, విక్రమదేవ శ్చిరం జీయాత్ ॥

శ్లో. క్షత్రియవంశే నృపతి, ర్విరళో విరళో బుధోఽద్య విప్రేషు ।
ఏవం సరసస్తత్రా, ప్యేతత్త్రయయోగతో మనః పూర్ణమ్ ॥

కాకినాడ,
9-6-46.

దర్భా సర్వేశ్వరశాస్త్రి.

# ప్రశంసాపంచరత్నములు.

శ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రిగారు.

శ్లో. కళ్యాణ మాంధ్రసాహిత్యపరిష ల్లభతాం చిరమ్
ప్రాచీనా ఉత్తమగ్రంథాః ప్రకాశంతే యదాశ్రయాత్.

సీ. కంజాతహితవంశసంజాగ్రదంభోధి
సంజాతమందార! స్వాగతంబు
అయనయోదంచితజయపూర్ణమహారాజ్య
ప్రాజ్యవైభవయుతా! స్వాగతంబు
సదుపేయవిబుధసంసదుపేతసాహిత్య
సమాప్రిత్పదాంచితా! స్వాగతంబు
మిలితవిక్రమభోజతులిత! విక్రమదేవ
వర్మమహారాజ! స్వాగతంబు
అంచు స్వాగత మిమ్ము ప్రత్యగ్రభవన
భాజమున నిన్నుఁ జేర్చు నీ రాజప్రాళి

కధిగతాఖిలవిజ్ఞహస్తావలంబ !
ప్రథితచరి తాంధ్రసాహిత్యపరిషదంబ !

సీ. విశ్వవిఖ్యాతాంధ్రవిశ్వవిద్యాలయా
ధ్యక్షతోల్లసిత ! దీర్ఘాయు రస్తు
దానాపజితకర్ణ ! దీనావనపరాయ
ణానందితబుధ ! చిరాయు రస్తు
సకలకలాభిజ్ఞ ! సుకవితాతత్త్వజ్ఞ !
విభువర ! వంశాభివృద్ధి రస్తు
పుంజీభవజ్జగద్రంజకసుగుణపుం
భావస్వరూప ! శుభాని సంతు
అనుచు దీవింపు నీదుహర్మ్యప్రవేశ
మహాసభాపతి నధ్యాత్మమతి ససుతుని
సరససాహిత్యచయసముద్ధరణరతిని
వ్రతిని విక్రమదేవభూపతిని సతము.

సీ. మహిత జయంతి రామయమహాశయచతు
రాస్యుండు సృజియించె నాది నేది
రహిమీఱ శ్రీసూర్యరాయమహోదార
భూదారసంభృతిఁ బొలుచు నేది
నానాదిశాఖ్యాతదానీంద్రసముదయం
బొసఁగు కేలూఁతల నెసఁగు నేది
సద్వ్యవస్థాపకాచార్యసూర్యేందుమ
హోద్యమద్యుతులఁ జెన్నొందు నేది
అట్టి శాస్త్రపురాణేతిహాసనదులఁ
బరఁగి సత్కావ్యసస్యసంభరిత యగుచు
నమరు నీయాంధ్రసాహిత్యసమితి జగతి
తద్ద వర్ధిల్లు నాచంద్రతారకముగ.

సీ. ఆంధ్రవాఙ్మయరక్షకై యాంధ్రసాహిత్య
పరిషత్సమాఖ్యతోఁ బరమపూజ్యుఁ
డైన మీయగ్రజుం డల రామయార్యుఁ డీ
సంస్థ వెలయఁజేసె
ఆమహాసంస్థకై యతిరమ్యసువిశాల
భవనంబు నిర్మించి భర్తపేర
నర్పించితివి నీవు త్యాగ మిట్టి దటంచు
సజ్జను లెల్లెడ సన్నుతింప
పుట్టినింటికి మఱియు నీ మెట్టినింటి
కసమయశము గూర్చితివమ్మ సాధ్వి!
రామయానుజ! సుందరరామపత్ని!
సుగుణనికురుంబ! వేంకటసుబ్బమాంబ!

సీ. ధనవంతు లెంద ఱెందఱు లేరు ధరలోన
నరయ ధర్మాసక్తి యరిది గాక
ధర్మాత్ము లెంద ఱెందఱు లేరు ధరణి స
త్పాత్రదానంబు చొప్పడదు గాక
దానశీలురు లేరె ధరణిలోఁ బెక్కండ్రు
రిట్టి విద్యాసంస్థ కిడరు గాక
ధన్య వీ వెలతయుఁ దలఁప నీదృఙ్మహా
భవన మిచ్చితి వాంధ్రభాషకొఱకు
రమ్యవితతంబు సుందరరామ భవన
మలరఁగావుత మాచంద్రతార మవని
దాన పాత్రజ్ఞ! మీ పుణ్యదంపతులకు
శాశ్వతసుఖంబు లొసఁగు సర్వేశ్వరుండు.

# ప్రశంస

గీ. కనెను మును రామయార్యుండు ఘన మనీషి
యాంధ్ర సాహిత్య పరిషదంబను లతాంగి।
మేనగోడలి కొక దివ్యమైన సౌధ
మలవరించె వేంకట సుబ్బమాంబ నేఁడు॥

గీ. ప్రథితమైనదియ జయంతివారి పుత్రి
ప్రభల వారి యిల్ సేరు,టాక్రమమె యిపుడు।
నాంధ్ర సాహిత్యపరిషదబ్జాక్షి ప్రభల
వారి యిలు సేరి పాలించెఁ బ్రజలు మెచ్చ॥

చ. అభినవ భోజుఁ డాదిగ మహామహులై నవదాన్య శేఖరుల్
ప్రభువులు తెల్గుభారతి కపారసపర్యలు సేయువారు స
ద్విభవము గల్గువారును మదిం దలపోయర; యైన నేడు మా
ప్రభలకొలంపు వృద్ధ నలువారెడుసౌధ మొసంగె నాంధ్రికిన్॥

కాకినాడ,
9—6—1946.  } విద్వాన్. పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి.

# మంగళాహ్వానము.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

౧

కోమరారన్ జయనాదభంగులఁ దెలుంగుల్ ముప్పదేనేండ్ల నీ
కోమసంస్రాయపుగాథ సాధుగతి వాకోఁగా, మహారాజు వి
క్రమదేవేంద్రుఁడు స్వాగతోక్తి నొడవంగా నుత్తమంబైన ది
వ్యముహూర్తమ్మున నగ్రోత్తలోఁగిలికి సారభామా!రమా.

౨

మొదట జయంతి రామయ్యను మోదమున న్మది నిల్పుచేసి య
ప్పిదపఁ బిఠాపురప్రభునిఁ బేర్కొని సుందరరాము నెన్ని యా
పదపడి యిందు నీవు కుడిపాదము వెట్టి గృహప్రవేశసం
పద నొడఁగూర్చుమా ! తెలుఁగుభారతి ! హారతిఁ గొందు వెల్గునన్.

3

పొలపము దక్కి పుర్వులకు భుక్తులు వెట్టెడి తాటియాకుఁగ
ట్టల నెల వేర్పఱించుకొని డాఁగిన నీదెసఁ బ్రీతి దోఁచి, ని
స్తులదయఁ జూచె నీ ప్రభల సుబ్బమ; కావున నీవె నిండుఁజూ
పులఁ దిలకించి తద్భవనముం గయిసేయుము వాగ్వధూమణీ !

౪

వెనుకటివారు సూత్రమును వేసిరి, మోసిరి తెల్గురాజు లె
ల్ల నడుసు మంటిముద్దలు, చెలంగి కవీశులు తీసి రిట్టికల్
గనప పునాది దిట్టముగఁ గట్టిరి పండితపాళి గూడి, నూ
తనభవనప్రవేశము ముదంబునఁ జేయుము వాఙ్మయేందిరా !

౫

మురువున శాస్త్రపండితులు, భోజసమానులు రాజులున్, గవీ
శ్వరులును వందిమాగధులపద్ధతి బారులుతీరి నీశుభో
త్తరచరితంబుఁ బాడఁ, బలితం బగువేడుక నాంధ్రసాహితీ
పరిషదమోఘహర్మ్యతలవాస మొనర్పుము శాశ్వతంబుగన్.

హరిహరదేవాయనమః

# ప్రశంసాపద్యోపాయనము.

మ. పరివస్యారచనాచణుం డగుచు సంభావింప మాపీఠికా
పురరాజన్యుఁడు నేఁడు శ్రీ జయపురీభూనాయకావిష్కృతిన్
పరిదీపించు నవీనధామమున నంబా ! యాంధ్రసాహిత్యస
త్పరిషత్సుందరి ! కాపురింపు మురువిద్వత్పాలిఁ బాలింపుచున్.

మ. పరిషద్దేవి ! కళాప్రపూర్ణరచితాహ్వానంబు మన్నించి సుం
దరరామార్యసతీనవీనభవనాంతస్సీమ వాసించుచున్
పరిఘూర్ణింపుము గ్రామ్యనవ్యకవితాపైశాచికాపారదు
ర్భరసాటోపముహుర్ముహుఃకహకహారావావిరామార్భటిన్.

ఆ. వె. అభినవాంధ్రభోజుఁడఁట యాంధ్రసాహిత్య
పరిషదధికపోష్ట, భవనదాత్రి
విప్రసాధ్వి యఁట, వేశ్మోత్సవవిధాత
యాకళాప్రపూర్ణుఁ డఁట, బళిర !

శా. లేకున్నారొకొ నేఁడు గాకపురి బాళిం గేళిం గాథాసు మొం
డాకల్పించి మనోవచఃక్రియల నీ యాంధ్రీయవాగ్దేవికిన్
సాకల్యార్పణముం బొనర్పఁ గలశ్రీనాథుల్ వదాన్యుల్ బుధుల్
నీకొక్కర్తకె మాట దక్కినదిగానీ నేఁడు సుబ్బాంబికా.

చ. విభవకళాభిశోభితనవీనమహాభజనాప్తి సాహితీ
సభికులె కాక కాకపురసర్వజనావళి నీవదాన్యతా
శుభకృతికిన్ ఋణంపడిరి సుందరరామసుధీవధూటికా !
ప్రభలజయంతివంశయుగపాలిక ! వేంకటసుబ్బమాంబికా !

ఉ. నీ నసమానదానకళనే సకలార్థము లంది యెందఱో
మానవు లాయురున్నతుల మానితసత్పదభోగభాగధే
యానుపమానసంగతుల హాయిగ నుండిరి వీర లెల్ల నీ
సూనులు గారొకో ప్రభల సుందరరామసుధీవధూమణీ.

తుల్యారామేశ్వరము,
9—6—1946.

కవికంఠీరవ, కవిమూర్ధన్య,
శాకరపతి శ స్వా.

శ్రీ శారదాంబాయైనమః

# ఆత్మకోదండప్రోత్తు.

శ్రీకారము నేఁ జుట్టుచు
ప్రాకటభక్తిం జయంతి రామయబుధు సు
శ్లోకుని భావించి నమో
వాకము లర్పింతు నాంధ్రపరిషత్సతికిన్.

శైశవ మాదిగాఁ దెలుఁగుచానయశంబును శాశ్వతంబుగా
దేశములందు నిల్పఁ దనధీవిభవంబును వెచ్చఁబెట్టి యా
వేశము లేక తా సభనివేశముతో గృషిసల్పి నిల్పె నీ
పేశలవాగ్విలాసపదవిం బరిషత్సతి రామయార్యుఁడున్. ౨

ఆంధ్రసాహిత్య పరిషదభ్యర్చనంబు
చేయుపూజరి మదిఁ దలపోయునట్టి
కోర్కెలకునెల్ల ముఖ్యమా కోర్కె నేఁడు
సఫలమయ్యె మహత్తరోత్సవముకతన. ౩

కనె నొక కన్యకామణిని గౌరవదాత్రిని రామయార్యుఁ డ్రీ
గానముల ప్రోక పోషణము గోరి మహత్తరఖేదమో... తల్
గని తుద కెట్టులో తనసకాశముఁ బాయకయుండ నిల్పె మే
దినిఁ దనకన్యసేవల సుధీమణు లెల్లరు సేయునట్లుగాన్. ౪

ఆమెగుణంబు లెంతటి మహాత్ములకైనను వింత గూర్ప నే
మేమని ముందుగా నిలిచి యిచ్చిరి రొక్కము వేసవేల్ యశః
కాములు మేదినీపతులు కానుకలుగా మఱి యీమెనిండు మో
మేమియు విప్పదయ్యె తగునింటను దా వసియింపకుండుటన్. ౫

ముదుసలియైన తండ్రి తన ముచ్చట దీర్పకయున్న నెట్టులో
కదిసి యుదారశీల మమకారము గల్గిన యత్తనేను మీ
పదముల నంటి నిత్యసపారయశం బొసగూర్తు మీకు నన్
సదయతజూడుమన్న విని సంతస మందెనుసుబ్బమాంబయు. ౬

ఎండకు వానకుం దడిసి యెండుచు రూపఱియున్న సీమె నొ
క్కండును జూడకున్న మమకారముగల్గిన యత్త "పున్నెముల్
పండునుగాదె యీమెకు నివాసముగా నొకసౌధ మిచ్చినన్
మెండగు కీర్తి వచ్చు"నని మెచ్చెను కోడలి లచ్చనంబులన్. ౭

ఇది వెలనాంటికాంత వయ సిప్పుడు ముప్పదియైదు నేండ్లు నా
కిదియును నన్నకూఁతు రిఁక నెంచఁగ నక్కఱలేదు వావి నా
ముదిమిని నిట్టి కోడ లనఁ మోదము జూపెను దీనిఁ జేర్చినన్
కొదవలు దీఱు నా కనుచుఁ గూరిమితోఁ దలపోసె నత్తయున్. ౮

అత్తయుఁ గ్రొత్తకోడలి గుణావలి వీనులఁ బడ్డయంత నే
హత్తినవేడ్క సీమె కొకహర్మ్యము క్రొత్తగ గూర్పఁ గోర్కె రే
కెత్తగ నామె పుత్త్రులకు నిచ్చెను రూప్యము లాఱువేలు మే
నత్తవిరాళముం గొనె మహాత్తరకీర్తి ఘటింపఁ గోడలున్. ౯

అంతట నామె పుత్త్రు లతియత్నములన్ బచరించి భారతీ
కాంత వసింప నర్హము నికామమనోహర మైననూత్నశు
ద్ధాంతము గూర్పఁగా గడగి రత్తయుదారత హెచ్చరింప
క్కింతయు జంకులేక సతి కీప్సితసిద్ధి ఘటింప నెంతయున్. ౧౦

తనమన మెంత గౌరవము దాల్చినదో భవనంబుగూడ నా
యనువున నుండగావలె నటంచు దలంచెడి సుబ్బమాంబ దా
గనుఁగొనవచ్చి యిచ్చెమఱి కానుకగ రొక్కము మూఁడువేలు మా
మనములు నబ్బురంబుగొనె మానిని యీవికి కార్యదీక్షకున్. ౧౧

ఇం కొకపల్కు పల్కె నిఁక నీభవనంబును గట్ట మీర తే
వంకకుఁ బోకుఁ డెంతధనభారమునైనను నేనె దాల్తు ని
శ్శంకతఁ గార్యముల్ నెఱపి జాగొనరింపక నూత్నసౌధప
ర్యంకతలంబునన్ విడియ యత్నము సేయుఁడు నాదుకోడలిన్. ౧౨

సకలసంభారముల్ గూర్చి సదనమట్టు
భారతీదేవిపూజకై పాదుకొలిపి
ఆంధ్రభాషావధూటి కీయవసరమున
జరుపుచుండిరి పటుమహోత్సవము సుతులు. ౧౩

కట్టించె భవనంబు కాంతయా సుబ్బాబ
భర్తకు శాశ్వతకీర్తి వెలయ
నిర్మించి రీసౌధ మర్మిలి ధీరులై
పరిషదారాధకుల్ భక్తితోడ
దీపించె నధ్యక్షుదివ్యపీఠమునందు
సాహిత్య సమ్రాట్టు శ్రద్ధతోడ
వీక్షించుచున్నారు వియ్యంకు లిద్దఱు
సత్తకోడండ్రయీపొత్తుపెంపు
కవులు పండితులును నీదుభవనవిభవ
మరసి యానందడోలావిహారములను
జేయుచున్నారు భారతీ సిగ్గు వీడి
అత్తకును జెప్పుమమ్మ నీపెత్తనంబు. ౧౪

స్థాపించె నీసంస్థ సార్థకజన్ముడు
రామయార్యుడు బుధరంజనముగ
పోషించె సూర్యరాడ్భూజాని దీనిని
పటుకోశసందర్భపాటవమున
జరపించుచున్నారు సకలకార్యంబులు
పండితవర్యులు ప్రౌఢి మెఱయ
అందిచ్చిరాంధ్రదేశావనీనాథులు
కానుకల్ వేనవేల్ గారవమున
కాని యింకను నెన్నియో కానుకలను
గోరుచున్నది మాతల్లి కూర్మిసుతుల

యశోహాలను నింప మనమున నుత్సుకత్వ
భరము గొనుమయ్య విక్రమవర్మ దేవ. ౧౫
ఎందఱు లేరు దాతలు మహీస్థలి వారల నెవ్వరేని యీ
కందువ నాంధ్రభాషకు వికాసముగూర్చెడి దివ్యసంస్థ చె
న్నొందగ రమ్యమైన తగునోలగమున్ రచియింపనేర్చిరో
యొదును బూర్వపుణ్యములె యిచ్చును శాశ్వతకీర్తి సంపదల్. ౧౬
పరిషత్సతి కారాధన
జరిపెడిమామనములెల్ల సంతోషముతోఁ
గర ముప్పొంగఁగఁ జేయుము
పరితోషితబుధసమూహ పాణినముఖ్యా. ౧౭

ఇట్లాసించు,
చిలుకూరి పాపయ్యశాస్త్రి.

## ఉపద.

చిలుకూరి వీరభద్రశాస్త్రి.

౧

శ్రీసూర్యరాయేంద్ర కృపాప్రపూర్ణశుభర్ద్ధిసంవర్ధితపూర్ణగాత్రీ
విజ్ఞానగంభీరశుభాంధ్రభాషాఖని శ్శుభాగార మలంకరోతు !

౨

శ్రీమత్పరిషద్భవనప్రవేశ సమయ శ్శుభర్ద్ధి సంభరితః ।
ఆంధ్రాశా మయ నుతితర మహనీయామేయగర్వకృతిహేతుః.

3

శ్రీమద్విక్రమదేవభూపతి మహాసౌజన్యపూర్ణాదృతిమ్
ప్రాప్తేయం పరిషత్సుపూర్ణభవనప్రావేశికేఽత్యుత్సవే ।
సేయం సర్వమహత్త్వదేదృశమహాసౌభాగ్యపూర్ణాంచితా
ప్రాసాదే వసతీ త్రివిక్రమపదం సంపూర్ణ మధ్యాస్యతామ్.

విజ్ఞానసంపూర్ణమహాధిరాజ శ్రీవిక్రమోర్వీశసుపూర్ణదృష్ట్యా
అగార మేత న్నచిరా త్సుపూర్ణం ప్రాసాదరాజం భవితేతి మన్యే.

౫

సాహిత్యాంబుధిఖేలనేన సరస స్సాహిత్యసమ్రా డయన్
అచ్ఛస్వచ్ఛగభీరబుద్ధికలితో నిత్యం కళానాం నిధిః ।
షట్ఛాస్త్రేషు నిగాఢపూర్ణధిషణః శ్రీవిక్రమోర్వీపతిః
శ్రేష్ఠాధ్యక్షపదం బభార పరిషత్సౌభాగ్యభాగ్యోదయైః ।

౬

ఆంధ్రాణాం నా స్తి విద్యోద్ధృతినిపుణమహాస్థేమ, తత్రాపి కృత్యం
కర్తుం తే నైవ శక్తాః, సుహృదయవిధురాః, సంఘశక్త్యా న చైవ ।
ఇత్యేవం లోకగర్హాం విమలతరమహోదారసంపూర్ణబుద్ధి
స్సుబ్బాంబేయం వ్యమార్క్షీత్ భవన మిద మపూర్వాంగరమ్యం
విధాయ.

౭

ఆంధ్రేష్వేకైకోఽపి ప్రకృష్టకృతిభారవహననిపుణతరః ।
ఇత్యేవం భువనే స్మి న్నబలా ఘోషయతి భవననిర్మాణైః.

౮

సీ. శ్రీసాంద్రపీఠాపురీరమ్యరాజన్యుఁ
డొకఁడె భాషోద్ధృతి నుండె ధృతిని
ఆంధ్రుల విశ్వవిద్యాలయ వృద్ధికై
దాతల వికృముఁ డీతఁ డొకఁడె
రామయపంతులు రమ్యాంధ్రసాహిత్య
పరిషత్తు నొక్కండె ప్రౌఢఁజేసె
ఈయమ యొర్తుక యీసౌధనిర్మాణ
కార్యధురీణయై కాంచె యశము.

గీ. ఇటుల నీయాంధ్రమండలి నీకు సేయ
నొక్కఁడొక్కఁడె ఘనకార్య మూర్జితముగఁ
జేయ సమకట్టి ధైర్యంబు చింతసేయ
నన్నిటను నగ్ర్య మైయుండ కబ్రమేమి ?

౯

మ. భవనంబున్ దరిసింప నెంచినఘనుల్ ప్రాపించి చూడంగ సం
భవమే? యెవ్వరు దీనిఁ గట్టిరి బళీ! బాగొప్ప! వీరెవ్వరే!
దివిఁ దాఁకఁగను నున్నసీ భవనము న్స్పష్టన్ గనుల్ విప్పుచున్
దివిదాఁకం గని నేత్రముల్ తలకురా నిర్మాత్రికేమా నొకో?

౧౦

శా. పారం బొందుదునే ధనం బిడఁగ నాభారమ్మటంచుఁ గృతిన్
వీరావేశముతోడ దానమిడి యుర్విన్ లేద యీ డంచుఁదన్
ధీరత్వంబును సాహసంబు నెగడ న్నిర్మాణముం జేయఁగాఁ,
బ్రారంభించి ప్రవేశముం జలుపు సుబ్బాంబ న్నుతింపన్ వలెన్.

౧౧

చ. ఇరువదియూ! పదాఱు! యిదె యిచ్చెద వేలను, గ్రిందుమీఁదు మీ
రరయక కట్టుఁడంచుఁ గడు నాదరణంబునఁ బల్కుసాధ్వి నీ,
ధరఁ గనుగొంటిరే? యిటులు దాంతత సుబ్బమకబ్బె నీయిలన్
గర మరుదిట్టి దాతృతకుఁ గారణ మేమయియుండి యుండునో?

౧౨

గీ. కీర్తిగడియింప నిట్టట్టి కృతులు తలఁచి
కడకుఁ జేయఁగఁ బూనిన ఘనులు కలరు
కాని యాకీర్తి కాంక్షించి కాదు, కనఁగఁ
**గలదు సుందరరాముని ఘనతకాంత.**

౧౩

చ. తెలియఁగఁజేయు నిట్టిఘనధీనిబిడీకృతకాంక్షితంబు మీ
రలు మునుమున్న కాంచనగు రమ్యము లౌ భవనాతురంబులే
యిల నిదె భర్తృవాంఛితము నేర్పడఁజేయుట యన్నదొక్కఁడే
కలను పతివ్రతామణికిఁ గాంక్షితమన్యము లేదులేదుగా.

౧౪

ఉ. కూరిమితోడ నీపటులు కోడలికిం భవనంబు కట్టినన్
బేరిమి కోడ నందలము పెంపుగఁ జేరిచి యూరనేఁగినన్
గోరుట మాన దీయువిద కోరుచు నున్నది సుబ్బమాంబ! మా
కారయసౌధవాస మిఁక హాయిని గొల్పు నటంచు నిత్తఱిన్.

౧౫

ఉ. లోకములోన నత్తలకు లోకువ కోడలు కాని మీ యెడన్
బోకడ నంతయుం గనఁగఁ బూర్ణవిరుద్ధము; కోడ లిట్టినన్
బోకడ వెట్ట కొక్కపరిపూర్ణపు వత్సరమేఁగకుండ నీ
వేకరణిం బొనర్తు! గడియింపుము కోడలియీప్సితంబులన్.

౧౬

గీ. రామమూర్త్యంశు నీ యట్టి రత్నఖనియె
కలదు నాపుత్రి కేమని గరువ మూని
యేమి చెప్పక నిశ్చింత నేఁగె దివికి
వంశజులచేవ యెఱుఁగనివార లెవరు.

౧౭

ఉ. వా! యెవరయ్య! యిట్టికృతి బాగుగ సల్పిరి; యుత్సవంబులో
నా యెడ గౌరవం బిడుచు సన్ను ఘనాదృతిఁ బిల్వఁ బంపిరే!
యీయిల నెవ్వరిట్టి రని యీ కడువృద్ధఁసు కష్ట మెంతు నే?
"!" యనివచ్చు విక్రముఁడు; పూర్ణకృపామతి మెచ్చఁగావలెన్.

౧౮

గీ. చులుకనేనకువేఁను సుబ్బమాంబ!
యిచ్చియుంటివి ప్రతిఫల మీయకునికి
గౌరవం బోటు! మఱువక కాన్కలిడెద!
వేఱుకొక్కొక్క పద్యంబు వెలకుఁ గొనుము.

ఓమ్.

---

శ్రీ ప్రభల సుందరరామయ్యగారి ధర్మపత్ని వేంకటసుబ్బమ్మగారు
శ్రీ ఆంధ్రసాహిత్యపరిషద్భవన ప్రవేశమహోత్సవ
సమయ ప్రశంసా

## పద్యరత్నపంచకము.

చ. సిరి కిరవౌ జయన్తికులసింధుసుధాంశుఁడు రామయార్యుఁడా,
దరమునఁ బెంపఁగాఁ బెరిగి తత్తదుదారనరేంద్రచంద్ర భా
స్వర కరుణ న్విలంగు పరిపన్నవకల్పలతామతల్లి సు
స్థిరయయి యాంధ్రులన్ దనియఁజేయుత మాశశి తారకమ్ముగా. ౧

ఉ. ఆమూలమ్మగ గ్రాంథికాంధ్రమును మాయంజేయఁగా గ్రామ్యభా
షామేఘమ్ములు సాంద్రమై యలము దుష్కాలమ్మున న్నీమహో
ద్దామప్రాభవ మన్ప్రభంజనము తత్కాలుష్యముం బాపి తే
జోమాన్యంబొనరించె నీకివియె మాజోహారు లోసాహితీ. ౨

ఉ. సోదరుఁడైన రామయ యహూసకృపం గని పెంచె నంచు స
త్యాదృతి మీఱ దివ్యమగు హర్మ్యము వేంకటసుబ్బమాంబ నీ
కై దయచేసి భ[illegible]రదగు నాహ్వయ మయ్యది శాశ్వతంబుగా
నేదియు లోటులేదుగద యింకట నోపరిషద్వధూమణీ. ౩

గీ. మేనగోడలవంచు ననూనమైన
పేర్మి దైవార నిరవు గల్పించుమేన
యత్త కాచంద్రతారార్కమైనయశము
గూర్పు మోయాంధ్రసాహితీ కోమలాంగి. ౮

మ. ధనవంతు ల్మతిమంతు లెంతయును విద్యావంతు లీధాత్రియం
దున లేరెందఱు రామయార్యునకె యొందుం జెల్లె సాహిత్యసం
స్థను సృష్టింపఁగఁ బెంపఁ దత్సహజవై దైవారు నీకే తగుః
ఘనహార్ద్యం బిటుగూర్చిదానమొసఁగంగా నెంచు సుబ్బాంబరో గి

ఇట్లు,

9-6-1946,
వింజరం
కాకినాడ తాలూకా.

విద్వత్కవిశేఖర: వ్యాకరణాచార్య,
ఆంధ్రకథాసరిత్సాగరాదిగ్రంథకర్త,
ఓలేటి సూర్యనారాయణశాస్త్రి,
శ్రీ వేంకటేశ్వర వేదశాస్త్ర పాఠ
శాలా ప్రధానోపాధ్యాయుఁడు.

ఓమ్.

శ్రీ శ్రీ శ్రీ జయపురాధీశ్వరులగు విక్రమదేవవర్మ
మహారాజులుంగారికి సమర్పించిన ప్రశంసా

# పద్యరత్న పంచకము.

శ్లో. శ్రీమాన్ జయపురరాజ్య
శ్రీదయితో దాతృతావిజితకర్ణః
సాహిత్యసార్వభౌమః
శ్రీవిక్రమదేవ భూమిపో జయతు.

ఉ. విక్రమదేవవర్మ పృథివీపతులందున మేటి నేటి స
మ్యక్కృతి కాధిపత్య మది యందుట లారయ భావికాలకా
ర్యక్రమమెంత యేని సు శుభావహమై దనరారు నంచు ని
ర్వ్యక్రమముగా నెఱుంగనగు రాజిలు మున్నతిమీఱి సాహితీ. ౨

చ. సకల కళాప్రపూర్ణుఁడయి సాహితిసంపన సార్వభౌముఁడై
యకలుషచిత్తవృత్తియయి యన్యదురాపయశోవిభాసియై
ప్రకటతరాతిసంపదభిరాముఁడు నౌజయపూర్విభుండు పూ
నిక నిఁక నీకు నున్నతి యనీదృశముం గలిగించుఁ గావుతన్. ౩

మ. అనువర్షంబును లక్ష వార్షికముగా నావిశ్వవిద్యాలయ
మ్మున కర్పించు వదాన్యుఁ డీనినుఁ గృపాపూరప్రపూర్ణేక్షణ
మ్మున నొక్కింతగఁ జూచినన్ సకల సమ్మోద ప్రదౌన్నత్య మెం
దును జేకూరుట యబ్రమొక్కొ? పరిషత్తూ! పండె నీపుణ్యముల్.

సీ. ఆంధ్రపరిషత్తు గావించు సత్యపూర్వ
పూర్వజన్మార్జితోరుతపోవిశేష
మునను విక్రమదేవవిభుండు సన్య
భోజఁ డధ్యక్షపీఠమ్ము పొందు నేఁడు. ౫

ఇట్లు,

9-6-46,
వింజరం.
కాకినాడ తాలూకా.

ఆంధ్రకథాసరిత్సాగరాదిగ్రంథకర్త.
ఓలేటి సూర్యనారాయణశాస్త్రి'
శ్రీ వేంకటేశ్వర వేదశాస్త్రపాఠశాలా
ప్రధానోపాధ్యాయుఁడు.

# ఆనందము.

చిలుకూరి విశ్వనాథశాస్త్రి.

శ్రీమదాంధ్ర సాహిత్యపరిషదమోఘ
నవభవనప్రవేశంపుటుత్సవమునందు
కవులు పండితులును వచ్చి ఘనతరంపు
దీవనలు పంపుఁగాక! యాదేవుకరుణ. ౧

భూజను లెల్లరుం బొగడుపోలికి, భోజసదృక్షుఁడైన యా
శ్రీజయపూరధీశ్వరునిచేఁ దెలువ బడుచుండె, వాఙ్మయ
భ్రాజితమైన యీభవనవర్యము; తద్భవితవ్య మెట్టిదో
యోజనసేయుఁడీ గుణమహోదధులైన సదస్యశేఖరుల్! ౨

ఈముహూర్తము మంచిదై యెల్లయపుడు
ప్రభల సుబ్బమసుందరరామనామ
దంపతులపేర శాశ్వతస్థాయియగుచు
నాంధ్రసాహితి యిం దలరారుఁగాత? ౩

రాణ్మహేంద్రకవీంద్రరమ్యహర్మ్యంబునఁ
బసిఁడిగిన్నెలలోనఁ బాలు ద్రావి
సోమయాజులవారి హోమవేదికలపై
నల్లన చల్లగా నాటలాడి
శ్రీనాధకవివర్యు సీసడోలికలలో
హాయిగాఁ దూగుటుయ్యాల లూఁగి
భక్తపోతనయింటి పంచపాళీలలో
మెత్తనిశయ్యల నొత్తిగిల్లి
తాత యగుపెద్దనకవి తత్పరత మీఱ
గజము నెక్కింప మెలగుచుఁ గరముమెఱయు
నాంధ్రకవితాకుమారి జయోఽస్తు నీకు
ఆంధ్రసాహిత్యలక్ష్మి జయోఽస్తు నీకు. ౪

# తెలుగులోని అఖండయతులు - వానిగతులు.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

కడచిన జూలై నెలలో వెలువడిన భారతి పత్రికలో అఖండయతిని గూర్చి కొంతవఱకుఁ బ్రసంగించియున్నాఁడను. ఇంకను దత్ప్రసంగమున ముఖ్యముగఁ గొన్ని యంశములు పాఠకుల కెఱిఁగింపఁ దలఁచి యీ వ్యాసము వ్రాయఁబూనినాఁడను.

సంధివశమున నుత్తరపదమునందలి యచ్చుతోఁ గూడిన తావులందెల్ల వళి, సమానాక్షరములకు నచ్చునకు హల్లునకు చెల్లింపవచ్చుననియు, అదియే యఖండవడి యనియు, దానినే భీమన ముద్దరాజు రామన చిత్రకవి పెద్దన కూచిమంచి తిమ్మనయు నంగీకరించినారనియు, అప్పకవి యొక్కఁడే యంగీకరింపనివాఁ డనియు అందుచేఁ బండితలోకమున నీయఖండయతికి వెలివచ్చినదనియు గిడుగు సీతాపతి పంతులు బి. ఏ. ఎల్. టి గారు 1920 మే జూన్ నెలలకు వెలువడిన 'తెలుగు' అరుమాసపత్రికలో 'అఖండవడి' యనుపేర దీర్ఘవ్యాసము నొకటి ప్రకటించియున్నారు 1934 లో వెలువడిన అప్పకవీయము పీఠికలో నీ వ్యాసమునుగూర్చి తిరుగ నుద్ఘాటన మొనర్చినారు. ఆవ్యాసమున వారు తెలిపిన యుపపత్తులు లక్ష్యములుగ నిచ్చిన కవి ప్రయోగములు వాని పాఠములు నెంతవఱకు సరిపడియున్నవో కొంత పరిశీలింతము.

అప్పకవి యఖండవడికి వెలివెట్టలేదని యీవఱకే వ్రాసియుంటిని. భీమన, పంతులుగా రనుకొనిన యఖండవడి నంగీకరించినచో, ప్రాదియతియందుఁగూడ నుత్తరపదాద్యచ్చుతోఁ గూడిన తావున నచ్చునకు హల్లులకు యతి చెల్లింపవలయునుగాన అఖండయతిచేతనే గతార్థమగుచుండ మఱి ప్రాదియతి నంగీకరింప నక్కఱలేదు. ఇటులనే రామనగాని పెద్దనగాని తిమ్మనగాని, అప్పకవి యుభయయతులుగా లెక్కించిన వర్గములోనినిత్యసమాసాదియతుల లక్షణలక్ష్యములను దెలుపఁగూడదు. అఖండయతి నంగీకరించియు నితరయతులనుగూడ నంగీకరించిన పె

లాక్షణికు లందఱుకూడ పంతులుగారు తెల్పిన యఖండయతి నంగీక రింప లేదని చెప్పవచ్చును. వారనుకొనినదే లాక్షణికాభిమతమైనచో పైలాక్షణికులందఱు నలాక్షణికులేని గానోపుదురు. ఒక్క అఖండయతి మాత్రము నంగీకరించిన సర్వలక్ష్యములు సరిపడుచుండ భీమనగాని యితరులుగాని యతుల సంఖ్య నేల పొడిగింపవలయును.

లాక్షణికహృదయము నరయుట కష్టసాధ్యము. యథాతథము గ నెఱింగిననేగాని లక్షణము సరిగా సమన్వయింపదు. ఏదియో యొకరీతిని సమన్వయించిన నది లక్ష్యమున సరిగాఁబొసగదు. ఒకప్పుడు విపరీతపథమును బట్టునేని భ్రాంతిని గలిగించును. తన్మూలకముగ ప్రామాణికలాక్షణికులను సైత మపవదించుట తటస్థించును. అఖండ యతివిషయమున నిట్టియవస్థయే తటస్థించినది. 'తెలుగు' లో పంతులు గారు ఈయతనిగూర్చి యింకను నీకిందిరీతిని బ్రస్తావించియున్నారు.

"అఖండవడి అగ్రాహ్యమని చాలామందికి భ్రమ. బాలవ్యాకరణ సూత్రములు అప్రతిహతములని పరిశీలన లేకపోవుటచే భ్రమపడి నట్లే ఛందశ్శాస్త్రమునందు అప్పకవిలక్షణములు వేదవాక్యములు గా పండితులు శిరసావహించడముచేత అఖండవడికి తెలివచ్చినది"

బాలవ్యాకరణమును రచించిన చిన్నయసూరి, ఆంధ్రభాషలో నేఁటి దనుక వెలువడిన వ్యాకరణగ్రంథము లన్నిటిలో నుత్కృష్టమని యనుపించురీతిని, సంస్కృత వ్యాకరణసూత్రనిర్మాణ కింగనకయు సిద్ధాం తకౌముదిపద్ధతిని సూత్రనిర్మాణమును గావించి తదనుగుణమగు వృత్తిని సంతరించియున్నాఁడు. కనుకనే సూరిసూత్రము లప్రతిహతములు బహువిచారసహాములునై యున్నవి. అట్లనే అప్పకవి యానాఁటికిఁ బ్రసిద్ధికెక్కిన ఛందోగ్రంథములను జాలవఱకు ననలోడనముచేసి విపు లమగు లక్షణగ్రంథమును నిర్మించియున్నాఁడు. కావుననే పండితుల కాతని ఛందోగ్రంథమాదరపాత్రమయ్యెను. ఇంతియగాక సూరి అప్ప కవియుఁగూడ శాస్త్రములందు విశేషమగుప్రజ్ఞనార్జించినవారు. శా

త్రము నెఱుఁగని వారివలె వారెట్టి లక్షణనిర్మితికిఁ గడఁగఁజాలెదరు. పండితులు పండితులగ్రంథముల నాదరించుటలో వింత యే మున్నది. పూర్వోత్తరవిరోధములు లేకుండ నన్యూనాతిరిక్తములగువాక్యములతోఁ దాము తెలుపఁబూనిన విషయముల నెఱిఁగించుటయే యుత్తమపండితలక్షణము. అట్టిపాండిత్య మీయుభయుల రచనలయందును గానవచ్చెడిని. వారి హృదయముల నవగతము చేసికొనక వారి నపవదించుటకంటె నింకను శ్రమగొని వారి వచనములందలి సారస్యమును బాగుగ నెఱుఁగుట సహృదయులగు విమర్శకులకుఁ గర్తవ్యము.

అఖండయతి రెండు తెఱఁగులు గలదియనియు, అందు బహులాక్షణికసమ్మతమైన యఖండయతియే పరిగ్రాహ్య మనియు, విషమాఖండ మగ్రాహ్యమనియు వెనుకటి జూలై సంచికలోఁ దెలిపియే యున్నాను. లాక్షణికహృదయాభిజ్ఞులగు పండితులు భ్రాంతి యేమియు లేక నిశ్చితబుద్ధితో నాఁటికి నేఁటికిఁ గూడ విషమాఖండయతిని స్వీకరించుటలేదు. ప్రాచీనార్వాచీన లాక్షణికులు గాని, లక్షణవేత్తలయిన కవులుగాని యిట్టియతిని బరిగ్రహింపలేదు. కవితామార్గమున నవధాన మంతగ లేక, తగినపదజాలము బుద్ధిస్థముగాక యేదియో యొకరీతిని గవిత్వము కూర్పఁ గడఁగువారే యీవిషమాఖండము నంగీకరించెదరు. విషమాఖండమనఁగా సంధివశమునఁ బైయచ్చుతోఁ గూడిన సమానాక్షరముల కచ్చువచ్చినతావులందెల్ల నచ్చుతోను హల్లుతోను యతి చెల్లించుట. ఇట్టియతిని బ్రాచీనార్వాచీనలాక్షణికులు సైత మంగీకరించిరనియు, ప్రాచీనకవుల ప్రయోగములుకూడ కుప్పతిప్పలుగాఁ గలవనియు, పరిష్కర్తలయిన పండితులు ముద్రితప్రతులలో దిద్ది వేసినారనియు, వ్రాఁతప్రతులలోమాత్ర మట్లే నిలిచి యున్నవనియు పంతులుగారు 'తెలుగు' లోఁ దెలిపినారు. ఈయభిప్రాయము లెంతవఱకు సరిపడునో కొంచెము పరికించెదము.

ప్రాచీనులు ప్రామాణికులు నగు తెలుఁగులాక్షణికుల లక్షణనిర్మాణ పద్ధతి నరసినచో వారు తమనాఁటికిఁ బ్రసిద్ధిలోనున్న యుత్తమకృతులం దు దఱుచుగఁ గానవచ్చు ప్రయోగసరణి ననుసరించియు, అంతకుఁ ముం దుండులాక్షణికులమతములఁ బరిశీలించియు లక్షణనిర్మితికిఁ గడఁగినారు. కావుననే ప్రాచీనలక్షణగ్రంథములకు సరిపడిన లక్ష్యము లు ప్రాచీనకవులకృతులలోఁ గాననగును. వారి కృతులలో నాఁటి లక్షణములకు విరుద్ధమైన యంశములు నేఁడు మనకుఁ గన్పట్టినచో నవి ప్రమాదములేనిఁ గావచ్చును; లేక వ్రాయసగాండ్ర యనవధానమేనిఁ గావచ్చును. అట్లయ్యును నేఁడు వ్రాఁతప్రతులను బరిశీలించినచో సర సములు లక్షణానుగతములు నగుపాఠములు గానవచ్చుచున్నవి. విమ ర్శకులు నిరూపించు విరోధాంశము లందు ఛోడసూపకున్నవి. రానురాను ప్రబంధయుగమునఁ గొందఱకృతులలో భావప్రధానత నంగీకరించి లక్షణశుద్ధత యంతగఁ బాటింపఁబడకుండుట యేర్పడినది అట్టిప్రబం ధములు ప్రచారములోనికి వచ్చినకొలఁది లక్షణవైపుల్యమున కకకాఱు యేర్పడినది. నాఁడైనను ప్రామాణికులైన లాక్షణికులు కొన్నిప్రబంధ ములనే గ్రహించిరిగాని వెలువడిన వాని నన్నిఁటిని గూడఁ గ్రహింప లేదు. వారికైనను తగినంత గ్రంథసామగ్రి లభింపకుండుటచే నెవరికి దోఁచినట్లు వారు కొన్నిలక్షణలక్ష్యములఁ గావించుపద్ధతి యేర్పడినది. లక్షణగ్రంథములనైనను దమకభిమతమైన "యేకొన్ని" నిమాత్ర మో చూచి, లభించునంతవఱ కన్నిటిని దలస్పర్శిగఁ బరికింపక లాక్షణికులపైఁ గాని కవులపైఁగాని దోషముల నారోపించుట నేఁటివిమర్శకుల కొక యాచారమై సాఁగుచున్నది. భారతములోని అఖండవళ్లని పంతులు గారు 'తెలుగు' లో తేటపఱచిన పద్ధతి పరికింపుఁడు.

౧

ఉ. వీరలు దైవశక్తిఁ బ్రభవింన వారను టేమి సందియం
బీరమణీయకాంతి నుపమింపఁగ వేల్పులగాక ...
భార. ఆది ౫.౧౫౧.

ఈపద్యములో ఇంచుగాగమసంబంధమైన ఇకారము విరుగునంటే మొదటి పాదములోను, విరుగదంటే రెండవపాదములోను అఖండయతి సిద్ధమనియు, అఖండయతి నంగీకరింపని అప్పకవిమతము చొప్పున నది దురుద్ధరదోష మనియు పంతులుగారు తెలిపియున్నారు. కాని యించుగాగమముతోఁ గూడినచోట నచ్చునకు హల్లునకుఁగూడ యతి చెల్లింపవచ్చునని లాక్షణికులయుఁ బ్రామాణిక కవులయు నభిప్రాయమైనట్లు లీ క్రింది విషయములవలన స్పష్టమగుచున్నది.

లక్షణచూడామణిలో—

క. ఇంచియను నచ్చుహల్లు ను
దంచితముగ సంధిఁ గూడునప్పుడు భిన్నం
బెంచగఁ బాలుఁడు హరిఁ బలి
క్రించెనన్ రెండుఁ జెల్లు నెలమిం గృతులన్.

అని కలదు. దీని ననుసరించి యించుగాగమముతోఁ గూడునవుడచ్చుతోడను హల్లుతోడను యతిచెల్లవచ్చును. నన్నెచోడుని కుమారసంభవములోని యీ క్రింది ప్రయోగముల నీవిషయము స్పష్టమగుచున్నది.

క. పరువడిఁ గులగిరు లిడి వా
రిరుహాసనుఁ డొనరి గంధరించెనొకొనా.

కు. సం. ౭.౯౪౩.

చ. ఎలిమిఁ బికాళితోడ నెలిగించుచు....

కు. సం. ౯. ౩౦౯.

ఇట్టి ప్రయోగము లింకను నెన్నియోగలవు. విస్తరభీతిచే విరమించినాఁడను.

మఱియు పరిషద్భాండాగారమునందలి 914 సంఖ్యగల తాళపత్త్రప్రతిలో "ఈ రమణీయకాంతి నుదయించిన వేల్పులగాక" అను

పాఠము గలదు. ఈ పాఠమున నర్థమును మిక్కిలి ఔచితిని వహించి నది. పంతులుగా రనుకొనిన దోస మిసుమంతయును లేదు.

అముద్రితమైన భారతము లక్ష్మీపతి సోమయాజులుగారి భారతవ్యాఖ్యానములో నీవిషయమున వివరణ మిట్లున్నది.

"౫. ౧౫౩. ఈ పద్యములో ప్రథమద్వితీయచరణములలో నిత్యసమాసవడి.

గీ. పదము విభజించి చెప్పఁ జొప్పడని యదియు
నన్యశబ్దంబు గొని విగ్రహంబు చెప్ప
నదియు నిత్యసమాసమై యలరుచుండు
నట్టిసంధి నచ్చైన హల్లైన విరతి."

ఈపద్ధతిని ఇంచుగాగమముతోఁ గూడిన పదములను నిత్యసమాసములుగ భావించినచో నేబాధకమును గలుగఁ బోదు.

౨

క. కొడుకుం ద్రిలోక విజయుం
బడయుదు నని ఘోర మగుతపం బొనరఁ పం
దొడఁగె సురరాజు నెడలో
నిడుకొని యేకాగ్రబుద్ధి నిష్ఠాత్ముండై.

భార. ౫. ౧౧౭.

ఈపద్యము నాల్గవపాదమున ఇడుకొని అను పదమునందలి 'ఇ' తో గూడిన 'ని' కిని నిష్ఠాత్ముండై అనుపదమునందలి 'ని' కిని యతి చెల్లించుటచే నఖండయతియనుకొనినారు. మఱియు, "నిష్ఠాత్ముండై అనుటకు బదులుగా 'నేకాంతమునన్' అని అచ్చులో మార్చినారు. 'నిష్ఠాత్ముండై' అని కవి వ్రాసియున్నట్లు దాని తర్వాతి వచనములో ఇట్లతినిష్ఠ నేకపాదస్థితుండయి ... ... అని ఉండడముచేత స్పష్టము" అని సమర్థించినారు. కాని ఏకాంతమునన్ అను పాఠమే పెక్కు తాళపత్రప్రతులలో నున్నది అదియున్న పాఠ

మునే ముద్రించినారు. మార్పు మాత్రము చేయలేదు. ఇంతియగాక నిష్ఠాత్ముండై అనుపదమునకు నిష్ఠతోఁగూడిన మనస్సుగలవాఁడై యని యర్థము. ఈయర్థము ఏకాగ్రబుద్ధిన్ అను దానిచే సిద్ధమగుచుండ నిష్ఠాత్ముండై అనునది పునరుక్తమగును. ఏకాంతమునన్ అనఁగా రహస్యముగా అనియర్థము. ఈప్రకరణమున నీయది యపేక్షితమును గాఁడు. పునరుక్తార్థపదములను బ్రయోగించుట నన్నయభట్టారకకవిహృదయ మెన్నఁటికిని గాదు. కావున నీ ప్రయోగమునందును వారి కభిమతమైన యఖండయతి లేదు.

3

క. నీవ కడు నేర్పుకాఁడవు
గావలవదు వీనిఁ గొన్నిఁ గఱచితి మేమున్
నీవిద్యలెల్లఁ జూపుదు
మీ వీరులు సూచిమేలు మేలని పొగడన్.

భార. ఆది. ౮. ౩౨.

ఈపద్యమునాల్గవ చరణమున ఈవీరులులోని 'ఈ' తోఁ గూడిన 'మీ' కిని మేలని లోని 'మే' కిని యతిచెల్లించుటచే నఖండయతి యనినారు. "మేవీరలు" అని దిద్దినారు. చూపుదుమే అంటే అర్థంసరిపడదు. చూపుదుము + ఈవీరులు అంటే అర్థమగుతుంది." అనియు వివరించినారు. వ్రాతప్రతులు పెక్కింటిలో 'మేవీరలు' అనియే పాఠము. ఎవరును దిద్దినదిమాత్రముగాదు. నీవు చూపించెడి విద్యలు మేమును చూపుదుమే అను కర్ణవచనములో నర్థము సరిపడకుండుటెట్లులో యెఱుఁగ రాకున్నది. దీనికి మూలమైన సంస్కృతభారతము నందిట్లున్నది.

శ్లో. పార్థ యత్తే కృతం కర్మ విశేషవ దహం తతః
కరిష్యే పశ్యతాం నృణాం మాత్మనా విస్మయం గమః

ఇందలి 'పశ్యతాం నృణాం' అనుదాని కనువాదము 'వీరలు సూచి' అనునది. ఈవీరులు అనుపాఠముమాత్రము పొసఁగదు. కావున

వా రనుకొనిన యఖండయతి కిటఁ బ్రసక్తి లేదు. పరిషత్తునందలి తాళ

పత్త్రప్రతిలోఁ బాఠమిట్లున్నది.

క. నీ వొకఁడ నేర్పు కాఁడవు
 గావలవదు వీనిఁ గొన్నిఁ గఱచితి మేమున్
 నీవిద్యలెల్లఁ జూపుదు
 మే వీరలు సూచి మేలుమేలని పొగడన్.

వ్రాఁతప్రతులను బరిశీలించి పాఠముల నరసి మూలముతోఁ గూర్చి సమన్వయించినచో భారతమునందెక్కడను వారనుకొనిన యఖండయతు లుండఁబోవు. గ్రంథవిస్తరభీతిచే మిగిలిన భారతప్రయోగములకు సమాధానమీయ వదలినాఁడను.

"తఱుచుగా అఖండవడి వాడిన మహాకవి శ్రీనాథుని గ్రంథాలలోని ప్రయోగాలుచూడండి" అని పంతులుగారు చూపించిన ప్రయోగముల నరయుదము.

కాశీఖండములో:—

౧

క. అంభోధి వలయితావని
 సంభరణప్రౌఢనిజభుజార్గళయుగళీ ... కాశీ. ౧. ౬౩.

అను పద్యములో ద్వితీయచరణమున సంభరణలోని 'స కును భుజార్గళ అను సమాసమున సంధివశమున అచ్చుతోఁగూడిన (భుజ+ అర్గళ) లోని "జా" కును యతిచెల్లించుటచే నఖండయతి యని పంతులుగారి యభిప్రాయము. కాని యీ పద్యమునకు పరిషత్తునందలి తాళపత్త్రప్రతులలో పాఠమిట్లున్నది.

క. అంభోధివలయితావని
 సంభరణప్రౌఢనిజభుజాయుగళీసం
 రంభావితకిటికచ్ఛప
 కుంభీనససార్వభౌమకులకుధరునకున్.

ఈపాఠమే వ్రాఁతప్రతులం దున్నది గావునను, మాకంటెను గూడ పంతులుగారికి వ్రాఁతప్రతులయెడఁ బ్రామాణికత్వాభినివేశ మెక్కుడు గావునను ఇది వారనుకొనిన యఖండయతి గానేరదు.

౨

క. ఈకుధర మిచ్చు శిఖరా
 లోకనమాత్రమున ముక్తు లుల్లసిలంగన్.

కాశీ 3. ౬౦

ఇటు ఆలోకనలోని "లో" కును ఉల్లసిలంగన్ అను పదము నందలి "ఉ" తో సంధివశమునఁగూడిన "లు' కును యతి చెల్లించుటచే వారనుకొనిన యఖండయతి శ్రీనాథుఁడు ప్రయోగించె ననుకొని నారేగాని అది యట్లుగానేరదు. వ్రాఁతప్రతిలోఁ బాఠమిట్లున్నది.

క. ... శిఖరా, లోకనమాత్రమున ముక్తులు కురంగాక్షీ.

ఇంతియగాక ఉత్ అను నుపసర్గతోఁగూడిన "లు' కుఁ బ్రాది యతిగా నుభయమును జెల్లవచ్చును. కావున నెట్లును బాధకము గానేరదు.

3

ఉ. తంత్రము లాచరించి వసుధామరముఖ్యులు ...

కాశీ. ౬. ౩౦౧

ఇట తంత్రములోని 'త' కును వసుధామర శబ్దములో సంధివశమున (వసుధా+అమర) అమరశబ్దములోని "అ' కారముతోఁ గూడిన 'ధా' కును యతిఁగూర్చుటచే నఖండయతియని వారియూహ. కాని వసుధామరశబ్దము సంస్కృత నిత్యసమాసము. బ్రాహ్మణుఁడను నర్థమున రూఢము. కావున నిట నచ్చుతోడను హల్లుతోడను గూడ యతి చెల్లవచ్చును.

ఉ. ...క్రై, లాటమునఁ ఘటిల్లె సకలార్థము దేవరయాజ్ఞ పెంపునన్,

ఇట కైలాటములోని "లా"కును, సకలార్థము అనుపదమున సంధివశమున (సకల + అర్థము) అర్థములోని 'అ' తోఁగూడిన 'లా' కును యతి చెల్లించుటచే నఖండయతి యనుకొనినారు. కాని కైలాటము అనునది దేశ్యనిత్యసమాసము గావున నచ్చుతోను హల్లుతోను యతి చెల్లవచ్చును. కావున నిదియు లాక్షణికసమ్మతమే.

ఇఁక భీమేశ్వర పురాణమునందు పంతులు గారఖండయతులతోఁ గూడిన వనుకొనినప్రయోగములను వాని సమర్థనములను బరిశీలింతము. ఇంతకును మా భాండాగారమున భీమఖండమునకు వ్రాఁతప్రతులు లేకుండుటచేఁ గొన్ని యంశములకు మాత్రమే యిట సమాధానము వ్రాయుచున్నాను. మిగిలినవికూడ వ్రాఁతప్రతులను బరిశీలించినచో సరిపడునని గట్టిగఁ జెప్పవచ్చును.

౧. తక్క రావుసింగవసుధాధిపుఁ డర్థుల కర్థ మిచ్చుచో.

౨. తమ్ముని వీరభద్రవసుధాధిపు విక్రమవీరభద్రునిన్.

౩. ...మరల, న్మాతృపయోధరపయః కణాస్వాదసమున్.

౪. ద్వాదశక్షేత్రతీర్థయాత్రాభివృద్ధి.

౫. కాశ్యపగోత్రపవిత్రియ, వశ్యాయధరాధరోద్భవాధిపభర్త.

ఈ ప్రయోగములలో శ్రీనాథుఁడు తమ కభిమతమైన యఖండయతి వాడెనని యభిప్రాయపడుచున్నారు. కాని వసుధాధిప (వసుధా + అధిప) పయఃకణాస్వాదనము (పయఃకణ + ఆస్వాదనము) యాత్రాభివృద్ధి (యాత్రా + అభివృద్ధి) ధరాధరోద్భవాధిప (ధరాధరోద్భవ + అధిప) అనుపదములలో సవర్ణదీర్ఘసంధివశమున అధి, ఆఙ్, అభి అను నుపసర్గలతోఁ గూడియుండుటచే నిట్టివి ప్రాదియతులలో నంతర్భవించుటచే లాక్షణికసమ్మతములే యగును. ప్రాదులైన యుపసర్గలు తరువాతి పదములతోఁగూడినపుడే ప్రాదియతి యనుకొన నక్కఱలేదు.

గీ. ధాతుప్రాదియోగ మాత్రంబు గలిగిన
నుభయయమును రచింప నొనరుఁ గృతికి

సాతిరి క్తభక్తి శక్రసేవిత శమ
లాలయానివాస లక్ష్మ్య మిదియ.

అను కవిచింతామణి లక్షణము ననుసరించి, యుపసర్గతోఁ గూడినమాత్రమున నుభయమునకు యతి చెల్లవచ్చును. ఈరీతిగఁ బై యుదాహరణములందెల్ల వా రనుకొనిన యఖండయతి మాత్రము లేదు.

౬. నీహారమణీయమూర్తి నిందుకరణమా.

ఈపద్యమున నీ హారములోని "నీ" కిని ఇందుపదముతో సంధించిన "ని" కిని యతి చెల్లించినాఁడు శ్రీనాథుఁడని పంతులుగారు భ్రాంతిపడినారు. పద్యమును బూర్తిగ సమన్వయించినచో వారనుకొనిన యతి యిక్కడ లేదు. కేవల మొక్క పాదమునే యుదాహరించుటచే బాఠకులకు సైతము భ్రాంతి యొదవుచున్నది.

క. నీహార భూధరేశ్వరు
నీహారమణీయమూర్తి నిందుకరహిమా
నీహారహీరకుముదసు
ధాహారసమానకాంతి నభివర్ణింతున్.

నీహారమణీయమూర్తియని యనుకొనునపుడు వారర్థము నెట్లు సరిపెట్టుకొనిరో యెఱుఁగరాదు. నీహారమణి యననేమో? నీహారమణీయ మనఁగానేమో? ఇట్లీపాదమును విఱిచినచో వెనుకటి పాదమున కన్వయమెట్లో? కాని యిట షష్ఠీసమాసమున వచ్చిన నుగాగమముతోఁ గూడిన రూపమిది. కావున ఈహారమణీయమూర్తి యనియే విఱుగును. నీహారభూధరేశ్వరుని హిమవత్పర్వతముయొక్క యిచ్ఛానుగుణమగు సుందరాకారుఁడు పరమేశ్వరుఁ డనిభావము. ఈ యర్థమున వారనుకొనిన యఖండయతి యిచ్చుటలేదు.

హారవిలాసమున—

ఉ. ...ఎప్పుడు, న్నించునొకో హారుండు తరుణీమణి నంచును వింట
నారి సారించుచు ...

"ఇందులో ఇంచునొక్కో ప్రయోగము సార్థకముగాని నించునొక్కో గాదు" అనిపంతులుగారు వివరించినారు. ఇక్కడ "ఇంచునొక్కో" యనునపు డేయర్థము పొసఁగునో తెలుపకయే, సార్థకమగుట యెట్లో తెలియరాకున్నది. ఇంచుధాతువున కకర్మకార్థముఁనందే ప్రయోగము లు ప్రచురముగఁ గలవు. ఆయర్థము లిటఁ గుదురవు. సకర్మకార్థముల నిట కుచితమైన యర్థమేమియుఁ గానరాదు. ఇంతియగాక వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడి ఆనందముద్రణాలయము వారిచే ముద్రింపఁబడిన హరవిలాసములో "ఎడ్డు మన్నించునొక్కో" అను పాఠము గలదు. ఆపక్షమున నేవిధమైన యతిదోషమును లేదు. నైషధమున—

వేదము వెంకటరాయశాస్త్రిగారు "పాఠములు దిద్దివేసినా తక్కిన పెక్కు ప్రతులలోఁగల పాఠములఁ బట్టి నైషధంలోఁగూడా అఖండవడికి ప్రయోగము లున్నట్లు స్పష్టం చూడండి" అని చూపించిన ప్రయోగముల నరయుదము.

౧

గీ. కాంత యశుబ్రబిందుచ్యుతికై తపమునఁ
దివిరి బిందుచ్యుతకకేళిఁ దవిలె దీవు
సారెసారెకు నాదు సంసారమును స
సారముగఁ జేయవే సారసాభనయన.

నాల్గవచరణమున సారముగ లోని 'సా' కును, సారసాభపదములో సంధివశమున ఆభలోని "ఆ' తోఁ గూడిన 'సా' కును యతిచెల్లించుటచే అఖండయతి యని వారి తలఁపు. కాని "సారసాభనయన" అనుపాఠమెట్లవతరించెనో వారెఱిఁగింపరైరి. ఒకవేళ ఏ వ్రాఁతప్రతి యందైన లభించినను నాపాఠ మిటఁ గూడనిది. "మసారసారసనయన" అను పాఠమే యుండవలయును. ఏమందురా ? శ్రీహర్షుని నైషధము

నకు యథాతథానువాదరూపమే శ్రీనాథుని నైషధము మూలము నందలి శ్లోకమిట్లున్నది.

శ్లో. చకాస్తి బిందుచ్యుతకాతిచాతురీ
ఘనాస్రుబిందుస్రుతికైతవాత్తవ
మసారసారాక్షి ససార మాత్మనా
తనోషి సంసార మసంశయం యతః

సం. నైష. ౯. ౧౦౪

మసారసారా=ఇంద్రనీలశ్రేష్ఠౌ తావివ అక్షిణీ యస్యాస్సా మసారసారాక్షి. తస్యాఃసంబుద్ధిః హే మసారసారాక్షి అని మల్లినాథవ్యాఖ్య. శ్రేష్ఠమైన ఇంద్రనీలమణులవంటి కన్నులుగలదానా అనియర్థము.

ఈమూలవ్యాఖ్యానముల ననుసరించి "మసారసారనయన" అనియే యుండవలయును. ఇంతకును పరిషత్తునందలి వ్రాతప్రతులలో నీపాఠమే గలదు. ఈపాఠమున వారనుకొనిన యఖండయతి లేదు. "సారముగఁ జేయవె మసారసారనయన" అని వ్రాతప్రతులపాఠము.

౨

శా. వైదర్భీ బహుజన్మ నిర్మిత తపోవర్గిష్ణు కల్లోచనా
స్వాదప్రౌఢవిలాస నీవసుమతీచక్రేశపుష్పాయుధుం
డాదిత్యాన్వయ సార్వభౌమ సుకృతాహంకార దుష్ప్రాభవం
బీ దాంపత్యమునం జిరాయువయి నెమ్మింబొందుగా కెంతయున్.

నాల్గవచరణమున సంధివశమున 'ఈ' తోగూడిన బిందుపూర్వక బకారమునకును, నెమ్మిక్‌లోని 'మి' యను దానికిని యతిగూర్చుటచే నఖండయతియని వా రభిప్రాయపడినారు. భైమీదాంపత్యమునన్' అనిగ్నే వ్రాతప్రతులందును గల పాఠము. ఈపాఠమే యుక్తము మూలానుగతమును. సంస్కృతము నందిట్లున్నది.

శా. వైదర్భీబహుజన్మ నిర్మితతపఃశిల్పేన దేహశ్రియా
నేత్రాభ్యాం స్వధతే యువాయ మవనీవాసః ప్రసూనాయుధః

గీర్వాణాలయసార్వభౌమ సుకృత ప్రాగ్భార దుష్ప్రాపయా
యోగం భీమజయానుభూయ భజతా మద్వైత మద్య త్వేషాం.
సం. నైష. ౧౫. ౮౭

ఈ శ్లోకమునందలి యోగం భీమజయా' అనుదాని కనుగుణమైన యనువాదము భైమీదాంపత్యము అనునది. శ్రీనాథుని నైషధము చాలవఱకు మూలానుయాయియే. పెక్కుపదములు సమాసములు అనువాదమునందు యథాతథముగ నున్నవి. ఇతఃపూర్వ పరిషత్తునందలి తాళపత్త్రప్రతులు పెక్కింటిలో నీపద్య మీ క్రిందికరితి నున్నది.

శా. వైదర్భీబహుజన్మనిర్మలతపోవర్గీమ్మృతల్లోచన
స్వాదుప్రౌఢవిలాసు డీవసుమతీచక్రేశపుష్పాయుధుం
డాదిత్యాలయ సార్వభౌమ సుకృతాహంకార దుష్ప్రాపభై
మీదాంపత్యమునం జిరాయువయి నెమ్మిం బొందుఁగా కెంతయున్.

పంతులుగారు చూపించిన 'దుష్ప్రాభసంబు' అను పాఠ మనన్వితము. మూలాననుగుణమును. కావున నిక్కడ వా రనుకొనిన యఖండయతి లేదు.

3

ఉ. కైపెక్క ప్రసూనముల్ గురియు వేనలి వీడిచి కొప్పుఁబెట్టుచో.

కైపెక్క అనునపుడు కైపు + ఎక్కు అనుకొని సంధివశమున "ఎ" తోఁ గూడిన "పె" అనుదానికిని వేనలిలోని వేకును యతి చెల్లించుటచే వారనుకొనిన యఖండయతి యని పంతులుగారి యభిప్రాయము కాని శ్రీనాథుఁడు దీని నేకపదముగనే గ్రహించినట్లు నీక్రింది హర విలాసప్రయోగమును బట్టియుఁ దెలియుచున్నది. ఇది యుక్కమైనంటి దగునుగాన నుభయమునుఁ గూడను యతి చెల్లనచ్చును.

గీ. శ్రవణకల్హారముకుళంబు జాఱకుండ
విరులఁ గీల్గొప్పు వదల కైపెక్కకుండ.

హర. ౭. ౪౫

కావున నిదియు లాక్షణికసమ్మతమే. దీనఁ బాధకులు శ్రీనాథుఁడు పంతులుగారనుకొనిన యఖండయతి వాడలేదని యెఱిఁగెదరు గాక.

మంచన—కేయూరబాహుచరిత్రములో—

ఉ. శ్రీవసియించుఁగాక సుఖసిద్ధి వహించి యశేషబంధుహాం

సావళియుం బ్రహృష్టరతిశాంతిసముత్కరపట్పదంబు నై.

'ఆవళి' లోని 'ఆ' తోఁ గూడిన 'సా' కును, శాంతిలోని "శా" కును అఖండయతి యని వారి యభిప్రాయము. ఆవళి అను పదము ఆఙ్ అను ఉపసర్గతోఁగూడిన వల ధాతువుకంటె ఇన్ ప్రత్యయము చేర్పఁగా సిద్ధమైనరూపము. ప్రాదియతిలో నంతర్భవించును. ఇట్టిది ప్రాదియతి యెట్లగునో వెనుకఁ దెలిపియే యున్నాఁడను. కావున నిదియు లాక్షణిక సమ్మతమే.

మఱియు నీతాపుర వ్రాఁతప్రతియందలి పాఠమిట్లున్నది.

హాం, సావళియుఙ్ బ్రహృష్టరసికార్థిసముత్కరపట్పదంబు నై.

ఈపాఠమున అర్థసంశుద్ధి గలదు. అఖండ యతి లేదు.

కేతన—విజ్ఞానేశ్వరీయములో

క. ఎవ్వరు లేనెడ నొక్కఁడు

నొవ్వంగా నడిచెనేని నొప్పికొలఁదియున్

జివ్వకతము నరయందగు

నొవ్వి న్వాఁ డెగ్గులాడు నుత్తమునైనన్.

విజ్ఞా. ప్రాయ. ౫౦.

(నొవ్వి=వేదన.)

ఈపద్యము నాల్గవచరణమున నొవ్విన్‌లోని 'నొ' కిని, ఉత్తమున్ అను పదమునందలి "ఉ" తోఁగూడిన 'ను' కును యతిచెల్లించుటచే నఖండయతి యనుకొనినారు. కాని పరిశీలింపఁగా 'నొవ్విన్' అను పాఠమున నర్థము పొసఁగకున్నది. ఎవ్వరులేనిచోట ఒకఁడు వేఱొకని

హింసించెనేని, ఆతని నొప్పిపరిమితిని జగడమునకుఁ గారణమును శిక్షించువాని కరయఁదగు. వాఁడు అనఁగా హింసింపఁబడినవాఁడు అని యనుకొనినచో ఉత్తమునైన నెగ్గులాడుప్రసక్తి యేముండును. హింసించినవాఁడాతానియెడ నుత్తముఁడు కాఁడుగదా. శిక్షించురాజు నెగ్గులాడుట యశక్యముగదా ? ఇఁక నే యుత్తము నాతఁ డెగ్గు లాడువాఁడు

మఱియు నిట తాళపత్త్రప్రతిలోఁ బాఠమిట్లున్నది. "ఒవ్వని వాఁడెగ్గులాడు నుత్తమునైనన్." ఒవ్వనివాఁడు - గిట్టనివాఁడు. అనఁగా నసిగాఁ బరిశీలింపనిచోఁ గిట్టని వాఁడెంతటి యుత్తమునైన నెగ్గులాడు నఁగాన బాగుగాఁ బరికింపవలయుననుట యుక్తము. ఈ పాఠమున యతి పా రనుకొనినది కానేరదు. ఇదియే మూలానుగతము. సంస్కృతవిజ్ఞానేశ్వరీయ మీప్రసంగమునఁ బరికింపుఁడు.

శ్లో. అసాక్షికహతే చిహ్నై ర్యుక్తిభి శ్చాగమేన చ
ద్రష్టవ్యో వ్యవహారస్తు కూటచిహ్నకృతో భయాత్.

యాజ్ఞవల్క్యస్మృతి. ౨. ౨౧౨

విజ్ఞానేశ్వరీయము:- యదాకశ్చి ద్రహస్య మ నేన హత ఇతిరాజ్ఞే నివేదితే, తదా చిహ్నై ర్వ్రణాదిస్వరూపగతై ర్లింగై, ర్యుక్త్యా కారణ ప్రయోజనపర్యాలోచనాత్మికయా, ఆగమేన జనప్రవాదేన, చశబ్దాద్దివ్యేనవా, కూటచిహ్న కృతసంభావనాభయా త్పరీక్షా కర్తవ్యా.

ఈ రీతిగ వ్రాయ మొదలిడిన పంతులుగారు 'తెలుగు' లో తేటపఱచిన యఖండయత్నములేవియు నిలువఁజాలవు. గ్రంథవిస్తరభీతిచే విరమించినాఁడను. ఆంధ్ర భాషాభిమానులు సవిమర్శబుద్ధితోఁ బరికించి, లాక్షణిక పథముల నుజ్జగింపకుండెదరుగాక యని వేడికోలు.

# వ్యాసుని కాశీ వియోగము.

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

వివిధగాథాపాథోధియు, వివిధధర్మరత్నఖనియు నగు స్కాందపురాణమును బ్రసాదించి లోకోద్ధరణ మొనర్చిన మహాకవి వేదవ్యాసభగవానుఁడు. భీమఖండము, కాశీఖండము అను భాగము లందలి గాథలే. "కాశీఖండ మయఃపిండమ్" అనియు నందొకటి పేరుగాంచినది. ఈ రెండుభాగములందును వ్యాసులు క్షేత్రమహిమల భివర్ణించియున్నాఁడు.

ఈ రెండు సంస్కృతభాగములును నిరుపమానముగా నాంధ్రీకరించినవాఁడు శ్రీనాథకవిరాజు. అందుఁ గాశీఖండమున నేడవ యాశ్వాసమున వ్యాసుఁడు కాశిమీఁదఁ గోపించుట, అను శీర్షిక మొదలించుమించుగా నెనుబది పద్యములలో వ్యాసుని జీవితమున జరిగిన యొక ముఖ్యఘట్టము రసవత్తరముగ వర్ణింపఁబడినది. అదే గాథ భీమేశ్వరపురాణద్వితీయాశ్వాసమున "అగస్త్యుఁడు వ్యాసునిఁ గాశిఁ బాసి వచ్చుటకుఁ గారణం బడుగుట" అను శీర్షికమొదలు ఆయాశ్వాసము చివరవఱకు నతిలోకముగా వర్ణింపఁబడినది. కాని వ్యాసునికి సంబంధించిన ఈ రెండుతావులందును కొన్ని విషయములు భిన్నముగాఁ గనఁబడుచున్నవి. ఈవిషయభేద మాంధ్రమునఁనే గాక మూలభూతసంస్కృతకాశీఖండభీమఖండములలోఁగూడ గానంబడుచున్నవి. ఈ భేదములు చూపుటయే ప్రకృతవ్యాసమునకు ముఖ్యోద్దేశము.

ఈ వ్యాసఘట్టమందలి కథాభాగ మిది. వ్యాసుఁడు కాశికను జేరి శిష్యులకుఁ బాఠప్రవచనముఁ జేయుచు మాధుకరవృత్తితో ముక్తిమంటపమునఁ బురాణములు సెప్పుచుండఁ గాశికావిశ్వేశుఁ డీతనిభక్తిఁ బరీక్షింప నెంచి భిక్ష కలుగకుండఁజేయుట. వ్యాసుఁ డందులకుఁ గోపించి కాశికాపురిని శపింపఁబూనుట. విశాలాక్షి ప్రాకృతకాంతయై వచ్చి యాతనికి భిక్షనొసఁగి కాశిని శపింపఁబూనిన యాతని మందలించుట. విశ్వేశుఁడు వ్యాసునికిఁ గాశిని వీడిపొమ్మని శాపమిచ్చుటయును.

గీ. బాదరాయణు భక్తి యేపాటిదియదియొ
యరయుదముగాని యతఁడు భిక్షాటనమున
కేఁగుదెంచినయప్పు డింటింట భిక్ష
కలుగకుండఁగఁజేయంగ వలయు నీవు. (కాశీ. 7—129)

అని విశాలాక్షీమహాదేవుల పరీక్షతో నీకథ మొదలుపెట్టఁబడినది. ఈప్రారంభము మూలమునఁగూడ నిట్లేకలదు. "ఏకదా తస్య జిజ్ఞాసాం కర్తుం దేవీం హరో౽వదత్" అని. ఈవిషయము భీమఖండమున వ్యాసుఁడు శపింపఁబూనునవసరమున శాప ముపసంహరించి యిటు రమ్మని పిలిచిన విశాలాక్షిచే ననిపించినాఁడు.

"భిక్ష లేదని యింత కోపింతురయ్య
కాశి పట్టణముమీఁదఁ గానిసేయ ?
నీమనశ్శుద్ధిఁ దెలియంగ నీలకంఠుఁ
డింత చేసెనుగాక కూడేమి బ్రాఁతి ?"

(1) వ్యాసునికి భిక్ష దొరుకని దొక దినమా ? రెండుదినములా?
"ఎన్నఁడుఁ జూడము న్వినము
నిట్టిమహాద్భుత మేమి చెప్పుదున్ గిన్నరకంఠి ...
నిన్నటినుండి యేము నిలు
నిగియు నంటిమి నిట్టుపవాసముల్"

అనియు,

"...ఒక్క దినంబుమాత్రలోఁ, బొట్టకు లేక తిట్టెదవు పుణ్యగుణంబుల రాశిఁ గాశికన్,"

మొదలగు సందర్భములందు వ్యాసుని వచనమైన పై పద్యముచేతను, గృహిణీవచనమైన రెండవ పద్యముచేతను వ్యాసుని కొక దినముమాత్రమే భిక్ష లేదని కాశీఖండమునుబట్టి స్పష్టమగుచున్నది. దీని మూలగ్రంథమునఁగూడ—

"తదహ్ని నాలభ ద్భిక్షాం సశిష్యః స మునిః క్వచిత్
ఉపోషణపరో భూత్వా తథైవాసీ దహర్నిశం,
అథాన్యేద్యు ర్మని ర్వ్యాసః కృత్వా మాధ్యాహ్నికం విధిం
ద్వితీయేహ్న్యపి యద్భిక్షా నలభ్యే తాపి యత్నతః"

అని యుండుటచే నేకదినోపవాసమే స్పష్టమగుచున్నది.

ఇంక భీమఖండమున —

"మే మేడునాళ్ళదనుకను
స్వామీ యుపవాసముండి జడిసితిమి మదిన్"
"కాశిలో నేడునాళ్లు నిష్కారణంబ
ఛాత్రులును నేను నిరుపవాసంబు వసిరి, మి"

"ఇద్విధంబున సప్తవాసరోపవాసాయాససంభూతోగ్రప్రభూతరోషావేశంబున" అనియు :—

దీనిసంస్కృతమూలమునఁ గూడ

"సప్తమస్యోపవాసార్తా భృశం వ్యాకులితా వయం"
"కిం వక్ష్యేఽద్య స్త్వమానిందరి కాశ్యాం సప్తదినా స్యమీ
నిష్కారణోపవాసార్తాః"
"సప్తస్వేవ దినేషు త్వ మోదనాభావతః క్షుత్రతః"
"దినాని సప్త క్షుత్పీడా బాధితా యూయముత్తమాః"

అనియు వ్యాసుని ఏడు దినములు భిక్ష లేకపోయెనని యున్నది. ఏడు దివసములు లేఁగలియఁ బాధఁ జెలియఁ బుట్టక పెక్కుడుశిష్యులతో బాధపడినవాఁడుగనుకనే యతనికిఁ బుణ్యరాశి గాశికనుగూడ శపించుటకు సమర్థమైన కోపము దయించినది. ఇట్టిసందర్భమున వ్యాసుఁడు శపింపఁ బూనుటయుఁ జాలవఱకు యుక్తముగానే యున్నది.

"సప్తమస్త్రోపవాసార్త్యా తీవ్రమేత్థం కృతోద్ధతిః" అనివ్యాసులే వచించియున్నారు.

మఱియు నిటఁ దెనుఁగుకాశీఖండమునందలి వ్యాసులు క్షుధావ్యథకుఁ దాళంజాలక "వాడవాడల నీపెద్దవలకాట" అని కాశికను దూషించుచు" భిక్షాన్నంబు పుట్టనిదినంబునుం గలదె ?

"రేపాడి మేలుకని నే
నేపాపాత్ముని మొగంబు నీక్షించితినో'
"భాజనంబులలోన నిప్పుచ్చురంబు"
"ఉపవసింతుముగాక నేఁ డుడిగి మడిగి"

అనునవి మొదలగుదైన్యములు పలికినాఁడు. దీనికి మూలమునందలిమార్గము వేఱుగ నున్నది.

వ్యాసుల రెండవదినమునఁగూడ భిక్ష దొరుకకునికికిఁ గారణమేమనుచు "కాశికయందనిష్ట మేమైనఁ గలిగినదా? అన్నక్షయము గలిగినదా? పురవాసులకెల్ల రాజదండన మొక్కపరి సంభవించెనా? మాయందీర్ష్యచే నెవ్వరైన భిక్ష వారించిరా? ఏదేని యుత్పాతముచేఁ బౌరులు దురవస్థ కలవారైరా?" అని యనేకవిధములుగా వికల్పించినాఁ డామహాత్ముఁడు. అంతేకాని యాంధ్రమందువలె దైన్యంబులు పలుకలేదు. మూలమందలి వ్యాసవితర్కౌచిత్యము తెలుగున విలుపము చేయఁబడినది.

"ద్వితీయేహ్న్యపి యద్భిక్షా నలభ్యేతాతియత్నతః
అనిష్టం కించిదత్రాసీన్మహాగురునిపాతజమ్
అన్నక్షయోవా సర్వస్యాం నగర్యామభవత్ క్షణాత్
రాజదండోఽథ యుగపత్ జాత స్సర్వపురౌకసాం
అథవా వారితా భిక్షా కేనాప్యస్మాసు చేర్ష్యయా
పురౌకసోఽభవన్ దుస్థా స్తూపసర్గేణ కేనచిత్"

అని పై వితర్కమునకు మూలము.

2. వ్యాసుని శిష్యులెందఱు ?

కాశీఖండమున:—

“అయుతసంఖ్యాశిష్యు లాయాయివీథుల
వేఱువేఱ భిక్ష వేఁడి తేఱ''

అనుపద్యమునుబట్టి వ్యాసుని శిష్యు లయుతముగా నున్నట్లు చెప్పఁబడినది. అయుత మనఁగా పదివేలు. దీనికి మూలమున ‘అయుతం మమ శిష్యా యే తైః స్సపంక్తి మహం వృణే” అని యున్నది. ఈవిషయము భీమఖండమున “మున్నూరు శిష్యులును నేను” అని తెలుపఁగునను, “ఉపావిశామ శిష్యాణాం త్రిశతీచాహ మగ్రతః’ అని మూలముననుగూడఁ గలదు. వ్యాసశిష్యులు మూఁడువందలా ? అయుతమా ? లేక అయుతమునకుఁ బెక్కురు అని యనుకొనుటయా ?

3. పదార్థావిష్కారము.

దీనినిగూర్చి కాశీఖండమున వ్యాసుఁడును శిష్యులును బంక్తి సాఁగించి కూరుచున్న వెంటనే.విచిత్రముగా నులివేఁడికట్టావితోఁ బదార్థము లావిర్భవించినవి, భవనభర్త యన్నము దారవోసినాఁడు అని మాత్రము గలదు. దీనికి మూలమున—

“భోక్తుమేవోపవేశితాః
తద్దివ్యపాకసంభారాన్ దృష్ట్వా తద్రుషయః క్షణాత్
పరాం తృప్తి ముపాగచ్ఛన్ ...
అతితృపిం సమాపన్నాః తే తదన్ననిషేవణాత్ ''

అని మునులు వచ్చుసరికే సమస్తభోజనపదార్థములును సిద్ధముగా నున్నట్లున్నది. ఇఁక భీమఖండమున మున్నూఱుగురు శిష్యులతో వేంచేయుచున్న వ్యాసుని, గృహిణి సబహుమానముగా భోజనశాలకుఁ గొంపోయి వృద్ధానుపూర్వకంబుగ గూర్చుండఁబెట్టినది. ఆమెయనుమతిని దివ్యపురంధ్రులు చక్కని యనఁటాకు లిడినారు. గృహిణి పంక్తులన

డుమ నుండి పచారులొనర్చుచు గంధపుష్పాక్షతలచే మునులను బూజించివినయముతో—

"ఇందఱుం గూడి శాంతి వహి
యింపుఁడు మజ్జనమాచరింపుఁ డ
ర్ధేందుకళాకిరీటునకు
నీయమృతాన్నము లీపదార్థముల్
మందగతిన్ భుజింపుఁడు స
మస్తజగత్పతి కాశికాపురీ
మందిరవిశ్వనాయకుఁ డు
మాపతి ప్రీతి వహించుఁగావుతన్."

అని మునులకందఱకు నాపోశనములు వోయుచుండ మునులపుడు "వండినచొప్పునుం బాగపు
వాసనయున్ బాగపాఱుచందమున్
భాండసమృద్ధి... ...సర్వమంగళము"

అని వితర్కించుచు నిదేమిదేమయా ? పదార్థములు లేక యీ యాపోశనము లేమి ? అనియు
"అరఁటాకు జూచినన్, ఝల్లనె గుండె వోయెడిని శాకములున్
బాడఁగానరామికిన్
'పాత్రసంశుద్ధి కార్యంబు ప్రస్తరించి, యునిచినుండిరి యిదియేమి
యొకొ ?...''

"కాని మీ్యాదివసంబును నిన్న 'యట్లగాని" అనిశిరఃకంపములు పెట్టిరి. తరువాత నాసాధ్వి గొంకుమాట యన్నది.
"ఆరగింపుఁడు లెండు మీ కమృతమస్తు
ప్రొద్దువోయెను జుండు..."

అని యంజలి యెత్తె. తోడన సకలపదార్థములు లామెయమోఘవాగ్విలసనంబున నావిర్భవించెను. అప్పు డాపవిత్రభావముఁ గాంచిమ

ను లీమె నన్నపూర్ణమనుగా గ్రహింపఁగలిగిరి. సంస్కృతమునఁ గూడ నీకథాపోషణ మిట్లే యున్నది

"అథాస్మానర్చయామాస గంధపుష్పాక్షతైస్సతీ
పంక్తిం పంక్తిం సమాసాద్య బ్రాహ్మణానాం వరాంగనా
సంతర్పణేన విప్రాణా మనేన భగవానయం
శ్రీకాశీపురవిశ్వేశః ప్రీతోభవతు శంకరః
తస్మిన్నవసరేహంచ సుమంతుః పైలజైమినీ
సవైశంపాయనశ్చాన్యే తర్కవ్యాకులతాం గతాః
న దృశ్యతే పాకచిహ్నం న చ భక్ష్యాదివాసనా
దృష్టే కదలికాపర్ణే జాయతే హృదయవ్యథా
... ... ... ...
అస్మాన్విలోక్య భోక్తవ్యం విప్రా అమృతమస్తు వః
ఆపోశనే గృహీతేఽభూత్తత్క్షణేఽన్నం చతుర్విధం
నానావిధాని భక్ష్యాణి ...తత్రప్రభావో మహాద్భుతః''

ఈకథాపోషణము కాశీఖండమున లేదు. భోజనానంతరము మును లామెను విశాలాక్షిగా నెఱిఁగినట్లు చెప్పినాఁడు. అంతేకాక కనివిని యెఱుంగనిపిండివంట లన్నియు నావిందున మును లారగించినట్లు శ్రీనాథుఁడు మూలమున మృగ్యమగువిషయమును బెంచి కథాభాగమును బోషించువిషయమును దుఱిమినాఁడు.

## 4. భిక్షాప్రార్థనము.

తెనుఁగు కాశీఖండమున నయ్యాదిమశక్తి, కమండలువు పగులనేసి శాప మీనున్న వ్యాసు నిటురమ్మని పిలిచినది. వెంటనే అందికొన్నది.

''ఆకంఠంబుగ నీవు మాధుకరభిక్షాన్నంబు భక్షింపఁగా
లేకున్కిం గడునంగలార్చెదవు మేలే లెస్స శాంతుండవే
నీకంటె న్మతిహీనులే కటకటా నీవారముష్టింపచుల్''

**నీవు గొంతుకమాప తిండిలేక యంగలార్చెదవు గొప్పశాంతుఁడవే.**

నేఁడు భిక్షలేనికారణమున శివునియర్ధాంగియైన కౌశికను శపింపఁ జూతువా? బ్రాహ్మణుఁడవుగదా. నీ వేమన్నఁ జెల్లు ననియా? అని జాడించివైచినది. తఱువాత,

"వైశ్వదేవాదివిధులు సర్వమును దీర్చి
యరయుచున్నాఁడు నాభర్త యతిథిరాక
నతిథి పంక్తికి రాకున్న నారగింపఁ
డొంటి నొకనాఁడు..."

"ఆఁకొన్నని న్నిప్పుడు హెచ్చుకుం దాడుట మముఁబోటిగృహిణులకు మెచ్చుగాదు" అనియుఁ బలికినది. దీనికి మూలమున,

"అథగచ్ఛన్ మహాదేవ్యా గృహద్వారి నిషణ్ణయా
ప్రాకృతస్త్రీస్వరూపిణ్యా భిక్షార్థై ప్రార్థితోతిథిః
భగవన్ భిక్షుకాస్త్రావ దద్య దృష్టా న కుత్రచిత్
అసత్కృత్యాతిథిం నాథో న మే భోక్ష్యతి కర్హిచిత్
వైశ్వదేవాదికం కర్మ కృత్వా గృహపతిర్మమ
ప్రతీక్షతేతిథిపథం తస్మాత్త్వమతిథిర్భవ
వినాతిథిం గృహస్థోయ స్త్వన్నమేకో నిషేవతే
నిషేవతేఘం స పరం సహితః స్వపితామహైః
తస్మాత్త్వరితమాయాహి కురు మే పత్యురీహితం
పతిర్మే బహుకాలీనః కాలం న సహతే చిరం
ఆశు గత్వా సమాగచ్ఛ..."

ఇందుఁ దెనుఁగులోనిరీతిగా ముందు విశాలాక్షి పలికినచండభాషితములుగాని హెచ్చుకుందాడుటలుగాని లేవు. ఎంతనేర్పుగా నుడివినదో పరికింపుఁడు. మఱియు,

"ఎంతయును కాల మీవ్రతం బిట్లు సెల్లె"
"వ్రతము తప్పి భుజింపంగ వలను గాదు"

అని తనయయుతసంఖ్యగలశిష్యులు దానును గలిసియే భుజింప నాధార

మనియు, అదొకవ్రత మనియు వారినెల్లఁ బిలిచినఁ గాని నే నొంటిగ నీయింట భుజింపరా దనియుఁ దెనుఁగువ్యాసుఁ డనినాఁడు. దీనికి మూల మున

"అస్తి మే నియమః కశ్చిత్ స సిద్ధిం చేద్వ్రజే చ్ఛుభే,
ఏకభిక్షాం తదాహంతు కరిష్యే నాన్యథా పునః
అయుతం మమ శిష్యా యే తైస్సహం క్తి మహం వృణే
అన్నం యావ న్నయా త్యర్థః తావ ద్భోక్ష్యే న్యథా నహి"

అనియుఁ గలదు. ఇఁక భీమఖండమున విప్రోత్తమా! శాప ముప సంహరించి యిటు రమ్మన్నది యాదిశక్తి. తఱువాత.

'భిక్షలే దని యింత కోపింతురయ్య
కాశికాపట్టణమువీఁదఁ గాని నేయ ?"

"ఏడు దినంబు లన్నమున కెడ్డము వుట్టినయంతమాత్రలో
నేమిచుచున్న వాఁడవు మునీశ్వర నేఁడును నీదు ధీరతల్
పాడఱిపోయె నే శివునిభార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిన్
గాదు నొసర్పఁజూచెదవు గంతపుఁగ్రోధము పెచ్చు రెచ్చఁగా"

నీవు విప్రుఁడవు గాన నేర మెంచరాదు. భిక్షకు రమ్మా, అన్నది. తఱువాత వ్యాసుఁడు

"తల్లీ యిన్నిదినాలకేనియు సుభాగ్యాగారసస్యందినై
యుల్లంబున్ సుఖియింపఁజేయుపలు కెట్లో వింటి నిన్నేటిలోఁ
బెల్లాఁకొన్నకతాన నే నొకఁడనే భిక్షానకు న్వత్తునో
మెలాశిష్యులఁ గొంచువత్తునో ?" అనియు

అమ్మా! నీ విశ్వభిక్ష నందఱము పంచి కుడిచి బ్రదికెదము ప్రాణంబు లందఱివి సమానమే గదా, అని యన్నాఁడు. వెంటనే యామె నీవు నీశిష్యులతోఁ గూడియే భిక్షకు రమ్మన్నది. దీనికి మూల మున:—

"కోపే నాలం న భిక్షేతి కాశికాయాం వారేణ తే

మనో దధ్టుం కృతాన్వేత దన్నానాగమనక్రియా
సప్తస్వేవ దినేషు త్వ మోదనాభావమాత్రిత:
రోదనం కురుషే క్లాంతః కథం తాపసపుంగవః
౦ వేక్ష్య నష్టే కిం పరయా రుషా
బత మానికులోత్తంస బాలచంద్రశిఖామణేః
ప్రియభోగపురంధ్ర్యాం తే కోపోఽస్మి న్నగరోత్తమే"
అని యున్నది, తరువాత వ్యాసుడును:—
"మాత ర్న్మయా కథమపి శృతి మస్మిన్ పురే చిరాత్
వాక్యం సుధారసస్యంది హృదయోల్లాసకారణం
భిక్షార్థ మేక ఏవాహ మాగమిష్యామి తే గృహం
శిష్యైః కిం వా ఖిలై స్స్నాక మేకం సత్యంచ మే వద"
అనియుఁ జెప్పఁబడి యున్నదిగాని శిష్యసహితభోజన మొక వ్రతముగాఁ బాటించినట్లు లేదు. పైఁగా నాతోపాటు నాశిష్యులకుఁ గూడ భిక్ష నను గ్రహింపు మన్నట్లు సూచిత మైనది. గృహిణీసంభాషణము మాత్ర మీ కాశీఖండమునఁ గర్కశముగా నున్న దనక తప్పదు.

5 వ్యాసుని మందలించుట.

"భోజనానంతరము ధర్మపత్నియుఁ దానును నాస్థానంబున సుఖోపవిష్టుండై బాదరాయణు రావించి" అని ప్రారంభించి కాశీనగరంబున శపథాఘం బొనర్చిన వ్యాసునికిఁ దగినశిక్ష చేయఁదలంచి యీశాని:—
"ఎట్టు పురాణముల్ పదియు నేస్మిదిఁ జెప్పితి వెట్టు వేదముల్
గట్టితి వేర్పఱించి నుడికారపుసొం పెసలార భారతం
బెట్టు రచించి తీవు ఋషి వెట్టయి తొక్క దినంబుమాత్రలోఁ
బొట్టకు లేక తిట్టితివి పుణ్యగుణంబులరాశిఁ గాశికన్"
"క్రోధంబు ఫలమె నిర్మల, బోధనునకుఁ దీర్ఘవాసమున శుచితలచే,
క్రోధము వారాణసిపైఁ, గోపించిన విశ్వభర్త గోపింపఁడా?"

"వారణాసి ముక్తిస్థానం బీతీర్థముమీఁద నెవ్వాం డన్యాయము సలుచు వాఁడు రుద్ర పిశాచం బగు' అని దులిపివేసి యుంకను పాలింపక యాశుమోము శిలకిఁచినది. వెంటనే యాతఁడు

"కాశి నుండఁగ నర్హుండు గాఁడు వీఁడు
వెడలిపొమ్మను మాటలు వేయు నేల ?"

అని పరుషాక్షరముల నధిక్షేపించినాఁడు పరమశివుఁడు. పాపము వ్యాసుఁడు ప్రముగ్ధుఁడై శంకరులఁ బ్రార్థించినాఁడు. అతఁడు వినక పుణ్యకాలములందును భూతతిథిని మాత్రము వచ్చుచుఁ గాశిఁబాసి యైదుక్రోశములయవతలఁ బొమ్మన్నాఁడు. నాఁటి నుండి గోపురములు కానరానంతదవ్వు పొమ్మని శంకరుఁడు మాయజైనాఁడు. చూచితిరా దైవపరీక్ష యెంతదుఃఖాంతముగ ముగిసినదో? దీనికి సంస్కృత మూలమున రీతి వేఱుగ నున్నది.

మునులు భోజనానంతరము పోనుద్యుక్తులై యుండి శంకరునిచేఁ బార్వతి కనుసన్న చేయఁబడి వ్యాసుని ధర్మమునుగూర్చి ప్రశ్నించినది. అతఁడు సాధారణధర్మములు సెప్పుచు 'కోపము లేనిమొం' పరోత్కర్షాసహనము విచార్యకారిత్వము, మున్నగునవి ముఖ్యధర్మము లనును. వెంటనే మహాదేవుఁడా చెప్పినధర్మములలో నీ కెయ్యది నేమి గల్గవయ్యా? అని యడుగఁగా వ్యాసుఁడు మఱి మాటాడలేదు. అప్పు డీశుఁడు వ్యాసుని దెప్పుచు వ్యర్థసిద్ధి నందక కోపముచే నెవఁడు శాప మిచ్చునో యాశాపఫల మెవఁడని యడుగ, వ్యాసుఁ డట్టివాఁడా శాపఫలమును దానే యనుభవించు ననెను. అప్పు డీశుఁడు వ్యాసుని యపరాధ మొనర్తి తెలిపి శపించును. దానికి వ్యాసుఁడు గడగడ వణఁకుచు నంబికను శరణువేడి యష్టమీచతుర్దశీతిథులందుమాత్రము కాశీప్రవేశమున కనుజ్ఞ గలిగింప నీశ్వరునితోఁ జెప్పు మని పాదములపైఁ బడును. పతి నడిగి యామె దానిని ముదల నొసఁగెను. ఇట్టుండ నీకథను దెనుఁగులో వేఱుగా గ్రహించి కొంత విడుచుట యేలొకో? చూడుఁడు.

(వ్యాసఉవాచ)

"స్వవ్యాంతఃకరణే మాత ర్మహా విహాన్న మానదే
సనషఘర్మోనాస్త్యస్తి యత్త్వయా పరివర్త్యతే
త్వమేవ ధర్మం జానాసి పతిశుశ్రూషణే రతా

(గృహిణ్యువాచ)

అయంధ ర్మో భవే న్మానం క్రియతే చ స్వశక్తితః
సాధారణాని ధర్మాణి సంపృచ్ఛే తాని మే వద

(వ్యాసః)

"అనుద్వేగకరం వాక్యం పరోత్కర్షసహిష్ణుతా
విచార్యకారితా నిత్యం స్వభిష్ట్యోదయచింతనం

(గృహస్థఉవాచ)

ఏషు ధర్మేషు భో విద్వంస్త్వయి కోऽస్తీహ తద్వద
తత స్సగితవ ద్వ్యాసః తస్థా కించిన్న చోక్తవాన్.

(గృహస్థః)

త్వయ్యేవహృదయాసమ్యక్ స్థైర్యం త్వయ్యేవ చోత్తమం
త్వయి సంభావనాస్త్యేవ కామకోऽధవినిగ్రహే
త్వమేవ సమ్య గ్జానీషే వక్తుం చోద్వేగవర్జితం
త్వయ్యేవ సమ్య గ్దృశ్యేత పరోత్కర్షసహిష్ణుతా
విచార్యకారితాయాశ్చ త్వమేవ నిలయో మహాన్
మమైకం బ్రూహి భోవిద్వన్ శాపం దద్యాచ్చ యఃకృధా
అలభన్స్వార్థసంసిద్ధి మభాగ్యాత్త స్యకస్య? సః

(వ్యాసః)

యస్స్వార్థసిద్ధిమలభ న్నభాగ్యాచ్ఛపతి క్రుధా
సశాపఃప్రత్యుతభవేత్ శప్తు రేవా వివేకినః

... ... ... ... ...

... ... ... ... ...

తచ్ఛ్రుత్వా వేపమానస్సః పరిశుష్కోష్ఠతాలుకః
జగామ శరణం గౌరీం పురం స్తచ్ఛరణాగతః
ఉవాచ చ వచో మాతః త్రాహి త్రాహి భృశం రుదన్
పరిత్యక్ష్యామి సదా క్షేత్రే ప్రతిభూశ్చ పార్వతి
దిశ పరివేశనాదేశం నేశ స్త్వద్వాక్యలంఘకః
ఇత్యుక్త్వా తేన మునినా భవానీ కరుణాజనిః
ముఖం మహేశితు ర్వీక్ష్య తథేత్యాహ తదాజ్ఞయా”

ఇంక భీమఖండమున నీవిషయము పార్వతీ పరమశివు లిరువురును ఋషులెల్ల భుజించి శయనించియున్న పరిదేశమునకే వచ్చిరి. తోడన ఋషిసంతోషస త్రాసములలోఁ బరిత్యక్తాన మొనర్చినాఁడు. నమస్కరించినాఁడు. దండకట్టినాఁడు. వెను వెంటనే శంభుఁడు కోపసంరంభుఁడై

“ఓరిదురాత్మ నీ౦ రమూర్తిం పచాభాస యోజనగంధి ప్రథమపుత్ర దేవరన్యాయమర్భవనాపరతంత్ర బహుసంహితావృథాపాఠపఠన భారతగ్రంథగుంభన పండితం మన్య”

అని మొదలిడి నీవా, కాశికను శపింతువంట “పొమ్ము నిర్భాగ్య మాయూరిపొలమువెడలి, యెచటికేన్ శిష్యులును నీవు నీతుణంబ”

“పోక నడగొట్టితేనియు, రాకింతుఁ జుమీ సుగంబు రాచట్టువమున్,
(శ్రీ) కాశిక నిందించిన నీకింతట నేలపోవు నచచరిత్రా)”

అని చెవులఁబెట్టరాని కఱకులు నుడివెను. అహా! భక్తుని భక్తి పరీక్షింపఁబూని యీతని నెన్నె చిక్కులు పెట్టిన భగవంతుని పరీక్షాపాక మెంత సున్నితమో పరికింపుఁడు? అప్పుడు వారియడుగులం బడినాఁడు వ్యాసుఁడు. అంబ కనుగ్రహము గలిగినది. దీనికిఁ గారణము

“కాశి శివునకు శుద్ధాంతకాంత గాన
దానిపై నగ్గి కోపపాత్రంబనైతి
కాశి గౌరికి సవతియే గాన, నేను
దానిపై నగ్గి ప్రేమపాత్రంబునైతి”

అని వ్యాసుఁడు మున్నే చెప్పికొనియున్నాఁడు. అప్పుడు

"వెఱవకు మోకుమార పదివేలవిధంబులనైన నిన్ను నే
మఱవ మహేశకుం జనుట మాని సుఖంబున దక్షవాటికిం
దుఱఁగలిగొన్న సమ్మదముతో గమనింపుము భీమనాయకుం
డఱగొఱలేని వేల్పు నిఖిలాభ్యుదయంబులు నీకు నయ్యెడున్"

అని యోదార్చి పంపినది భవాని. సత్యముగా నీవిశ్వేశ్వరప్రవృత్తికై వ్యాసునికప్పు డెట్టి యభిప్రాయమున్నదో గ్రంథముననే స్థానాంతరమున నాభావము వెల్లడించియున్నాఁడు. చూడుఁడు.

బాదరాయణుఁడు కాశికి శిష్యగణముతోఁ గైవల్యసిద్ధికేఁగియున్నాఁడు. మనమును బోవుదములెండని మైత్రావరుణ బృహస్పత్యత్రిభరద్వాజముఖ్యులగు మునులును బ్రయాణమై కాశికేఁగిరి. అచ్చటి పురజనులవలన విషయము తెలిసికొన్నారు. అప్పుడువారు

"కిమర్థం బత విశ్వేశః స్వయం క్రోధాకులోఽభవత్
దినాని స ప్తాదత్వాన్నం పరిపీడితవానయం
శిష్యసందోహసహితం మునీంద్రం బాదరాయణం
ద్వైపాయనం ధిక్కృతవాన్ సోఽపి కాశీపతి స్స్వయం
పాత్రైరస్మానతోకథం కృపయా ధారయిష్యతి. ౧౪ అ౧౮–౨౦
"కూడుపెట్టక యేన్నాళ్ళు కుతిలపఱచి, గాసిసేయుట యిది తప్పుగా
దె తనకుఁ ఎదురు కెదుకే, కోపించె నిందుధరుఁడు, అకట గుజ్జెత్త
బాదరాయణునిమీఁద"

"ద్వైపాయనముని వెడలం, దోలించిన కోపగాఁడు ధూర్జటి యీకా
శీపతి మనలను ననుకరు, పాపరుఁడై యిచట నేల బ్రదుకఁగనిచ్చున్"

అని యనుకొని గిరుకున దక్షపురికి బయలు వెడలినారు.

ఇంక దీనికి మూలముగూడ సరిగానేయున్నది. ఆంధ్ర కాశీఖండ ఘట్టమునకును దానిమూలమునకును గథాసంవిధానమందు మార్పును ఆరెంటికంటె భీమఖండమందు భేదమును జూపట్టుచున్నది. కాశీఖండ

మున నీశాని వ్యాసుని నిందించినది. ఈశుడుం శాపమిచ్చినాఁడు. భీమ ఖండమున నీశుఁడే వ్యాసుని నతిపరుషముగా నిందించుటయు శాప మిచ్చుటయు జరిగినది. భవాని యోదార్చి ధైర్యముచెప్పి వ్యాసునికి ముందుదారి చూపి యాశీర్వదించినట్టు లున్నది. సంస్కృత కాశీఖండము నఁగూడ వ్యాసునిచే శరణుపొందిన దేవి కొంత కరుణించి పుణ్యతిథు లందుఁ గాశీప్రవేశమునకు సెల వీయఁగాఁ దెనుఁగున శివుఁడే దానిని మొదలపెట్టినాఁడు. మఱి పార్వతిమాటయే లేదు. మఱియు భీమఖండ మున "ఆకంఠపూర్ణం నిశ్శంకం భుక్తవంతో వయం తథా" అను ఋషు లమాట కాశీఖండమున "ఆకంఠంబుగ నీవు మాధుకరభిక్షాన్నంబు" అని పార్వతిచే ననిపించినాఁడు, వ్యాసుఁడు భిక్షకు రమ్మనిన గృహిణిని "కమలలోచన, నీలవేణి, బింబాధరోష్ఠి" అని సంబోధించినాఁడు. మూలమున "భద్రే! కాత్వం కుతః ప్రాప్తా పూర్వం దృష్టా న కుత్రచిత్ మన్యే ధర్మమయీ మూర్తిః కాచ త్వం శుచిమానసా, త్వద్దర్శనాత్ పరాం ప్రీతిం సంప్రాప్తా నీంద్రియాణి మే" అని మొదలిడినాఁడు. దీనికి "నిత్యం వీక్షే చరంతం త్వాం భిక్షాశిష్యైః ప్రశిష్యకైః, త్వామేవహం నోజానీషే జానేత్వా మహామేవహి" అనియు నామె చెప్పినది. తెనుఁ గున నిది మృగ్యము. మూలమున సుభగే, శుభలోచనే, సుందరి" అనునట్టి సంబోధనములే యున్నవి. 'వేనలి పాటపాట నరవెండ్రుకలోఁ దిలతండులాన్వయ, శ్రీ నటియింపఁ గైసదలి వ్రేకని చన్నులు పాలవంకలై, కొసరియార్ప వాలుఁదెలికన్నులఁ గల్కితనంబు వీడ్కొ నన్' ఒక స్త్రీ పిలిచినట్టు వర్ణించిన శ్రీనాథుఁడు మున్ముందే వ్యాసు నిచేఁ బలికించినాఁడు. మఱియుఁ బై పద్యమునకు మూలమున,

'అథ గచ్ఛన్ మహాదేవ్యా గృహద్వారి నిషణ్ణయా
ప్రాకృతస్త్రీస్వరూపిణ్యా భిక్షార్థై ప్రార్థితో౽తిథిః"

అనియే యుండ నామె కచకుచాదులు తెనుఁగున వర్ణించినాఁడు.

ఇది ప్రాకృతస్త్రీ వివరణమై యుండవలయును. మఱియు వ్యాసుఁడు భిక్ష కేఁగినపుడు

"వందుచున్నార మును శిష్యవనజనేత్ర
తిరిగి రమ్మను నొక్క లేఁదీవఁబోఁడి

దేవకార్యంబు నేఁ డనుఁ దెఱువ యోర్తు
ద్వాఃకవాటంబుఁ దెఱవదు వనిత యొకతె

అనునవి మొదలగు నిషేధవాక్యములు, చర్యలు నమూలకము లు. ఐనను నివి యాంధ్రమున సుందరములు.

పురాణములు గీర్వాణభాషలో రచించిన మహాత్ముఁ డొకఁడే. అతఁడును వ్యాసమహర్షి. ఇతి వృత్తము వ్యాసునికి సంబంధించిన పరాభవరూపమైనగాథ. అట్టిశక్తి వ్యాసభగవానుఁడు సంస్కృతభీమ కాశీఖండముల రెంటను దనగాథ భేదభూయిష్ఠముగా వ్రాయుటకుఁ గారణ మేమో? కాశీఖండమునఁ దనకుఁ బ్రత్యక్షముగాఁ గ్రియారూపమున ననుభూతమైనసంగతి భీమఖండమునాఁటికి కొకరితోఁ జెప్పుట రూపమున ననుకరింపవలసివచ్చినాఁడు. చిన్న చిన్న మార్పులున్నను సంగతముగానే యుండును. కాని తనకుఁ గల శిష్యసంఖ్యను, తనకు శాప మిచ్చినవారి విషయమును, తన్ననుగ్రహించినవారివిషయమును, తనకుఁ గాశిలో భుక్తి దొరకని దినములసంగతియుఁ, దన కిచ్చిన శాపసంగతి విషయమును భిన్నభిన్నముగాఁ జిత్రింపవలసినంతమఱపు గాని మఱియొంకగాని సంభవించునా?

శ్రీనాథకవిరాజు సంస్కృతమున వ్యాసుఁ డెట్టివాఁడో తెనుఁగున నీతఁ డట్టిసిద్ధహస్తుఁడు. తాను పరివర్తించునపుడు మూలములందలి విరోధఘట్టములఁగూర్చి యేమనుకొనెనో? పురాణముపైఁ బూర్వపక్షము మన కేలయని యున్నదున్నటులే రచించె ననుకొందమా? మూలముననున్న మంచిమంచిసంవిధానముల మార్చినాఁడే. కొంతస్వతంత్రించినాఁడే. ఈగాథ నిట్లు పరస్పరవిరుద్ధముగా రచింప నేలొకో? ముఖ్యముగా శ్రీనాథుని భాషాంతరీకరణపద్ధతి, నైషధము, కాశీఖండము, భీమఖండములనుబట్టిచూడ మూలములందున్న మహితవిషయములెన్నో యాతనియాంధ్రీకరణమున లోపించినను, లేనివి కొన్ని పెరిగియు రుచిభేదము ననుసరించియుఁ గొన్ని మార్పులతోఁ జేరియుండె ననక తప్పదు. (ఓమితి శివం)

---

ఈవ్యాసము ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభలో [illegible] ఆం ప ప్ర.

నవశోణరుచుల నందము లగునెఱజడల్
దలిరులుగా నొక్కదళువు మెఱసి
లలితవిలాసంబుగా బాలచంద్రుఁడు
విరిపువ్వుగా లెస్స మురువు వడసి

గీ. కరుణ మకరందధారగాఁ గరము చెలువు
గన్న శివుఁ డనునూతనకల్పతరువు
చూడఁ దరముగ ఫలలాభసూచకముగఁ
దనర నమ్మునియెదురఁ బ్రత్యక్షమయ్యె.

క. ఆనంది యపుడు హరునకు
నానందితసరణి ఫాల మవనిం జోకం
గా నగుచుఁ గరము నగుచును
దా నతులితభక్తి నిటలతటమున్ జేర్చెన్..

క జయ వివిధోపనిషత్సం
చయశయన చరాచరాత్మజగదయన ధనం
జయ శశిరవినయనకృత
స్వయముదితజ్ఞానముఖ్య సౌఖ్యానయనా !

క భువనసిసృక్షారక్షా
త్వవనజిఘృక్షాత్వవస్థ వాగ్ధవనిటలు
త్వవతార తత్తదభీ
ష్టవిశేషవ్రాత జయ యసంయజ్జేతా !

క. పంచవిధర్మమదగజా
పంచేత్వత్ప్రాణవప్రభావైకవిభా
పంచాననభావలస
త్పంచాక్షరమంత్ర జయ కృపాపరతంత్రా !

క. అనిబహువిధములఁ బ్రస్తుతు
లొనరింపఁగ నెలమిఁ బొంది యోగి నందికి ని
ట్లని యానతిచ్చె శంకరుఁ
డనయము ననుకంప చూపులందు నటింపన్.

చ. తలఁపఁగ నేనిరాని క్రియఁ దాపసపుంగవ నిష్ఠ యొప్ప నీ
వలవడఁజేసినట్టిపరమాద్భుతఘోరతపంబుచేత నే
నెలమి వహించి యిప్పుడ యభీష్టఫలంబుల నిత్తు నంచు ని
ర్మలమతి వచ్చినాఁడను వరంబు వరింపుము సంతసంబునన్.

క. నావుడు శిలాదనందనుఁ
డావిశ్వజగద్విధాతయానతి విని త
త్పావనపదాబ్జములకుం
గేవలమగు భక్తి మ్రొక్కి కృతనిశ్చయుఁడై.

గీ. సరవి నింకను (నిట్లు) వత్సరసహస్ర
మేను మిమ్ము భావించుచు నింపుతోడఁ
దపము సలుపంగఁ జాల నచ్చవు మహాత్మ
మిమ్ము మఱి యొల్ల నెవ్వియు నిందువాళి.

వ. అని విన్నవించిన విని సదాశివుండు వెరఁగుపడుచు నయ్యభిమతంబు ప్రసాదించి యతని నవలోకించి నీవు దపంబున నిలిపిన యీమహీస్థలంబును నీపేర నందిమండలం బనుమహాతీర్థంబుగా నిచ్చితి మనిఁ యానతియిచ్చి యంతర్ధానంబు నొంది యభినందితానందంబున గైలాసంబునకు విజయంచేసె; నట నందియును సలబ్ధవరుండగు చుండి యొక్కవాసరంబున,

ఉ. కమ్రతరప్రమోద మెసఁగంగఁ దదాశ్రమభూమి డించి యా
తామ్రరుచిప్రపూర్ణనవతామరసాకరరమ్యమున్ ఫలా
నమ్రమనోజ్ఞశాఖతరుమధ్యమునై తనరారుచున్న యే
కామ్రకనామతీర్థమున కాదటనేఁ జని నిశ్చలాత్ముఁడై

మ. హరునింగూర్చి మహేశు నెంచి గిరిశుం బ్రార్థించి దాక్షాయణీ
శ్వరుఁ గాంక్షించి త్రినేత్రుఁ గోరి రజనీశస్ఫారఖండాంశభా
స్వరు నుల్లంబునఁ జేర్చి సల్పెఁ దప మాశైలాది యామోదియై
వరుస న్దివ్యసహస్రవర్షములు దూర్వారంభఘోరంబుగాన్.

వ. అంత నతని దుశ్చరతపశ్శక్తికి దుర్ధరనిజభక్తికిం బ్రియం బందుచు నిందుధరుండు నిరంతరాజ్ఞాచరణప్రవణంబు లగుప్రధానప్రమథగణంబులం బిలిచి యేకామ్రకస్థలంబున మత్పరమభక్తుండును నిష్ఠురతపోయుక్తుండును నగుశిలాదపుత్త్రుం డున్నవాఁడు; మీ రక్కడి కరిగి సశరీరంబుగా నమ్మునినాథుని గనకవిమానంబుమీఁద నిడుకొని రమ్మని యానతిచ్చి వీడుకొలుప నవధరించినం జని.

క. తదనంతరంబ వారలు
ముదమున నేకామ్రతీరమున కరిగి శిర
స్సదన్వాస్తరణ బ్రహ్మని
నదసంశ్రవణప్రమాభిసంధిన్ నందిన్.

క. కని యద్భుతమయులై య
మ్మునిపుంగవుమీఁద రుచిరముగఁ గురిసిరి వా
రనఘామరవృక్షవిరా
తనపుష్పప్రకరసాంద్రతరవర్షంబుల్.

చ. ప్రమథవరేణ్యు లప్పుడు ప్రభాపటలీవిభవాభిశోభితాం
గములు దలిర్ప నాతనికిఁ గన్నులపండువుగాఁగ నగ్రభా
గమునకు వచ్చినిల్చి మణికాంచన నిర్మలదీప్తిమద్విమా
నము నొకఁ డర్థిఁ జూపి జతనంబున నిట్లని రేకవాక్యులై.

గీ. సకలదేవగురుఁడు చంద్రకళాధరుం
డీశ్వరుండు నిను సమిద్ధకరుణ
గొనలుపాఁగ నిపుడు దనసన్నిధికిఁ దేరఁ
బనిచినాఁడు మమ్ముఁ బావనాత్మ!

వ. అని పలికి యతని మంగళస్నానపవిత్రగాత్రుం గావించి దివ్యమాల్యాభరణంబులు శృంగారించి విమానంబునడిమిభద్రపీఠంబునఁ గూర్చుండ నునిచి యప్సరఃకాంతాయుతసువర్ణచామరవ్యజనంబులను గంధర్వబృందమధురగానంబులను బద్మాసనంబునఁ గింపురుషులు రచించు మందారాగంబునకుఁ దోడ్కొనిపోయి సముచితప్రకారంబున శాంభవసభాభవనంబు గదియించి రట్టియెడ.

సీ. తుంబురుండును నారదుండును సగ్రభా
గమున గీతప్రబంధములతోడఁ
బరిహాసనత్కథాభంగి భృంగీశ్వరుఁ
డెడనెడఁ దగుమాట లలరఁజేయఁ
గాలరుద్రుండు శుండాలవక్త్రుండు ను
పరిపీఠమునఁ గ్రమయుక్తిఁ గొలువ
వామాంకతలమున వఱలు దాక్షాయణి
సరసచేష్టలఁ బ్రేమభరముఁ జెనుప
గీ. నాల్గుదిక్కుల నిజసేవనాప్రసక్తి
నరుగుదెంచిన హరివిరించాదు లెల్ల
నెలమి మడిసందులను జేతులిడి భజింప
గరిమఁ గొలువున్న శశిమౌళిఁ గనియె నంది.

మ. కని భక్తిం బ్రణమిల్లి లేచి కరయుగ్మంబు న్లలాటస్థలంబునఁ గీలించి నమశ్శివాయ కరుణాంభోరాశయే భక్తపాలనదీక్షాగురవే యటంచు మఱియు న్బాగొంద నందంద మించినతన్నామము లుచ్చరించుచుఁ బ్రశంసించె న్గారు న్శంకరున్.

చ. అపుడు మహేశ్వరుండు ప్రణయంబున నమ్మునినాథుతోడ నీ
విపులతపఃప్రశస్తికిని విశ్రుతభక్తికి నేను మెచ్చితిం
బ్రపురుషవర్ణనీయగుణభాసురసక్తికి నీడుగా విశే
షపుపద మిప్పు డొరసితి జక్కఁగ నందుల నిన్ను నుంచెదన్.

వ. అని యానతిచ్చి యతనికిం దనసామీప్యసారూప్యంబులు గృపచేసి నిజసర్వకార్యభారకత్వంబును గణాధిపత్యంబును తదధీనంబులు గావించి యనన్యసామాన్యంబుగా మన్నించె; నది మొదలుగా నందికేశ్వరుండును నిచ్చలు మొగసాలఁ గూర్చుండి జగంబుల విన్నపంబు లాలకించుచుఁ దగినపగిది నుపలాలించుచు నయ్యష్టమూర్తియాసన్నవర్తియగుచు నుల్లసిలుచుండె.

క. నంది ప్రసాదమన న
స్పందిత మహిమమున వెలయు భవలీల ప్రియం
బందఁగఁ జదివిన వినినన్
నందత్సభ సిద్ధు లొదవు నరులకు నెపుడున్.

## తొమ్మిదవ లీల.

గీ. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁడవధరించినట్టిలీల
నది దనర్చు సింధురాసురమర్దనం
బనువిశేషనామ మతిశయిల్ల.

తరల. మహితదానవసంభవుం డసమానవిక్రముదుస్సహుం
డహితభంజననిష్ఠురాత్ముఁ డనర్గళాగ్రహవర్తన
ప్రహితమానసుఁ డాతతోగ్రతపఃప్రభావసముజ్జ్వల
న్మహిమ నొప్పుగజాస్యుఁ డొక్కయమర్త్యశాత్రవుఁడిమ్మహిన్.

గీ. అలఘులీల దశసహస్రయోజనమితి
వఱలు నున్నతియును వలము గలుగ
విగ్రహమునఁ జాల విలసిల్లు జంగమాం
జనధరాధరంబు పొలుపు గెలిచి.

వ. ఈదృశప్రభావంబున వెలయు నతఁడు దనమనంబున నిసర్గజంబగు నిర్జరులవలని యలుకం జులక రెట్టించి సముదయంబున దర్పించి యొక్కసమయంబున

సీ. ఖురఖరట్టాకారచరణఘట్టనముల
కుతలమంతయును గ్రగ్గోడు గాఁగ
శాతదంతాగ్ర సంజాతఘాతముల గో
త్రమహీధరములు దుత్తుమురు గాఁగఁ
గర్ణతాడనసముద్గతపవనంబుల
వార్ధులు పిండలివండు గాఁగ
నుత్క్షిప్తశుండాగ్ర హూంకృతఘర్షణముల
జదలువారు...... చదురుగాఁగ

గీ. నడచె జైత్రయాత్ర(కుల) సన్నాదపటిమఁ
గుటిలగంభీరఘీంకారఘోరఘోష
పటపటార్భటిపాటితపద్మజాండ
భాసురుండగు నగ్గజాసురుండు.

గీ. ఇట్లు నడుచునపుడు హేలాసముత్తాల
సరణిఁ బ్రళయసమయతరణిమండ
లోపమాన తన్మహోగ్రవీక్షణముల
నొక్కపెట్టఁ బావకోల్క లెసఁగె.

క. అవి భయదప్రసరణముల
నవిరళసంతాపభరసమాహతిఘనతన్
గవిసి యెడతెగని పెక్కన
వివిధగతిం జగములేఁచి పెంపఱవెట్టెన్.

చ. అదయత నమ్మహాసురుఁడు నాజలలోఁ దనతోడఁబోరఁగా
నెదిరినయట్టివారి సముదీర్ణకృతాంతకదండచండతా
స్పద మగుచున్న తుండమునఁ జక్కఁగ నొక్కటఁ జుట్టిపట్టి నె
మ్మదిఁగని మ్రింగఁ జొచ్చెఁ బలుమాఱును దారుణకర్మధీయుఁడై.

చ. హరిశిఖిదండిరాక్షసజలాధిపమారుతయక్షపోగ్రులా
కరిదనుజేంద్రునిష్ఠురపుఁ గైవడి సైఁపక యొక్కపెట్ట యు

ద్ధరబహుసంఘసైన్యములతో నరుదెంచి యెదిర్చి భీమసం
గరమునకుం గణంగి రవగాఢభుజావిభవంబు సూపుచున్.

వ. ఇట్లు పోరికిం జేరిన నాకపతుల నాకులతపఱుపం దలంచి రభసంబునం గసిమసంగి దంతివల్లభుండు

ఉ. కొందఱు మట్టు పాదములఁ గొందఱ నొక్కట గ్రుచ్చుఁ గొమ్ములం
గొందఱఁ జుట్టుఁ దుండమునఁ గొందఱ నీఱుగఁ జూచుఁ జూపులం
గొందఱఁ గొట్టుఁ గర్ణములఁ గొందఱఁ బాఱఁగఁదోలు ఘీంక్రియన్
గొందఱఁ గట్టు వాలమునఁ గ్రూరవిహారవిధాధురీణుఁడై.

సీ. పదహతి నెగసిన మెదడుఁతండంబులు
రంపిల్ల మట్టన రొంపి యగుచు
రదనఘాతంబులఁ జెదరిన ప్రేవులు
తోడ్తోన తునిసిన తొండ లగుచు
తుండంబువ్రేటునఁ దునిసిన శిరములు
కనుకనిఁదెగిన పంకజములగుచుఁ
జూపుమంటల వేడి స్రుక్కిన భుజములు
గరము మూర్ఛిలి నవాగ్రమ్ములగుచు
మఱియు దంతప్రహారసమ్మర్దనముల
నవిసిపడిన యంగంబులు నాచులగుచు
సమరతల మనుపద్మాకరమును మెఱయ
నాగజాసురసమఁ విహార మొప్పె.

వ. ఇట్లు దుర్వారఘోర ప్రకారంబునఁ బ్రతిఘీరులఁ బాఱి సమరిననతని ధాకకుం గాక పలాయితసురాధిపు లొక్కయెడఁ గూడి పడి యా దనుజభయంబువలనఁ గావ సమర్థుండు భర్గుండుగాక యెవ్వారు గల రతనికి విన్నవింతు మనుచుఁ దలంచి యందఱుం దక్షిణంబ రజతాచలం బధిగమించి యాజగత్ప్రభువు పెద్దమొగసాల ముందర నిలిచి కరంబులెత్తి తారస్వరంబున నిట్లని విన్నవించిరి.

సీ. అభయమ్మునిమ్ము భక్తానందసంధాత
శరణంబుగమ్ము విశ్వప్రణేత
కరుణఁజూడుము చారుకల్యాణమయరూప
యార్తిమానుపుము దివ్యప్రతాప
యరయుము కుముదమిత్రార్ధచూడామణి
కావుము దారుణాఘప్రణాశ
చేకొమ్ము శాంభవీచిత్తనూతనచోర
రక్షయొనర్పు నిర్మలవిహార
గీ. యభవ ఫాలాక్ష శంకర యాదరింపు
ముగ్రభూతనాయక మమ్ము నుద్ధరింపు
మజర యక్షర ద్వయమమ్ము నవధరింపు
ప్రకటజయసంగ గతి నవపాండురాంగ
ఉ. మామొఱ యాలకింపుము సమస్తజగత్పరిరక్షణవ్రతా
మ్మామొఱ యాలకింపుము సమగ్రదయారససంగమానసా
మామొఱ యాలకింపుము సమస్తజగత్పరిరక్షణవ్రతా
మామొఱ యాలకింపుము శమప్రకటాత్మక యోసదాశివా!
క. దిక్కగుము శర్వ శాశ్వత
దిక్కగుము పినాకహస్త దిక్కగుము హరా
దిక్కగుము వృషభవాహన
దిక్కగుము వినాశదూర దిక్కగుము భవా.
త. అని యిట్లు శతమఖాదులు మిగుల నార్తులగుచు నానారూపంబులం బలుకు దీనాలాపంబుల నొదవు ఘోషంబు రజతాచలంబు గుహాసముచ్చల త్ప్రతిధ్వనులవలనం బరితాపంబుఁ బొందుచు భూనభోంతరంబంతయు బోరుకలుగఁ గలంగునటుగాఁ జెలంగుచుండు నవసరంబున నంతరాస్థానమంటపంబునఁ బ్రమథగణంబులు గొలువ నొడ్డోలగంబున్న విశ్వనాయకుం డాకలకలం బాలకించి పిలువఁ బుత్తెంచినం జని వారు నుం ద త్ప్రదేశంబున,

సీ. ఉపరిపీఠమున నిలుచున్న నందీశ్వరు
నంజలిస్థలియొక్క యడుగుజరపి
యావలిచరణ మొయ్యారంబుతోఁ గూడఁ
దొడమీఁద వెరగు చెన్నడర నిలిపి
సతియంకవేదికిం జనఁజూచి మురిఁచిన
యొకచేతిలోన మస్తకము మోపి
నాసికయరడాయ బాసిక నెఱివేడ్క
......మీఁఱహస్తమునఁ బూని
గీ. ఇతరకరయుగ్మకంబునఁ జతురలీల
నభయవరదానచిహ్నంబు లర్థిఁ దాల్చి
ప్రకటగంధర్వగీతప్రబంధరుచులు
వినుచునున్న యీశ్వరు లోకవిభునిఁ గనిరి.
క. కని భక్తితోడఁ బ్రణమము
నొనరించి లలాటతటుల నొక్కటఁ గరమున్
దనరఁగ ఘటించి సాధ్వస
మున వణఁకుచునుండి రింద్రిముఖు లట్టియెడన్.
క. శివుఁ డాదరించుచూపులు
నివురగ మీ రకట యేల నేఁ డిట్లార్తిం
దవిలితిరి చెప్పుఁ డిప్పుడ
యవలీల నణంచువాఁడ నాభయ మెల్లన్.
గీ. అనుచు నాపురందరాదులతోడ ని
ట్లానతిచ్చుటయును మానసమున
వార లందఱు...చకిత్రతరానంద
ఘనత గ్రిమ్మఱంగ వినతు లగుచు.
వ. లేచి నిలిచి దేవా మహిషాసురనందనుం డగుగజాసురుండు మదిం
చి ముదఱం గానక విశ్వంబునకు బాధసేయం దొడంగిన మే మంద

ఱము చతురంగబలసన్నద్ధుల మగుచు నతనిం దలపడి యెంతయుం గొల్లలసేయనోపక పాఱిపోయివచ్చితిమి. వాఁడును వారిజగర్భు మీఁదికి దాడిసనియె; నంత కక్కడ నేపాటికోలాహల మగునో యెఱుంగరాదు; ఈవిజ్ఞాపనంబు చి తంబున నవధరించి యిప్పుడు విజయంచేసి వానిం బరిమార్పవలయు, ననన్యగతికుల మమ్ముఁ గావవలయు నని నోడకుండుఁ డనుచు వారి కభయం బిచ్చె; ననంతరం బ యక్కడఁ గదలి.

చ. తన యిరువంకలందుఁ బ్రమథప్రకరంబులు నిర్జరేంద్రులున్
ఘనతరలీలఁ గొల్వ వృషభాధిపు నెక్కి యుదంచితోద్ధతిన్
జని యటముందటం గనియె శంకరుఁ డాగజదానవు న్రణా
వనినిజహస్తబంధబలవద్భరభీతు సరోజసంభవున్.

గీ. ఇట్లు సూచి యాత్మ నేచిన రోషపా
వకముశిఖలు వెలికి వలియ నిగిడి
కానవచ్చె ననఁగఁ గన్నుల రెంటను
నరుణరుచులు నిగుడ నపుడుగవిసి.

క. అతిభయదాశనిపాతము
ప్రతియగు కరఘాత మొకట రాక్షసవిభునిం
ధృతి గుదియ నడఁచి యావా
క్పతిఁ దత్కరముక్తుఁగాఁగఁ గ్రక్కునఁ జేసెన్.

వ. ఇట్లు దన యాగ్రహంబునకు ననువుపడి విరించి విడిపించి సమరవ్యగ్రుండగు నుగ్రు నిరీక్షించి యతండును మాఱుమలయుచు నవష్టంభించి గదిసి.

మత్తకోకిల.
ఫాలలోచనుఁ డుం దదుద్భటభంగి యంతయుఁ జూచి త
త్కీలజాలకరాళతాసముదీర్ణతాభఁ దలంచుచున్

శూల ముద్ధతిఁ ద్రిప్పుచు న్వాడిఁ జొచ్చి వానియురంబున
నీల గ్రుచ్చి నిరూఢి నెత్తెను నింగికిం జనునట్లుగన్.

క. గిరిశకరశూల శిఖరో
పరితలమున నట్లుగుప్పఁబడియున్న గజా
సురుఁ డొప్పె సురభయావలి
హరణార్థము కాచినట్టి యంబుదము క్రియన్.

క. ఆలోకనోత్సవంబుగ
నాలోకప్రభునిమీఁద నడరెం దఱచై
యాలోఁ బ్రసూనవర్షము
లోలి న్మధుపో(రు)ఝుణఝుణారవములతోన్.

వ. అప్పుడ కని లబ్ధశాంభవభక్తిభాసురుం డగుచు గజాసురుండు
శ్రీమహాదేవునకు విన్నవింపం దొడంగె.

క. కరుణింపు నన్ను నీశ్వర
పరమానందాత్మ శర్వ భవ సకలజగ
ద్భరిత యనంత యనామయ
గిరిశ సుధాకరకిరీట గీర్వాణనుతా !

ఉ విగ్రహావృత్తి పూని కడు వీరిణులై చరియించు ధూర్తులం
దుగ్రుఁడ వౌదుగాన భవదుజ్జ్వలపాదసరోజభక్తి స
వ్యగ్రతరాత్ములై పరగువారలయందు శివుండ వౌదు సా
నుగ్రహరీతిఁ గావున నినుం బ్రణుతింపఁగ నొప్పు ధూర్జటీ.

క. శిష్టాపకారుఁ డెంతయుఁ
గష్టక్రమవర్తనుండు కల్లరి నీఁచు
తత్కృష్టాఘుఁ డనక యిపు డొక
యిష్టము నాకవధరింపు మీశాన! కృపన్.

వ. అని మఱియు నీదృశంబులగు విజ్ఞాపనల నాసదాశివునిచిత్తంబు
ప్రమోదాయత్తంబుచేసి, దేవా? దేవర మదీయచర్మం బొలిచి యది

పరమపవిత్రంబుగా నలవఱిచి వస్త్రభావంబున ధరియింపవే యనిన
విని శంకరుం డనంతరసమయంబున.

ఉ. ఆకరిదానవప్రభుని నల్లనయుర్వికి నొప్పడించి చి
త్రాకరకౌశలంబు మెఱయంగ దదీయశరీరచర్మ మం
గీకృతహేల నొల్వఁగఁ దొణంగెఁ గరాస్త్రనితాంతశాతధా
రాకృతనూతనవ్రణసరద్రుధిరం బతిభీకరంబుగన్.

క. ఒలిచినచర్మము మఱుఁచుచు
నొలఁజొచ్చె తనర్చిపాఱియున్న యెడల న
స్థులు దోఁచె దనుజుమేనం
దలతల నెఱసంజదోఁచు తారలుఁబోలెన్.

క. సెరకట్టెఁగాలువలుగా
ధరఁ జాఁగుచు వానిశోణితమ్ములు మెఱసెన్
సురహృదయరాగరసములు
పరువడి నీకరణి వెలికిఁ బ్రసరించు ననన్.

క. కరివిభుని రక్తబిందువు
లరుణగ హరుమేనఁ గదిరి యలరె భవిష్య
ద్వరభూషోరగచూడా
స్ఫురన్మణిప్రభలు మున్న పొడసూపె ననన్.

వ. అని యివ్విధంబున నవ్విభుం డాగజాసురుచర్మంబు దారుణకర్మంబు
న నొలిచి యదిగరంబునం గొని కరంబు వీరరసావేశంబు ప్రకా
శంబు నొంద నమందలహరీచారుగతి నిరతిశయభరన్యాసపద
న్యాసదుస్సహాభూతలవహాపన్నగప్రముఖముఖనిస్సరద్గరళజ్వాలనజ్వా
లాపరీతరసాతలుండును, సవిభ్రమభ్రమపరిభ్రమణ సంచారచల
దవిచల విచిత్రాయమాణ పరిధానపరివీతజఘనమండలుండును,
మంగళాంగహారఫలిత స్వచ్ఛపటాకారవిభ్రాజితాదభ్రాజిననవనిష్ప
తద్రక్త ద్రుమబంధూకరుచిరబంధురశరత్సమయుండును, నభంగ

మృదంగవాంశతాళాద్యనవద్యవాద్యవాదనాదరసంభ్రమ సంధిపుష్కరత్కమలసంభవపురస్సరుండును, అభినవాభినయసముద్దండభుజాదండ జాగ్రదుదగ్రసాధన ప్రసాధన ప్రకామధామ ధగధమనిచనిసజగదంతరాళకహారుండును శర్వత్రిసరనిశ్శేషఝంపాపాతఘూర్ణమానార్ణవసమున్మీలితతద్బహులలహరీభీషణా ఘోష ప్రతిధ్వనిత గోత్రిగోత్రాధరగుహాగృహాంతరుండును విద్రుమద్రుమలతా ప్రతానపరిభాత ప్రభావిభాసమాన జంగమజటాచ్ఛటాసంతాన నితాంతప్రవృత్తి హరి ద్వృత్తిశంకరుండును, నిజవిజయాపదానప్రథమాన నానారాగ నిబద్ధనాదచంక్వణ తుంబురు నారదప్రభృతిదివ్యగాయకపరివృతపార్శ్వస్థలుండును సమేధితక్రీడిత సందర్శన సందర్భనిర్భరానందోన్మీల త్కాలరుద్రగజానన ప్రధాన ప్రమథనాథ జయజయవచనముఖరుండును మధురమధురసపానచంచరీకకాకలీస్వరస్వననిష్యందదమరుతరుప్రసూనవర్షసురభిత విశాలశేఖరుండును నగుచుఁ జూపఱ కొండొక తడవు కన్నులపండువుగాఁ దాండవవశానందవంబున వినోదించిన చిత్తంబున నుండు సమయంబున

గీ. హరివిరించాదు లందఱు నమ్మహాత్ము
పాదయుగ్మమునకు నతిభక్తి మ్రొక్కి
కేలుదోయి శిరంబులఁ గీలుకొలిపి
యభినుతింపంగఁ దొణఁగి రింపలరుమతుల.

ఉ. ఎల్లసురావలిం బఱపి యీజగ మంతయునుం బ్రతాపసం
ఫుల్లకృశానుకీలములఁ బ్రొవులఁజేయు...గజాసురుం
జెల్లఁగ నిట్లు సంగరమహీస్థలిఁ జంపను జర్మ మొల్వఁగాఁ
జెల్లునె యెందు నెవ్వరికి సిద్ధమనోరథ విశ్వనాయకా !

చ. పదహతి నేల యంతయును బాదములం గలచేవనట్లు బి
ట్టదర జటాప్రఘాతముల నాశలు బీటలువాఱ విస్మయ

ప్రదమగు నిట్టిమాడ్కిఁ దనరం భువనావలిఁ గాచుసంభ్రమం
బాదవఁగ నీవు తాండవమహోన్నతిఁదాల్చుట యొప్పు నీశ్వరా!

వ. అని మఱియు ననేకభంగుల నిజవిజయవినోదం బంపునఁ బ్రశంసించు
చున్న పద్మాక్షపద్మగర్భప్రభుతుల నిభృతాదరలక్షితంబులగు నిరీ
క్షణంబులను సమయానురూపంబులగు సల్లాపంబులను బహ్వాను
మతులం గావించి యెల్లవారును సేవించి రా నిజనివాసంబగు కైలా
సంబునకు విజయంచేసి యథోచితవిహారంబులం బ్రొద్దుపుచ్చుచుండె

క. హరుఁ డిట్లు సింధురాసురు
హరియించిన యట్టిలీల యంచితభక్తి
స్ఫురణం జదివిన వినినను
ధరణి జనావలి కభీష్టసిద్ధము లొనఁగూడున్.

**పదవలీల.**

గీ. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డాధరించి నట్టిలీల
దనరు నది భుజంగధారణాహ్వాయమున
నఖిలవిబుధసేవనీయ మగుచు.

క. అనఘశుభగతులు కశ్యప
మునినాయకసతులు గలరు ముగ్ధలు వినయా
దినిరూఢగుణసమర్థులు
ఘనకుచభారవహాసతులు కద్రూవినతల్.

వ. ఇట్లు వర్ణనీయగుణకాంత లొక్కనాఁడు విశ్రామంబునకు గృహ
సీమంబులు వెడలి యక్కడ నక్కడ హృదయానందపరిపోషంబు
గాఁ దత్తత్పదార్థ విశేషంబులు సూచుచుం జని చని ముందట.

సీ. అంతస్థిరా తోచ్చల దభినవానిలముల
వీచికావితతులు విజృంభిఁగ

పిచికావితతి నవీనదోలలమీఁద
నహిరాజ కన్య లుయ్యాలలూఁగ
నహిరాజకన్యక లగ్నిఁదాఁకక యుండ
భానాగతాబ్దముల్ బలసియాడ
భానాగతాబ్ద శుంభద్గర్జనములతో
నాత్మఘోషములు సయ్యాటలాడ
గీ. అమర సురశిరోజ ... ... ...
... ... ... రాజదశని తక్షురక్షు
ణార్థకలనాభిమానాభియాతవీత
పరిభవాచలాకరము సాగరము గనిరి.
ఉ. శ్రీవిభుపంజ మేదినికిఁ జెల్వగుపుట్టము దివ్యనవ్యర
త్నాలికి మక్కపట్టు దివిజారులదుర్గము వాహినీసతుల్
భావముగట్టుఠావు బడబోజ్జ్వలనంబున వంటయిల్లు నాఁ
గా విలసిల్లు నావనధి గాఢమహత్త్వము చెప్ప నొప్పగున్.
ఉ. చండమరుత్ప్రరి భ్రమణ చంచల చంచదుదీర్ణవీచికా
షండ మజాండపూర్ణవిలసద్గతి నుండుపయోధి యొప్పుచుం
డాండవసంభ్రమార్థభుజదండనవాభినయాశ్రిశోభితాం
గుండగుచుం గరం బలరు కుండలికుండలితోడి జోటిగన్.
సీ. ఒకచోట లహరీ సముద్ధతి నెగసి వాః
కణములు చుక్కలఁ గ్రందుకొలుప
నొకచోట బడబానలాగతార్చులునాఁగ
భరరత్న రోచులు ప్రబలుచుండ
నొకచోటఁ దమలోన మకరాదికముల సో
మకమునేకాంగికి మాఱుమలయ
నొకచోటఁ దిరిబడి యురుపయోధరములు
పలుమాఱు గొండ్లిన పరిథవింప

గీ. మఱియు నొకచోటబయలికి మలకువెడలి
యెలమిఁ జలమానవాంగన లెండఁగాయ
యిట్లు నానాక్రమంబుల నెసఁగుచిత్రి
సరణి నలరొందు నమ్మహాశరధివిభుఁడు.

చ అతుల నిజప్రభాతతుల నంబరము న్విశదీకరించి యు
ద్ధత (తను) గ్రాలు కొన్నురువుతండముచేత నపూర్వవిభ్రమా
యతమగుచుండు నెప్పుడును నాజలరాశి శుభప్రకాశియై
యితరగభీరతామహిమ నెల్లను దక్కక నవ్వుచాఘనన్.

వ. ఇట్లు వివిధగుణ విని ద్రంబగు సముద్రంబుగని యాతరుణులిగున్పురు
గదియంజని శీతకరోదయవేళలఁ గడల్లు పింపిళ్ళుగూయుచుండఁ గ్రక్క
డనతదీయవిక్షేపంబులు బెరసి యాసమీపంబున జలాధిదేవతాధివా
సంబునకు విలాసంబు గదురఁ బ్రాళిగాఁ వ్రాసిన రంగవల్లికల నుపమిల్లి
నముక్తాఫలవారంబుల రుచిపూరంబులు మీఁదఁగనిసి పాటలవర్ణపాట
లంబులగు ప్రవాళంబులవలన వెన్నెల నవ్వున నెలనవ్వునకుం గొప్పు
లగు కెమ్మోవులు చెన్నుమిగులు నన్నువకరణి నభినవశోభఁ దనరు లవ
లీలతలును, లవలీలతలుప్రాఁకు తేఁకువఁ దిరంబులగుచు మానసనివాసగ
మందిరంబున నెనయు చందనబృందంబుల నానందంబున ననంగి పె
నంగిననాగవధూగణంబు లాభరణంబుగాఁ బూనిన మానితనీలమ
ణులతోడం గలసి యాడందివురు దంతావళతాళదళశ్యామలకోమ
లచ్ఛాయలును బలుచాయలం దనకునపూర్వ ప్రకారంబున శృంగా
రంబు నొసంగ నద్భుత విలాసప్రకాశంబునొందు వేలాప్రదేశంబు
నందు వినోదించుచు నొక్కయెడఁ గరంబు దూరంబున.

సీ కదలంగఁ జాలక కడుఁ గష్టమని వచ్చి
రజతాద్రి యీభంగి వాఁలెనొక్కొ
జడత పాల్పడఁగ మెచ్చుగు జగంబని వచ్చి
హిమవంతు మీభంగి నెసఁగెనొక్కొ

# ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు
పిఠాపురము మహారాజావారు, పరిషద్యాజ్ఞాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిడాంబి రఘునాథాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు,
(కోశాధ్యక్షులు)

,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

,, కోకా శివనాథశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.

,, వెంపటి రామబ్రహ్మముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, ఉందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు రామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ. (ఆనర్సు)

,, వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

## చతుర్థ సంపుటము.

శ్రీ పిఠాపురముమహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 965 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారమువఱకునుగల యచ్చులాదియందుఁ గల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁ గల శబ్దములును, తృతీయసంపుటమున 'ఝ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున "తె" మొదలు "ప్ర" వఱకుఁ గలశబ్దములును గలవు. ఇదివఱ కున్ననిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమ మైనది. ఈపుస్తకమును రచియించుటకు, ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు నను తలంపుతో నీ క్రిందివెలలు నిర్ణయింపబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు. ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు. తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లును.

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works, Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

# శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౬. { **సర్వజిత్తు.** చైత్ర - ఆషాఢములు } సంచిక. ౧. ౨.



కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

1946-47.

# విషయసూచిక.

—:0:—

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౬. { సర్వజిత్తు. చైత్ర - ఆషాఢములు } సంచిక ౧-౨.

# విస్మృతప్రబంధపద్యావళి.

కాకమాని గంగాధరకవి — బాలభారతము.

౧

శా॥ క్రీడాలోలత దంతకోరకశిఖం గీలించి భూచక్రముం
గ్రోడగ్రామణి నించియెత్తి ఫణు లక్షుద్రానుమోదంబునన్
జూడాభోగము లెత్తి చూడఁగ దిశాశుండాలరాణ్మండలిన్
బ్రీడం బొందఁగఁజేయు దంతిముఖు నిర్విఘ్నార్థమై కొల్చెదన్॥

౨

శా॥ శ్రీరామాయణకావ్యకల్పనవిరించి న్వేదఘంటాపథో
ద్గారప్రౌఢమహర్షి సత్తముని మార్తాండున్ దపఃకీర్తి ల
క్ష్మీరమ్యున్ భువనైకవంద్యుఁ డగు వాల్మీకిం గవిగ్రామణిన్
ధారాళస్థిరభక్తియుక్తిఁ దలఁతున్ దత్త్వజ్ఞచూడామణిన్॥

---

పరిషత్పుస్తకభాండాగారమునందలి నెం. 2226 రు గలతాళపత్త్రగ్రంథమునుండి సేకరించి విస్మృతప్రబంధ పద్యావళి నిటు ముద్రించుచున్నారము.

ఆం. ప. ప. సంపాదకుఁడు.

శా॥ సంసారార్ణవపారగుం బరమహంసవ్రాతచూడాపదో
త్తంసంబున్ శ్రుతిసంకరోద్ధళన పాథఃక్షీరభేదక్రియా
హంసంబున్ జగదేకవంద్యు జలదశ్యాము న్మహాపాతక
ధ్వంసాభారతు భారతామృతనిధిన్ వ్యాసుం బ్రశంసించెదన్॥

౪

సీ॥ కైవారమొనరింతు గంభీరసాహిత్య
ఘంటాపథోద్భాసుఁ గాళిదాసు
వర్ణింతు నుజ్జ్వలవాణీసుధాపూర
పాథోధిపరిబాణు భట్టబాణుఁ
బ్రణుతింతు నుద్దండభాషాసమాక్షిప్త
హారబాహు కేయూరుఁ డగుమయూరు
సన్నుతి గావింతుఁ జాటుధారాప్రౌఢిఁ
గోమలతాయత్తు సోమదత్తు
గీ॥ భక్తి నంజలి రచియింతుఁ బ్రవరసేన
భాస శివభద్ర భవభూతి భట్టహర్ష
భారవి మురారి హేరంబచోరులకును
మఱియుఁ దక్కిన సుకవుల మదిఁ దలంతు.

౫

క॥ శబ్దార్థ రసవిశారదు
శాబ్దికమూర్ధన్యు శబ్దశాసనబిరుదున్,
శబ్దాయమానవిస్ఫుర
శబ్దఘటారభటి నన్నపార్యుఁ దలంతున్॥

ఉ॥ ఆంధ్రకవిత్వతత్త్వ సముదంచితకీర్తినిఁ దిక్కయజ్వ నీ
రంధ్రతరప్రభావనిధిఁ బ్రస్తుతిసేయుఁడు... నుల్లస
త్కంధ్రగభీరమంజుతర గర్జిత విభ్రమభవ్యభంగి సై
రంధ్రికమైన చాటుమధురస్ఫుట (మంజుల) వాగ్విజృంభికన్

క॥ ఇంద్రప్రస్థం బనుపురి
సాంద్రమహేంద్రాశ్మకాంతిసంతతులను ని
స్తంద్రంబై విలసిల్లెను
జంద్రాతప ధవళచంద్రశాలా యుతమై.

౮

శా॥ ధారాపాతవిభాతి శీతకరకాంతస్ఫారగేహంబు లీ
యూరం జంద్రికమీఁదఁ బర్వ నురుచున్ వ్యాఘాంబుధారాళతం
జేరుం జాతకపంక్తి చిత్రములు రంజిల్లన్ మయూరంబులున్
సారస్యంబుల లాస్యముల్ మెఱయు నుత్సాహంబు భూపాలకా॥

౯

గీ॥ ఇంద్రమణిజాలములయందుఁ జంద్రముఖుల
వాలుఁగన్నులు యమునయావర్తనముల
మెలఁగియాడెడి వాలికమీలనంగ
న (లువు) గనుపట్టు నీపట్టణంబునందు॥

౧౦

శా॥ చంచత్కేలి సరస్తటీమరకతచ్ఛాయా కదంబంబు గ్రొ
మ్మించుల్సోఁకినఁ దమ్మిలిమ్మలను గిమ్మీరంబులై యుంట సం
ధించు న్వాసనఁ జంచరీకములు మందీభూతసందేహతన్
సంచారించుచు నల్లగల్వవిరులన్ ఝంకారశంకారులై॥

౧౧

సీ॥ పురుహూత విస్ఫూర్తి భూమండలంబెల్ల
భుజవిటంకంబునఁ బూనినాఁడు
గీర్వాణుర్వాఁరఁ గోళిదానవుఁగొట్టి
విజయలక్ష్మియుక్తి వెలసినాఁడు
లచ్చినెచ్చెలికానిలలితోరుపీఠకఁ
బొడమిన పూఁబోఁడిఁ బొందినాఁడు
నవయుగద్వీప భూనాథచూడారత్న
మిత్త్ర శాసనలీల మెఱసినాఁడు

గీ॥ విమలకీర్తి మందాకినీ వీచినికర
పూరపాతాళ మర్త్యవిబుధనివాసుఁ
డై కరంబొప్పు సోమాన్వయప్రభుండు
చారుకీర్తి పురూరవశ్చక్రవర్తి॥

౧౨

శా॥ మత్తారాతి మహాంధకారపటలీ మార్తాండుఁ డుద్ధాటికా
దత్తోద్వృత్తతురగావళీఖురపుటోత్పన్నక్షమాధూళికా
మత్తాంభోధి యయాతిఁ జెప్పఁదగు నుద్యద్వజ్రధారాప్రభా
జిత్తేజున్ శితకీర్తి కైతకదళశ్రీనూతనాంభోదమున్॥

౧౩

గీ॥ అట యుధిష్ఠిరుఁ డప్పంకజాక్షి ధౌమ్య
దత్త (నవ) వహ్నిధూమకందళిత శిఖలు
మగువఁ గూడిన రాయంచ మధుపశబల
నలినములఁ బోలెను బ్రదక్షిణంబుసేసె॥

౧౪

శా॥ ఆలజ్జావతి ధౌమ్యపంపున శిఖివ్యాలోలకీలాలిపై
నోలి న్వ్రేల్చిన లాజరాజి పవనప్రోద్భూతవారాసి వీ
చీలోలోద్ధతివిద్రుమాటవి నధిక్షేపించు కట్టాణిము
త్యాలోనాఁ గనుపట్టె నట్టియెడ నందద్రాజహంసంబునాన్॥

౧౫

గీ॥ వరుఁడు కెంగేల నకలన్యచరణపుటము
సన్నెకంటిపై నిడ నొప్పె శత్రుయువతి
చూడ మాణిక్యములమీఁదఁ గూడఁజేయు
లీలఁ బ్రకటింపఁ బూనిన కేళి మెఱయ.

# ప్రశంసాపద్యములు.

(గతసంచికతరువాయి)

## ఆమోదప్రవేశిక.

శ్రీరమణీకటాక్షములఁ జెన్నలరారిన దివ్యసత్సుధా
ధారల నానినట్టి సుకృతంబు ఫలింపఁగ నాంధ్రపండితా
ధారము వాఙ్మయేందిర పదప్రపవార్చనచే మహోజ్జ్వలో
దారత మీఱె రీప్రభలసంపతు లీభవనప్రతిష్ఠతిన్.

౨

ఎందఱు లేరు ధారుణి నహీనధనాధిపులైనవారు, లే
కొందఱు గాని సత్కృతులకున్ ధనమున్ వ్యయము బొనర్పఁ; రా
కొందఱిలోనఁ గొందఱగు కోవిదులే నిరవద్యభారతీ
సుందరపాదపూజలను శోభఁ దనర్చుట సత్య మద్దిరా!

3

భాషాసరస్వతీప్రాణప్రదములైన
తాళపత్త్రగ్రంథతతికి నెల
విజ్ఞానసుగుణవివేకదాయకమైన
గ్రంథాలయమున కఖండగుప్తి
సరససుజ్ఞానవిషయకమహాసభా
సంధానమునకు విశాలవేది
సత్కావ్యభాషావిచారసమర్థమై
సట్టిపత్త్రికకుఁ గార్యాలయంబు
నై నభవనంబునకు వ్యయమైన ద్రవ్య
మొసఁగి యఖిలాంధ్రపండిత ప్రసరమునకు
పరమ ముద మొడఁగూర్చిన ప్రభల సుంద
రాఖ్యసతి నిత్యసంస్తుత్య యగును గాదె.

౪

ప్రభలవేంకటసుబ్బమాంబా! మహోజ్జ్వ
లంబయిన యాంధ్రసాహిత్యలక్ష్మి కొఱకు
విమలసౌధంబు నొసఁగితి, విస్మరింప
లేము నీయుపకారము మామనముల.

౫

పరమంబైన ప్రశాంతిసౌఖ్యములు సంప్రాప్తించు; నీభర్త సుం
దరరామాఖ్యునకుం గఁటంబు పరిషత్ప్రాణప్రదుండైన సో
దరుఁ డైనట్టి జయంతిరామయకు; నీదాతృత్వగాథావళుల్
తిరమై నిల్చిన దాంధ్రధారుణి నతంద్రీభూతసత్కీర్తితోన్.

కాకినాడ, 9–౬–46. ఇట్లు, పాలెపు వేంకటరత్నము.

# ప్రశంసాపద్యములు.

దుప్పూరి సూర్యనారాయణశాస్త్రి.

చ. వనితలకెల్ల వన్నెయును వాసియుఁ గూర్చితివమ్మ ధర్మపుం
బనుల నొనర్చి, నీధనము భారతికిం గృహ మాచు నిల్చె, నీ
వనితరసాధ్యసత్ఫలము నంది తరించితి, దీనఁ గీర్తియున్
వినఁబడు నెల్లకాలమును, వెంకటసుబ్బమ! ధన్యురాలవే? ౧

క. నీవలె సద్ధర్మంబులు
గావించెడి వనిత నేఁటికాలమునందున్
భావింపఁ గోటికొక్కతె
యీవసుధం గలుగఁ గళల కెంతగు నొక్కో? ౨

ఉ. సుందరరామయార్యుని విశుద్ధచరిత్రుని ధర్మపత్నివై
నందులకున్, జయంతికులుఁడౌ నలరామయగారి చెల్లెవై

నందులకున్, సమర్థమగు నట్టిపనిం బచరించితమ్మ, నిన్
బొందక భర్తృసోదరులపుణ్యగుణంబులు పొల్లువోవునే ? ౪

గీ. ఆంధ్రసాహిత్యపరిషత్తు నన్నగారు
అగ్రయింటను నిల్పినా రనుచు నెంచి
యన్న చేసినపనికిని వన్నె వెట్ట
సొంతభవనము గూర్చితే సుబ్బమాంబ ౪

ఉ. వాసిగఁ బూర్వపుణ్యవిభవవ్యయలబ్ధధనంబు వన్నెయున్
వాసియుఁ గల్గ సద్వ్యయ మొనర్చితి, తావకభూతపూర్వసం
వాసితవాసనాబలము పావనమైనది, కాక దక్కునే
యీసరి సుప్రతిష్ఠ యిల నెవ్వరికేనియు నెంతగల్గియున్. ౫

ఉ. దాతలచేతఁ బండితవిధాతలచేత, లసత్కిరీటమాం
ధాతలచేత నిల్పఁబడి నాఁటికి నేఁటికి నిల్వ నీడ లే
కే తపియించుసాహితికి నీవు ఘటించిన దివ్యసౌధ మ
త్యాతతకీర్తిఁ గూర్చి మన యాంధ్రపురంధ్రులకీర్తి చాటెడిన్. ౬

ఉ. వేలకువేలొసంగితివి వేంకటనాథుని కాంధ్రవిశ్వవి
ద్యాలయసంస్థకన్న, బరమార్థము దాన వచింపరాని, దీ
యాలయదాన మీపరిషదర్థము నీవొనరించు టిప్డు నేఁ
జాలను నాదువాక్కులును జాలవు చెప్ప నదెంతకృత్యమో ౭

గీ. తమ్ములపుటరుణిమ దోఁప, దనదు మీస
ముఁ దెమల్చుచు రామయ్య ముద్దులొలుక
నవ్వుచున్నాఁడు లే; నీవొనర్చినట్టి
ధర్మకార్యము దలఁచి చిత్తమ్ములోన. ౮

సీ. నన్నపార్యుని పల్కునాడెంపు నిగ్గుతో
జనన మందిన యట్టి తెనుఁగుతల్లి
తిక్కనార్యుని పల్కుతీరుతో గడికట్టి
మనుగ డందిన యట్టి తెనుఁగుతల్లి

ఎఱ్ఱనార్యుని వాక్ప్రసన్నతతోఁ బెఱుకువ
తనము నందినయట్టి తెనుఁగుతల్లి
కవిరాజవాక్చమత్కారంపుఁ బసలతోఁ
గునిసి యాడినయట్టి తెనుఁగుతల్లి
గీ. పోతనమహాకవియుని భక్తిబోధనములఁ
దేనెపలుకులు నేర్చిన తెనుఁగుతల్లి
ఆంధ్రపరిషదాకారము నంది నేఁడు
గేస్తురాలయ్యె ననుచు నగ్గింతు మదిని. ౯

## ప్రశంసాపద్యములు.

శ్రీమత్తిరుమల పెద్దింటి రాఘవాచార్యులు.

సీ. ప్రాజ్ఞుఁడగు జయంతి రామయ్యపరమేష్ఠి
సంకల్పసిద్ధిగా జననమంది
శ్రీసూర్యరాయేంద్రచిత్తడోలికయందుఁ
బొత్తుల పాపవై హత్తియుండి
వీరేశలింగాదివిద్వద్వరేణ్య వా
క్కుల నుగ్గుగాఁ గ్రోలి చెలువమంది
పోషకస్థాపక ప్రోద్ధారకార్థపు
స్తన్యమున్ గ్రోలుచు ధన్యతగని
గీ. కిలకిలమనుచు నవ్వుచుఁ గేకరింత
వెట్టు చాట పాటల నేర్చి వివిధమండ
లముల వార్షికవిహరణన్ రక్తినొందు
నాంధ్రసాహిత్య జనని! దాసోఽహ మమ్మ! 1
గీ. సారసారస్వతవిమర్శసారమణులఁ
బూర్వకవిసూక్తిముక్తంపుఁబుంజములును

సాధు శసువర్ణ రచనావ్యాఘ్రనఖలుఁ
బడయు నీమెడఁ బులిగోటి పతకమహిమ. 2

గీ. రామయకు మానసికపుత్రి రామసోద
రీలసద్భహాపుత్రి కెంగేలు వట్టె
సూర్యరా ట్ట్రీకృతిని జూచి చొక్కుచుండె
దేహసంబంధ మెవరికి దీప్తికాదు ? 3

గీ. చెన్నపురి మనయాంధ్రుల కన్నబిడ్డ
కేంద్రమిాస్థలి మార్చుక క్రీడసేయఁ
బలుకరేమి యాంధ్రులు మంటిపాము లగుచు
భాష రాష్ట్రవిభజనకు హేష గాదె ? 4

గీ. అమ్మ ! నీ నిబంధనములు వ్యాప్తిచేసి
చాలవఱకును సంపూర్తి సల్పి, తండ్రు
సూర్యరాయనిఘంటువు శోభ దాల్చు
నీదుమంగళసూత్రతన్ నిజమునిజము. 5

శా. సాహిత్యాంబుధి నోలలాడు బలి యీసద్విక్రమాదిత్యుఁ డే
రహిత్యంబును లేకయుండి రసముల్ రాజిల్లు నాంధ్రంబునన్
దాహాయింగననోపుకావ్యతను సంస్థాపించి లోకంబుకున్
సాహాయ్యంబును జేసి కీర్తిసరసీసారంబునన్ వెల్గెడిన్.

గీ. తరుణసాహిత్య వృద్ధశంతనుకుమార
పరశురాములఁ బోలెడి పండితులకు
బుద్ధలను జూప భాషేద్ధ యుద్ధరంగ
మునఁ బమచుచుఁదన మొందుదు ముద్దుగాను. 7

సీ. విషమించి మెఱయుత విక్రమదేవవా
గసిధార మనశత్రుహంత్రి యగుచు
తనరుచుండుత భువి దాఁగుడుమూఁతగా
సూర్యభూపాలు

తనపట్టుఁ గుండేటికిని గాళ్లు మూఁడను
మూర్ఖులమనములు మఱుఁగుఁగాత
కాశీభట్టాదివిఖ్యాతపండితసేవఁ
గనుఁ గాత వన్నెలఁ దెనుఁగుతల్లి
గీ. ప్రభల సుందరరామ ధర్మసతి సార్థ
కపు విరాళంపు సద్రూప గ్రంథగృహ మి
ది కడు వెలయుతఁ గీర్తిచంద్రికల దినది
నప్రవృద్ధశుద్ధశశినై, నయముమీఱ. ౮

---

శ్రీ

జంధ్యాల పాపయ్యశాస్త్రి.

శ్రీకరా స్సంతు సర్వేషాం సుధాకర సుధాకరాః
మహానట జటాజూట రంగ ద్గంగాంబుశీకరాః ॥

౨

మందిరం సుందరం భూయా దాంధ్రసాహిత్యసంసదః
గుంజితైః కంజభూ సుభ్రూమంజు మంజీర శింజితైః ॥

౩

జయం త్యహో అహోరాత్రం 'జయంతి' భగినీ శ్రియః
వేణీషు కవిదారాణాం వాణీషుచ విపశ్చితామ్ ॥

---

# ప్రభల వేంకట సుబ్బమ్మగారి ప్రతివచనము.

చ. అలఘుచరిత్రులార, సముదంచితకీర్తిధురీణులార, వి
ద్దెలఁ బఠియించి మించినసుధీమణులార, హసింపఁబోక, నే
నెలమి వచించుపద్యములనెల్ల వినన్ మిము వేడికొందు, న
ర్మిలి పఠియింపఁగా, సుతులు లే రితరుల్ మతిలేకపోవుటన్.

ఉ. శ్రీలకుఁ దానకంబయిన చేడియతో మును లెల్ల గొల్వఁగా
నోలి జయావహంబగుచు నొప్పు మహానగరాధివాసుఁ డై
క్రాలు ముకుందుఁ డెల్లపుడు క్రమగణాంచితశ్రీయుతాత్మునిన్
పాలితపండితౌఘుని నృపాలకవిక్రమదేవు బ్రోచ తన్.

చ. విమలగుణోదయంబునను విద్యల నామమునన్ నృపాలతన్
అమలమతిన్ బుధాళిఁ గనునట్టి మహావిభవంబునందు వి
క్రముఁడగు భోజభూపతివిలాసము దోఁపఁగఁ జేయు నీయశం
బమర దిగంతమూచుఁ జెలువారెడు విక్రమదేవభూపతీ !

చ. కవిజనమాననీయమగు గౌరవ మొప్పఁగ భూపకోటిలో
నవిరళదానపాండితి నహర్నిశముం జెలువొంది విక్రమా
ఖ్యవెలయు నిన్ సదాజయపురాఖ్యసతీతిలకంబు భర్తగాఁ
దవిలి వరించి కీర్తిగనె తథ్యము విక్రమదేవభూపతీ !

గీ. దానధారాయుతం బయ్యు ధరణిలోన
కవికులాశ్రయహర మగుఁ గరికరంబు
దానధారాయుతంబయ్యు ధరణిలోన
కవికులాశ్రయ కరము నీకరము కరము.

సీ. కవితాప్రశస్తి నన్నయ తిక్కనాదులఁ
దలపించి వెలయు నుత్తముఁడ వీవ
విద్యానిధానత విక్రమభోజుల
దేవరాయల కీర్తిఁ దేలు దీవ

దానప్రశస్తి మాంధాత్రాది నృపతుల
గౌరవప్రఖ్యాతి గాంచి తీవ
ఆశ్రితత్రాణపరాయణాత్మత నెల్ల
వేళల హారికీర్తి వెలయు దీవ

గీ. అట్టి నీదుయశశ్చంద్రి కాఘుమెఫుడు
దిక్కులలముచు నెంతయుఁ దేజరిల్లఁ
బుడమి వర్థిల్ల నాశీస్సు నిడెదఁ గొనుము
రాజదేవేంద్ర విక్రమరాజచంద్ర !

---

# కృతజ్ఞత.

ఉ. అండగ నెందఱో కువలయాధిపు లాశ్రితకల్పభూజు, లా
ఖండలతుల్యధాము లధికంబగు రొక్కము లిచ్చి యాంధ్ర భూ
మండలి నీదుపూజలు సమంచితరీతి నొనర్ప, పుణ్యముల్
పండుటగాదె నాకుఁ దగువాసము నీకిటు గూర్ప భారతీ !

ఉ. ఎందఱు లేరు నీవడుగ నిచ్చెడిదాతలు, నాఁడుదాన నా
కెంతును శక్తిలేదు భవదీప్సితసిద్ధి నొనర్ప నైన నీ
సుందరరామసౌధమున శాంతముగా వసియింప మెచ్చికోల్
చెందితివమ్మ నాయలుచు సేవకు వందన మమ్మ భారతీ!

ఉ. చేసినసేవ చూడఁ గసుఁ జన్నది; వందనముల్ బుధాళికిన్
దోసము లెన్నియేని మదిఁ దోఁచుచునుండును వాని నన్నిటన్
వీసము లెక్కసేయకుఁడు; వేడుక వాణిపదాబ్జసీమ నేఁ
జేసినపూజల న్విమలచిత్తముతోడ ననుగ్రహింపుఁడీ.

ఇట్లు.
ప్రభల వేంకటసుబ్బమ్మ.

# సారస్వతదర్శనము.

## (కావ్యావేక్షణము.)

విద్వాన్, పాలెపు వేంకటరత్నము.

విశాలపరిషదగారమునఁ గూర్చుండిన నాకడకు వచ్చి నా మిత్త్రుఁడు ప్రశ్నించినాఁడు ప్రదర్శనశాలలు తిలకించితివా యని. ప్రద ర్శనశాల లంటేని. "ఓయి వెఱ్ఱివాఁడా! నీ కింకను దెలియనేలేదా? భవనము నలువైపులను బ్రదర్శనశాలలు నిర్మించినారు, పోయి చూడుము, నీజన్మ తరించును, నీకుఁ బ్రవేశము సులభముగనే లభించునులే. ఓ, ఎంతమందికవులు, ఎన్నిపాత్రలు!! ఏమి హావభావవిలాసములు!!! త్వరగఁ బోవయ్యా! నే నిపుడే చూచి వచ్చితి' ననినాఁడు కవులు, పాత్రలు అనినతోడనే నా కుత్కంఠ మిక్కుటమై పడుచు లేచుచుఁ బరుగిడితిని. ప్రదర్శనశాలల ప్రారంభములోనే తల్లిరూపము నా కగ పడినది. వెంటనే చేతులు జోడించి,

ఉ. అంబ! నవాంబుజోజ్జ్వలకరాంబుజ! శారదచంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి! ప్రకటస్ఫుట భూషణరత్నరోచి రా
చుంబితదిగ్విభాగ! శ్రుతిసూక్త పవిత్ర నిజప్రభావ! భా
వాంబరవీథి విశ్రుతవిహార! ననుం గృప జూడు భారతీ!

అని పఠించి బయలుదేఱితిని. "తెలుఁగుపోల" మను శీర్షిక న న్నాకర్షించినది. అది యొక విశాల మగుకుటీరప్రాంగణము. బహి ర్వేదికపై నొక మహాపురుషుఁడు హోమమునకై తయారుచేసిన గోమ యపిండముల నెండవైచి స్రుక్స్రువములు తయారుచేయుచు, దర్భల సవరించుకొనుచు నా కగపడినాఁడు. నే నేగి నమస్కరించి ప్రవేశాను మతి నర్థించితిని. నీకు స్మార్తము వచ్చునా? నీవు జపహోమతత్పరుఁ డవేనా! ఆంధ్రకవిత్వాదరభావుఁడవైననే నీకిందుఁ బ్రవేశము కలు

గును. ప్రదర్శనదర్శనకుతూహలినై స్వామీ! తమ చివరప్రశ్నకు మాత్రమే నేనర్హుఁడను. అని యనుమతి నంది లోని కేఁగితిని. మొదటి గదిలో నొకమహాస్త్రి సంధ్యకృత్యములఁ దీర్చుకొనుచుండఁగా నొక బ్రాహ్మణబలిక యౌవనసౌందర్యోద్భాసిత దీనవదనముతో "వాఁడి మయూఖముల్ కలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె, ధేనువుల్, నేఁడిలు సేరె నేకతము, నిష్ఠమెయి న్భవదగ్నిహోత్రముల్ పోఁడిమి వ్రేల్వఁగాఁ బడియెఁ, బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్, రాఁడు వనంబులోన మృగరాక్షస పన్నగబాధ నందెనో?" యని యడుగుచున్నది.

రెండవగదిలోని కేఁగఁగనే రాజసూయాధ్వరము జరుగుచున్నది. అందు విశేషధర్మవిధిజ్ఞుఁడు ధర్మజుఁడు యజ్ఞదీక్షితుఁడై "బ్రహ్మతేజమ్మును రాజతేజమును, సద్బహుభూషణాత్మరాజితేజమ్మును విస్తరించుచు......" మూర్తమైన ధర్మమును బోలె సహోదరపరివృతుఁడై శ్రోత్రియపుసోమిదమ్మ యాజ్ఞసేని తనచెంత నుండఁ గూర్చున్నాఁడు. కాంచి, పులకాంచితదేహుఁడ నైతిని. ప్రక్కనున్నవారెవరో కాలమంతయు నిచటనేనా, యింకొకసాలకుఁ బోవలదా? యనుచుండిరి. తత్క్షణమే కుటీరము వెలువడి రెండవసాల దరిసితిని.

అది యొక విశాలగృహాంగణము. అచట వైదికలౌకికములు రెండును సమ్మేళన మొందిన ట్లున్నవి. గుమ్మముకడ నొక తేజోమూర్తి యొకకలాలలేఖకునకుఁ బద్యములు చెప్పుచు నావైపు చుఱచుఱ చూచి 'ఏమిట్లు వచ్చితి'వని ప్రశ్నించినాఁడు. మహోజ్జ్వలుఁడైన యజ్వ, సుతీక్ష్ణ ప్రతిభావంతములైన నేత్రములు. ప్రదర్శనము చూడ ననుమతి వేఁడితిని. నీకు శివకేశవుల భేదము లేదు కదా? హరిహరనాథ భక్తుఁడవేనా నీవు? తెలుఁగుపలుకుబడుల నలవరించుకొన్నావా? నీకు రాజకీయపరిజ్ఞానము కలదా? ఏదీ? "తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం జేరు వంచించి......' అన్వయింపుము, అని నాఁడు. ఎట్లో కించిత్ప్రతిభచే నాతని నొప్పించి భవనప్రవేశ మొనర్చి

తిని. అందొకచో నొకానొక యోధుఁడు రథముపై నొక బాలసారథి తో "బలరిపుఁ డిచ్చినకుండలములు, నక్షీపమును గలిగి, తీఁగఁ దిగిచి నగతి తంతేసు మెఱయ ప్రలయభైరవ సహస్రగర్జనోదగ్రతర్జనుఁడై నవాభ్యుదయంబు నంది, రాత్రి వుచ్చి తోతెంచు మార్తాండుపోల్కి తన పగవాఁడైన చక్రవర్తియెదుట నిల్చి "క్షత్త్రియుఁ డోడునే తగ దు కౌరవరాజ! యొకండనేఁ బృథా, పుత్రులలోనఁ జిన్న ..." నను చున్నాఁడు.

రెండవగదిలోఁ బరమాత్మునిఁ డగునందనందనుని కట్టెదుటఁ బాంచాలనందన క్రోధారుణితాక్షియై విశీర్ణకేశపాశము డాకేలఁ బూని "ఇవి దుస్ససేను వ్రేళ్లం దవిలి, సగము సగము ద్రెవ్వి తక్కినయవి కౌరవులయెడ సంధిమాటలయవసరమునఁ దలఁపవలయు నచ్యుత! వీనిన్." ఇంకను రెండు మూఁడు గదులుండఁగనే శాలాంతరము దరిసి తిని. సన్నని శరీరము ప్రక్క నొక చేపాటికఱ్ఱ, చేతులో నాకులపాత్త ము, గంటము పూని సద్భక్తిపూరితుఁడైన కవి యొకఁడు కూరుచు న్నాఁడు. నుదటిముడుతలలో నున్నభావనకు నమస్కరించితిని. "ప్రదర్శనము చూచుటకు వచ్చితివా నాయనా?" భక్తిభరితస్వాంతుఁడ వైనచో లోనికిఁ బొమ్ము. కాని, యిటురా! నీవు గ్రంథములు వ్రాసితివా? వ్రాసినచో నవి సాధ్యమైనంతవఱకు భగవదంకితములే గావింపుము. సరే లోనికిఁ బొమ్మనినాఁడు.

వరుసగా నమర్పఁబడిన యాసనములపై మహాభక్తులు ధ్రువుఁ డు- కుచేలుఁడు- అంబరీషుఁడు- గజేంద్రుఁడు- ప్రహ్లాదుఁడు మొదలగు వారు నిష్ఠాగరిష్ఠులై కనుపించినారు. నమస్కరించి కక్ష్యాంతరములు దాఁటితిని. నేపథ్యమున మురళీధ్వని వినిపించినది. సుమారు పదిమంది వ్రజయువతు లుత్కంఠతో నెవ్వానినో యన్వేషించుచున్నారు. వారిలో నొకవనిత "నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు, కృపా రసంబుపైఁ జల్లెడివాఁడు, మౌళిపరిసర్పిత పింఛమువాఁడు, నవ్వురా

జిల్లెడు మోమువాడు.........ఓమల్లియలార ! మీపొదలమాటున లేడుగదమ్మ ? తెల్పరే ?" అని ప్రార్థించుచున్నది కనుమూసి తెఱచితిని. అది యమునాతీరము. శరద్రాకానిశ. స్వచ్ఛకౌముదిలో పెంకెంద్రాభీరయువతులమధ్య నందకిశోర మందజి కన్నిరూపులై వంశీగానముతో రాసక్రీడలు సల్పుచున్నాఁడు. జన్మ తరించినది. వీథి తిరిగి మఱొకమందిరమున కేఁగితిని. పరమవిలాసవేషముతో స్వచ్ఛమాల్యాంబరధారియై చందనచర్చాంకితదేహుఁడు, రత్నాభరణభూషితుఁడు, దర్భ వెట్టెడు వ్రేల లీల మాణిక్యాంగుళీయకము ధరించి కర్పూరతాంబూలచర్వణము చేయుచుఁ గూర్చున్నాఁడు. నే నేఁగి నమస్కరించితిని. వచ్చితివా, రా, ప్రదర్శనమునకేమి లే, కూర్చో, తాంబూలము వేసికొనుము. తృప్తిగా భోజనము చేసి తాంబూలచర్వణమైన తర్వాతనే యేపనియైనను, భోజన మైనదా యన్నాఁడు. నమస్తే కవిసార్వభౌమా ! నీప్రసాదమువలననే సారస్వతభోక్తలు ప్రతిక్షణమును "గోక్షీరంబులతోడ మండెగలతోఁ గ్రొన్నేతితో పప్పుతో, నక్షయ్యంబగు నేరుఁబ్రాలకలమాహారంబుతో... కుక్షుల్ నిండఁగ నారగించుచునే యున్నారు. అని ప్రక్కఁ గూర్చుండి తాంబూలపుఁ బుటికకై కైసాచి ప్రశ్నించితిని. స్వామీ ! తమలపాకులు ఓరుఁగల్లు సంతలోఁ గొన్నవేనా ? అవి. ఔను, యా తమలపాకుమీఁగాఁరిసోయగము తిలకించితివో లేదోగాని, నే వలచుటకేమి "శంకరునియంత మహాత్ముఁడు లింగరూపియై గొనకొని......" అవును. కవిరాజా ! తమ విలాససంభాషణ నన్ను తుష్టుని గావించినది. తమ పలుకులలో హారచూడాహారిణాంకవక్రతయు, కాలాంతస్ఫురచ్ఛుండికాపరుషోద్గాఢపయోధరస్ఫుటతటీపర్యంతకాఠిన్యము ఉన్నదని నాకుఁ దలియును. తమ 'విశ్వలోక కుటుంబి భీమేశ్వరుని' దర్శింపనిచ్చెదరా ? యనెను. సరే పొమ్మా. అని కవిరాజు నాకాజ్ఞ యిచ్చినాఁడు. లోనికిఁ బోఁగానే, ' అంతఃపురాంగనలక్ష గన్నుమొఱంగి...గన్నెరు కాఁదారి

ప్రాంగణ సానివాడ కరుగు విశ్వలోక కుటుంబి శిష్యపరివృతుండై కుక్షి ప్రోద్భవనిష్ఠురక్షుధితదుష్ప్రేక్షాంధకారంబునన్ చక్షుల్ రెండునుజిమ్మ చీకటులుగా, భిక్షాపాత్రము పగులంగొట్టి శాపజల మెత్తి వారణాసిపై "మాభూత్త్రైపూరుషీ విద్యా" అని తిట్టఁబోవు పారాశర్యుండు పచ్చని వృక్షవాటికల పండులభిక్ష భుజించి కూర్మిమెం పచ్చుపడఁగ నేర్చు కొనెడి కోయల బ్రహ్మచారికి చదువు చెప్పు స్వరమునకలవైదగ్ధి, మం చుం గొండయనుంగు పెండ్లికొడుకుకు మధ్యాహ్నకాలంబున నర్చిం చు మహాతపస్వి పాండవమధ్యముండు నొకరొకరే యుదాత్తస్వభావ ములతో నాకను విందు చేసినారు. తృప్తినంది ప్రక్కభవనమున కేఁగి తిని—

ఆ యరఁగుపై నిరువురు పురుషులు నాకగుపించినారు. వారు పరస్పర సంభాషణానిమగ్నులై యుండుటచే శ్రవణకుతూహలినై నిలు చుంటిని. వారిలో నొకరు ఎనరిప్రతిభ నారిది, నే నుత్తరభాగమును మాత్రమే యాంగ్లీకరించితిని. నన్నదియే మిక్కిలి యాకర్షించినది. తమవలె నేను పూర్వోత్తరభాగములు రెండును దెనిఁగించితినా ? ఎట్లయినను తమరు ప్రబంధపరమేశ్వరులు! అనుచుండిరి. ఎంతమాట సెలవిచ్చితిరి. దానికేమిలెండు. తమరు పెద్దలు. ప్రావోపణాచాతురి తమ సొమ్మని ప్రదర్శనము చూచినవారంతయు ననుకొనుచున్నారు తమ భావన "తోలుకాగు మెఱుఁగులతోటలో విహరించు రాయంచ కొదమతో రాయఁజాలి" యన్నదని విజ్ఞజనాభిప్రాయము. అని ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు. దగ్గర కేఁగి నమస్కరించితిని. ఇరు వురు నైక్యకంఠముతో లోనికిఁ బోవచ్చునన్నారు. లోనికేఁగినంతనే యింద్రుని జయించి నాక మాక్రమించి సుధర్మాసనముపైఁ గూరు చుండిన నరకుండు, చిత్రరూపోకరూపో యనంగ చేగవ కంబము చెంత డాసి గండారపు బొమ్మవోలెనున్న యూర్వసి నాకగుపించినారు నర కుండు దివ్యకాంతాకరతాలవృంతసముదాయసమీరముసోక రాజ్య

ముం గైకొని దిగ్విజయగౌరవధన్యుఁడనై నప్పటికిని నాసభలో నీకను
దోయి వెన్నెలలు నిండక కోర్కెలు నాకు నిండునే? యనుచున్నాఁ
డు. తన్నాయికాసఖ యగునూర్వ్యాశి పుష్ప్యాలు వేడుకైన గడివోయి. నవే
ముడువంగవచ్చునే! సంతనెన్నఁడో జవ్వాన మమ్ముకొన్న గడసానిని,
అని నేర్పుగా తప్పించుకోఁ జూచుచున్నది. సంభాషణ సాహసము కలి
గించుటచే యాగభాగములు గొన నూర్వ్యాశి యాజ్ఞాపించువఱకు
నుంటిని.

రెండవగదిలో మహాయోధుఁడైన యానరకాసురున కెదుట
రథస్థయైన యొక యాఁచినకజ్జ సంపనిపయోరుహాలోచన హా చేతి
శార్ఙకోదండ మంచుకొని శౌర్య ముట్టిపడుచుండఁగా "అరిఁజూచున్
హరిఁజూచుఁ జూచుకములం దండంద మందార కేసర మాలామకరంద
బిందుసలిలస్యందంబు లందంబులై తొరఁగఁగ శరాసారమున్ దర
హాసామృతపూరముం గురియుచున్" గనిపించినది. ఓహోహో! ఆవీర
నారి శరీరమున నరకాసురుం డేయు వేగిరంపు బాణములు ప్రాణములు
క్రేగంటి చూపున సిరిగొన్న సన్నగేదంగి రేకుల కన్నదమ్ములగుచు,
జడగొప్పులోను నచ్చపుసజ్జకములైన విరదులకు వింతవిదులగుచు,
బిగువుఁ జన్నులమీఁద పెనుపటంబైన చెంగులో క్రొవిరులు సంగడము
లగుచు, కేలికి హారివైనఁ గేలఁదాలిచిన సంపఁగి బంతికొనల జోపాప
లగుచు, కుసుమశృంగారముల కెల్ల క్రొత్తసేయుచు నెనిమిది తెఱఁగులై
యినుమడించిన సొబగుతో నొప్పినవి. ఆహాహా! యని తనివంది మలు
పు తిరిగితిని. ఢంకానగారాలు మ్రోగుచున్నవి. గజబృంహితములు
వినవచ్చుచున్నవి. తల పైకెత్తి చూచితినిగదా? విజయనగర నివేశ
మని యున్నది. వాతావరణమంతయు మహాభాగ్యవంతముగ నున్నది.
క్రింద రత్నకంబళములు, పసిఁడి కూఁగుటూయెలలు, చందిరకావివస్త్ర
ములు, మృగమదవీటీస్థగితపరిమళములు, సౌందర్యపూరితులైన దాసి
కలు, మహోజ్జ్వలముగ నున్నది. దరిదాపు ఎనిమిది పది సాల లున్నవి.

తొలుత నేనొక రాజభవనముచెంత కేఁగితిని. ప్రదర్శనాధికారి మహారాజనను గర్వమైనను లేక యెల్లరకును దగ్గరగా నున్నాఁడే ? యని సంశసించితిని. మహారాజా ! నీవేమి వ్రాసితివి. ఆంధ్రభాషలో నీయాముక్తకు సరివచ్చుకయ్య మఱిలేదు. నీదే యారచన. అనుచు భటుఁడు తెర తొలఁగింపఁగా లోనికిఁ బోయితిని. గుమ్మము దాఁటినంతనే పాండ్యనగరోర్వీరత్నసీమంతమైన విలుబుత్తూరు రాజవీథులలో దేవతామిథునరూపములతో నున్నపసిఁడి తేరులు, ఆరెకులుమసృణిత ప్రయాతద్విజానళి పిండీకృతశాటువులను భ్రమలతోఁగదలింపఁగా కేదారంపుకుల్యాంతరములో దిగిపోవు బాతున్రులు- ఆరెకుల తెల్వితక్కువకు నవ్వు శాలిగోపికలు- మొదలైన వెన్నెన్నో దివ్యదృశ్యములు కనిపించినవి. ఇంకను పరిక్రమింపఁగా విష్ణుచిత్తుని యింటిలో నడికిరేయైనను 'నాస్తిశాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూపో నాస్త్యదనసౌష్ఠవం చ కృపయా భోక్తవ్యమ్' అను వాక్యములును యామునాచార్యునితో వాదింపఁబోవ రంగనిచే నాజ్ఞాపింపఁబడిన విష్ణుచిత్తుని "గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా వహనంబో... ...నృహరీ ! వాదములేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్," అను ప్రార్థనము విని సంతసముతో వెలువడి శాలాంతరము డాసితిని. డాకాలనున్న కవిగండపెండేరము గిలుకుగిలుకు మనుచుండఁగా నొక స్థూలకాయుఁడగు కవి క్షౌమవసనధారియై గుమ్మములోఁబచారుచేయుచున్నాఁడు. ఆకాలియందెయులివు "పూఁతమెఱుంగులున్ బసరుపూపబెడంగులు నింపునింపువా, కైతల జగ్గునిగ్గువలె" గమ్మగమ్మనుచు, రాతిరియుం బవల్ మఱపురాని హాయులు తోడిచెలి యారజంపునిద్దాతటి తీపులవలెఁ దారసిలుచు... ...భారతీవధూటీకమనీయ గర్భనికటీభవదానన పర్వసాహితీ... ...ధ్వనుల వెలార్చుచున్నది. నమస్కారము తాతగారూ! ప్రదర్శనము చూడ నిచ్చెదరా ? యంటిని. పో, లోనికి పో. దిక్కులు చూడకు. అచట తొండముల్

సాఁచి యందుగు చిగుళ్లకు నిక్కు కరుల దంతచ్ఛాయ గడలుకొనఁగ ......పుడమి తిలతండుల న్యాయముగ నుండును. కాలుజారి పడిన నీగతి యధోగతియే. మనసు నిగ్రహించుకో. పోఁకనునుబోదియ చెంత నెవరైన మాట్లాడు కొనినట్లుండిన చాటుగా వినుము. జాగ్రత. కాలుజారినచో హిమవత్పర్వతమునుండి పాతాళములోఁ బడెదవు. సరే చూచి రా యని దారి నిచ్చినాఁడు. లోని కేఁగినంతనే యెంత చిత్రమోగాని, భవనమంతయు సంకీర్తితమై 'శశికీల గఱపుచు' సురరాజు జలకేళి సవరించు చంద మెఱిఁగిన చదలేఱు, కలిగి బహురత్నద్యుతిమేదురోదర దరీభాగంబులం బొల్చుమిహికాహార్యము గనిపించినది. నభోవాహి నీలహరీశీతలగంధవాహము నాశరీరమునకు హాయి కలిగించినది. సమీపమున తిరస్కారపరీభూతదైన్య రవ మొంకు స్త్రైణము నాకు వినిపించినది కవి పితామహుఁడు చెప్పిన మేరనుండియే చూచితిని. ఆట నొకానొక మరున్నారీశిరోరత్నము 'మీఁటిన విచ్చు గుబ్బచనుమిట్టల నఖములు చింక వందఁగా' పాటున కింతులోర్తురె కృపారహితాత్మక! నీవు త్రోవ నిచ్చోట భవన్నఖాంకురము సోకె కనుఁగొనుమనుచున్నది. ఎచ్చోట? హా శ్రీహరీ! యని కన్నులు ముకుళించితిని. ఏ హవ్యవాహనుని కృపయో చెప్ప లేనుగాని, కనులు తెఱచుసరి కొకానొక మహాకవి కన్నెదుట నిల్చితిని. ఆకవి భార్యాభర్తలమధ్య తగవులు తీర్చుటలో మిక్కిలి నేర్పరియని తెలిసికొంటిని. విలువగల వస్త్రము ధరించి, జరీపూవుల లక్క రంగుశాలువ వల్లెవాటుతో అరఁగుపై ఠీవిగాఁ గూర్చున్నాఁడు. ఇదివఱకు నేను చూచినవారందఱ కన్నను కొంచెము పొట్టి. కాని, కోనసేటి కోటేరు పెట్టినట్లున్నను ముక్కు నన్ను మిక్కిలి యాకర్షించినది. పోయి నమస్కరించితిని. నన్నుఁ జూచి, యింతమంది వచ్చుచున్నారు, పోవుచున్నారు. ఒక్కరైనను తగవుపెట్టి తమాషా చూపఁగలవా రని నాకు తోఁచదు. **ఆ తగినమనసులు విఱుచును- విఱిగిన మనసులు కలుపుట- ఈవిద్య**

లో నీకుఁ బ్రవీణత యున్నదా? యన్నాఁడు. నేనును హేలాసంభాషణ కుపక్రమించి కవిపారిజాతమునకు నమస్కారము! ఆవిద్యలన్నియు నాకేమి చేతనగును? నేనేమి, అమ్మగారి కరణముకవినా? అయ్య గారి కాలివంకవాఁడనా? ఏదో తమబోంట్ల పాదసేవచేసి హృదయా బ్జమరందాస్వాదన చేయువారి రసపిపాసిని. దయచేసి, లోనికిఁ బోనిం డంటిని. పరవా లేదులే. మాటయూఁతము బాగుగనే యున్నది. పో, పో, లోనికి పో, అని బుజము తట్టినాఁడు. వెంటనే సంతోషముతో మూఁడుబుజములై లోనికిఁ బోయితిని. అబ్బా! ఏమి యింద్రజాలమో నేను జెప్పలేనుగాని, వెనుకటిశాలలోని నగరాజదృశ్యము నాకనుల వ్రేలుచునే యున్నది. అల్లే యిదియొక శృంగారవనదృశ్యము. 'అలి కులరావముల్ కిసలయాంకుల కోకిల కేకి కాకలీ కలమృదునాదముల్' మాఱుమ్రోయుచున్నవి, ప్రక్కనే యొక కొలనిపొంత పూఁదేనియ యేటికాలువయొద్దన నొకరాణి చెలికత్తెతో నుద్విగ్నయై మాటాడు చున్నది. తాను పదునాఱగాల క్షత్త్రియవంశసంజాత ననుగర్వ మామె కున్నట్లు మాటలలో నేనూహింపఁగా స్పష్టముగా నామెయీ మాట పలికినది. ఎఱుంగునే పసులకాపరి భావజమర్మకర్మముల్! ఎంత స్వాభిమానపూరిత వమ్మా! నీసవతులయొద్ద నీపేరైన నెత్తుటకు వీలులేదేమి? కావలె నమ్మా నీవంటివీరాంగనలు భారతదేశమునకు అనుకొనుచు ప్రక్కగదిలోనికిఁ బోయితిని.

అది స్వర్గసీమ. నందనవనపరిసరప్రదేశము. ఇచట నాసాత్రా జితియే భర్తృసహితయై ధీరయై నిలువఁబడి ఎదుట నున్ననందన వనపాలకులతో జడచుట్ట సవరించుకొనుచు సమాధాన మిచ్చుచున్నది. వినుఁడు సురేశ్వరవనపాలకులు! వార్ధిఁ బొడమిన యట్టివృక్షమునకు ఇంద్రాణి యెవ్వతె? యింద్రుఁ డెవ్వాఁడు!......... ఈనగంబు సత్య భామావిధేయుచేత నొడిసించుకొని యేఁగుచున్నదాన. చేవ గలదేని మీశచీదేవిని, ఆమె భర్తచేత నాభర్తను గెలిపించి తీసికొనిపొమ్మని

Legitimate altimatam పంపుచున్నది. కబు రందినది. అటు నాకౌకసులు, ఇటు యాదవసైన్యము పోరున కాయితమగుచున్నది. కల్పవృక్షాసవపానమత్తులగు అమృతాంధో యోధులు యదువీరులు కలిసి రణభేరి ప్రయోగించుచున్నారు. ఢాం, ఢ ఢాం.

ముందునకు దృష్టి సారించితిని. ఇంకను ఎన్నియో శాలలు, దాక్షిణాత్యనివేశనము, గోదావరీనివేశనము, అర్వాచీననివేశనము, అని యెన్నియో శీర్షిక లగపడుచున్నవి. కనులు దెఱచితిని. క్రింద పరుచుకొన్న పరుపుచుట్టలు ప్రక్కమండముపై దభాలున వైచి నా యర్థాంగి నన్నుఁ జూచి నవ్వినది. ఓహో యొత్తముపై రాత్రినుండి యిప్పటివఱకును మూగురు సత్యభామలను దర్శించితినే యని ప్రత్యక్ష సత్యభామకు బదులు నవ్వి లోనికిఁ బోయితిని.

# కళోపాసన.

మహాకవి కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు.

సీ. మానవజన్మ సమ్మాననీయ జ్ఞాన
సుస్థాయి స్వస్థమై సొంపునింప
మానవసౌందర్య ధీనిదానంబుగా
ననురాగ మచ్ఛమై గొనబుదనియ
మానవపురుషార్థ మహిమాన్వితంబుగా
సుకృతులఁ గావించు సొబగు లుబుక
మానవదేవతాస్థానైక్యయోగమై
సత్యాశ్రయాసక్తి జానుమీఱఁ

దానమానాదిగా రంజితం బొనర్చి
దివ్యతంత్రుల మీటుచుఁ దేటలొలుక
వీణవాయించుచున్న యా వాణి మమ్మ
మానవోద్యమములఁ గాచి మనుచుఁగాత.

సీ. భారతీదేవికి హారతినిడుపోల్కి
　　వింధ్యాద్రిపై జెండ వెలయుచుండ
గంగాజలంబులఁ గావేరినీటను
　　జలకేళి పొలుపులు సాఁగుచుండ
ఇరుదెస సామంతవరులునాఁగ సముద్ర
　　భూభృద్ద్వయంబుచేఁ బొదలుచుండ
లలితకళామహోల్లాసహాసములొప్ప
　　నల యజంతవిహార మలరుచుండ

భారతీరూప మొకపరిఁ బ్రబలుచుండ
దివ్యవాక్కులఁ దనప్రభ తెలుపుచుండ
సింహపురి సింహపీఠిగాఁ జెలఁగుచుండ
నింతలో నాంధ్రి యేమయ్యె నెచటికేఁగె ?

3

నానారత్ననిధానభూషణమయాంధ్రక్షేత్రసంచారణా
న్యూనశ్రీవిభవంబుడంబు వెలుఁగన్ ద్యోవాహినీనీరసు
స్నానోద్ధూతసమస్తపాపనిచయస్ఫాయత్ప్రభాశోభినీ
నీనై పుణ్యమదేల చూపఁజన వాంధ్రీమాత మా కిత్తఱిన్.

పలుకు ల్నిర్మలతావకీనగురుసంభావ్యంబులుంగా వఁటం
చలుగం జెల్లదు వేషభాష లవి యన్యంబు ల్విధర్మాంచితం
బు లఁటంచు న్మదిఁ గుందరాదు, విను, మామూర్ఖత్వమున్ బాపి నీ
చెలువారూపము చూడనిమ్ము కరుణాసింధూ లసద్భారతీ.

౫

సొమ్ము ల్పెల్లుగఁగూర్చి చిత్రరచనా సూక్ష్మజ్ఞతాభూమిగా
సమ్మోదంబునఁ బూర్వులార్యమతులై సాక్షాజ్జగన్మాతగా
సమ్మోదించి నుతించి రంచు వినెదన్ సత్యంబకా మైన చో
నమ్మా భారతమాత రమ్ము విమలస్వాంతంబునన్ గొల్చెదన్.

కలుగునె యాంధ్రికున్న యల కమ్రతరోరుమధుప్రవంతికో
జ్జ్వలసురశాఖినిర్గళితసారమయ ప్రథమప్రశస్త స
త్ఫలగతమాధురీరుచిరభవ్యరుచుల్ దలపోయ నన్యభా
షల కవి యేల కల్గును నిసర్గగుణంబును మాన్పఁజెల్లునే.

పల్కుపల్కును దిద్ది ప్రాణశక్తుల నించి
మాటలం దమృతంబు మట్టుపఱచి
చిటిపొటినడలలో జిగిపసందుల నేర్చి
భారతసంహితల్ పట్టఁజెప్పి
ఆటపాటలనైన నాచారశీలంబు
లెడసేయనీని కట్టడులఁదొట్టి

వ్యవహారసౌకర్య మరయంగాఁ గఱదుల
నెఱజాణతనమెల్ల నీటుపఱచి
సీమవారును గర్ణాటసీమవారు
రసికు లందఱుఁ దలలూఁప నెసకమెసఁగ
నాంధ్రి నాభాష నాదేశ మమృతభూమి
యాంధ్రు లమరవరులనఁ గాదనఁ దరంబె.

ఉభయభాషాలసదిభయుగోద్ధారవేఁ
గీస్యందనవిహారకేళిఁదేలి
అచ్ఛప్రభావాచకాంచితశివకథా
కృతిసమాశ్రయపుణ్యకీర్తిగాంచి

విక్రమదీక్ష సద్వినుతిఁగాంచి
మధుమధురోదారమహితవాగ్బంధుర
సత్ప్రబంధవిధానచరితమెఱఁగి
యున్నయాంధ్రివి నిను మించ నుర్వి లేరు
లేరు లేరని చాటి పల్కెదఁ నిజంబు
అలిఁగి యేరేని గొణఁగిన నలుఁగనిమ్ము
తెలుఁగుతియ్యదేనియరుచి తెలియఁ దరమె.

నన్నయ్యా యని పేరుసెప్పుకొని విన్నాణంబులం దిన్నిటన్
గన్నాకన్నటులెన్న నేర్చి మకరందస్వాదువాగ్జాలమె
ల్లన్నాదేయనఁ జాలుజాణ వని యుల్లంబందు ధీరప్రభా
వౌన్నత్యంబున నిల్పికొందు నిను నే నశ్రాంత మాం

౧౦

తిక్కన్నను దిమ్మన్నను
దిక్కోటుల నాంధ్రమధువితీర్ణప్రౌఢిన్
దక్కఁగ నేలిన జాణవు
తెక్కలి మాటల యాంధ్రి - తెలుఁగుమగలకున్.

౧౧

తిక్కన్న వేడ్కయ దివ్యభారతసార
సౌరభం బాంధ్రికి సంతరించె
ఎఱ్ఱన్న విందగుఁ దొట్టులెల్లను దీర్చి
మూర్తిత్రయఖ్యాతి మురియనిచ్చె
రేచన్న వలనానె కృతినిరూపకశాస్త్ర
చర్చల గడిదేర్చి సాఁగనిచ్చె
పోతన్న హెచ్చానె పురుషోత్తమకథార్థ
భావసర్వస్వంబు భక్తి నించె
కావరమ్మదె యెవ్వ రేకరణి నన్ను
నెన్న కేతేరు రాజసంపన్నవమ్మ
తేటగీతులఁ గోరిన దివ్యగతులఁ
కొదువలేదమ్మ తిరుగు మేకొదుకులేక.

# పుష్యరాగోత్సవము

౧

ఆహిమవన్నగాంబుధి నిరంతర సర్వజగజ్జనస్తుత
శ్రీహిత కీర్తిగాన రస సింధు తరంగసమూహ డోలికా
మోహవిహారగంధవహ ముగ్ధకిశోర సమాజ పూజ ల
వ్యాహతభక్తిఁజేయునవె యాంధ్రిసమీపమునందుఁ గోకిలల్॥

౨

ఆంధ్రీమహాదేవి యానందపరబుద్ధి
ఆలపించిన శ్రుతిమేలవించు
ఆంధ్రీపదన్యాస మందగించుచునుండ
రాగానురాగ సంక్రాంతిఁ జూపు
ఆంధ్రీవచోమధురాంచన్మధువు లొప్ప
కోకో ధ్వనిస్ఫూర్తిఁ గూయఁదొడఁగ
ఆంధ్రీ రసప్రశంసాతి సుందరవాద
మమర రసాలాగ్ర మధివసించు
ఆంధ్రి ద్రావిడీయనఁ బల్లవాదియగును
ఆంధ్రికి వసంత మన సంతతాత్మయగును
ఆంధ్రికి "ఉగాది"యన నిష్టమైన దగును
ఆంధ్రి పెంచిన కోకిల యట్టిదగుట॥

3

సరిగమాపసగమగమసరిపదమని
మూర్ఛనా మోహనాదుల మొనయు కదిగొ
పంచమారవమో స్వభావస్వరంబొ
పాడుచున్నది కోకిల పాట వినుఁడు॥

౪

సహకార పల్లవోత్సాహ తాత్పర్యంబు
గలదాటను వసంత ఫలము లిడదె
పుణ్యభూజనవాస బుద్ధివిశ్రుతిమూర్తి
గల దాంధ్రికి వసంతబలము లిడదె

మధురస్వరాలాప మాన్యాభిమానముల్
కలదాంధ్రికి వసంతకళల నిడదె
శ్యామసుందర తనూ క్షేమస్వరూపంబు
కలదాంధ్రికి వసంత గరిమ నిడదె
ఆవసంతకోకిల యాంధ్రికను గుంజెలియొ
ఆంధ్రి కోకిలకన్న మిక్కియగునోయేయొ
కోకిలాంధ్రులేకోదరలోకులేమొ
పలుకువరుసను బిలువఁగా వచ్చుగాదె॥

గీ

కాకేమి తెలుఁగువారికిఁ, బైకము కోకిలలగుంపె ప్రకృతి తలంపన్
వాకొన దేశీయుల కదె, పైకము సర్వస్వ మట్టి బంధువు గలదే॥

హాహాకారమునన్ ద్రివిష్టపమునం దాగాయకుల్ వ్రాసి స
మ్మోహప్రక్రియ 'కో' యటంచు మధుసంపూర్ణధ్వనిం గాయకుం
డై హెచ్చుంగద యాంధ్రిచెంతఁ బికరా జత్యంతమర్యాదన
ట్లాహాహోహా విచక్షణుండగుటకే నోర్తు న్నిరాతంకినై॥

౭

తొలిపలుకు లకుఁగులుకు చెలువొల్కునాంధ్రికి
వందిమాగధ పికవ్రాత మదిగొ
నునుమాటలను దేటలను జాటునాంధ్రికి
నండఁ గోకిల తండ మలరుచుండ
కలపాంకముల బింకములఁ గొంకకాంధ్రికి
బికగణంబు బలంబు వెలసియుండఁ
దనకన్న నోకమిన్న గనమన్న యనుమన్న
నను గొన్నయాంధ్రి కామని పికంబు
నట్టిదాట నేటేట నాంధ్రాళి శుభము
గోరి పంచమస్థాయిని గొల్చి ఫలము
కొమ్ము నైకొమ్ము మేకొమ్ము కొమ్మటంచు
"కో" యను వసంతవేళలఁ గోకిలమ్ము.

# భావవీచీవిహారము.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

మృదుమధురభావసామగ్రి సహృదయులహృదయముల నానందపరవశము చేయును. అట్టియానందము ననుభవించుటకు వారెంతేని కృషి చేయవలసివచ్చును. రసభరితములగు పెక్కుకావ్యములను బలుమాఱు చదివి వానియందలి మేలిభావముల నెఱుంగొని మనమున హత్తుకొనఁజేయఁజాలినశక్తి యేర్పడినఁగాని యాసహృదతయే యేర్పడదు. నాఁడుగాని సరసకవిహృదయము నెఱింగి యాతనిభావనాతిరేకము నెడఁ గృతజ్ఞత వెల్లడింప ననువుపడదు. ఒకరీతిగ నీని నలవఱచుకొనుటలోనంతశ్రమ లేదనవచ్చును తఱుచుగ సద్గ్రంథపర్యవేక్షణము, తత్సారము నాకళింపఁగలిన సౌమనస్యము నపేక్షితములు. కావ్యనిర్మాతయగు కవి కన్ననో యింతకంటె శ్రమ మత్యధికము. తొలుతఁ గావ్యనిర్మితి కనువగుసామగ్రిని సమకూర్చుకొనవలయును. ప్రకృతి దృశ్యములఁ బ్రత్యేకదృష్టితోఁ బరికింపనలయును. భావనావిశేషముతోఁ దనమానసమున స్ఫురించిన వాని నేకాగ్రతతో నహర్నిశముఁ బరిశీలించి, వానికొక నూతనాకృతి నమర్పవలయును. కావ్యకళావిస్ఫూర్తి దొలుకాడ నాదృశ్యములఁ బ్రదర్శింపవలయును.

ఏదియో నవ్యత కలదనుకొని కవి తన యూహాకొలఁదిని గృతిని నిర్మించినను సమకాలికులగు పరిశీలకుల హృదయములకెక్కఁ జాలనిదగునేని వాని పరిశ్రమ మంతయుఁ గాలగర్భమున నణఁగియుండవలసినదియే. కవివతంసుఁడగు భవభూతి

"ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మా
కాలోహ్యాయం నిరవధి ర్విపులాచ పృథ్వీ"

యని వాకొనిన రీతిని చతుస్సముద్రముద్రితమైన యీభూభాగములో అనంతమగు కాలచక్రమున కవి కడగండ్లనెఱిఁగెడు సహృద

యుఁ డేనాఁటికైన నవతరింపకపోఁడు. కాని యంతవఱకు నెంతటి యుత్తమకావ్యమైనను ఒకప్పుడు చివికి చిందఱవందఱయై మ్రగ్గుచు నణఁగి యుండవలసినదియే. కృతియందుమాత్రము కవితాసారము కరుడుగట్టి యుండవలయును. అదియున్నచో నేనాఁటికైనను బయటికి వచ్చును.

సారాసారవివేచనము వ్యాఖ్యాతల (విమర్శకుల) శిరముపై నిలిచియుండును మల్లినాథునివంటి నిశితవిమర్శకుఁడు వివేచనభారము తన శిరమున నిడుకొని నిర్వహించినాఁడు గనుకనే కాళిదాసాదులు కవిమూర్ధన్యులై వన్నెకెక్కినారు. మల్లినాథసూరి తన వ్యాఖ్యానారంభములో

శ్లో. వాణీం కాణభుజీమజీగణ దవాసాసీచ్చ వైయాసకీ
మన్తస్తంత్ర మరంస్త పన్నగగవీ గుంభేషు చాజాగరీత్
వాచా మాచకల ద్రహస్య మఖిలం యచ్చాక్షపాదస్ఫురాం
లోకేఽభూ ద్యదుపజ్ఞమేవ విదుషాం సౌజన్యం యశః.

అని తనకుఁగల శాస్త్రపాండిత్యము నుగ్గడించినాఁడన్నది తన యాథార్థ్యమును వెల్లడించుటకుఁగాదు. ఉత్తమకావ్య నిర్మాతలగు కవుల హృదయసారము నెఱుఁగవలయునన్న నంతటిపాండిత్యముండిననే గాని వలనుపడదని యెఱిఁగించుటకే. శ్రీహర్షుని నైషధకావ్యసారము నాకలింపవలయునన్న నాతఁడు రచించిన ఖండనఖండఖాద్యము బాగుగ నాస్వాదించినవారికేగాని తర్కాదురుల కది కొఱుకఁ బడనిదియే.

ఇఁక దెలుఁగు కృతులలోఁ గవిహృదయము బాగుగ నెఱుఁగ వలయునన్న సంస్కృతవాఙ్మయమును దలస్పర్శిగఁ బరిశీలించినఁగాని వలను పడదు. శ్రీనాథునివఱకుఁగల ప్రాచీన కవులలో మేటి వారని పించుకొను కవులందఱు తమ కృతులయందు సంస్కృతకవు లుపయోగించిన సరససామగ్రిని విశేషముగా వినియోగించుకొనినవారే. కావున సంస్కృతకావ్యరసాస్వాదన పరతంత్రుల కాంధ్రకవుల హృదయము

సులభముగను సుస్పష్టముగను నెఱుఁగవచ్చును. ఇట్లనుట నితరులకా కావ్యములఁ బరికింప నర్హతలేదనుట మాత్రముగాదు. సూక్ష్మదర్శులగు ధీమంతుల కొకరీతిగ మధురభావసామగ్రి వెంటనే పొడకట్టుచునే యుండును. కాని సంస్కృతభాషాపాండిత్య మలవఱుచుకొననివారికి శ్రీనాథకవిసార్వభౌముని కవితగూడ వైరస్యాపాదకమేకదా! అందును మధురభావవీచికలకలకలముతో నొప్పారుప్రాచీనాంధ్రభాషాకావ్యరసవారిధి సంస్కృతకావ్యమాధుర్యభరితమే గావున నందలి కృషి యెంత యధికమో యీ కృతులం దాదర మంత మెండగుచుండును. అట్లుగాకున్నచో నన్నెచోడునివంటి యుత్తమకావ్యస్రష్ట యిరువదియవ శతాబ్దివఱకు నెవ్వరికి సాక్షాత్కరింపకుండునా? ఇంతటి యుత్తమ కవి నేప్రబంధకర్తయు వాకొనన్నైన లేదుకదా? ఇప్పటికి నీతని భావభరితకవిత నాస్వాదించెడివా రరుదుగదా? అయిననేమి? కావ్యము సారవంతమైనచో నేనాఁటికైన సహృదయుల హృదయములలో నాఁటుకొని తీరును. రత్నాకరమున రత్నములువోలె కావ్యమంతటిలో మధురతరభావము లటనట విరళముగనే యుండవచ్చును. వార్నిధిలో తిమినక్రఝషాదులుండుతావులవలె దురవగాహములగు పట్టు లుండక పోవు. కాని పరికరబంధమున నవలోడనముచేసినచో మేలిరత్నములు దొరకకనుబోవు. లోనికిఁజొచ్చి వలలువైచి వెదుకవలయును. కవిరాజశిఖామణి యగునన్నెచోడుని తెలుఁగుసేఁత యగుకుమారసంభవమునందలి భావవీచికలలో కొలఁదికాలము వినోదించెదముగాక.

శైలరాజపుత్రి యీశ్వరునిభక్తితోఁ బూజించి, వరదుఁడగునా యహికుండలువలన వరములఁ బడయుటకై పసిఁడి తామర పూవులఁ దెచ్చినది. ఆపుష్పసంచయమున నీకవి ప్రదర్శించిన భక్త్యతిరేకము భావవైభవము ప్రశంసనీయము.

సీ. మొనలావులించి వాసన నల్లఁ బసిగొని
తేఁటిదేఁటిగము లెంగిలింపకుండ
నెద సూఱగొన వేచి సుడియు తెమ్మెరలచేఁ
బొడముపుప్పొడి పొలివోవకుండఁ
దరణికూటమున వే.యుఱిలి పద్మిని మేన
మొలతెంచు మధుమద మొలకకుండ
మేల్కాంచి గోమిని మెలఁగి మై మురిసినఁ
బొదిగొన్నయుకరువు సెదరకుండఁ

గీ. దెలసి జక్కవ లొండొంటిఁ గలయుఁదారు
కలకలంబున రేకులు కదలకుండ
మున్నకొనివచ్చి గణికాసమూహితోడ
గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు,

కు. సం. ౩. ౩౫౧

మొగ్గలకొనలు వికసించి వాసన నలుదెసల వ్యాపించి నంతనే పసిఁబట్టిమూఁగివచ్చు పిల్లతేంట్లుమూతులతో ముట్టియెంగిలిచేయకుండ, హృదయముకొల్లగొట్టుటకై సమయమువేచుకొని చుట్టుముట్టు మంద మారుతములచే పుప్పొడి యించుకైనను చిందఱవందఱ కాకుండ, సూర్యుఁడను పురుషునికలయికచే రాపిడినొందు పద్మిని (పద్మలతయను పద్మినీజాతి స్త్రీ) శరీరమున మకరందమను మదప్రవాహ మొలికిపోకుండ లక్ష్మీదేవి మేలుకొని యటునిటు తిరుగుటచే శరీరము ఖండితమై గుబురుకొన్న కింజల్కములు చెదరిపోకుండ, చక్రవాకపక్షులు తెలివి గొని ఒకదానితో నొకటి కలిసికొనుటకై సమీపించునపుడు సేయు కలకలముచే రేకులు కందిపోకుండ, ముందుగనే లేచి, స్త్రీ సమూహ ముతోఁగూడి కొలనిలోని పైడిఁతామరలఁదెచ్చి, వరదుని బూజించెను.

'గోమిని' శబ్దమునకు ల యను నర్థము కిట్టెలు దొరగారి కన్నడ నిఘంటువునఁ గానవచ్చుచున్నది. మఱియు సంస్కృతనిఘంటు

వు నందుచు నొకచోఁగాననయ్యెను. తెలుఁగు కవులుమాత్రమీశబ్దము నంతగవాడుకొనియుండలేదు. గణికాశబ్దమును సామాన్య స్త్రీపరముగ నుపయోగించినాఁడు. 'సమూహి' యనునది సమూహమను నర్థమున నీతనికృతిలోను ఇతర శైవకవుల కృతులలోను గానవచ్చెడి వింత రూపము.

గౌరిచే సంపాదింపఁజేసిన పద్మములఁ బరికించినచో నీకవికిఁ బరమేశ్వరుని యెడలఁగలఁ భక్తిభర మత్యధికమని తోఁచెడిని. పార పొచ్చెమేపాటియులేని తామరపూవుల నార్జించుటలో గౌరి యంతగ శ్రమపడినదో లేదోగాని యీ ప్రభువరుఁడు మాత్రము భావముల నేర్చి కూర్చుటలో మిక్కిలి కష్టించినాఁడనవచ్చును.

ఇంద్రుఁడు స్మరించినంతనే మన్మథుఁడు పయనమై యమరావతికిఁబోవునప్పటి యాతనిరాజసపుఠీవి చోద్యముగఁజూడఁదగియున్నది.

ఉ. పూవులదేరు జక్కవలు పూన్ప వసంతుఁడుఁ దాను నెక్కి, కీ
రావళి కోకిలాళి మలయానిలముం దనుఁ గొల్చి పొల్చి రాఁ
గా, వరమీనకేతనము గ్రాల, నలివ్రజఝంకారావహాళా
రావములుంజెలంగ, నమరావతికిం జనుదెంచె నున్నతిన్.

కు. సం. ౪. ౩౯౦

మన్మథుఁడు దేవేంద్రుని పంపున నీశ్వరునిపై శర ప్రయోగము సేయుటకై మీఁదుమిక్కిలి లేక పలికిన విని రతీదేవి తన మనమున నీశ్వరుని మహత్త్వమెఱిఁగి, అతనికి నీకును నేనుఁగునకును దోమకును గల తారతమ్యమున్నదని తెలిపి వారింపఁజూచును.

చ. అతని శరాసనంబు కనకాచల, మిక్షుశరాసనంబు నీ,
కతనికి నమ్ము పాశుపత, మంటినఁ గందెడు పువ్వులమ్ము నీ,
కతఁడు పురాపహారి, విరహాతుర పాంథజనాపహారి వీ,
వతనికి నీకుహస్తిమశకాంతర మెమ్మెయి నెన్నిచూచినన్.

కు. సం. ౪.౪౮

అంతటితోఁబోక తనభర్త్రదౌర్బల్యము నిట్టుగ్గడించినది. ఆఁడు దానను బలహీనురాలను నగు నేనోక్కించుక యలిగి చూచినంతనే భయముతోఁవడఁకెడు నీకు భయంకరాకారుఁడగు నీశ్వరుని యుగ్రలోచనములనుండి పుట్టెడిమంటల నెదురుకొని నిలుచుట యేమాత్రమేని వలను వడునా ?

గీ. ఆఁటదాన నబలనైన నే యించుక
యలిగి చూచినను భయమునఁ దలరు
దుగ్రునుగ్రలోచనోద్భూతవహ్నికి
నెదిరి నిలువ నీకు నెంతకోలఁది.

ఇంతియగాక యాతని పరికరమంతయు నిస్సారమని తెలిపి హెచ్చరించినది. బాలురు సైతము చేతఁగొని తినివైచి పిప్పిచేసి యుమిసి వైచెడు చెఱకుగడ వింటిబద్దగాఁజేతఁ దాల్చితివి. అబలాజనుల తలవెంట్రుకలలోఁ బడినను గూడ కందిపోయెడు విరిపూలుబాణములుగాఁ దల పోసితివి. చిగురుటాకునైనను గదల్పఁజాలని మందమారుతము నీకొక పెద్ద సహాయము. అబలలు బెదరించినను గూడ నాకసముఁబట్టి కరుగ త్తెడి తుమ్మెదలు చిలుకలు నీకు మూల బలము. ఏపాటి వేసఁగితాఁకి నను ఎండకుఁ గందిపోయెడు వసంతుఁడు నీకుఁదగుసహాయకారి. కాకి పిల్లలతోడి జగడమేర్పడినను ఓడిపోయెడి కోకిలలు నీకుఁ బోటరిబంట్లు. ఇట్టి పరికరముతో నుగ్రునిపై దండువెడలుట నీకు తగునా ?

సీ. కొని బాలురైనను దిని పిప్పి యుమిసెడు
చెఱకు విల్లని నమ్మి చేతఁబట్టి
మెలఁతల తలవెంట్రుకలఁ బొంది కందెడు
నలరు పువ్వము లమ్ము లని తలంచి
తలిరాకునైనఁ గదల్పనోపని మంద
పవనుండు నొకపెను ప్రాపు గాఁగ

నబలలు స్తోఁపిన నాకాశమునఁ బొఱు
నలిశుకములు మూలబలముగాఁగ
గీ. నెంతవేసవి ముట్టిన నెండఁ గమరు
ననువసంతుండు దగు సహాయంబుగాఁగఁ
గాకి పిల్లల కోడుపికములుఁ బోటు
మగలుగా నుగ్రుపైఁ బోవఁ దగునె మదన.

కు. సం. ౪. ౪౩౧

మన్మథ పరికరము నతినిస్సారముగఁ జిత్రించుటలోఁ గవికిఁగల భావనాపరిపాక మబ్బురపాటు నొదవించుచున్నది. కాని మన్మథుఁడు మాత్రమట్టి పరివారమునే గైకొని త్రినయనుని సమాధివైకల్యంబొనరింప సమకట్టి, తనమూలబలమునకుఁ గనుసన్న చేసినంతనే తుమ్మెదల ఝుంకారము బొంగువెదురుల మంజులధ్వానము, చిలుకల ముద్దుపల్కులు, మదించిన కోకిలల యాలాపములు, శారికల కలరవములు, నెమ్మిళ్ల కేకారవములునుగూడి యొక్కమ్మడిని మంజులగానములై చెలంగ, వానితోఁగూడ గంధర్వగీతములును గలిసి యీశ్వరుని లతాగారము మాఱుమ్రోయునట్లు చేసినవి. ఆ ధ్వనుల నన్నిటిని భావనచే వినినచో మన చెవులు గింగురనిపించును.

చ. అలిఝుంకారముఁ గీచకస్వనముఁ గీరాలాపము ల్మత్తకో
కిల నాదంబులు శారికాస్వరములుం గేకీనినాదంబులుం
గలయన్ భోరన మంజుగానములతో గంధర్వగీతంబు ల
గ్గలమై భోరన మ్రోసె నీశ్వరులతాగారంబు ఘూర్ణిల్లఁగన్.

కు. సం. ౫. ౪౧౫

పార్వతీ విరహవినోదమునకై యొకచిత్తరువు గీలించినాఁడీకవిః తన్నిర్మితిపాటవమున నాచిత్తరువు మూర్తివంతమై పాఠకుల కెదుటఁ గానవచ్చునట్లున్నది విచిత్రిసాధనంబులుగొని పలకఘట్టించి మెఱుంగిడి త్రివటించి తిట్టఁబుకొఁడికిఁదెచ్చి బుజ్జాగతింబున రేఖనూల్కొలిపి

ప్రతికబింబకనిమ్నోన్నతాపాంగ మానోన్మానంబు లలవఱచి సలక్ష ణంబుగాఁ జిత్రించి వన్నువగొలిపి కందెఱదెఱచిన—

చ. కలకల నవ్వునట్లు దమకంబునఁ గన్గవవిచ్చి భ్రూలతల్
వాలయఁగఁజూచునట్లు దనివోవఁదెమల్చియుఁ గౌఁగలింపఁ జే
తులు పచరించున ట్లెదుటితో రతికేళికి నప్పళించు న
ట్లెలమి నటించుచుండె సతి కీశ్వరురూ పెదురం బ్రసన్నమై.

కు. సం, ౫. ౫౬౮,

చిత్తరువునందలి యీశ్వరుని రూపము కలకలమని నవ్వునట్లును ప్రేమాతిశయమునఁ గన్నులు విప్పి భ్రూభంగ మొప్పఁగఁజూచునట్లును తనివిదీఱఁ గౌఁగిలించుటకయి పట్టుకొనిలాగఁ జేతులు సారించునట్లును, సంతోషముతో నెదుటఁ బ్రసన్నమై నాట్యము చేయుచునుండెను.

అట్లారూపసాదృశమును గనుఁగొనినంత నంతయు యథార్థము గాఁదలఁచి క్రీగంటిచూపు లందమై వెలయఁ దదేకాయత్తయగుచు గౌరి మనకుఁగూడ నాచిత్తరువునం దాసక్తి గూర్చుచున్నది. ఇట్టి చిత్తరువు నొక్కటి పింగళి సూరనార్యుఁడు తన ప్రభావతీప్రద్యుమ్నమునఁ జిత్రించియున్నాఁడు. దానినిగూడఁ గాంచెదము.

వ. అనువుడు నక్కాంత యిక్కడ నొక్కచిగురుంబొదరుటీరమి నిడిన దాన నని యాక్షణంబ తెచ్చి నెచ్చలియుందాను నప్పలక కప్పుబా వడ యెడలించి

చ. కలకల నవ్వినట్ల తెలికన్నుల నిక్కము చూచినట్ల తోఁ
బలుకఁ గడంగినట్ల కడుభావగభీరత లబ్బినట్ల పెం
పొలయఁ దనర్చి జీవకళయట్టివడన్ శివ వ్రాసినట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకును దాను బోటియున్.

ప్రభా. ౧.౧౩౭

సప్తర్షు లీశ్వరుని యానతిపై హిమవంతునొద్దకుఁ బోయి పెండ్లి మాటలు పూర్తి చేసికొని తిరిగి శివునొద్దకే తెంచి యాజగన్మంగళ సౌం

దర్యవిశేషము నంతయుఁగొనియాడి యాతనికాదరాతిశయము నొడగూర్చినారు. ఆప్రకరణమున ఉమాదేవి ప్రత్యంగసౌష్ఠవము నగ్గడించుచు కన్నుల నిట్లుత్ప్రేక్షించినాఁడీకవి. అందమైన పార్వతి కన్నులు యామెకీసంగతి నెఱిఁగింపఁజెవులయొద్దకుఁబోయినవఁట. 'నీ నడుమతి దుర్బలము. ఉరోజము లత్యున్నతములు. వాని యుత్సేధమున నెదుటి భాగము మాకుఁ గానవచ్చుటలేదు. అడుగుదీసి యడుగు పెట్టెడిచోట కాలు వెలికిలఁబడినచో నడుమునకు దెబ్బతగులును. కావున పాదములఁ దడఁబడఁజేసెద మన్న నది మావలన నగు దోసము గాదు,' అని.

చ. నడు మస, దింతిచన్నులతనర్పున మందరు గానరాదు, మా,
కడు గిడుచోటఁ గాల్దెమలినంతన కౌనుకు బింద మయ్యెడుం
దొడిఁబడఁజేయుమావలన దోసము లేదని చెప్ప డాసె నాఁ
గడుబెడఁగొందు గౌరి తెలికన్నులు వీనులు డాసి దేస్థిమై.

కు. సం. ౮. ౧౬

తెల్లని కన్నుల విస్తృతిని ఉరోజములయున్నతిని వర్ణించుటకై యద్భుతమైన యుత్ప్రేక్ష నంగీకరించుటలో నీకవి కవితాశిల్పము కాంచఁదగియున్నది.

మఱియు గౌరి వివాహవేదిక నలంకరించి ప్రేమరసాతిరేకమున ప్రియునిఁజూచిన చూపు లెంతటి సొంపునింపినవో కాననగు. అందమైన ముఖముపై వ్రేలుకుంతలములు, ముఖమను పద్మమునందలి పరిమళమునకై చెదరక నిలిచిన తుమ్మెదలవోలె నొప్పారఁగా, వానిని పోఁదోలుటకై తత్క్షణమే చేకొనిన నల్లకలువ రేకుల మాలికలోయనునట్లొప్పు క్రీగంటి చూపుల కాంతులు సొంపారఁగాఁ బార్వతి తన విభుని జూచెను.

చ॥ లలితముఖాబ్జసౌరభ విలంపటషట్పదలీలఁ గ్రాలఁ గుం
తలములు వానిఁజోపనని దందడి నేలిన నీలభాసురో

త్పలదళధామకం బనఁగ భాస్వదపాంగవిలోల దృగ్రుచుల్
పొలయఁగఁజూచెఁ బార్వతి విభుం బ్రణయాతిరసావహంబునన్.

కు. సం. ౯. ౨౨౯.

పార్వతీ పరమేశ్వరుల వివాహ మతివైభవముగా జరిపి యా దంపతులచే జలవనకేళులఁ గావింపఁజేసినాఁడు. ఆసన్నివేశముల నత్యవధానముతో విపులముగఁ జిత్రించినాఁడు. మధురభావ సామాగ్రితో నింపి రసావేశములఁ దోలఁకింపఁజేసినాఁడు. ప్రసంగాంతరమున నందలి విశిష్టతను చవిచూడఁగలము. ప్రకృతమున ఈశ్వరుఁడు జలక్రీడకై సరోవరమున కేతేర ముందుగ నెదురుగవచ్చి స్వాగతమొసఁగి పూజ లొనర్చిన మందమారుతవిలాసము నరయుదము

సరోవరముపైనుండి వీతెంచు మందమారుతము, కదల్చుటచేఁ జెదరి వెంటవచ్చు తమ్మిరేకులు జతగూడమోడ్చిన హస్తములు కాఁగా చిన్నచిన్న తరఁగలనుండి బయలుదేఱు తుంపురులు స్వచ్ఛమైనమౌక్తికాక్షతలు కాఁగా, రొదసేయు పలు తెరఁగుల నీటిపిట్టల కలకలము అతిశయించు స్తోత్రపాఠధ్వనులు కాఁగా, యెఱ్ఱని నల్లని తెల్లని పద్మములయు కలువలయు పరిళములు మేలైన సుగంధద్రవ్యములు కాఁగా, తన కాదిమూర్తియైన పరమేశ్వరునకుఁ బ్రీతితోఁ బూజలిడుటకు వచ్చిన ట్లెదురుగ వచ్చి గౌరవముతో మార్గాయాసము నెల్లఁ దీర్చెను.

సీ. చెదరితోఁ బరతెంచు చెందమ్మి రేకులు
గెడఁగొని మొగుపు కెంగేలుగాఁగ
నెలమి లేఁదరఁగల నెలయుతుంతుర్వాని
సదమల మౌక్తికాక్షతలుగాఁగ
నులియు నానావిధజలపక్షికులకల
రవ మించుసంస్తుతి రవముగాఁగ
జలజాతకైరవోత్పల కలహారాది
గంధంబులోలి సద్గంధము ౘగ

గీ. నర్థిఁ దనయాదిమూర్తికి ననిలుఁ డర్ఘ
లీ ముదంబున నచ్చువ ట్లీశ్వరునకు
నెదురువచ్చి పథశ్రమ మెల్లఁ బాచె
గారవమున సరోవర మారుతంబు.

కు. సం. ౯. ౨౭౧.

ఇట "తుఁతుర్వని" అను శబ్దమునకు తుంపర అను నర్థము కిట్టెలు దొరగారి కన్నడ నిఘంటువునఁ గలదు. (తుంతుర్వని=Small drops of water spray).

జలక్రీడ గావించునపుడు అందు పాల్గొనిన వనితల కంటఁగట్టిన మార్ధ్య మతివిస్మయావహము. గడసరియగు నొక గరిత, తన ముఖము పద్మమనుకొని మూగిన తుమ్మెదలతోఁ బెనఁగు లాడఁగ లేక ప్రక్క నున్న యొక ముద్దరాలినిజూచి 'ఓల' యని పిల్చిన నామె తన్నుఁబట్టు కొనుటకై దగ్గరకుఁ జేరఁగా, తుమ్మెదలను, యీ వచ్చిన యామెను మూఁగికొనఁడనుచుఁ దాను మునిఁగిపోయి నేర్పరియై మఱియొకచో నవ్వుచు నిలిచెను.

వేఱొకముగ్ధ తుమ్మెదలుగూడిన పద్మమును తనప్రియుని ముఖ మను తలంపుతో కరయంత్రధారల నొక్కుమ్మడిఁ జిమ్మఁగా, నామెను గని ప్రియుఁ డనురాగముతో నవ్విన, వాని మెఱుఁగారుదంతకాంతులు వచ్చుటచూచి, యామె తనభర్త తనమీఁదికి స్వచ్ఛమైన జలధారలఁ ద్రోయుచుండె ననుకొని ముఖమును మరల్చుకొనెను.

చ॥ తనముఖ మంబుజాత మని, దండడిమూవు నలివ్రజంబుతోఁ
బెనఁగువిదగ్ధ, మ్రోల నొక బేలుసతిం గని, యోలఁబెట్టి పి
ల్చిన, నది తన్నుఁబట్ట నని చేరినఁ దేఁటుల దాని మూఁగికొం
డనుచును గ్రుంకిపోయి, చదురాలయి నవ్వుచు నిల్చె నొక్కెడన్.

కు. సం. ౯. ౨౮౭.

చ॥ అలికలితాంబుజంబు ప్రియునానన మన్వగ హ స్తయంత్రధా
రలు మొగిఁ బేర్చు ముగ్ధఁగని, రాగమునం బతి నవ్వఁడుం దదు
జ్జ్వలతరదంతదీధితులు వచ్చుట గాంచి, నిజేశు పేర్చి ని
ర్మల జలధార లొక్కొయని, మానిని దీర్చె ముఖాబ్జ మక్కడన్.

కు. సం. ౯. ౨౮౮.

ఇఁక వనవిహారము నతివిచిత్రముగ నడిపించినాఁ డీ ప్రభువరుఁడు. స్వీయముగ ననుభవించిన సన్నివేశములగుటచే మఱింత విశిష్టత గానవచ్చుచున్నది. ప్రభువర్యుఁ డగుటనుగాఁబోలు తుమ్మెదల నూఁతగఁగొని అయోమయ ప్రాకారము నిర్మించినాఁడు.

వనమునందలి తరుగుల్మలతానీకంబు లొండొంటికి మీఱినట్లు నానాప్రసూన ప్రసవాభిరామంబులైన వానినుండి బయలువెడలిన పూవుల సుగంధప్రవాహభరము దట్టమై చుట్టుముట్టి యొక్కమాఱు నలుదెసలకు వ్యాపించఁగా గుమిగూడి తుమ్మెదలా పూవుల దగ్గరకుఁ బోలేక విడిచిపోవను లేకయుండ మన్మథుఁడు తన యాయుధశాలకు ఇనుముతోఁ బ్రాకారము నిర్మించినాఁడో యనునట్లొప్పియుండెను.

ఉ॥ ఆయవనీరుహోద్గతలతాంతవినిర్గత సౌరభప్రవా
హాయతి సాంద్రమై వలితమై మొగిఁ బర్వినఁ డాయఁబోవనుం
బాయనురాక చుట్టి మధుపవ్రజమాలిక లుండెఁ జొప్పి పు
ష్పాయుధశాలఁ జుట్టు మరుఁ డాయసవప్రము పెట్టినట్టిదై.

కు. సం. ౯. ౨౯౮.

ఇటులనే ముక్కుతిమ్మన తన పారిజాతాపహరణమున నొక భృంగమును పహారావానినిగాఁ దిరిగించినాఁడు. హృద్యభావభరితమగుట నాపద్యమును గూడ నిక్కడ స్మరింతము.

మ॥ ఒకభృంగంబు పరాలినీమదనతంత్రోన్మాదిఁ బ్రాణేశ్వరి
న్మకరందాసవమత్త నబ్జగృహసీమం బెట్టి తాఁబోయి సం
జకడ న్వచ్చి తదావసన్నముకుళీ మేజాడ న్నారినాత్రి యా
మికుఁడై నాఁ దిరిగెం గొలంకరమకు న్మేలెంత హీనంబు కో.

పారి. ౨. ౭౩.

మఱికొంతపోయి యాయలులచే జపము చేయించినాఁడు ఒక తుమ్మెద మిక్కిలి శుద్ధమైన మనంబుతో మదనోత్సవము (1 వసంతోత్సవము 2. రతికేళి.) అసిరమనియు, బంధుజీవసంఘము (1. మంకెన పూవులు 2. బందుగులపోగు) చిరకాలముండునది కాదనియు విచారించి అన్నిటినిగూడ వదలి శ్రేష్ఠుఁడగు మహర్షివలె జపాసక్తి (1. దాసనపుఁ బూవునందాసక్తి 2. జపమునందాసక్తి)తో నిలిచెను.

క. మదనోత్సవ మధ్రువ మని
సదసమలమతి బంధుజీవసంఘం బచిరా
స్పదమని యన్నిటి నొకయలి
వదలిజపా సక్తి నిలిచె వరముని వోలెన్.

కు. సం. ౯. ౩౦౨.

శ్లేషను దఱుచుగఁగూర్చు నలవాటీకవిరాజునకుఁ గలదు కాని ప్రకృతమున నీపద్యమునందలి శ్లేషమాత్ర మెంతయు హృద్యముగా నున్నది.

వసంతము లో విహరింపవచ్చిన వనితల సౌందర్యమును మాధుర్యమును కడు ముద్దుగఁ జిత్రించినాఁడు. ఆ విహారమునఁ బాల్గొన్న పడఁతులు వసంతవిలాసమునఁ బూచిన మామిడికొమ్మలను దమ హస్తములను శాఖలచే నూఁదికొని నిలువ, వారి వక్షోజములు చెట్టునకు నిండియున్న పండ్లవలె నొప్పార సొబగు నింపునారైరి.

క॥ కరశాఖలఁ దరుశాఖలు
పరువడి నూఁదికొని నిలిచి పడఁతులు శోభా
కరలైరి తత్కుచంబులు
భరితంబై యున్నమావిఁ బండులువోలెన్.

కు. సం. ౯. ౩౧౮.

క॥ ఎనసి నిజాసితదృక్ప్రచి
గనుఁగొనఁ గప్పైన మల్లికాప్రసవంబుల్

దనరారు నల్లమల్లియ
లని కోసిరి కొందఱుత్పలాక్షులు ప్రీతిన్.

కు. సం. ౯. ౩౧౫.

కొంద ఱుతలాక్షులు తమ నల్లని కన్నుల కాంతితోఁ జూచి నంతనే నల్లనైన మల్లెపూవులను గని నల్లమల్లియ లనుకొని యత్యాదరముతోఁ గోసిరి. మఱికొందఱు చెలువలు మఱ్ఱిచెట్టుపై మూఁగి క్రీడించు చిలుకల యెఱ్ఱని ముక్కులుచూచి మఱ్ఱిపండ్లనుకొని కోయ బోఁగా, చిలుక లాచెలువల చేతులు లేఁజిగుళ్లనుకొని తత్క్షణమే కొఱికిన, "నమ్మయ్యో యిదియొక కాటుల మఱ్ఱిచెట్టని కలకలము చేయుచు భయముతో బరుగెత్తినారఁట. ఎంతటి మౌగ్ధ్యమో?

చ॥ చెలువలు మఱ్ఱిమ్రానుపయిఁ జిల్కలుమూఁగి రమింప వాని ము
క్కులుగని మఱ్ఱిపండులని కోయఁగఁబోయిన వానిహస్తముల్
దలిరుల సావికీరములు దండడిముట్టిన ముగ్ధలందఱుం
గలగొనఁబాఱిరో యిదియ గాటులమ్రా ననుచు న్భయంబునన్.

కు. సం. ౯. ౩౧౩.

చ॥ అలరులతోడ నవ్వుచు నయంబున మొగ్గలతోడ నాడుచున్
దలిరులతోడ సోలుచు మదభ్రమరంబులతోడఁ బాడుచు
న్నెలమిఁ బికాళితోడ నెలిఁగించుచుఁ జిల్కలతోడఁ బల్కుచు
న్నలి వనకేళి ల్పి రెలనాఁగలు తీఁగలతోఁ బెనంగుచున్.

కు. సం. ౯. ౩౧[illegible].

పువ్వులతో నవ్వుచు, మొగ్గలతో నాటలాడుచు, చిగుళ్లతో సోలిపోవుచు, కోకిలలతోఁ నెలిఁగించి పాడుచు; చిల్కలతోఁ బల్కుచు; తీఁగలతోఁ బెనఁగులాడుచు నెలనాఁగలచే నాటలాడించి భావవీచికల విహరించినాఁ డీకవి. ప్రకృతికాంతసౌందర్యము గాంచి; ప్రేమమునించి పాడిన యిట్టి మృదుమధుర భావగీతములు సరసహృదయముల నానందడోలికల నూఁగులాడింపకుండునా?

---

భంగపాటున నెంచు బ్రతు. కేలయని వచ్చి
దుగ్ధాబ్ధి యీభంగిఁ దోఁచెనొక్కొ
యకలంకగతి నుంట యది తేజ మని వచ్చి
విధుబింబ మీభంగి వెలసెనొక్కొ.

గీ. కాక నిర్జరభర్తకుఁ గలుగుయశము
గూడుకొని వచ్చి యీభంగిఁ గొఱలె నొక్కొ
యనఁగ నసమానఘననిర్మలాంగకమున
నమరు నుచ్చైశ్శ్రవం బనుహయముఁ గనిరి.

ఉ. అత్తఱి నాగమాత హృదయాంబురుహంబు ప్రగాఢవిస్మయా
యత్తము గాఁగ నాకవిభునశ్వకులోత్తముఁ జూపెఁ గంకణో
దాత్తఝుళంఝుళంకరణహారివిధావి సన్నినాదనం
చత్తరహస్తపల్లవము సాఁచి ఖగాధిపుమాతృతల్లికిన్.

క. తదనంతరంబ నిర్మల
రదనరుచుల్ గండయుగళిఁ బ్రకటింపఁగ నా
సుదతీమణి యుపలాపా
స్పదభాషలఁ దనదుతోడిసవతిం బలికెన్.

ఉ. ఓసఖి కంటె దూరమున నున్నతురంగమరాజు చారురా
కాసితధామ మందముగఁ గ్రమకళంకము దాల్చునట్లు ము
క్తాసమకాంతి నొప్పియుఁ బదంపడి వాలము గ్రేవ నీషదో
ద్భాసిత మైననీలమణిభావనమునం దలరారె నెంతయున్.

క. నా విని కలకల నవ్వుచు
నావినతయుఁ గద్రువకు యథార్థత్వకథా
ప్రావీణ్యాగణ్యభాషల
వావిరి నిట్లనియె వదనవనజం బులరన్.

ఉ. ఉన్నతకీర్తి ధర్మసుగుణోజ్జ్వలసజ్జనకీర్తిరాశి కే
ఖ న్నుతనిర్మలాంగమునఁ గన్నులపండువు సేయుచుండఁగా
నన్నున నివ్వరాశ్వపున కంగకళంక మటందు వప్ప యే
కన్నులఁ జూచి పల్కి వి క్రమ్మఱ నిప్పుడు సక్కఁ జూడుమా.

క. అనుటయుఁ గద్రువ నాచూ
పునకు న్మఱి తప్పు గలదె పొసగం గననే
రనిపలుకులు పలికెద రివి
పని లే దటుగాన చనము వన్నెద మబలా.

క. విను మాహయపతివాలము
నను గాళిమ యున్న నీవు నాకును లేకుం
డిన నేను నీకు దాసిన
తన మందుద మబ్దశశతం బగుదాఁకన్.

వ. అనవుడుఁ దన మనం బలర నిది దగుఁ; గదియం జని చూతము
పోద మనినఁ గదలక కపటవిచారసంజనిత యగు నురగజనని
యిప్పటికిఁ బ్రొద్దు సాలదు; రేపకడనే వచ్చి కళ లేనిక్రమం
బంతయు నిర్ణయించెదముగాని రమ్మని మాయవన్ని నాఁటి కాము
ద్దియం గ్రమ్మఱించుకొని గృహంబున కరిగి యారాత్రి గూఢ
మార్గంబున నిజక మార్గంబున నిజకుమారవర్గంబు నెల్లం గూడఁ
బెట్టి తనసవతియుం దానును బురుహూతవారువంబు గన్న విధం
బును దదీయవాలంబునందు లేనికందు ఘటించి సవతికిం జెప్పిన
తెఱంగును బరస్పరదాసీత్వంబు గాఁ బన్నిదంబు సలిచిన ప్రకారం
బునుం దెలియఁబలికి వెండియు.

క. ఆయశ్వవిభుని నిర్మల,
కాయంబున లేనిసలుపు కల దంచు యద్భ
చ్ఛాయు ఁ దలఁప కాడితి
నీయుత్కమ మింక మీర లీఁగఁగవలయున్.

క. వాలాయముగా నాహాయ
వాలంబునఁ గఱి ఘటింపవలయున్ రమణు
ల్మేలుగఁ బుత్రులఁ బడయుట
చాలుద మని తమకు హితము సలుపుటకుఁగదా.

ఆ. వె. కానినాఁడు వినతబానిసగా నాకు
వలయు నంతవట్టు తలఁపులందుఁ
గలిగి యింతప్రొద్దు కావింపుఁ డిది నన్ను
గనిసతండ్రులార తనయులార.

వ. అట్లని సవతి మానిసిబానిసగా మీతల్లి సతీమతల్లి యగు మ సుఖం బుండు ననిన విని శేషవాసుకితక్షకప్రభృతులు రోషమతులగుచుఁ గటకటంబడి కద్రువ కిట్లనిరి.

క. ఆవినత యనఁగ నీనన:
గా విను మామానసములఁ గలుగదు ఖేదం
బావంతయు నిటు గల్లకుఁ
దావల మగుపలుకు వలుకఁ దగవే తల్లీ.

చ. జనకుఁడు వేడ్క నిద్దఱఁ బ్రశస్తముగా వరియించె నిద్దఱున్
జనములకాక వారల కసమ్మతకృత్యము సేయు భావ్యమే
కనఁగొన మీర లిద్దఱును గశ్యపుభార్యలు నింక మేము నం
దనులము దక్కనీంద్రునకుఁ దక్కనె యిద్విధ మెన్నిభంగులన్.

ఆ. వె. జననియాజ్ఞ సేయఁజనుఁ బుత్రులకు నంచు
వినత కెగ్గుసేయ వెఱతు మేము
ధర్మ మైన దూష్యకర్మయుతంబైన
నదియు కడు నధర్మ మనిరి గాన.

వ. ఇట్లందఱు నొక్కమాటయకాఁ బలుకుటయు నలుక వాడమి యాకాంత యీర్ష్యదరుణాయమానలోచన యగుచు నిట్లనియె.

ఉ. మన్నన దక్కి యావిషపుమాటల మామకకర్ణరంధ్రముల్
మిన్నక చూఁడి తల్లి యనుమేరఁ దలంపక దుర్వినీతిసం
పన్నుల వక్రసంచరణపండితుల న్క్రము నెట్లు నేఁడుమా
కన్నకుమారు లంచు నొడికమ్ముగ నమ్మెదు నాత్మ నక్కటా.

క. నాపని సేయనిక్రూరులఁ
బాపాత్ముల సవతివలని పక్షమువారిం
గాపథవర్తుల నగుమిము
శాపమున దహించుదానఁ జటులస్ఫురణన్.

చ. వరయశుఁ డింకఁ గల్గుఁ గురువంశమునం జనమేజయుండు నాఁ
బరఁగి పరీక్షితాత్మజుఁడు పాయక యాతఁడు సర్పయాగ ము
ద్ధురమతిఁ జేయు నప్పు డతిదుస్సహతద్దహనార్చులందు సో
దరహితపుత్రపౌత్రసహితంబుగ గ్రుగ్గుఁడు మీర లందఱున్.

వ. అని జనని తనయు లని మొగమోడక రోషవశతం బలికిన శాపభాషణంబులు విని జనితవిషాదు లగుచు శేషాదులు హృదయంబుల నిండామభయంబు గలకతంబునఁ దదభిమతంబు సలుప వచ్చినగతిఁ గానిమ్మని చనిరి కర్కోటకుం డనునొక్క పన్నగుండు దురితంబునకు రోయక నిజప్రాణహితంబుగా మాతృహితంబునఁ జరించె; నంత ననంతపురస్సరు లగునురగవరు లొక్కెడఁ గూడి తమభావిమరణంబునకుఁ బరిహారణంబు దడవి కానక జనకుసమీపంబునకరిగి తదీయపాదంబులకుఁ బ్రణామంబు సలిపి యాత్మవృత్తాంతంబంతయు వివరించి, విన్నవించిన నతండు వారల నోడకుండుఁడని యిట్లనియె.

క. హర యను రెండక్షరములు
నెరపు పడక నిలుచు నెపుడు నెవ్వరియంతః
కరణములకు నిహపరసుఖ
పరికరములు హస్తబదరభావోజ్జ్వలముల్.

సీ. గంధనాగముల భీకరనఖంబులచేతఁ
గొజలి మృగేంద్రుండు గూల్చునట్లు
కక్షసంఘముల నుగ్రజ్వాలములచేతఁ
గడఁగి కృశానుండు గాల్చునట్లు
ధారాధరముల నుద్ధతవీజనలచేతఁ
దొడరి సమీరుండు దూల్చునట్లు
తిమిరసంతతులను దీప్తాంశువులచేత
మలసి సప్తాశ్వుండు మాన్చునట్లు
గీ. భక్తభయముల నాగమప్రకరశిఖర
సప్రవేదిక దివ్యరత్నాయమాన
విమల నిజనామ వరకీర్తనములచేత
నెలమి ఫాలేక్షణుఁడు పొలియించుచుండు.
క. ఆపన్నిశాప్రభాతం
బాపత్తిఖవర్ష మాపదగశతధారం
బాపత్సముద్రబాడబ
మాపరమేశ్వరునిసేవ యనవరతంబున్.
వ. అట్లుగావున సమస్తభువనశరణ్యంబులుం బరమశుభాస్పదంబులు నగుచంద్రధరపదంబులు గొలిచి మహంతు సనుండు నావుడు నురగవల్లభు లందఱుఁ గృతప్రణాము లగుచు జనకు వీడ్కొని పరమ పవిత్రంబగుసముద్రపుష్కరాంతరక్షేత్రంబున కరిగి తత్ప్రదేశంబున.
సీ. వదలక కొంద ఱీశ్వరచిన్మయాకార
భావనానాంతరప్రవణు లగుచు
మానక కొంద ఱీశానపావనమాత్ర
జపవిధానాజస్రనిపుణు లగుచు
మరలక కొందఱు గిరిశపదార్చనా
కలనానిరంతరకలితు లగుచుఁ

బాయక కొందఱు భవమహిమస్తోత్ర
విరచనానవరతనిపుణు లగుచు

గీ. నిట్లు నానాప్రకారంబు నెఱపుకడక
నందఱును భక్తియుక్తితో సర్వ్వముగను
శివుని నొకనిన తలఁచుచుఁ జిత్రలీలఁ
జలుపఁ జొచ్చిరి తపము దుశ్చరముగాఁగ.

గీ. తలఁపులును మాటలును జేఁ
తలు శివభజనంబునందె దగులఁగఁ బెఱత్రో
వల నెందుఁ దారు దగుల
వలనొప్పుచు భూరినియతి ప్రాలుచు భోగుల్.

ఉ. ఎండకు వానకుం జలికి నెంతయుఁ గొంకక నాలుగగ్నులున్
మండఁ దదీయమధ్యమున మందిరగుంభములేనియచ్చటన్.
నిండినీటిలోపలను నిల్చి భజించిరి నిశ్చలక్రమా
ఖండితనిష్ఠతో ఫణికాయ ముదర్క్యనుతాభవున్ శివున్.

వ. ఇట్లు త్రికాలదుస్సహంబుగా ననేకసంవత్సరంబులు తపంబుసేయుచు వాయుభోజను లీశానపదధ్యానతత్పరమానసంబుల నుండు సమయంబున.

సీ. ఎవ్వనిరూపంబు లెల్లలోకములందుఁ
దమమయంబులుగాఁగఁ దనరుచుండు
నెవ్వనితత్త్వంబు లెల్లతేజంబులు
దమమయంబులుగాఁగఁ దనరుచుండు
నెవ్వనినామంబు లెల్లభూతంబులు
దమమయంబులుగాఁగఁ దనరుచుండు
నెవ్వనిమంత్రంబు లెల్లవేదంబులు
దమమయంబులుగాఁగఁ దనరుచుండు

గీ. నతఁడు ప్రత్యక్షమయ్యె నానాగులకును
నలఘుతరభక్తియుక్తికి నాత్మ నలరి
సకలనిర్జరప్రముఖసన్మకుటముకుర
దర్శనీయపదాబ్జసుందరుఁడు హరుఁడు

క. అత్తఱి నురగులమీఁదన్
మొత్తముగం బుష్పవర్షములు గురిసె సము
ద్వృత్తమకరందనంద
న్మత్తమధుపకలకలాయమానస్ఫురణన్.

వ. ఇట్లు మహేశ్వరుం డాత్మలోచనగోచరుం డగుటయు భుజంగ పుంగవులు, ప్రియవిస్మయంబులు హృదయంబులం బొదవఁ దదీయ దివ్యచరణంబులకు నమస్కృతు లాచరించి యిట్లని స్తుతియించిరి.

క. జయ విగతామయ జయ య
క్షయ జయ జయ పరమభావసంశ్రయ జయ చి
న్మయజయ… … … …
జయ సన్నుతసన్మునీంద్ర సదమలహృదయా.

గీ. రెండురూపంబులు మెండుగా జలదనీ
హారపద వినిహితాస్తములుగ
రెండు రూపంబులు మెండుగా గంధసం
వ్రజన సంపాన విశ్రాంతములుగ
రెండురూపంబులు మెండుగా హవ్యప్ర
దాన పరిగ్రహాధారములుగ
రెండురూపంబులు మెండుగాఁ గమనీయ
చాలనోన్మీలనావాలములుగ

గీ. నుండి విశ్వప్రపంచంబు నిండి చారు
కీర్తిరుచి నొప్పునయ్యష్టమూర్తి నిన్నుఁ

గంటి మానందసంపదఁ గంటి మిపుడు
పరమకరుణామయాపాంగ పాండురాంగ.

క. కరుణింపు మమ్ము జననీ
ఖరశాపజ్వలనశిఖలఁ గ్రాఁగకయుండన్
శరణాగతజనసాధ్వస
హరణాదరభావ భవ మహాదేవ శివా.

వ. అని యిట్లు పెక్కుభంగులఁ బ్రస్తుతించుచున్న యురగులను బ్రసాద లక్షణంబులు వెలయువీక్షణంబులం దనుపుచు వాలతోడ మీ తపంబునకు మెచ్చి యనుగ్రహంబుం వచ్చితి; నింక మాతృదత్త శాపంబువలనం బరితాపంబు వలవదు. తత్పరిహరణ బులుగా నా కాభరణంబులు గండు సుఖం బుండు డని మచ్చిక నానతిచ్చి యనంతరసమయంబున

మ. వలనారంగబదంబులున్ జఘనమున్ వక్షస్థలంబుం గరం
బులు గంఠంబును గర్ణయుగ్మము శిరంబు న్మన్నగాఁ దత్తదు
జ్జ్వలగాత్రావయవంబులం దుచితభూషల్ గాను దత్తత్ప్రిథా
ముల నాగేంద్రులఁ దాల్చె శంకరుఁడు సంమోదంబు సంధిల్లఁగన్

క. ఉరగభరణరత్నదీధితు
లురువడిఁ దనమేన ... నొరసిఁ పుడుశం
కరుఁడునవ భానుదీప్తు బు
వెరసినరజితాద్రితోడిపొలుపు వహించెన్.

క. తలచుట్టుబాగు గాశివుఁ
డలవఱచినయహిపుఫణిసహస్రము గడుఁగ
న్నులపండు(వయ్యె)ముకుటో
జ్జ్వలవిభునకు నిడినయాతపత్రముపోలెన్.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు
పిఠాపురము మహారాజావారు, పరిషద్యావజ్జీవితాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

## కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు,
(కోశాధ్యక్షులు.)

,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

,, కోకా శివనాథశాస్త్రిగారు

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.

,, వెంకటి రామబ్రహ్మముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ, ఎల్. ఎల్. బి.

,, మందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు కామరాజుగారు.

,, వేమల శ్రీరామచంద్రమూర్తిగారు, ఎమ్. ఏ. (ఆనర్సు)

,, వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

## చతుర్థ సంపుటము.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న్ర' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీ క్రింది వెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లును.

---

Printed by N Achutaramiah at the Cocanada Printing Works Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౬. { సర్వజిత్తు. శ్రావణ - ఫాల్గుణములు } సంచిక ౩. ౬.



కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయముతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

1947–48.

# విషయసూచిక.

—:0:—

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౭. సర్వజిత్తు. శ్రావణ - కార్త్తికములు } సంచిక ౩. ౬.

## విస్మృత ప్రబంధ పద్యావళి.

పెదపాటి సోమయ్య — కేదారఖండము.

ఉ. కన్నియ రూపుఁగోరుఁ; గనకంబులు గోరును దల్లి; బుద్ధిసం
పన్నతఁ గోరుఁ దండ్రి; కులభవ్యతఁ గోరును బంధుకోటి; ప
క్వాన్నఫలాదిభక్షణము లన్యులు గోరుదు;రిట్టు లన్నియున్
బన్నుగ నొక్క చో నొదవె; భాగ్యము సేసితిఁగన్య నిచ్చెదన్. 1

సీ. కెంజాయజడముడి కేశపాశంబును
బూపచందురుఁడును బూపుదండ
యురగకుండలమును దరళతాటంకంబు
వనజాప్తుఁ డగుకన్ను వాలుఁగన్ను
ముదురుఁ బున్కలపేరు ముత్యాలహారంబుఁ
గడుఁ గొంచెమగుచున్న ఘనకుచంబుఁ
బులితోలు దుప్పటి వెలిపట్టుచీరయుఁ
బాపపెండెంబును బసిఁడియందె

గీ. మృదువు దెలుపును నగు భూతిమృగమదంబు
నింత యొప్పౌనె కుడివంక నెడమవంక
నిమ్మహాదైవమునకని యిచ్చ మెచ్చి
యర్ధనారీశ్వరుని గొల్చి రఖిలజనులు. 2

సీ. వేదాదులగు మహావిద్య లన్నియుఁ గూడి
మూర్తిమంతంబులై మొనసి కొలువఁ
గ్రతుమరీచ్యంగిరఃకణ్వాదిసంయముల్
కలుమాఱుఁ గనుసన్నఁ బనులు సేయ
సురసిద్ధకిన్నరగరుడవిద్యాధర
యక్షాదు లంతంత నభినుతింప
నారద విశ్వావసత్కుమారాంగిర
శ్శతరుతు లుభయపార్శ్వముల మెఱయ

గీ. భామతోఁగూడి యానందభరితుఁ డగుచు
సత్యలోకేశ్వరుం డుండు సంస్తుతింప
నిమ్మహాసృష్టి కెల్లను నితఁడు గర్త
చూడుమీ బ్రహ్మలోకంబు సుభగమూర్తి. 3

సీ. చరియించువారికి సంకల్పసిద్ధిగా
నిర్మించె నెవ్వాఁడు నిజవనంబు
సార్వకాలికఫలసస్యంబు గల్పించి
వరమునిశ్రేణి నెవ్వాఁడు బ్రోచె
చీకటితప్పు చేసిన నెవ్వఁ డదలించె
నింద్రుని తను వెల్ల హేయముగను
సుర్వీసురశ్రేణి కొఱిమ లేకుండఁగఁ
బలికె నెవ్వాఁడు ప్రతాపంబు మెఱసి

గీ. యట్టి శ్రీవీరశైవాగమాదివేది
యైన గౌతమసంయమి యాశ్రమంబు
పొంత నెంతయు నొప్పారిపొగడ నెగడు
ననఘమానస శ్రీవైజయంతిపురము. 4

సీ. వనితయూర్పులచేత వావిలి వికసించె
పాటఁ బేంకనము లేఁ బరువమయ్యె
నాతుక చూచిన నలువొత్తెఁ దిలకంబు
కొమరారె మాటలఁ గొండగోఁగు
సతిముఖరక్తిచే సంపంగి సొంపెక్కె
నవ్విన సురపొన్న మవ్వమలరె
నెలనాఁగ కౌఁగిట నిగురొత్తెఁ గురవకం
బంటినఁ జెలువొందె నామ్రతరువు

గీ. పొలఁతిపుక్కిటి మధువునఁ బొగడ వొలిచెఁ
గాంతపదసంగమున నశోకంబు విరిసెఁ
గాననములోన జాతియొక్కటియె తక్క
భూజములుఁ దీఁగలును బూచి బువురులయ్యె. 5

సీ. హరియురస్స్థలివోలెఁ గరమొప్పఁ జూచితే
భాసురకమలాధివాసమగుచు
యాశాతటమువోలె నసలారుఁ జూచితే
బంధులకుముదవిభ్రమము గలిగి
త్రిదివంబువోలె నొప్పిదమయ్యెఁ జూచితే
మకరకచ్ఛపమహామహిమ గలిగి
గగనంబువోలె నక్కజమయ్యెఁ జూచితే
రాజహంసస్ఫూర్తి రమణ గలిగి

గీ. యతిమనోహరమందమారుతవిహార
లోలకల్లోలమాలికాందోళకేళి
కలితబహువిధఖగసముజ్జ్వలత గలిగి
యమరెఁ జూచితె యీసరోజాకరంబు. 6

# చందలూరి చిక్కన్న—నాచికేతూపాఖ్యానము

సీ. రాజితరత్న దర్పణ తోరణంబులఁ
గడుశోభితములైన కల్వాడములు
మానితకనకరంభా స్తంభపంక్తుల
భాసురోజ్జ్వలపతాకాసమృద్ధి
నిర్మలస్ఫురిత మాణిక్యకుంభంబుల
మెండైన చిత్రంపుమేలుకట్లు
ప్రకటితనూత్నమౌక్తికరంగవల్లుల
రమణీయపరిమళద్రవ్యసమితిఁ

గీ. దనరు నగరంబు నుతనిరంతరవిభూతి
నతిశయంబుగఁ దగనలంకృతు లొనర్చి
బహుపదార్థంబు లొడఁగూర్చి పరిణయమున
కాయితముసేసి రంత వా రనుపమముగ. 1

సీ. బహువిధపరిమళభరితోదకంబులఁ
జెలువంబు శోభిల్ల జలకమార్చి
నిండారు పండువెన్నెల సోయగము నవ్వ
పసిఁడికమ్ములకెల్ల పట్టుఁగట్టి
కబరిభారంబునఁ గన్నెచెంగలువలు
పసమీఱఁ గొనలుదోఁపఁగఁ జెరివి
తీండ్రించు పసిఁడి దీధితులచే నమరెడు
నవరత్నమయభూషణములు దొడిగి

గీ. మృగమదముఁ గుంకుమంబును మేళవించి
గంధసారంబు మైఁదీగఁ గలయ నలఁది
శ్రీలు మెఱయంగఁ బరిణయోచితము గాఁగ
సఖులు కైసేసి తెచ్చిరి చంద్రముఖిని.

———

# వడి – యతి

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

తెలుఁగుభాషలో ఛందోబద్ధమయిన కవితామార్గములం దన్నిటను వడులకు ప్రాసములకు మహత్త్వ మధికము. వానిని గూర్చుటలో నితరభాషాకవులం దఱికంటె నాంధ్రకవులకు శ్రమ మత్యధికము. కాని వాని నవధానముతో ననువుగఁ గూర్చినచోఁ బద్యములు తీర్చి దిద్దినట్లుం డును. తొలుత నీవడులు ప్రాసములుగూడ తెలుఁగుకైతల కలంకార మాత్రములుగనే యవతరించి, క్రమముగ లక్షణములలో నగ్రస్థానము నాక్రమించినవి. నేటి కయిదు శతాబ్దులకుముందు కొఱవి గోపరాజ కవి తానురచించిన 'సింహాసన ద్వాత్రింశిక' యనుప్రబంధమునందువీని ప్రాశస్త్యము ని ట్లుగ్గడించినాఁడు.

వ. ఆంధ్రమండలంబునం గోణదేశంబునం దెలుంగు కవితకు ప్రాలు
వళ్లు ననునియమంబులు చూచినాఁడ; నవి యెయ్యెడం దఱుచు
గాకుంట నపూర్వం బవధరింపుము.

శా. పుణ్యస్త్రీకి గణింప మంగళగుణంబు ల్సొమ్ములై యొప్పఁగాఁ
బణ్యస్త్రీకి సువర్ణమౌక్తిక సుహారవ్యక్తి భూషాకృతు
ల్గణ్యంబౌ గతి సంస్కృతంబునకు వాగ్వ్యాపంబు శబ్దంబు లా
వణ్యాకారము లౌఁ; దెనుంగునకుఁ బ్రాల్వళ్లుం గడు న్వన్నియల్.
ర. ౧౯౦

క. తప్పక వళ్లును బ్రాలును
ముప్పిరి గొనఁదగినశబ్దములు మెఱుఁగెక్కం
జెప్పినఁ గవితాచాతురి
యొప్పము వెట్టిన పసిండియొఱపున మెఱయున్. ర. ౧౯౨.

ఈప్రసంగమునుబట్టి గోపరాజకవిసమయమునకు వడులు ప్రాసములు నితరభాషలందుఁ దఱుచుగ లేనట్లును, వీని నవధానముతోఁ గూర్చిన కవితలు తీర్చిదిద్దిన బంగారుప్రతిమలవలె మెఱుఁగెక్కు-ననుటయు వ్యక్తమగుచున్నది. ప్రాలు వళ్లను అలంకారస్థానీయము లనుటయుఁ బైప్రసంగమున విదితమగుచున్నది. నన్నయభట్టారకుఁడు మున్నగు ప్రాచీనకవులు వీనిని గూర్చుటలో విశేషావధానమును బాటించుటఁజేసి నాఁటిశబ్దస్వరూప నిర్ణయమునకు నైతము నివి మిక్కిలి యుపకరించినవి, ఉపకరించుచున్నవి.

కవిజనాశ్రయము కావ్యాలంకారచూడామణి మున్నగు లక్షణగ్రంథములలోఁ గొన్నిటఁ బాదాదినున్న యక్షరము వడియని వ్యవహరింపఁబడినది. 'వడి' యనుపదము 'యతి' యనుపదమునకుఁ బర్యాయముగ వ్యవహరింపఁబడలేదు. కాని అనంతుఁడు మున్నగుకొందఱు లాక్షణికులు వీనిరెంటిని విశ్రమాదిశబ్దములతోఁ గూడ పర్యాయపదములుగ వ్యవహరించినారు. ఈవిషయమున లాక్షణికుల నిబంధన మెట్లున్నదో యరయుదము.

ఆంధ్రశబ్దచింతామణికర్త వడినిగూర్చి, 'వళి రాద్య మనన్తరాక్షరం ప్రాసః' అనినాఁడు. అనఁగా పద్యపాదమున కాద్యక్షరము 'వళి' యనియు, తరువాతియక్షరము ప్రాసమనియు సంజ్ఞకలవని భావము. ఈవిషయముననే యప్పకవి పాఠమును తద్వివరణమును నిట్లున్నవి.

శ్లో॥ ఆద్యో వళి ర్ద్వితీయోఽవర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు-

క. చరణ చరణమున కాద్య
క్షరములు వళు లయ్యె నవియె క్రమ్మఱఁ దత్త
చ్చరణములలోనఁ జెప్పిన
యిరవులఁ బొందింపవలయు నెల్లకృతులలోన్.

అనఁగా పద్యపాదమునందలి మొదటియక్షరము 'వళి'యనియు దానిని నాయాపాదములయందలి యతిస్థానమున నునుపవలయు ననుట. యతిస్థానములును ఆయావృత్తభేదమునుబట్టి వేర్వేఱుగ నుండుట ఛందఃప్రకరణములయందు లాక్షణికు లెఱింగించియున్నారు. పద్యములలో నియమితమైన యతిస్థానములందు వళివర్ణమునేగాని తత్సజాతీయవర్ణములనుగాని కూర్చుట తెలుఁగుకవితయందలి పరిపాటి. ఏయే వర్ణముల కేయేవర్ణములతో సాజాత్య ముండునో దానిని నిర్ణయించుటకే లక్షణగ్రంథములందు యతిప్రకరణము లవతరించినవి. సాజాత్యనిర్ణయమును గూర్చి పొత్తపి వేంకటరమణకవి లక్షణశిరోమణిలో నిట్లు వాక్రొనినాఁడు.

క. ఎన్నిట యతి రావలె నని
యన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నట యతి రావలెనని
యన్నిటఁ దెనుఁగునకు మొదటియక్షర మమరున్.

వ. సంస్కృతంబునకు యతి పదచ్ఛేద సంజ్ఞ యనరు; నాంధ్రభాషాకవనంబున వర్ణోత్పత్తి స్థానబలంబున ప్రత్యాహారప్రయుక్తసూత్రంబున నాంధ్ర ప్రాకృత శాస్త్రోద్భవ తద్భవ తత్సమవర్ణ నిరూపణ సామ్యంబునంజేసి వర్ణంబుల కన్యోన్య సంబంధం బగుటచేత నాదిమకవులు వివరించిన యతులలోఁ దెలుఁగులో మొదలి యక్షరంబు విచ్ఛేదస్థానంబున రావలయును గానఁ దద్వర్ణోత్పత్తి క్రమంబు వివరించెద ననినాఁడు.

పైనఁ జెప్పిన వివరీతిని సంస్కృతంబునందు యతి యనఁగాఁ బదములకు విచ్ఛేదము. (పదము విఱుగుట.) అనఁగా విశ్రమస్థానము.

సంస్కృతమునందును ఈవిచ్ఛేదము తొలుత పాదాంతమునందేర్పడి, క్రమముగ ధాతువుల ప్రాతిపదికముల తుదిని, ఉపసర్గలతుదని,

ఆ వెనుక సంధివశమునఁ బైయచ్చులతోఁగూడిన తావులందును ఏర్పడి నట్టు లీ సంస్కృతలాక్షణికుల ప్రసంగములఁ దెలియుచున్నది. కనుఁ డాపరిపాటి:—

సూ. యతిర్విచ్ఛేదః. ౬. ౧.

వృత్తి. విచ్ఛిద్యతే విభజ్యతే పదపాఠో అస్మిన్నితి విచ్ఛేదో విశ్రమస్థానమ్. పింగళఛందశ్శాస్త్రము.

శ్లో. యతి శ్ఛందోఽధి రూఢానాం శబ్దానాం యావిధారణా

భామహుని కావ్యాలంకారము.

అనఁగా ఛందోబద్ధము లయినపద్యము లందలిపదములకు విచ్ఛేదము యతి యని యర్థము.

సూ. విరసవిరామోయతిభ్రష్టమ్.

వామనసూత్రములు.

వృత్తి. విరసః శ్రుతికటుః విరామో యస్మిన్ తత్ విరసవిరామమ్ యతిభ్రష్టమ్.

విరామో విచ్ఛేదనియమః—అని కామధేనువ్యాఖ్య.

ఈసూత్రవృత్తి వ్యాఖ్యానములనుబట్టి 'యతి' యనఁగా విశ్రమస్థానము అని తెల్లమగుచున్నది.

శ్లో. పాదాన్తఏవ కేచిచ్చ పాదమధ్యేఽపి కేచన
యతిం వదన్తి తత్రాపి విశేషః స్ఫుట ముచ్యతే
ధాతునామస్వభిన్నేషు యతి ర్భవతి నాన్యథా
ఉపసర్గాన్తత శ్ఛేదః ప్రత్యయాదౌత యోః క్వచిత్
స్వరసంధౌతు సంప్రాప్త సౌందర్యా ద్యతిరిష్యతే
తుచాదయో నప్రయోజ్యావిచ్ఛేదా త్పరత స్తథా
ప్రత్యయాదౌ యతి ర్నామ్నాం షష్ఠ్యామే వేతి కేచన

మందారమరందము.

తెలుఁగు లాక్షణికులును యతియన విశ్రమస్థాన మనియేవారి నిరి గాని పదవిచ్ఛేదమే యతి యగునట్టి తెలుఁగును సమగ్రముగఁ బాటింపలేదు. పదమధ్యమునందును పలుతావుల యతిని గూర్చినారు. యతిస్థానమున చరణాద్యక్షరము అనఁగా వడివర్ణము, లేక సజాతీయాక్షరమును గూర్చుటలో నియమముల నధికముగఁ బాటించుచు వచ్చినారు. ఈవిషయమే యీక్రింది లాక్షణిక ప్రసంగముల నెట్లు వర్ణింపఁబడినదో కనుఁడు:—

క. విలసత్పాదాద్యక్షర
ములు వళ్లగు నాద్వితీయములు ప్రాల్, వళ్లు
న్నలకొనుఁ దమతమపాదం
బుల యతిపై, నన్నిపాదములఁ బ్రా లమరున్.

కవిజనాశ్రయము.

క. పాదముల వళ్లుఁ బ్రాసము
లాదిమము ద్వితీయమైన యక్షరములు ద
త్పాదంబుల యతుల విసం
వాదము గాకుండఁ దగిన వళ్లిడవలయున్.

సింహాసనద్వాత్రింశిక.

క. పాదాదిమవర్ణము వడి
యాదరమున వ్రాసి వాని యతి నిడఁగఁదగున్.
పాదద్వితీయ మమరును
బాదంబులు నాలుగింటఁ బ్రాసంబనఁగన్.

తాతంభట్టు-కవిచింతామణి.

క. వడియన గాదాదులయం
దిడు నక్షరమేది యది యెనచేసెక యె
య్యెడ యతిరావలె నని రచ
నిడుటయు విరతులకు సంజ్ఞ యనసుతమంత్రీ.

చిత్రకవి పెద్దన-లక్షణసారసంగ్రహము.

పై లాక్షణిక ప్రమాణములనుబట్టి పద్యపాదములందలి మొదటి వర్ణము వడి యనియు, ఆవర్ణమును యతిస్థానమం దునుపవలయు ననియు, అట్లిడుట యతి యనబడుననియుఁ దెలియుచున్నది. దీనిని బట్టి యతి వడి పర్యాయపదములు గానట్లు వ్యక్తమగుచున్నది. కవిజ నాశ్రయము మొదలగు లక్షణగ్రంథములలో యతికిఁ బర్యాయపదము లుగనే విశ్రమాదిశబ్దములను జేర్కొనినారు.

క. విశ్రాంతి విరతి విశ్రమ
విశ్రామ విరామ విరమ విరమము లనఁగా
విశ్రుతమగుయతి కృతి కధి
కశ్రావ్యంబై బెడంగుగా నిడవలయున్.

కవిజ. సంజ్ఞా. ౬౦

గీ. విరతి విశ్రామ విశ్రాంతి విరమ విరమ
ణాభిధాన విరామము లనెడి పేర్లు
యతికిఁ బర్యాయపదములై యమరుచుండు

కావ్యాలంకారచూడామణి. ౭ ౨౭.

ఇది యిటుండఁ గొందఱు మున్నగు లాక్షణికులు కొందఱు యతిని వడిని బర్యాయపదములుగాను చరణాదిమ వర్ణమును విశ్రమ స్థానమునుగాను దెలిపినారు కనుఁడు :

క. యతి విశ్రాంతి విరామ వి
రతి విశ్రమ విరమణములు విరామము వడి వి
శ్రుతవిశ్రామము లను నివి
యతులకుఁ బదిపేళ్లుఁ జెల్లు నాగాఱుఁ గృష్ణా.

ఛందోదర్పణము.

గీ. విరతి విశ్రాంతి విశ్రామ విశ్రమములు
శ్రాంతి విరమణ విరమ విరామయతులు
ననఁగ నివితొమ్మిదియు వళి కాఖ్య లయ్యె
భవ్యసత్ఫలాయామ్య భాగగేహ.

అప్పకవీయము.

కాని మును పేర్కొనిన తెలుఁగులాక్షణికుల ప్రచుర సమ్మతిని బట్టి చరణాద్యక్షరమున కేగాని యతిస్థానమునందలి యక్షరమునకు వళియను సంజ్ఞ లేకుండుటచేతను, ఇందలి యతి సంస్కృతమునందలి యతితో సమానమయిన నియమములతోఁ గూడియుండుటచేతను వళి-యతి వేర్వేఱనుటయే యుక్తమని తోఁచెడిని.

కవిజనాశ్రయమునందు భీమకవి వృత్తలక్షణములను దెలుపునపుడు విశ్రమాదియతి పర్యాయపదములనే యుపయోగించినాఁడు. వళి యను పదమును మాత్రము విశ్రమమునకు బదులుగా నుపయోగింపలేదు. ఉదాహరణమునకై కొన్నిలక్షణముల నెఱిఁగించుచున్నాఁడను.

లాటీవిట వృత్తము—

సస సామయుతంబులు సూర్య యతి
శ్రీవ్యాంబై లాటీవిట వృత్తం
బసమానయశా నుతమానగుణా
యాశ్చర్యాన్వితంబగు ధాత్రిన్.

మానినీ వృత్తము—

భాకరముల్ క్రియ గర్గోన నేడు భ
కారము లొక్క-గకారముతో
గారవమై చనఁగా యతి పంక్తిఁటఁ
గల్గిన మానిని రామ విభా !

తురగవృత్తము—

న న న న సజములును జగము
దుదనాఁటు కొల్పిన రేచనాఁ
జనుఁ దురగ మన జగతి నిది
మనుసంశ్రయయుక్త విరామమై

అశ్వలలిత వృత్తము—

న జగణముల్ భజద్వయముతోఁ జె
నంగి భవయుక్తమై ధరణి సూ
ర్యజమగు విశ్రమం బమరియున్న
నశ్వలలి తమ్మగున్ గుణనిధీ

కవిరాజ విరాజితము—

క్రమమున నొక్క- నకారము నాలుజ
కారములుం బరగంగ వకా
రమును నొడంబడి రాఁ గవిరాజవి
రాజిత మన్నది రామ విభా !

దీనినిబట్టి కూడఁ బాదాద్యక్షరమును 'వళి' యనియు విశ్రమస్థానమం దలి యక్షరమును యతి పర్యాయపదములతోను వ్యవహరించుట లాక్షణికాభిమత మైనట్లు తోఁచును.

పైన నేఁజేసిన ప్రసంగ మంతయు లాక్షణిక ప్రమాణములను బురస్కరించుకొని నాయూహాకొలఁదిఁ జేసినాఁడ. విమర్శకు లందలి స్థూలసూక్ష్మముల నారసి సరియగు నిర్ణయము నరసెదరుగాక.



# "సాహిత్యవిమర్శము"

'వ్యాకరణ సాహిత్యవిద్యాప్రవీణ." అప్పల్లసోమేశ్వరశర్మ. P. O. L.

శ్లో. శ్రీమేధాదక్షిణమూర్తిం సచ్చిదానందవిగ్రహమ్।
వటమూలాశ్రయం వందే వసిష్ఠమునిసేవితమ్॥

## ౧. శాస్త్రలక్షణాదికము.

అనాద్యవిద్యావిలసితము శీతోష్ణసుఖదుఃఖాదిబహుద్వంద్వభూయిష్ఠము జననమరణప్రవాహరూపము సచ్చిదానందాత్మకపరబ్రహ్మజ్ఞానైకనివర్త్యము నగునీసంసారమునఁ బరిభ్రమించు సమస్తమానవులకు నభిలషణీయములగు నర్థములు నాలుగు. అవిధర్మార్థకామమోక్షములు. పురుషులు కోరఁదగినవిగానఁ బురుషార్థములను పేరు వీని కుచితముగనే యున్నది. వీనిలో మొదటి మూఁడింటికిఁ ద్రివర్గమనియు మొత్తము నాల్గింటికిఁ జతుర్వర్గమనియు "త్రివర్గోధర్మకామార్థై శ్చతుర్వర్గ స్సమోక్షకైః" అనురీతిని ప్రాచీనులు సమాఖ్య నేర్పఱచి యున్నారు.

వీనిలో "నస పునరావర్తతే" మొదలగు శ్రుతులచే మోక్షమునకు నిత్యత్వము; "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమే వాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" మొదలగు శ్రుతులవలనఁ బ్రత్యక్షసిద్ధమగు కార్యత్వమువలనను మిగిలిన పురుషార్థముల కనిత్యత్వము నవగతమగుచున్నది.

ఇట్టిపురుషార్థములన్నిటియొక్క స్వరూపసాధనఫలాది నిరూపకములగు నుపాయములు శ్రుతిస్మృతీతిహాసపురాణాదులు పెక్కులు కలవు. వానిలో శ్రుతు లన ఋగ్యజుస్సామాథర్వము లనునాలుగు వేదములు. వేదార్థస్మరణపూర్వకముగ మన్వాదులచేరచింపఁబడినది

స్మృతులు. వేదార్థోపబృంహకములగు రామాయణమహాభారతాదు లితిహాసములు. వేదార్థోపబృంహకము లేయగుచు వంశవంశానుచరిత సర్గప్రతిసర్గ మన్వంతర వర్ణనవిశిష్టము లగుచోఁ బురాణము లనఁబడును. అట్టివి భాగవతాదులు. ఇట్లే శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్త జ్యోతిషకల్పనామకములగు వేదాంగము లాఱు నేదోయొకరీతిని వేదోపకారకములయి ప్రకాశించుచున్నవి. వీనిలో శ్రుతు లపౌరుషేయములు. మిగిలిన వన్నియుఁ బౌరుషేయములే.

పైవాని కన్నిటికి నుపదేశములనియు శాస్త్రము లనియు వ్యవహారముకలదు. అయ్యది యుక్తమే. ఉపదేశమనఁ గర్తవ్యాకర్తవ్యములలో నొకదానిని బోధించు పౌరుషేయాపౌరుషేయములయిన వాక్యములలో నొకవాక్యము. అదియే శాసించునదగుటచే శాస్త్రమనియుఁ జెప్పఁబడును.'శాసు' (అనుశిష్టౌ) అను ధాతువుకంటెఁ గరణార్థమున ష్ట్రన్ ప్రత్యయమువలన శాస్త్రమనురూపము సిద్ధమగుచున్నది. ఎయ్యది విధినిషేధములను శాసించుచున్నదో అదియే శాస్త్రమని తాత్పర్యము. కావుననే "ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేనకృతకేనవా పుంసాం యేనోపదిశ్యేత తచ్ఛాస్త్ర మభిధీయతే" అని యభియుక్తులు నుడివియున్నారు.

ముఖ్యముగ శాస్త్రోపదేశశబ్దవ్యవహారము శ్రుతులకే వర్తించు ననియు మిగిలినవేనికైన నట్టివ్యవహార ముపచరితమనియు (శాసకత్వధర్మముచే లక్షణావ్యాపారమువలన సిద్ధించినది) గ్రహింపనగును.

ప్రతిశాస్త్రము వేదమూలకముగా నుండవలయును. అట్టిదానినే యంతర్వాణివర్యు లాదరింపవలయును. ఈవిషయమే పద్మపురాణమున బదునేడవ యధ్యాయములో "అతో వేదవిరుద్ధార్థ శాస్త్రోక్తం కర్మసంత్యజేత్ । స్వబుద్ధిరచితైశ్శాస్త్రైః ప్రతార్యేహచ బాలిశాన్ । నిష్కున్నిశ్శ్రేయసో మార్గం లోకనాశాయ కేవలం । నిందన్తి దేవతా వేదాం

స్తపో నిందన్తి సద్ద్విజాన్ । తేనతే నిరయం యాంతి హ్యసచ్ఛాస్త్రనిషే వణాత్ । శ్రుతిస్మృతిసదాచారవిహితం కర్మ శాశ్వతం । స్వం స్వం ధర్మంప్రయత్నేన శ్రేయోఽర్థీహ సమాచరేత్" మొదలగుశ్లోకములచేఁ బ్రతిపాదింపఁ బడియున్నది. కాన వేదావిరుద్ధ మగుశాస్త్రమునకే పరిగ్రాహ్యత యని సంప్రదాయము.

## ౨. శాస్త్రపరిగణన.

శాస్త్రములలోఁ బ్రసిద్ధ వ్యవహారగోచరము లాఱు. అయ్యవి వ్యాకరణ పూర్వమీమాంసోత్తరమీమాంసా సాంఖ్య వైశేషిక న్యాయనామకములు. వీనికే దర్శనములనియు వ్యవహారముగలదు. "పాణినే ర్జైమినేశ్చైవ వ్యాసస్య కపిలస్యచ, కణాద స్యాక్షపాదస్య దర్శనాని షడేవహి" అను నార్యోక్తి యిందుఁ బ్రమాణము. అయినను బూర్వోక్త శాస్త్రలక్షణాక్రాన్తవిషయములగుటచే యోగచ్ఛందో జ్యోతిరాదులకును శాస్త్రవ్యవహారముచితము;లోకమున జాగరూకమై యున్నదికూడ. పదానుశాసకత్వ, కర్మ నిరూపకత్వ బ్రహ్మప్రతిపాదకత్వ పదార్థపరిశీలకత్వాదిలక్షణములచే వ్యాకరణ పూర్వోత్తర మీమాంసా న్యాయవైశేషికాదులకెట్లు శాస్త్రత్వ వ్యవహారము సిద్ధించినదో యట్లే జ్యోతిశ్ఛందో యోగాదులకును వేద విహితకర్మల కుపయోగించు కాలాదులను బోధించుట, వేదసంరక్షణ సమ్యగ్విజ్ఞానాదుల కుపయోగించుఛందస్సులను నిరూపించుట మొదలగు లక్షణములచే శాస్త్రత్వ వ్యవహారము సిద్ధించును.

తత్త్వము నాలోచింప, సాక్షాత్తుగఁ బురుషార్థ సాధనాదుల నుపదేశించు స్వభావముగల వేదమున కవిరుద్ధము, పరంపరగఁ బురుషార్థ సాధనాదుల నుపదేశించు స్వభావముకలదియు నగునేదేని యొక యపూర్వార్థమునెయ్యది బోధించునోయట్టిది సర్వమును శాస్త్ర మనిచెప్పుటయుక్తమని తోఁచెడిని. కాన "ఇతిహాస పురాణాభ్యాం

వేదం సముపబృంహయేత్ । బిభేత్యల్పశ్రుతాద్వేదో మా మయం ప్రహరిష్యతి" అని చెప్పినరీతిగ వేదోపబృంహకములగు నితిహాస పురాణాదులకు వర్ణస్వరమాత్రాది బోధకమగుశిక్షకు వేదార్థమును నిర్వచించు నిరుక్తమునకు మన్త్రవినియోగముచేఁ గ్రత్వనుష్ఠానాదులనుపదేశించు కల్పములకు నిట్లె తత్తల్లక్షణములవలన ధర్మశాస్త్రాదులకును శాస్త్రత్వము నంగీకరింపవచ్చును. కావుననే శాస్త్రపరిగణనయం దవ్యవస్థ చిరకాలమునుండి యనుభూతమగుచున్నది. ఎట్లన ? శాస్త్రము లాఱేయని కొందఱందురు. "అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః । పురాణం ధర్మశాస్త్రంచ విద్యా హ్యేతా శ్చతుర్దశ" అను నార్యోక్తినిఁబట్టి శాస్త్రములు పదునాలుగని మఱికొందఱు. ఆయుర్వేద ధనుర్వేద గాంధర్వవేద శిల్పవేదనామకములగు నుపవేదములను గూడ పై పదునాలుగింటితోఁగలిపి పదునెనిమిది శాస్త్రములనుట యుక్తమని యింకకొందఱి యభిప్రాయము వార్తా దండనీతులను గలిపి యిరువదివిద్యలని కొందఱియాశయము. కావ్యాలంకార శాస్త్రమును గూడఁ గలిపినచో నిరువదియొక్క విద్యలగునని కావ్యాలంకార తత్త్వవేత్తల తాత్పర్యము. ఇట్లే కొందఱు శాస్త్రములకు విద్యలకుఁ గళలకుఁ బరస్పరభేదము నంగీకరించుచున్నారు. శాస్త్రములకు విద్యలకు నభేదమును, కళలకుఁ బార్థక్యమును గొందఱొప్పుచున్నారు. అన్నిటికి నైక్యమును ముఖ్యముగఁ గొన్నింటికి నౌపచారికముగఁ గొన్నిటికిని శాస్త్రవ్యవహారమును విమర్శకు లభిలషించుచున్నారు. మొత్తముపైని శాస్త్రసంఖ్యాన మనాదిసిద్ధమగు నొక నిశ్చయమునను సరించి యుండలేదని దీనివలన స్పష్టమగుచున్నది. అందుచే నిట్టి యభిప్రాయభేదములకంటె శాస్త్రము లనంతములనుట సముచితము "అనంతా వై వేదాః" అను నభియుక్తోక్తివలె "అనంతాని వై శాస్త్రాణి" అను నభియుక్తోక్తినిఁగూడ నంగీకరింపవలయును.

## ౩. సాహిత్య పదార్థము.

ఇట్లు శాస్త్రలక్షణాదులను సంగ్రహముగఁ బరిశీలించిన పిదపఁ బ్రకృతమున సాహిత్యమునకు శాస్త్రత్వము కలదా ? లేదా ? యను విషయమును జర్చించుటకుముందు సాహిత్యపదార్థమును గొంతవఱకు విచారింపవలసియున్నది. సహితశబ్దముకంటె భావార్థమున ష్యఞ్ ప్రత్యయముతో సాహిత్యశబ్ద మేర్పడుచున్నది. సహితశబ్దమునకు సంయుతములని (కలిసియున్నవి) యర్థము. కానఁ బరస్పరము కలిసి యున్న పదార్థములభావము (అనఁగా కలయిక) సాహిత్యమని సామాన్యముగ వ్యాకరణానుసారియగు వ్యుత్పత్త్యర్థము లభించును. ఈసాహిత్యపదమును "పంచమీ సాహిత్యవిద్యా" ఇత్యాదివాక్యములచే రాజశేఖరాదులు మొదట నలంకారశాస్త్రపరముగ నుపయోగించిరి. క్రమముగ రుయ్యక విశ్వనాథాది విరచితములగు సాహిత్యమీమాంసా సాహిత్యదర్పణాది గ్రంథములవలన నీసాహిత్యపదము కావ్యపరముగ నలంకార శాస్త్రపరముగను లోకమునఁ బ్రసిద్ధిని వడసెను. దీనికిఁ గారణ మిదియై యుండవచ్చును:— ప్రాచీనాలంకారికాగ్రేసరులగు భామహాదులు "శబ్దార్థౌ సహితౌ కావ్య"మ్మని కావ్యలక్షణము నంగీకరించిరి. పిదపఁ గొంతకాలమున కానంద వర్ధనాచార్యులు మహాసంరంభముతో విలక్షణమగు కావ్యాత్మను స్థాపించినను శబ్దార్థములకుఁ గావ్యశరీరత్వమును ద్రోసివేయలేదు. మమ్మటాద్యాలంకారి కాచార్యులందఱు దీనినే యనుసరించిరి. కానఁ గావ్యపదమునకు సామాన్యముగ శబ్దార్థము లనియర్థము "నను శబ్దార్థౌ కావ్యమ్" మొదలగు కావ్యానుశాసకుల సంవాదము లీవిషయమునఁ బెక్కులుకలవు. శబ్దార్థములు (పరస్పరాఽవియుక్తములు) శబ్దమునువిడిచి యర్థము నర్థమునువిడిచి శబ్దమును నుండవని యభిప్రాయము. కావుననే కవికులపతి కాళిదాసు పార్వ[illegible] లను శబ్దార్థములతోఁబోల్చెను. లోకమున నేభాష

మైన నేసంభాషణమైనఁ గొనకే వ్యవహారమైనను శబ్దార్థములనువిడిచి ప్రతిష్ఠనుఁ బొందఁజాలదు. అందుచేతనే శబ్దార్థములకు సమప్రాధాన్యము. ఈవిషయమున "శబ్దార్థౌ సత్కవిరివ ద్వయం విద్వానపేక్షతే" అని మాఘుని సంవాదమున్నది. ఇట్టి పరిస్థితినిబట్టి "సహితములగు శబ్దార్థములభావము (సహితయోః=శబ్దార్థయోర్భావః) అనఁగాసంబంధము సాహిత్య మనుతలంపుతో మొదటఁ గావ్యపరముగను గ్రమముగ శబ్దార్థస్వరూపాది నిరూపకమగు శాస్త్రపరముగను సాహిత్యపదము నుపయోగించిరి. కొంతకాలమునకదియే రూఢప్రాయమైనది. అని

సహితము లన శబ్దార్థములనియు వానిసంబధమే సాహిత్యమనియు శాస్త్రకారు లందఱు నొప్పుకొనవచ్చును. కాని శబ్దార్థసంబంధ విషయమున మాత్ర మభిప్రాయములు భిన్నభిన్నములుగనుండును. "పదపదార్థసంబంధము శక్తియనఁబడును. అయ్యది యీపదమువలన నీయర్థము నెఱుఁగునది యను నీశ్వరేచ్ఛారూపము" అని నైయాయికుల యాశయము. "అనాదిసిద్ధ మగుబోధహేతుత్వముశక్తి. కావుననే "ఇంద్రియాణాం స్వవిషయే ష్వనాది ర్యోగ్యతా యథా। అనాదిరర్థైశ్శబ్దానాం సంబంధో యోగ్యతా తథా" అనిచెప్పఁబడినది." అని వైయాకరణులయభిప్రాయము. ఇట్లే మరికొందఱు శాస్త్రకర్తలును దమ తాత్పర్యముల నీషద్వైషమ్యముతో సూచించిరి. ఇట నాలంకారికులు వేఱుమార్గముల ననుసరించిరి. శృంగార ప్రకాశకారుఁడగు భోజరాజు శబ్దార్థముల సంబంధమే సాహిత్యమనుచు నాసంబధమునుఁ బండ్రెండు విధములుగ నిరూపించెను. చూడుడు:— "కింసాహిత్యం? యశ్శబ్దార్థయోస్సంబంధః। సచ ద్వాదశధా। అభిధా, వివక్షా, తాత్పర్యం, వ్యపేక్షా, సామర్థ్యం, అన్వయః, ఏకార్థీభావః, దోషహానం, గుణోపాదానం, అలంకారయోగః, రసాఽవియోగశ్చేతి" అని ఈపండ్రెండింటికి సాహిత్యములనియే వ్యవహారము. కాని వీనిలో మొదటియెనిమిది

వ్యవహారసామాన్యసాహిత్యములనియుఁ గడపటినాలుగు కావ్యని యతసాహిత్యములనియు భోజుఁడు తలంచెను. ఈవిశేషమును సరస్వతీ కంఠాభరణవ్యాఖ్యాతయగు రత్నేశ్వరుఁడు "ధ్వనిర్వర్ణాఃపదం వాక్య" మిత్యాది ప్రథమశ్లోకవ్యాఖ్యానమున స్పష్టపఱచెను. "తదయ మత్ర తాత్పర్యసంక్షేపః। సాహిత్యస్వరూపనిరూపణాయ కిల ఏషగ్రంథా రంభః। సాహిత్యంచ శబ్దార్థయోస్సంబంధః। తత్రశబ్ద ఏవ కఇత్యా కాంక్షాయా మయం విభాగోధ్వనిరిత్యాది। అర్థస్తు స్తంభకుంభాది లక్షణో లోకేశాస్త్రేచ ప్రసిద్ధః। సంబంధః కశ్చి దనాదిః। సర్వస్యాయ మానస్తు సంబంధో నాఽన్యత్రేత్యస్మిన్నాయతతే। స చతుర్విధః। దోషహానం, గుణోపాదానం, అలంకారయోగః, రసాఽవియోగశ్చ" మొదలగు వాక్యములచే భావప్రకాశకర్త శారదాతనయుఁడును "ద్వాదశధా సంబంధ శ్శబ్దస్యార్థస్యయ స్సాహిత్య"మిత్యాదివాక్యము లచేభోజునే యనువర్తించెను. మరికొందఱాలంకారికులుగూడనీమతము నే యించుమించుగ సమర్థించిరి. అందుచే వీరందఱిమతమునఁ గావ్య నియతమగు రసాఽవియోగాదిరూప శబ్దార్థసంబంధము సాహిత్య పదార్థము.

(సావశేషము).

# గ్రంథస్వీకారము.

1. శ్రీరామకృష్ణమఠస్వర్ణోత్సవ సంపుటము. (1948) శ్రీరామకృష్ణమఠము. (మైలాపూరు) చెన్నపురి వారిచేఁ బ్రకటింపఁబడినది.

ఈ స్వర్ణోత్సవ సంచిక సుందరమగు చిత్రములతోడను శ్రీరామకృష్ణ వివేకానందాది మహనీయులను గూర్చియు, వేదాంత విషయములను గూర్చియు వివిధవ్యాసములతోడను విరాజిల్లుచున్నది. సనాతనధర్మోద్ధరణము సత్యాహింసలు మొదలగు ధర్మవిషయక వ్యాసములు గలవు, దక్షిణభారతదేశమున శ్రీరామకృష్ణసేవా సంఘప్రారంభవికాసము లుగూడ వివరింపఁబడినవి. హిందూమత ధర్మ పునరుద్ధరణమునకై శ్రీరామకృష్ణవివేకానందులు గూర్చిన మహత్ప్రయత్నములును, వారిమతప్రచారమును పవిత్రజీవితములును దెలియని హైందవు లుండుట యరుదు. కేవల మతవిషయముననేగాక విద్యాపోషణము క్షామనివారణము మొదలగు సాంఘిక విషయములందును శ్రీరామకృష్ణమఠమువా రొనర్చుచున్న దేశసేవ ప్రశంసనీయము.

వెల 2-0-0.

2. కుందమాల— శ్రీబులుసు వెంకటేశ్వర్లు బి. ఏ. గారిచే రచింపఁబడినది. ఇది దిఙ్నాగుని సంస్కృతనాటకమున కాంధ్రీకరణము. కీ. శే. వడ్డాది సుబ్బారాయకవిగా రొనర్చిన యాంధ్రీకరణము రసవత్తరముగాదని పలువురు పెద్దలభిప్రాయపడుటచేతను శ్రీరాముని దివ్యచారిత్రసంకీర్తనము చేయుతలంపుతోడను గ్రంథకర్త లీ నాటకము ననువదించిరి. పీఠికలో దిఙ్నాగుని కాలనిర్ణయము కుందమాలాప్రశస్తి భవభూతి విరచితోత్తర రామచరితతోఁగల పోలికలు వైషమ్యములు వివరింపఁబడినవి. కుందమాలలో వైశిష్ట్య నిరూపణమునకై భవభూతిరచనమును గూర్చి పీఠికలో వ్రాయఁబడిన విషయములు సహృదయరంజకములు కాఁజాలవు. అదెట్లున్నను దిఙ్నాగుని కృతి యుత్కృష్టమైన దనుట నిర్వివాదాంశము. అనువాదము మూలము ననుసరించి సులభశైలిని రచింపఁబడినది. (వెల 2-0-0)

౩. వివేకచూడామణి శ్రీ దర్భా సుబ్రహ్మణ్యశర్మ విరచితము. (పద్య కావ్యము.)

"యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ! అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్" అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితోఁజెప్పిన చొప్పున అధర్మము ప్రబలి ధర్మమున కొత్తుడు కలుగునపుడు భగవంతుఁ డవతరించి అధర్మము నడఁచి ధర్మము నుద్ధరించుచుండును. ఒకప్పుడు భారతదేశమున జైనము బౌద్ధము సౌతా ము కాపాలికము మొదలగు దుర్మతములు పెచ్చుపెరిఁగి అనాదియైన యార్షమత మంతరితప్రాయ మయియుండ నద్దాని నుద్ధరించుటకై పరమేశ్వరుఁడు శ్రీ శంకరాచార్యస్వాములై యవతరించి సకలవిద్యాతత్త్వజ్ఞత మెఱసి సర్వతంత్రస్వతంత్రులయి ప్రస్థానత్రయము నకుభాష్యములు రచియించి శిష్యబృందముతో ఆసేతుశీతాచలముగ సంచారమొనరించి పెక్కండ్రు విమతస్థుల నోడించి యెల్లయెడల అద్వైతమతమును నెలకొలిపెను. ఆభాష్యములయందు శంకరులు పై నుడివిన నాస్తికమతములనేకాక, పూర్వమీమాంస, సాంఖ్యము మున్నగు మతములసైతము ఖండించిరి. కావున, ఆభాష్యములు బహు శాస్త్రకృతశ్రములయిన యుత్తమాధికారులకే సుబోధములగుట మధ్యమాధికారులకై ప్రకరణగ్రంథములను, మందప్రజ్ఞుల కుపకరించుటకు బహువిధస్తోత్రసముచ్చయమును వెలయించిరి. ఆప్రకరణ రత్నములలో నాయకమణి వివేకచూడామణి. గ్రంథమంతయు గురు శిష్య సంవాదరూపమున సూక్ష్మాతిసూక్ష్మవిషయముల విస్పష్టముగ వివరించుచు, పరమపదసౌధాధిరోహణమున కనువగు సోపానమార్గ మనఁదగియున్నది. శంకరభగవత్పాదుల కవితారీతి వెన్నెలవలె సర్వ లోకరంజకమయ్యును, అర్థగౌరవమునను భావగాంభీర్యమునను అన న్యాదృశమయి సామాన్యులకు దురవబోధముగానుండును. అందువలన

ఈవివేకచూడామణి సరళతరమగు సంస్కృతభాషలో రచింపఁబడిన దయినను, ఆభాషయం దంతగా నభ్యాసములేనివారికి- ఆంధ్రులకు-అర్ద ములోని ముల్లెవలె నందుకొన నశ్చకుండెను. నేఁటికి నెల్లూరుపుర వాస్తవ్యులు, అభినవతిక్కన బిరుదాంచితులు గీర్వాణాంధ్రాంగ్లాద్య నేకభాషా సాహిత్యనిష్ణాతులు బ్రహ్మశ్రీ దుర్భాసుబ్రహ్మణ్యశర్మ విద్వద్వరులు అనఁటిపండొలిచి చేతి కందిచ్చు నట్లాకృతిరత్నము నాం ధ్రుల కనాయాసబోధ్యమగునటులు తేటతెల్లమగు మాటలతో తెలుఁగున ననువదించి యాంధ్రజనుల యభివాదనస్తుతుల కాస్పద మయిరి.

'జగ మెఱిఁగిన బ్రాహ్మణునకు జందెం బేలా' యన్నట్లు సక లాంధ్ర లోకసంస్తుతి పాత్రమయిన శ్రీ శర్మగారి రచనయందలి విశేషములను బ్రశంసింప నెంచుట ప్రభాకరునిఁ గరదీపికతోఁ గనఁ బఱుపఁ దొరకొనుటయే యగును. అయినను శ్రీ సుబ్రహ్మణ్యశర్మ గారు సుశిక్షితమగు తమ వైదుష్యమునకు సుస్థిరమగు తమ యాత్మాను సంధానానుభవము తోడుపడ భగవత్పాదుల భావవైభవమును దమ యనువాదమునం దెట్లు పొందుపఱచిరో పరిశీలించు కుతూహలముతో నే నీయనువాదము నాస్థతో నామూలాగ్రముగఁ జదివితిని. శ్రీ శర్మ గారు లలితలలితములగు తెలుఁగుపలుకులలో మధుర మధురములగు శంకరుల భావములను మనవారికిఁ జుబ్బనచూఱ గావించిరి. చిత్త గింపుడు:—

శ్లో. సమ్యగ్విచారత స్సిద్ధా రజ్జుతత్త్వావధారణా।
భ్రాంత్యోదిత మహాసర్పభయ దుఃఖ వినాశనీ॥

ఆ. త్రాడు పామటంచు భ్రమ గొన్ననరుని యు
తలము వెతయుఁ బాప వలఁతియొన
రజ్జుతత్త్వబోధ రహి విచారమునఁ గా
కన్యమునను లభ్యమగునె యెచట?

శ్లో. దోషేణ తీవ్రో విషయః కృష్ణసర్ప విషాదపి ।
విషం నిహన్తి భోక్తారం ద్రష్టారం చక్షు షాప్యయమ్ ॥

ఆ. కాలసర్పవిషముకంటెను విషయంబు
క్రూరతరము చెడుగుఁ గూర్చుటందు
విషము చంపు భోక్త, విషయంబో కన్నులఁ
గన్నవానిఁగూడఁ గసిమసంగు ॥

పైపద్యములలో నేయొక్కపదమును మార్చినను మూలమందుఁ గలభావము కోలుపడును.

వీరు గ్రంథ మాద్యంతమును హెచ్చుతగ్గులులేక మూలమును సూటిగ ననువదించియు ఒక్కొకపట్టున తదుపరంజకముగ మూల భావముకుళములను వికసింపఁజేసిరి.

మచ్చున కొక్క యుదాహరణము:—

శ్లో. ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే యత్స్వప్న దేహే హృది కల్పితాంగే ।
యథాత్మబుద్ధి స్తవ నాస్తి కాచి జ్జీవచ్ఛరీరేచ తథైవ మాస్తు ॥

సీ. కదలినఁ గదలు చొక్కట నిల్వ నిలుచుచు
సీతోడఁ బర తెంచు నీడయందు,
అతి నిర్మలం బైన యద్దంబునను దోఁచు
చక్కని నీ ప్రతిచ్ఛాయ యందు
స్వప్నంబున జనించి బహువిధవ్యాపార
ముల నాచరించునిమూర్తియందు,
ఇల్లుండు నంచు నూహించుచో నీకు నె
మ్మనమునఁ బొడకట్టు తనువునందు
నే ననెడి బుద్ధి యేరీతి నీకు లేదో
యట్లె జీవచ్ఛరీరంబునందుఁగూడఁ
బొడమ కుండునుగా కహంబుద్ధి నీకు
లేశమైనను భ్రమనైన లీలనైన.

పలుతావులం దీవిద్వత్తల్లజులు సూక్ష్మార్థ ప్రతిపాదకములగు ఘట్టములఁ గావించిన యనువాదము వీరి వేదాంత విద్యాతత్త్వజ్ఞతనే కాక వీరిచిరతరానుభవమును జెప్పక చెప్పుచున్నది.

ఈపద్యమును దిలకింపుఁడు:—

గీ. వెలి నిరోధింపఁగ మనమ్ము కలఁక దేఱు
తుది కలఁక దేఱఁ దోఁచుఁ బ్రహ్మమ్ముచక్క-
బ్రహ్మ తుది దోఁప సంసారబంధ మెడలు
వెలి నిరోధంబె ముక్త్యవాప్తికిఁ బథంబు.

నిజముగ యనుభవముండినవే కాని విషయమంత సులభముగఁ జెప్ప వలమపడదుగదా! మఱియొక యుదాహరణము:—

గీ. చదలువలె బట్టబయలులయి కదలికయును
మితియు మార్పు మలంబు వికృతియుఁ దుదయు
లేని యద్వయబ్రహ్మంబు తానె స్వయము
ఇంతకంటెను బోధింప నేమి కలదు.

ఇందు బ్రహ్మతత్త్వము నెంతసూటిగఁ దెలిపిరో గమనించితిరిగదా.

అభినవ తిక్కనయని ప్రఖ్యాతివడసిన శ్రీ శర్మగారి రచనా కౌశలమునుగాని సాహిత్యస్థాపక బిరుదాంచితులయిన వీరి వైదుష్య ప్రకర్షమునుగాని నిరూపింపనెంచుట చర్వితచర్వణమే యగును. కాన అది యట్లెయుంచి యొక్కయంశమునుమాత్రము వ్రాయుదును. అది యేదియన, క్లిష్టతమములయిన వేదాంతవిషయములను దేటమాటలతో స్పష్టముగాఁ దెలుపుటయందు శ్రీ శర్మగారి రచన మడికి సింగన కవితారీతిని బుడికి పుచ్చుకొన్నదనుటయే.

దుర్బోధములయిన బ్రహ్మవిద్యా రహస్యార్థముల నాచార్య సూక్తుల కన్యూనాతిరిక్తముగ నింత సుబోధముగ ఆంధ్రలోకమున కందఁజేయుట యన్యుల కసాధ్యమనుట సత్యదూరము కాదేమో? శ్రీ శర్మగారు పరమార్థబోధకములగు నిట్టి ప్రకృష్టగ్రంథముల రచియించి లోకోపకారమును భాషాపోషణమును గావించుచుండు నట్లు సర్వశక్తుఁడగు సర్వేశ్వరుఁ డనుగ్రహించుఁగాక!

ప్రయాగ వేంకటరామశాస్త్రి.

క. హారచరణహ స్తముల నూ
పురకంకణరేఖ నున్న భుజగాంకంబుల్
గర మొప్పు సరసిజంబుల
బెరసిన నవబిసము లనఁగఁ బ్రియకరలీలన్.

క. శ్రీకారంబుల క్రిందటి
యీకారంబు లన మెఱసె నీశ్వరకర్ణ
వ్యా(కీర్ణ)కుండలీకృత
గోకర్ణకులాధిపతు లకుంఠితగరిమన్.

వ. ఇవ్విధంబున నిజశరీరమున శ్రీపూర్వశృంగారంబుగాఁ దగిన ఫణి వల్లభుల ధరించి వారలందఱకును బాతాళంబు నివాసంబుగా వివరించి యాశ్రితవాంఛితపోషణుం డయ్యహిభూషణుం డనన్య సామాన్యవిశేషంబునఁ గైలాసంబునకు విజయంచేసె.

క. తనరి భుజజంగమధారణ
మునఁ దగునీభవుని లీల యులవడ గణియిం
చిన వినిన భాసినం ద
జ్జనులకుఁ బొరయంగ వెఱచు సర్పభయంబుల్.

పదునొకండవలీల.

ఆ. వె. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
భవుఁ డవధరించినట్టిలీల
యఖిలవందనీయ మగుచు గంగాధర
ణాహ్వయమున నదియ నలరుచుండు.

సీ. తనకీర్తికర్పూరమునఁ జతుర్దశమహా
భువనకరండముల్ పూర్ణములుగఁ
దనప్రతాపానిలమున్నన నన్యరాజన్య
సుభటకాననములు చూర్ణములుగఁ

తనకీర్తికాసారమున నంగనావలో
కనమీనపోతము ల్గలితములుగఁ
దనదానరవితేజమున విద్వదుద్దామ
దారిద్ర్యతిమిరముల్ దళితములుగ

ఆ. వె. జగతి వెలయు నుగ్రసముదగ్ర జృంభణా
రంభజయరమాకరోత్సవార్థ
వృత విభాసితాసి వివిధభూషణపరి
స్ఫురితభుజుఁడు సగరధరణివిభుఁడు.

ఉ. వారక యేడుదీవులు నవక్రమహత్త్వము మీఱ నేలెఁ దా
భూరమణుండు మారటబుభుప్రవరుండునుబోలె నిర్మలో
దారగుణానుబంధన విధాపరికీర్తిత చక్రవర్తితా
స్ఫారతరప్రభావప్రతిసంస్తుతిలోల జగత్ప్రమోహుఁడై.

వ. ఒక్కెడనాఁ డక్కమలాప్తసంశోకరుండగు సగరుం డాత్మగతంబున నాత్మజులు లేనివానికి సామ్రాజ్యంబు గలిగియుఁ బూజ్యంబుగాదు గావున బహుతనూభవలాభంబునకుఁ బరమేశ్వరు గుఱించి తపంబాచరించి చరితార్థుండ నగుదునని యూహించి తత్పరత సన్నాహించి యుచితసచివన్యస్త కార్యభారుండును విసృష్టపరివారుండును నగుచు మహిషీద్వయ సహితంబుగాఁ దుహిన మహీధరంబుకొన కరిగి పావనస్థలంబున నిలిచి తీవ్రతర వ్రతచర్యాధుర్యభావంబున ననేకకాలంబు తపంబు సేయుచుండఁగను.

సీ. కటిమండలంబునఁ గనుపట్టు కరిచర్మ
మలఁతి చీకటితోడఁ జెలిమిసేయఁ
గరశూలమున మీఱు ఘనధార లాఱును
బాయక ధగధగ ప్రభలనీనఁ

గర్ణసంగతభుజంగములు మస్తకమందు
మణు లరుణాబ్జగుంభములఁ జూడఁ
దలమీఁద నెలకొన్న నెల రెండు కొమ్ములఁ
జాలుచు నమృతంబు జాలువాఱ
వచ్చి సన్నిధిచేసెను వరదయార్ద్రి
భావమున నవ్వసుంధరావాలునకును
పదయుగప్రణామనిషక్త భక్తలోక
శోకహారణప్రతాపభాసురుఁడు హరుఁడు

ఆ. వె. అట మహీపతియును నా జగత్పతిమ్రోల
సతులతోడఁ గూడఁ జాఁగి మ్రొక్కి
యుచితసరణి హస్తయుగళి ఫాలస్థలిఁ
దెలుఁగుపఱచి యభినుతింపఁ దొణఁగె.

కవిరాజవిరాజితము.

జయవరదాయక సర్వవిధాయక సంయమినాయక సాంధ్రశుభా
శ్రయగుణపోషణ సాధ్వసశోషణ సంగతితోషణ జన్మమహా
భయవినివారణ పాతకహారణ భక్తజనప్రియ భాగ్యకళా
శ్రియకనిరీక్షణ రాక్షసశిక్షణ భావజసంహార రాజధరా ॥
శరణమనామయ సారదయామయ సంగతభూమ యశశ్వయశం
మరుదదిగుత్తర మానవనిరంతర మంగళకాంతర మానససం
చరణమనోహర సత్యజయాహర సత్పరిణామ రసావహతా
పరిణతభూషణ పాతకదూషణ భంగివిదూషణ ఫాలదృశా!

వ. అనుచు వినుతించిన శివుఁ డతని నాదరించి కోరికయేమి యనవుండుఁ బ్రజాభర్త పునః ప్రణామంబుసలిపి, దేవ! భవత్ప్రసాదంబున నాకుఁ గుమారు లనేకులు గలుగవలయు ననవుండు, నయ్యుమాధవుండు సగరుతోడ నీభార్యలిద్దఱిలోన నొకతెకు వంశకరుండగు సుతుం

డొక్కరుండును వేఱయొక్క తెకు నవశ్రిపరాశ్రిములగు పుత్రు లఱువది వేవురునుం బుట్టుదురు; పొమ్మని యనుజ్ఞయిచ్చిన సకరి వారుండై రజతాచలంబునకు విజయంచేసె; నిక్కడ మహీపాలుం డునుం గళత్రద్వయంబుతోడ రా నాత్మనగరంబున కరిగి యుండు సమయంబున

చ. అల వడ దోఁచె సంగముల నాననము ల్వెలవెల్ల బాఱె న
ఖులు వెడవాడఁజొచ్చెఁ గడుకోరిక లీరికలెత్తెఁ జన్నుము
క్కుల హరినీలరుచి కుంభములం గనుపట్టె నాధరా
తలపతి భార్యలిద్దఱకు బాహ్యదకౌతుక ముల్లసిల్లఁగన్.

క. ఆయబలలో నంతట
నాయతమును మిగుల వలము నగునానుగపుం
గాయ జనించెను నొకతెకు
హేయపడుచుఁ బ్రజలు వగవ నీశ్వరుమాయన్.

క. అంతటలోనన రెండవ
కాంతయు నిజతేజమునఁ బ్రకాశగతి న్భా
స్వంతుని నెనసినసద్గుణ
వంతుని నొకసుతునిఁ గనియె వారని నేడ్కన్.

వ. ఇట్లు దనభార్యలవలన నలాబూఫలంబునుం గుమారుండును నుద్భ వించుట దాదులవలన విని తెలుఁగని ఖేదమోదంబులు మానంబునం బెనంగొనఁ గొడుకున కభిరామంబుగా నసమంజసనామంబుగావించి యనంతరంబ కింకరులం గాంచి షష్టిసహస్ర సంఖ్యాకంబులగునంద నానీకంబు గలుగు ననుచు శివుండు కృపనిచ్చినవరంబు వృథపుచ్చిన వదరు పుట్టిన యది; యిట్టిది మనకేఁటికి బహిష్కరించి రండను సమయంబున

క. మోహారయమ్మునఁ బలికితి
వోహో యవనీశ వలవ దుడుగుము దగదీ
సాహస మమోఘఫలదం
బాహరునానతి నిరర్థ మగునే తలఁపన్.

క. ఈవదరు కాయలోనివి
కేవలబీజములు వుచ్చి ఘృతకుండికలన్
వేవేగ వేలువేలుగ
నీవేళయ యునుపఁ బనుపు మెలమి నృపాలా!

క. అరుదుగ నందు జనింతురు
వరుసన నీకర్కవంశవర యఱువదివే
వురు నందనులు రణాంగణ
పరుషపరాక్రములు దీర్ఘబాహాపరిఘుల్.

వ. మఱియు నీయఱువది వేవురకును నేకకాలంబ మృత్యుభయంబు నొదవ నసమంజసుఁడు వంశకరుండు గాఁగలండని యాకాశసరస్వతి దేటపడం బలికిన విని సగరుండును దదుక్తభంగి నంగీకరించి పెక్కండ్రుపుత్రులం బడసెఁ; గొంతకాలంబునకు నంశుమంతుఁడను పేర నసంజసునకుఁ గుమారుండు వొడమె ననంతరసమయంబున

క. వెస వెఱ్ఱివట్టి యంతయుఁ
గొసరక పురదేశజనులకున్ బహుతరసా
ధ్వసముగ మెలంగఁగా న
య్యసమంజసు రాజు విడిచి యవనికిఁ బాపెన్.

గీ. ఇట్లు నిష్కంటకంబుగ నేపు మిగిలి
జగతి నిమ్మగ నేలుచు సగరవిభుఁడు
దివుట నశ్వమేధమ్మను సవనమునకు
దీక్షఁ గావించియుండి యుదీర్ణమహిమ.

ఉ. యాగతురంగరక్ష కొఱ కావసుధేశుఁడు వేడ్కతోడ దే
జోగరిమాసదృక్షము నజప్రముఖాస్త్రదురీక్షముం జయా
భాగగుణావతంసముఁ బ్రభూతకఠోరయశఃప్రశంసమున్
సాగరజాతముం బనిచె షష్టిసహస్రగణప్రణీతమున్.

మ. సియమాశ్వంబును వెంట నేమరక పూన్కిన్క్రమించి యాసాగరో
చ్చయము న్సంగడి ఱేఁగె విశ్వధరణీసంచార కారంభమ
ర్షయ నానారదదంతిరాజి సుభట వ్రాతప్రమాణంబుగన్
వియదాశాంతర మఁతయుం బ్రతిరవావిష్కార ఘోరంబునన్.

వ. అంత నింద్రుండు సగరు మహత్త్వంబు సహింపక మాయాబలంబున మఖహయంబుఁగొని పాతాళంబునం గపిలముని యాశ్రమస్థానంబునఁ గట్టి యరిగె; నట్టిసమయంబున

ఉ. అశ్వముఁ జూడఁ గానక భయంపడి యాసగరాత్మనందను
ల్నిశ్వసనావలి న్వదననీరజము ల్గమలంగ మొత్తమై
యాశ్వనురూపయానముల నక్కడి కక్కడి కేఁగి యేఁగి యీ
విశ్వవసుంధరాస్థలి గవేషణచేసిరి పెక్కుభంగులన్.

క. ఇల నిట్టు లరసి యాహయ
తిలకము జాడ గనలేక దివమునకు రయో
జ్జ్వలగతులఁ జనియు నచటం
గలయ వెదకి లేకయున్నఁ గ్రమ్మఱి యలఁతన్.

వ. మధ్యభువనంబునకు వచ్చి యంతకమున్న యగస్త్యునిచేతం గ్రోలంబడి యపనీరంబగు నబ్ధిం జొచ్చి యదియంతయుం గ్రొచ్చి తదీయద్వారంబున భుజంగాగారంబునకుఁ జని యక్కడ నొక్కయెడ

క. కనిరా సాగరులొక్కట
మునినాయకు రూఢవృధసముద్గతలీలా
కనవర జ్వాలావీక్షణుఁ
ఘనలంబజటాకలాపకపిలుం గపిలున్.

ఆ. వె. అంత నతని వెనుక ననుపమ పాదప
స్కంధశాఖఁ దగులఁ గట్టినట్టి
మఖహయంబుఁ జూచి మనమున లేచిన
యలుక నిష్ఠురాత్ము లగుచుఁ గవిసి.

వ. అత్తాపసోత్తముంబట్టి యశ్వచోర! యింకెక్కడ వోయె దనుచు ననేకరూపంబులఁ గలుగు గర్జనాలాపంబులను దండించిన నతండు దనకు నొదవినయకారణనిందకుఁ గటకటంపడి ఘృతపతహుతవహుండునుంబోలె మండుచు రోషారుణాంతభీషణంబులగు వీక్షణంబులు దెఱచిన.

శా. కల్పాంతావసర ప్రపూర్ణ సముదగ్రవ్యగ్ర వహ్నిచ్ఛటా
కల్పాకారముతోడ విశ్వహరిదాకారాంతర చ్ఛాదనా
కల్పప్రక్రియఁ దద్విలోకముల సాక్షాద్భంగి దీపించి య
స్వల్పజ్వాలలఁ జేర్చె నొక్కయనలం బాసాగర వ్రాతమున్.

వ. ఇట్లమ్ముని కోపానలంబున వారలందఱు మ్రందిపోయిన, దత్క్రమం బంతయు నారదువలన విని సగరుండును విచారమూఢతం గొంతతడవు నిలచి తనకుం దాన తెలిసి తనః సనుమని నంశుమంతునిం బిలిచి మఖహయంబు తేరంబనిచిన నరిగి యతండును గపిలమునిం బ్రసన్నతాసనాథుంగా నలవఱించి యున్నయెడ.

మ. ఆతని యోగమార్గము రయంబున నమ్ముని బుద్ధిఁ గాంచియ
న్వీతదయామతి న్హయముని చ్చి భవత్పితృవర్గనాకథా
మాతతలీల దేవనది నాసగరాదులమీఁదఁ బాఱఁ బ్ర
ఖ్యాతముగాఁగ నీసుతుఁడు గాంచుఁ జుమీ యనిపల్కి పంచినన్.

ఆ. వె. అంశుమంతుఁ డప్పు డానన మమరంగ
మునిపుపాద కమలములకు నెరఁగి

హాయముఁగొనుచుఁ గదలి యవనిమీఁదికి వచ్చి
తాత కెఱుఁగఁజెప్పెఁ దత్క్రమంబు.

వ. అట సగరుండును గృతార్థుండగుచు నంశుమంతుని రాజ్యభారధు రంధరుంజేసి వనవాసయయ్యె; ఆతండు దిలీపుఁడను మహాపుత్రా పుం బడసి తనదురాజసిరికిఁ బట్టంబుగట్టిన ననంతరసమయంబున

ఆ. వె. ఆ దిలీపనామ మేదినీభర్తకు
నుదయమందెఁ బా నుదీర్ణ ఘనుఁడు
దివ్యగమననిపుణ దృఢమహారథుఁడు భ
గీరథుండు జనమనోరథుండు.

ఉ. ఆరవివంశ వల్లభుఁ డుదగ్రత నుర్వర నేలె నిర్మల
స్ఫారయశంబు దిక్కులకుఁ బాయనిచందనచర్చగా మహో
దారనిరూఢి దీనుల కుదాత్తనిధానముగా సముల్లస
ద్వీరగుణంబు శత్రులకు దేవపురీపథ దర్శనంబుగన్.

వ. అట్లనన్యసామాన్యచరిత్ర ఖేలనంబునఁ బ్రజాపాలనంబుసేయుచు భగీ రథుండు వృద్ధసచివవర్గంబువలనఁ గపిలు కోపానలశిఖలఁ దమ తాతలగు సగరులు గముగుటయును, వారలకు నాకాశగంగా సమానయనంబున నాకలోకసుఖంబు గలుగుననియుమ్ముని యంశు మంతునితోడఁ బలుకుటయు విని యాత్మగతంబున.

ఉ పంకజగర్భుని న్హృదయ పంకజపీఠికమీఁదనిల్పి యా
తంకవిదూర తత్పరత దంకక కొల్చిన నాత్మ మెచ్చి నా
వంకఁ బ్రసన్నభావ మొదవన్ దయసేయఁడె గంగనేల నా
కింక విచారమున్ దపము నేడెఱుఁ జల్పెదనంచు నేపునన్.

క. రాజ్య మహాభరమంతయుఁ
బూజ్యాన్వయ సచివహితము గాఁజేసి జగ
త్ప్రాజ్యశతాంగ మదావళ
వ్యాజ్యాదుల నిల్పి పుర మవారణ వెడలెన్.

వ. ఇట్లు వెడలి యొక్కరుండును హిమవన్నగంబున కరిగి సిద్ధమునీంద్ర విరచితసంభావనం బగు నొక్కతపోవనంబున నిలిచి క్రమంబునఁ గందమూలఫలపర్ణజలపవనంబులు కొండొకకాలంబు నడిపి యనంతరంబ నిరాహారనిష్ఠుండును నిరంతరప్రణవమంత్రజపగరిష్ఠుండును నగుచు విరించిఁగుఱించి బహుసహస్రవత్సరంబులు తపంబు సేయుకాలంబున

సీ. ఆమ్నాయరాజికీరామలారామంబు
భారతీసుందరీ ప్రాణవిభుఁడు
హృద్యానవద్యోత విద్యాలవాలంబు
హరినాభినీరరుహాంగవిభుఁడు
రాజహంసదర్పవిభ్రమవిధానంబు
హంసనాథ ప్రయాణరతుఁడు
లోహిత మహాఖ్యా కళాన్వితధారంబు ?
సర్వనిర్మాణ ప్రశస్తఘనుఁడు

గీ. రమణఁ జనుదెంచి గంగా భగీరథనృపాల
మణికి సన్నిధిఁ జేసె నిర్మలదమూర్తి
భావుఁ డనుపమవినుతప్రభావుఁ డతులి
తాఘసంశాసనుండు పద్మాసనుండు.

క. ఆనలువచరణములకు
న్వే నలువగు భక్తి మ్రొక్కి పితతానంద
శ్రీ నసమానము గాఁ దన
మానస మలరఁగ నుతించె మానసవృత్తియున్.

వ. అనంతరంబ బ్రహ్మదేవుండు గోడ దేవా! దేవర తోడ నాకుం బ్రసన్నుండవేని మత్పితరులగు సగరులకు దుర్గమస్వర్గపదసమారోహణసోపానపరంపరాయమాన తరంగయగునట్లుగా గంగ నవధరింపు;

మిలాతలమునకుం గొని చనియెద; మీ ప్రసాదంబున ననశ్వర యశంబుగనిమ్ము; నీదయ నని విన్నవించిన భగీరథు నాదరించి విశ్వసృజుం డిట్లనియె

క. క్షితినాయక యీయభిమత
మతిదుష్కర మితరజనుల కయ్యెడు నెటు నీ
కతులతపశ్చరణంబున
కతమున నావలనఁ బడయఁగా సుకర మగున్.

శా. మల్లోకంబుననుండి గంగయిటు సామర్థ్యంబున న్వచ్చుచోఁ
గల్లోలప్రభవన్మహాపతన సద్గాఢప్రవాహార్తిచే
వెల్లంబోవుఁ గగంగి యద్భుతముగా విశ్వంభరాచక్రము
దృల్లీల న్హరువేఁడు జూటమునయం దాఁగం దదుద్రేకమున్.

వ. ఇట్లు సిరుపద్రవంబుగా గంగ నిన్ననుసరించి ధరిత్రికి వచ్చుఁ దత్ప్రకారంబున కుత్సాహము సేయు మని పలికి వారిజసూతి యదృచ్ఛాగమనంబున నరిగె; నట భగీరథుండును బవిత్రామలశరీరుండును సదాచారభరితోపదేశుండును బంచాక్షరీమంత్ర జపాసక్తభావుండును నగుచు నితాంతభంగిఁ దపంబునకుఁ గడంగి,

మ. భవుఁ బూజించు భుజంగమాభరణునిం బ్రార్థించు దాక్షాయణీ
ధవు వర్ణించుఁ బినాకచాపధరునిం దర్కించు నానందసిం
ధువుఁ బాటించు లలాటలోచనుని సంతోషించు నాదిస్వయం
భువుఁ బాలించు నిరంతరంబుఁ దగ నా భూనాథుఁ డుల్లంబునన్.

వ. ఇట్లితరసాధారణత్వదూరంబుగా శాంకరవ్రతాచారంబు నడుపుచు ధారాధరనీరంధ్రముక్త ధారాసంపాత కంపావహంబులగు నహఃబుల బట్టబయిటనుండియు, శీతాపమస్పర్శ హిమాలయతుషారసహాప్రచార సమీరభయంకరంబులగు వాసరంబులఁ గుత్తుక బంటి నీళ్లలోపలం జొచ్చియు, సంస్మరణమాత్రభయప్రదానపాత్ర

చండతర చండకర దుస్సహాతపంబులగు దినంబుల నాలుగునగ్గుల నడుమ నిల్చియు నిస్తరతపశ్చరణంబునఁ గాలంబు నడపుచున్న యెడ

సీ. ఏవేల్పు మొలగంట లెల్లవేల్పులకును
దలపంగ భయదప్రదాత లయ్యె
నేదేవు మెడహార మెల్లయుర్వీరకును
బరగ నపూర్వసంభ్రమమయ్యె
నేదేవు నుదిటిచూ పెల్లయజ్ఞములకుఁ
నరయఁ బ్రిధానపదార్థమయ్యె
నేదేవు సిరసుపూ వెల్లలోకములకు
బరగ నానంద స్వభావమయ్యె

ఆ. వె. అట్టిదేవుఁ డభవుఁ డవ్యయుఁ డమ్మహీ
నాథుతపములకు మనంబులోనఁ
జాల నలరి వచ్చెఁ గైలాసశైలంబు
నందు నుండు ప్రమథు లర్థిఁ గొలువ.

వ. ఇట్లు చనుదెంచి సాక్షాత్కరించి భగీరథ! భవదీయతపంబునకు మెచ్చితి వరంబు వేఁడు మనవ్రంతు నతండును డెందంబున విస్మయానందంబులు వొదవ జగన్నాయకు నడుగులకుఁ బ్రిణుతిసలిపి కృతాంజలియై

మ. పరహంస ప్రథమానసంజ్ఞ తిలకింపంగా సదానంద వి
స్ఫురణోదంతి చిదాత్మకంబగుచు నుంచుం గుందు రాకుండ
సుస్థిరకూటస్థితితోడఁ బావన మహాత్తేజంబున నీవ్రలుచుం
బరగుం దావక తత్స్వభావము శివా! భవ్యావ్యయప్రాభవా!

ఉ. వేలతరంబుపాదముల వేలతరంబు భుజార్గళంబులన్
వేలతరంబు వక్త్రముల వేలతరంబు నిరీక్షణంబులన్

వేలతరంబు మస్తముల వేలతరంబు నిజాహ్వాయంబులన్
వేలతరంబు రూపముల నీ పురుషత్వము నించు నీశ్వరా!

శా. లోకంబుల్ దగఁ గావఁ బ్రోవ నణఁప న్లోలక్రియాభంగి నీ
వా కంజాసన విష్ణురుద్రు లనునాఖ్య న్మూర్తుఁ ద త్తద్గుణ
స్వీకారం బెసలార భిన్నసరణిం జెన్నారియు న్విప్పు బా
హ్యాకారంబున నుండు దొక్కఁడవ సోమా! సోమచూడామణీ.

వ. అని పెక్కుభంగులఁ బ్రస్తుతించి దేవా! దేవర నావలనఁ బ్రస న్నుండవుగావున నేను వెఱవక యొక్క విన్నపంబు సేయుదు నవధ రింపు; మస్మత్పితరులగు సాగరులకు సాధ్యనాకసిద్ధ్యర్థంబుగా గంగా ప్రవాహంబు ధరణికిం దే నుత్సహించినాఁడఁ దత్పతన వేగంబున భూభాగంబు గరఁగి వెల్లిం బోకయుండ నమ్మహానదికి దిగ్గునప్పుడు విడిదలపట్టుగా భవజ్జటాభరంబున నిలిపి నన్నుఁ జరితార్థుం జేయు వే యనుచుం గ్రమ్మఱఁ బ్రణుతుండగుటయు శివుం డాదరంబున,

చ. వినుము నరేంద్రచంద్ర! నను వేఁడిన యర్థము ఇచ్చితిం గరం
బనుపమితంబుగాఁగ నట నంబుజగర్భకమండులుస్థలం
బున నెలకొన్నగంగ నతిపుణ్యగుణ ప్రకటానిపంగ నిం
పెనయఁగఁ దెమ్ము వచ్చునెడ నేఁ దల నించెదఁ దత్ప్రవాహమున్.

క. అని యాన తిచ్చి యిట్లా
తనిఁ గడు ధన్యాత్ముఁ జేసి తనయిరుదెసల
న్మనుమిడి ప్రమథులు గొలువఁగ
వినుతసరణి మరలి హాసంబు విజయంచేసెన్.

వ. అంత నిక్కడ భగీరథమహీధవుండును శివుండు దనతోడ నవధ రించిన సరణి విరించికి సముచితంబుగా విన్నవించిన నతం డాత్మక మండలి నున్న దేవనది దనుకాకారంబుఁ దన్మాలికాలాలిత ద్వారంబున వెలువఁ జేసిన నాగంగ యతిశిశుమూంతరంగయగు సు మూర్తిలీ ం దత్పాదకమలంబులకుఁ బ్రణామంబుసలిపి యిట్లనియె.

ఉ. లోలత నీకమండలములోపల నిమ్మల నున్న నన్ను నేఁ
డేల దయారసామృతవిహీనత వెళ్ళఁడఁజేసి తీక్రియ
న్మేలగు నీ సకాశమున నిల్వక పాయఁగ జాలఁ గావలెం
జాలప్రసాద మొప్పు నఘ సంచయశాసన పంకజాసనా !

క. అనుటయు నాయమరాపగ
ననుకంపాసంపదలకు నాకరమగులో
చనయుగళంబులఁ జూచుచు
వనరుహాసంభవుఁడు భక్త వరదుఁడు పలికెన్.

వ. విను మిప్పుడు నిన్ను వెడలించుటకు నొండుగతంబు లేదు; త్రిభువన విహితంబగు పని వనుపం దలంచితి; నది యెట్టిదనిన భగీరథుండను మహీవరుండు దనపితరులగు సాగరులు పాతాళంబునం గపిలుకోపశిఖాజ్వాలంబుల నెఱసి పుణ్యలోకంబులం గానక బహుళశోకంబున మఱుఁగుట విని తత్స్వర్గగమనంబునకు భవదాగమనంబు గారణంబని నన్నుగుఱించి తపంబు గావించినవాఁడు గావున నతనికిఁ బ్రియంబుగా నవని కవతరింపుము

క. భవదవరోహణవేళను
శివదేవుఁడు దాల్చు నిన్నుఁ జిత్రముగ జటా
టవి నొండు ముందు పొందుల
నవిరళగతిఁ గొంతసేపు మారఁగ నబలా.

క. దివి మందాకినియును నీ
భువి భాగీరథియు నురగభువనంబున భో
గవతియు ననఁగా మఱియును
వివిధవిశేషాహ్వయముల వెలయుము గంగా !

వ. అని యీక్రమంబునం బెలియం బలికి యొడంబఱచి యజుండు వీడుకొల్పుటయుఁ దదాజ్ఞాపనంబునకు మాఱుపలుక వెఱచి యున్నదీ

మణి మెట్టకేలకు నియ్యకొని యతని వలగొని యక్కడఁ గదలి
వచ్చి శివుండు దన ప్రవాహాభరంబు గపర్దాంతరంబున ధరియింపం
బూనుట దలంచి కలుషించి యాత్మగతంబున

మ. వికచాంతర్బహిరుజ్జ్వలన్మహిమ నీవిశ్వప్రపంచంబును
ప్రకటాకార న్వరియింప నన్ను దన యల్పంబైన జూటంబునన్
సుకరప్రక్రియఁ బూని శంభుఁ డఱిఁదాల్పం జూత మాచంద మే
ల కపర్దిత్వము గల్గునే యతని యాలాపంబులం దాహహా!

క. ధరియించుఁ గాక యింకను
గౌరీరమణుండు నాదు ఘనఘనపుష్ప
వ్యారూఢగాఢలహరీ
ప్రారంభవిజృంభదోఘ పటుఘాతములన్.

గీ. భయదమీ ప్రవాహరయ మెసఁగ బాతాళ
బిలము సొచ్చి భ్రమలఁ బెట్టి శూలిఁ
జిక్కువఱతు ననుచు గ్రిక్కున జలమయాం
గము ధరించి గంగ గర్వమెసఁగ.

వ. ఇట్లు తనరూపం బనర్గళ లసత్పరిమాణ నిష్ప్రతీపం బగుచుండ నఖండ రయప్రళయ జంఝూపాత సంపాత చలాచల కులాచల సందోహ సందేహ ధామంబులును, సముద్దండ తాండవారంభ సంరంభ ప్రసాదిత భూరితరాభిసయశోభిత భుజగకుండల భుజదండ సంకాశంబులును, నధోలోక సవనకుతలభారవహకుదుఃకలాపాప హార పావన స్నానవిధానసమాగతాంబు పరిలుఠత్ఫణి పరిసరాయమాన ధారాళీఘోరంబులును, రభస ప్రభస నిర్వర్తనోద్వర్తన వ్యక్తవ్యక్తముక్తాఫలకచ్ఛాయాచ్ఛటాస్ఫార డిండీరధవళిమప్రసర ణ్యాత సిజాక్రమణ భీతిభావ దశదిశాభాగంబులును, నిరంత గాఢ పరస్పరఘట్టన స్ఫుటదృష్టాద్భుతోద్భూత జలశకల చటుల స్వాగ్రసన

జాగ్రత్కపలాయమాన తారకా నికాయంబులును, నతిసమగ్ర పరంపరాభంగి సమంగీకారకలారంగంబులును ననం దనరుతరంగంబులు గలిగి, మఱియు భారతీపతిభాషితంబునుం బోలె సర్వతోముఖసలలితంబును, విరక్తపురుష మానసంబునుంబోలె దేశాలంఘిసజంఘాలంబును, వర్షాకాల సరోవరంబునుంబోలె నంతరంగపుష్కరంబును, రసాతలంబునుంబోలెఁ బల్లవిత జిహ్మగమనస్ఫురణంబును నింద్రజాలవిద్యాకల్పంబునుంబోలె బహుళభ్రమ సంజనితఘూర్ణంబును, వసుంధరామండలంబునుంబోలె నాకలితానంతప్రవాహవిజృంభణంబును, బాణతనూభవమనోహరంబునుంబోలె ననిరుద్ధవ్యాపార కృతాయోగంబును నై ఘనంబైన వేగంబున మెఱయుచుండి, నిలువుసాలక విరుగంబడియు, వెలితివడని యుబ్బుకలిమిం గ్రాలుచు నొక్క తెల్లగాఁ బ్రబలియుఁ, బలుచాయలం జూపుచు నక్కడక్కడం జెదరఁబఱచి యొక్కమొగిఁ బొడమఁజాఁగుచు మీఁదిమీఁదన మెఱసి నిగుడియు, నగ్గలంపులోఁతున మీఱుచుఁ జదలకతలంగడలుకొనియు, మేర యెఱుకపడక నిక్కుచు గాడంబట్టగుటగల్గియు, కొండలకందని పరణింజరించుచుఁ జాల మెత్తనిపగిది నఖువుమిగులియుఁ, గడమవడక పరుసందనమునఁ దుదిముట్టుచు విచ్చివిచ్చి వెల్లివిరిసియున్నెడ తెగని పెక్కువం బ్రకటించుచుఁ, గరంబు విస్మయకరంబుగా నభిరామశృంగారంబుతోడ నమ్మహానది జగత్సంహారంబునకుఁ గడంగునట్లు వచ్చు సమయంబున

గీ. అమర గణవల్లభాది దేవాధిపతులు
దివిజమునివర్గములు చేట తెల్లఁగాఁగ
నంతరిక్షోపగాబలో దగ్రగర్వ
కలన మంతయు నాత్మలోఁ దెలిసి యపుడు.

సీ. అధిక నిరూఢశక్తిఁ దనరువ ర్తనములు
రయచిత్రగతి లసద్రథములుగను
నెఱియ పెక్కువతోడ నిక్కుతరంగము
లతులితాంకుశభీత హస్తులుగను
బవనాహతులఁ దెగి పడుజలశకలముల్
వంతపుగుఱ్ఱాల పంజుగాఁగ
మునుముట్ట ముంగిలి మొనగట్టు సింధువు
లెలగోలు నడుచు కాల్బలములుగను

గీ. నిగుడి దాడిగా మందాకినీనితాంత
భయదవాహిని యిటవచ్చె ప్రథమలీలఁ
దనదు దుర్వారవేగ ప్రతాపమొప్ప
నింక నెవ్వారు హరియింతు రీక్రమంబు.

క. తడసిన కర్జము దప్పుం
దడయక యీ దుస్తరాపదం బాపుచు ను
గ్గడువున మనములఁ గావఁగ
మృడుఁ డొకరుఁడగాక వేఱ మేరలు గలవే.

క. ఆపదలు పొందుతావుల
నేపఱకుండంగ విశ్వ మంతయు గరుణం
బ్రాపగుచు మనుప నెవ్వరు
నోపరు వెలుపలనులోన నుగ్రుఁడు దక్కన్.

వ. అను తలంపుల నా జగన్నాథు చరణంబులు దలంచుచు వెల్లఁదనంబులు మొగంబులఁ గడలుకొని భువనంబులకు భద్రంబుగా రుద్రసూక్తంబులు జపియించుచుండి రట్టియెడఁ నాగంగదర్పసంపదయును సురాసురాదులదీనావస్థయును దివ్యచిత్తంబున నెఱింగిన సర్వజ్ఞుండు నగవును గరుణయు నాత్మఁ బెనఁగొన నాతఁణంబయుదంచితప్రభావంబున,



శ్రీ

ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ.

వ్యయ నామ సంవత్సరము

(1946—47)

ఆయ వ్యయ పట్టిక.

వ్యయ నామ సంవత్సరము.

1946—47.

# ఆయము.

1. సంవత్సర ప్రారంభమున నిలువగత ఆడిట్ రిపోర్టు ప్రకారము
2. వడ్డి
   (a) శ్రీ వెంకటగిరి మహారాజావారు ఇచ్చిన గవర్నమెంటు పత్రముమీాద 6 నెలలకు; వచ్చిన వడ్డి జూలై 1946 సం॥లో 175-0-0. తిరిగి 6 నెలలకు 18-3-47 న 150- 0- 0 } 325- 0- 0
   (b) సెప్టెంబరు1946సం॥లో 3½% to 3%లోన్ బాండ్సుకు మార్చినప్పుడు వచ్చినవడ్డి ముదరా బాపతు. 73- 14- 0
   (c) శ్రీ బొబ్బిలిమహారాజావారు యిచ్చిన వార్ బాండ్ మీాద 4% చొ॥ 6 నెలలకు సెప్టెంబరు నెలలో 1946 సం॥లో వచ్చిన వడ్డి బాపతు. 200-0-0 400- 0- 0
   తిరిగి 6 నెలలకు 18-3-47న వచ్చినవడ్డి 200-0-0
   (d) సేవింగ్సు బ్యాంకివడ్డి 0-11- 0
3. పత్రిక చందాలు
4. పుస్తక విక్రయము
   కె. రామనాధముగారు చెల్లించిన రు45 లు సప్లయి చేసిన పుస్తకముల విలువ 43-12-0 పోను నిలువ
5. ఇతర జమలు
   కొల్లూరి సుబ్రహ్మణ్యముగారు 15- 0-0
   కొత్తపల్లి సుబ్రహ్మణ్యముగారు 1-14-0
6. చేబదుళ్లు:-రు 400 లలో తీర్చిన రు 200 లు పోను

# వ్యయము.

| | మొత్తము |
|---|---|
| 1. ఉద్యోగుల జీతములు | 1155- 0- 0 |
| 2. ఉద్యోగుల ప్రయాణవ్యయములు | 2- 0- 0 |
| 3. పోస్టు వ్యయములు | 40- 6- 3 |
| 4. పత్రిక ముద్రణము | 100- 0- 0 |
| 5. పత్రికకు కాగితము | 1- 1- 9 |
| బైండింగు | 370-11-0 |
| 7. పత్రికలకు చందాలు | 28-10- 0 |
| 8. కొనిన పుస్తకములు | 64- 6- 6 |
| 9. బ్యాంకి చిల్లర వ్యయము | 2- 0- 0 |
| 10. ఇతర వ్యయములు | 53- 8- 0 |
| 11. సాదరు | 167-15- 9 |
| 12. కె. రామనాథముగారు; పార్థివ సం॥లో పుస్తకములకుగాను చెల్లించినసొమ్ము రు 45 లు ఆదాయములో పుస్తకవిక్రయమునకు రు 43-12-0 లున్ను పోను వారిబాపతు నిలువ రు 1-4 0 లు చూపించినది | 45- 0- 0 |
| 13. చిఠా నిలువ | 394- 4- 8 |
| ఇంపీరియల్ బ్యాంకి సేవింగ్సులో 79- 0-7 | |
| కార్యదర్శిగారియొద్ద నిలువ 315- 4-1 | |
| | 2424-15-11 |

కిళాంబి రాఘవాచార్యులు,
వింజమూరి వెంకన్న,
కార్యదర్శులు,
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి
అధ్యక్షుఁడు.
పళ్ళె వెంకటహనుమంతరావు,
ఆడిటరు.

కాకినాడ.
1[illegible]-8-47.

# పుస్తక విక్రయము.

| | |
|---|---|
| విప్రనారాయణ చరిత్రము | 5- 4-0 |
| జైమిని భారతము | 8-12-3 |
| యుద్ధమల్లుని శాసనము | 3-13-6 |
| జ్యోతిశ్శాస్త్రసారము | 2-12-3 |
| జ్ఞానప్రసూనాంబికా శతకము | 0- 3-9 |
| సర్వేశ్వర శతకము | 0-10-9 |
| కావ్యాలంకార చూడామణి | 1-15-6 |
| ఆకారాద్యనుక్రమగ్రంథ సూచిక | 3-10-9 |
| శివతత్త్వ సారము | 7- 7-9 |
| ప్రాకృత భాషోత్పత్తి | 4- 1-8 |
| చంద్రభాను చరిత్రము | 5- 7-3 |
| ఆర్యభాషా విభాగము | 2-12-3 |
| ప్రాస్వరంగములు | 0-14-9 |
| మన్నారుదాస విలాస నాటకము | 2- 9-9 |
| కాళిందీ కన్యాపరిణయము | |
| 1-వ భాగము | 7- 5-6 |
| 2-వ భాగము | 3- 2-9 |
| రెడ్డిరాణి రెండు శాసనములు | 1- 2-6 |
| ఆంధ్రధాతుమాల | 2-12-0 |
| శాసన పద్యమంజరి 1-వ భాగం | 15-11-0 |
| 2-వ భాగం | 3- 3-6 |
| శతకసముచ్చయము 1-వ భాగం | 4- 1-9 |
| 2-వ భాగం | 3- 7-0 |
| మనమత్పుస్తక భాండాగారం | |
| II భాగము | 1- 12-9 |
| III భాగము | 1- 1?-9 |
| సూర్యాంధ్ర వ్యాకరణము | 1- 13-3 |
| రసాభరణము | 2-13-9 |
| ఆంధ్రశబ్ద చింతామణి | 2-13-3 |
| షోడశ కుమార చరిత్రము | 1-14-9 |
| హంస సందేశము | 0- 7-6 |
| రాయవాచకము | 1-13-3 |
| సింహాసనద్వాత్రింశిక 1-వ భాగం | 7-12-0 |
| 2-వ భాగం | 7-12-0 |
| నిఘంటు చరిత్రము | 2- 5-6 |
| ఆంధ్రకౌముది | 2-13-6 |
| బాలభారతము | 2- 2-6 |
| ద్రవిడియన్ లెక్సికోగ్రాఫీ | 0- 7-6 |
| ది ఫేజెస్ ఆఫ్ లిటరరీ తెలుగు | 0-14- |
| చాటుధారా చమత్కారసారః | 2- 6- |
| సాంబోపాఖ్యానము | 4-11- |
| రసార్ణవాలంకారము | 1-13- |
| కవిజనోజ్జీవని సమస్యలు | 1- 8- |
| రఘునాథ రామాయణము | 1- 6- |
| రజతోత్సవ సంపుటము | 5- 8- |
| ఆంధ్ర సాహిత్య పరిషద్వృత్తాంతము | 0- 7-3 |
| అరవదేశమందలి ఆంధ్రవాఙ్మయము | 1- 2-3 |
| లక్షణ సారసంగ్రహము | 1-15-3 |
| లౌకిక న్యాయవివరణము | 2- 4-3 |
| శ్రీ సూర్యరాయాంధ్ర | |
| నిఘంటువు 1-వ భాగం | 207- 6-0 |
| 2-వ భాగం | 163- 0-6 |
| 3 వ భాగం | 177-12-6 |
| 4-వ భాగం | 195-12-6 |
| సీతారామ చరిత్రము | 0-13-0 |
| ఉత్తరరామ చరిత్రము | 30- 4-0 |
| అనిరుద్ధము | 3-12-6 |
| చంపూ రామాయణము | 3-13-6 |
| ఆధునికాంధ్ర వాఙ్మయ | |
| వికాస వైఖరి | 7- 4-6 |
| | 948-12-9 |

# ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు
పిఠాపురము మహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్న పంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు, (కోశాధ్యక్షులు.)

" పిల్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

" కోకా శివనాథశాస్త్రిగారు

" కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.

" వెంపటి రామబ్రహ్మముగారు.

" నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

" ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

" ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

" కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

" కేశవరపు రామరాజుగారు.

" వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ. (ఆనర్సు)

" వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

## చతుర్థసంపుటము.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీ క్రింది వెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లును.

---

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౭ { సర్వధారి. చైత్ర - భాద్రపదములు } సంచిక ౧-3.

37



కాకినాడ

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0.

1948-49.

# విషయసూచిక.



1946-47 సర్వజిత్సంవత్సర విషయసూచిక-

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౭. { సర్వధారి. చైత్ర - భాద్రపదములు } సంచిక ౧ ౩.

శ్రీః.

## "సాహిత్యవిమర్శము."

(పూర్వానువృత్తము)

అప్పల్ల సోమేశ్వరశర్మ. P. O. L. (సింహాచలము)

ఈవిషయమునఁ గుంతకుని యభిప్రాయము కొంచెము వేఱుగ నగపడును. అతఁడు తన వక్రోక్తిజీవితమను గ్రంథములో సాహిత్య పదార్థమునుఁ జాలవరకు విమర్శించి ప్రతిపాదించెను. "వాచ్యవాచక భావరూపమగు సంబంధము శబ్దార్థములకు సహజమే గాన శబ్దార్థ సంబంధమాత్రము సాహిత్యమనుటకు వలనుపడదు. విశిష్టసంబంధమునే సాహిత్యమనవలయును. సంబంధవైశిష్ట్యమునుఁ బ్రతిపాదింపఁబోవు రీతినిఁ బరిష్కరించుకొనుట యుక్తము." అని కుంతకుని తాత్పర్యసంగ్రహము. ఈవచనములనుఁ బరిశీలించిన నతనియాశయము తెల్లమగును. చూడుఁడు :—1. "యదిదం సాహిత్యం నామ తదేతావతి నిస్సీమని సమయాధ్వని సాహిత్యశబ్దమాత్రేణ ప్రసిద్ధమ్, నపున రేతస్య

కవికర్మ కౌశలకాష్ఠాధి రూఢిరమణీయస్య అద్యాపి కశ్చిదపి విపశ్చిదయమస్య పరమార్థ ఇతి మనాఙ్మాత్రమపి విచారపదవీ మవతీర్ణః । తదస్య సరస్వతీహృదయారవింద మకరందబిందుసందోహసుందరాణాం సత్కవివచసామ న్తరాఽ మోదమనోహరత్వేన పరిస్ఫురదేతత్ సహృదయషట్చరణగోచరతాం నీయతే." (చిరకాలమునుండి సాహిత్యము శబ్దమాత్రముచేతనే ప్రసిద్ధమైయున్నది. ఎవరు నద్దాని పరమార్థమును నిర్వచించలేదు. కాన సాహిత్యపదార్థమును సహృదయులకు మనవిచేసుకొనుచున్నాను.)

2. "సహితయోర్భావస్సాహిత్యమ్".

3. "శబ్దార్థౌ సహితావేవ ప్రతీతౌ స్ఫురతస్సదా । సహితావితి తావేవ కిమపూర్వం విధీయతే." (శబ్దార్థములు సహితములుగనే యెల్లప్పుడు స్ఫురించుచుండును. సహితములన నవియే. క్రొత్తగఁ జెప్పునదేమి ?)

4. "ననుచ వాచ్యవాచక సంబంధస్య విద్యమానత్వా దేతయోః కథంచిదపి నసాహిత్యవిరహః । సత్యమేతత్ । కింతువిశిష్టమేవేహ సాహిత్యమభిప్రేతమ్". (వాచ్యవాచక సంబంధము శబ్దార్థములకు సహజమగుటచే వానికెప్పుడును సాహిత్యాఽభావముండదు. అయినను విశిష్టసాహిత్యమే సాహిత్యపదార్థముగ నభిప్రేతమైనది.) ఈ మొదలగు వచనములు. కుంతకుఁ డిట్లు విశిష్టసంబంధమే సాహిత్యమని స్థిరపఱచి తుదకు స్వాభిమతమయిన వైశిష్ట్యము నీవిధముగ నిరూపించెను :— 1. "సాహిత్యమనయోశ్శోభాశాలితాంప్రతి కాఽప్యసౌ । అన్యూనాఽనతిరిక్తత్వ మనోహారిణ్యవస్థితిః । సహితయోర్భావస్సాహిత్యమ్ । అనయోశ్శబ్దార్థయో ర్యాకాఽప్యలౌకికీచేతనచమత్కారకారితాయాః కారణం అవస్థితిః—విచిత్రైవ విన్యాసభంగీ......................... సా సాహిత్యముచ్యతే". (లోకోత్తర

చమత్కారజనకమగు శబ్దార్థముల విచిత్రవిన్యాసము సాహిత్యమనఁబడును.) 2. "మార్గానుగుణ్యసుభగో మాధుర్యాదిగుణోదయః। అలంకరణ విన్యాసోవక్రతాతిశయాన్వితః।వృత్త్యౌచిత్యమనోహారి రసానాం పరిపోషణం। స్పర్ధయా విద్యతేయత్ర యథాస్వముభయోరపి। సాకాప్యవస్థితి స్తద్విదానందస్పందసుందరా। పదాదివాక్పరిస్పంద సారస్సాహిత్యముచ్యతే।" (రసోచిత గుణాలంకారాది సహితము, లోకోత్తర చమత్కారజనకము, రసికహృదయాకర్షకమునగు శబ్దార్థముల విలక్షణావస్థితి సాహిత్యమనిపించుకొనును.) అని దీనినిఁబట్టి "శబ్దార్థ విశిష్టసంబంధమే సాహిత్యపదమునకు ముఖ్యార్థము" అని కుంతకుని యాశయమైనట్లు స్పష్టమగుచున్నది. భోజుని నియత సాహిత్యమునకుఁ గుంతకుని విశిష్టసాహిత్యమునకును భేదమంతగ సిద్ధింపదు. భోజుని కావ్యనియతత్వమునకే కుంతకుఁడు వైశిష్ట్యమని పేరిడినట్లు విశదమగుచున్నది. అయినను సంబంధాన్తరమును సాహిత్యమనుటయుక్తమే కాదని కుంతకుని యభిసంధిగఁదోచుటచే నియ్యది మతాన్తరముగఁ జూపఁబడినది.

రాజశేఖరుఁడు తనకావ్యమీమాంసలో సాహిత్యపదార్థము నతిసంగ్రహముగ నిరూపించి వదలివైచెను. "శబ్దార్థముల యథావత్తమగు కలయికయే సాహిత్య"మని యతనియాశయము. "శబ్దార్థయోర్యథావత్సహభావేన విద్యా సాహిత్యవిద్యా" మొదలగు వాక్యములచే నీవిషయము తెల్లమగును. ఇతనిమతమునఁ గావ్యనియతత్వవైశిష్ట్యాదుల కావశ్యకతయుండదు. శబ్దార్థ సంబంధాన్తరముఁ గూడ సాహిత్యమనవచ్చును.

ప్రసిద్ధాలంకారికులలో సాహిత్యపదార్థ విచారమునుఁజేసిన వారి తాత్పర్యము లీవిధముగ నున్నవి.

ఈ సాహిత్యపదము "సాహిత్యసంగీతకలావిహీన స్సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః" "పదవాక్య ప్రమాణేషు యదేతత్ప్రతిబింబితం। యో యోజయతి సాహిత్యే తస్యవాణీ ప్రసీదతి" "సాహిత్యం శ్రీమురారేః" మొదలగు ననేక స్థలములలోఁ గొన్నిచోటులందు కావ్యపరముగనుఁ గొన్నిఁట నలంకారశాస్త్రపరముగనుఁ బ్రాచీనకవులచేఁ బ్రయోగింపఁబడెను.

ఇట్లు దుర్నిరూపణీయార్థము, అలంకారికవివాదాస్పదము, మహావిషయమునగు సాహిత్యపదమును, కాలక్రమమున "సామాన్యముగఁ గావ్యస్థలములగు శ్లోకాదుల యన్వయజ్ఞానము" అను నర్థమందుఁగూడఁ బ్రయోగించుట సంభవించెను. "వానికి సాహిత్య మధికము" "వీనికి సాహిత్యమల్పము" మొదలగు లోకవ్యవహారములనుఁ బరిశీలించిన నీవిషయము గోచరించును.

ఇట్లే "సాహిత్యపాథోనిధి మంథనోత్థమ్" "సంస్కృత సాహిత్యమ్" "ఆంధ్రసాహిత్యము" "హిందీసాహిత్య" మొదలగు ప్రాచీనాఽధునిక వచనములనుఁజూచినచో సాహిత్యపదము క్రమముగఁ గేవల వాఙ్మయ రూపార్థమునందునుఁ బ్రయోగింపఁబడుచున్నదని నిశ్చయింపవచ్చును.

కాగా నిప్పటికి సిద్ధించిన సాహిత్యపదార్థములివి:— 1. కేవల వ్యాకరణవ్యుత్పత్తి ననుసరించి "సహస్థితి" రూపార్థము.

2. "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" అను లక్షణానుసారముగ శబ్దార్థ సంబంధరూపార్థము.

3. భోజాభిమతమగు రసాఽవియోగాదిరూపార్థము.

4. కుంతకాభీష్టమగు విశిష్టసంబంధ రూపార్థము.

5. శబ్దార్థముల యథాతథమగు సహభావమనెడి యర్థము

౬. అన్వయజ్ఞాన రూపార్థము.

7. వాఙ్మయ రూపార్థము.

ఈవిధముగ స్వల్పముగు భేదముతో సాహిత్యపదార్థములు నిరూపింపఁబడినవి. ఎట్లో యొకరీతి నర్థాన్తరములను నిరూపించినను నిరూపింపవచ్చును. సహితశబ్దమునకు శాస్త్రసమూహమను నర్థమును జెప్పి యధ్యాహార శేషపూరణ లక్షణాదులతో "షట్ఛాస్త్ర సామాన్య సంప్రదాయార్థ జ్ఞానత్వము" అని పెద్దలవాక్కులలో దొర్లుచుండు నర్థమట్టి యర్థాన్తరములలో నొకటి. పైయర్థములలో భోజకుంతక మతములు సహృదయ పరిగ్రాహ్యములు.

ఈయర్థములనన్నిటి నటుంచి సాహిత్యపదపరమార్థనిష్కర్షను దెలిసికొనవలయును. "రసమేకావ్యాత్మ" యను మతము సర్వోత్తమముగ స్థిరపడినపిదప సాహిత్యపద పరమార్థము రసికహృదయాకర్షకముగ వికసించినది. ఎట్లనః— హితశబ్ద మేవిధముగఁజూచినను రసవాచకముగ సిద్ధించుచున్నది. చూడుడు:— 1. హితము=బ్రహ్మానందసదృశ మగుటవలన రసికాగ్రేసరులకు పథ్యము. (రసము) 2. హితము=పిహితము నిగూఢమని యర్థము. అభిధాలక్షణావ్యతిరిక్తమగు వ్యంజనావ్యాపారముచేతనే గాని యింకొకరీతినఁ బ్రతీయమానము కానిదగుటవలన గూఢము. (రసము) అనిభావము. 3. హితము=సన్నిహితము. సతతకావ్య పరిశీలన పరిపక్వచిత్తులగు భావుకుల హృదయారవిందములందు సంస్కారరూపమున సన్నిహితము. (రసము) 4. హితము=నిహితము. సమ్యగ్రక్షితమని యర్థము. మహాకవులచే బాగుగఁ బరిపోషింపఁబడినది (రసము) అని భావము. 5. హితము=అవహితము. వాల్మీకి వ్యాసాది మహామునులచే నేకాగ్రచిత్తముతో ధ్యానింపఁబడినది. (రసము) ఎట్లైనను హితశబ్దమునకు రసమనియే యర్థము. హితముతోఁగూడినది. (హితేన-సహ=యుక్తమ్) సహితము రసవిశిష్టమని యర్థము. సహితముయొక్క భావము సాహిత్యము. ప్రకృతి జన్యబోధయందు ప్రకారముగ భాసించు నర్థమే భావప్రత్య

యోగ్యమగుటచే సాహిత్యశబ్దార్థము రసమనియే పర్యవసించును. (రసవిశిష్టమును సహితశబ్ద జన్యబోధలో విశేషణముగ రసమే భాసించుచున్నదిగాన యని తాత్పర్యము) కాన సాహిత్యశబ్దార్థము రసము ఇదియే సాహిత్యపదపరమార్థము. రసము కావ్యాత్మయను సిద్ధాన్తము సర్వాంగీకృతము; సునిశ్చితము నగాన నిదియే సర్వసహృదయపరిగ్రాహ్యము.

ఇట్లు సాహిత్యశాస్త్రమన రసశాస్త్రమని ఫలితము వచ్చినది. ఆత్మస్థానీయమగు రసమును నిరూపించునపుడు శరీర, తద్ధర్మ, తదలంకారాది స్థానీయములగు శబ్దార్థ, గుణాలంకారాదులను నిరూపించుట యత్యావశ్యకము నుచితముఁగూడనగును. కాగా రసవిశిష్టమగు కావ్యమునొక్క స్వరూప సాధన సామగ్రి ప్రయోజనాదినిరూపణపరమగు శాస్త్రము సాహిత్యశాస్త్రమని సంపిండితార్థము.

### 4. శాస్త్రత్వ సమర్థనము.

ప్రకృతమున నిట్టి సాహిత్యముగూడ వ్యాకరణాదులవలననే శాస్త్రమేయని సయుక్తికముగ నిరూపింపవలసియున్నది. పండితలోకమున నిటీవలఁగొన్ని యభిప్రాయపరిణామములు కలిగినను మొదటినుండియు నిద్దాని శాస్త్రత్వవిషయమున నొకవిధమగు ననాదరము వ్యాపించియున్నది. కావునఁ బ్రస్తుతనిరూపణమున కావశ్యకత సంభవించినది. కొందఱాలంకారికు లీవిషయమునఁ దగుశ్రద్ధవహింపక పోయిన నీవిషయమును శంకించి పట్టుదలతో సాహిత్యము యొక్క శాస్త్రతను సమర్థించినవారు రాజశేఖర ధర్మసూరులు. వీరికావ్యమీమాంసా సాహిత్య రత్నాకరములందు బహుముఖములుగ సాహిత్యమునొక్క శాస్త్రత్వము సమర్థింపబడియున్నది. ఆగ్రంథములందలి యుక్తులచేతను యుక్త్యన్తరములచేతనుఁ బ్రస్తుతవిషయమును విశదీకరింపఁదలచితిని.

1. "సకలవిద్యాస్థానైకాయతనం పంచదశం కావ్యం విద్యాస్థానమితి యాయావరీయః। గద్యపద్యమయత్వాత్, కవిధర్మత్వాత్, హితోపదేశకత్వాచ్చ। తద్ధిశాస్త్రాణ్యనుధావన్తి।" (పదునాలుగువిద్యలని ప్రసిద్ధికలదు. కాని కావ్యవిద్యనుఁగూడ జేర్చి పదునైదువిద్యలన వలయును. గద్యపద్యమయత్వము, హితోపదేశకత్వము మొదలగు శాస్త్రాంతరలక్షణములు కావ్యవిద్యకును గలవు.

2. "పంచమీ సాహిత్యవిద్యేతి యాయావరీయః। సాహి చతసృణామపి విద్యానాం నిష్యందః।" (నాలుగువేదముల సారభూతమగుటచే గావ్యవిద్య నైదవవేద మనవలయును.)

3. "ఉపకారకత్వా దలంకారస్సప్తమమఙ్గమ్। ఋతేచతత్స్వరూపపరిజ్ఞానాద్వేదార్థానవగతేః।" (అలంకారవిద్యను విడిచిన వేదార్థసమ్యగ్జ్ఞానము కలుగనేరదు. కాన అఙ్గత్వమునగా నుపకారకత్వమగుటచే గావ్యవిద్యయు వేదార్థవిజ్ఞానోపయుక్తమగుటవలన నద్దానినేడవ వేదాఙ్గ మనవలయును.) ఈ మొదలగునవి రాజశేఖర వచనములు వీని బరిశీలనచే సాహిత్యమును, పదునైదవవిద్యగాను, ఐదవ వేదముగాను, ఏడవవేదాంగముగాను, దప్పకఁ బరిగణింపవలయు నను రాజశేఖరుని యభిసంధియు, దన్మూలమున సాహిత్యముయొక్క శాస్త్రతయు స్పష్టమగును.

మఱియుఁ బ్రతిశాస్త్రమందు నేదోయొక యనధిగతవిషయము సంపూర్ణముగ విచారింపఁబడును. అట్లే సాహిత్యశాస్త్రమునఁగూడ ననధిగతమగు కావ్యవిషయము పూర్ణముగఁ జర్చింపఁబడుచున్నది. గాన నదియు శాస్త్రమే. విషయము, ప్రయోజనము, పురుషార్థ పర్యవసానము, కర్తవ్యతాబోధక ప్రమాణము నుండుటచేఁగావ్యము విమర్శింపఁదగినదియే కాదని వాదించుటమాత్రము యుక్తముకాదు, కావ్యమీమాంసకు వక్ష్యమాణస్వరూపమగు కావ్యమే విషయము,

గావ్యమునకుఁ గీర్త్యాదులు పెక్కు ప్రయోజనములు గలవు. అయ్యవి మున్ముందు పూర్తిగఁ బ్రదర్శింపఁబడును. అంగములకు ప్రధానఫలము చేతనే ఫలవత్త్వమను న్యాయమున ననుసరించి కావ్యప్రయోజనములను బట్టియే కావ్యమీమాంసకును సప్రయోజనత్వము సిద్ధించును. అట్లే "కీర్తిం స్వర్గఫలా మాహురాసంసారం విపశ్చితః।" అనునభియుక్త వచనానుసారముగ స్వర్గాదిసాధకమగు కీర్తికి సాధనమగుటచేఁ గావ్యము పురుషార్థపర్యవసాయియనగును. ఇట్లుండ నిట నొకశంక యుదయింపవచ్చును. "ప్రతియుపదేశమునకుఁ బ్రవృత్తినివృత్తిబోధనమే ప్రధానప్రయోజనముగదా ! అయ్యది యుపదేశాన్తరములచేతనే సిద్ధించునుగానఁ గావ్యోపదేశము వ్యర్థము" అని. ఈశంక నిలువనేరదు. తుల్యయుక్తిచే (కావ్యోపదేశముచేతనే ప్రధానప్రయోజనము సిద్ధించుటవలన నుపదేశాన్తరములు అనుదానిచే) నుపదేశాన్తరములేయేల నిరర్థకములు కాకూడదు ? వేదార్థసమ్యగ్విజ్ఞానాదుల కుపదేశాన్తరము లవసర మందుమేని యందుకొఱకే కావ్యోపదేశమునకు నావశ్యకత సిద్ధించునని యెఱుఁగునది. అన్నివిధముల నుపదేశాంతరములతో సమానయోగక్షేమము కావ్యోపదేశము. మీఁదుమిక్కిలి యుపదేశాన్తరములకంటె మిక్కుటమగు నాధిక్యముండుటచేఁ గావ్యోపదేశమునకే యావశ్యకత సంప్రాప్తమగును. ఇతరోపదేశములకంటెఁ గావ్యోపదేశమునకుండు నతిశయమెట్టిదో కొంచెము వివరించుట యుచితము. ఉపదేశము ప్రభుసమ్మితము, మిత్రసమ్మితము, సమ్మితము, కాంతాసమ్మితమునని త్రివిధము. ఇటసమ్మితశబ్దము సదృశార్థకము. అందు ప్రభుసమ్మితము వేదము. వేదమున నర్థమునకప్రాధాన్యము శబ్దమునకే ప్రాధాన్యమునుఁగాన నద్దానికి ప్రభుసమ్మితత్వముపపన్నమగుచున్నది. లోకములో నొకానొక ప్రభువు భృత్యాదుల నెట్లు వాజ్మాత్రముచేతనే యొకకార్యమందుఁ బ్రవర్తింపఁజేయుచు

నింకొకకార్యమునుండి నివర్తింపఁజేయుచు విపరీతముగఁ జేసినచో దండించుచు నుండునో యట్లే శ్రుతియు లిఙ్ (విధిలిఙ్) లోట్ (విధి) తవ్యదాది (ప్రస్థాతవ్యమ్) విధ్యర్థక ప్రత్యయ సహితములగు వాక్యముల చేతనే పురుషుల నిష్టకార్యములందు ప్రవర్తింపఁజేయుచు ననిష్టకార్యములనుండి నివర్తింపఁ జేయుచు విపరీతముగఁ జేసినచో దండనస్థానీయమగు ప్రత్యవాయమును జూపుచు నుండును. శబ్దమనఁగా విధిప్రత్యయసహిత వాక్యము. ప్రవర్తకత్వమే (పురుషునిఁ బ్రవర్తింపఁజేయుట) దానికిఁగల ప్రాధాన్యము. అందుచే శబ్దప్రధానమైన శాస్త్రము, ప్రభుసమ్మితమను లక్షణము ఫలించుచుండఁగా వేదము ప్రభుసమ్మితమను విషయము సిద్ధించినది. ప్రభుసమ్మితోపదేశమున మనస్సునకాహ్లాద ముండదు. భయభక్తులతోఁ బురుషుఁడు ప్రవర్తింపవలసి వచ్చును.

మిత్రసమ్మితములు పురాణములు. అవియు అర్థప్రధానములు. అర్థమనఁగా వాక్యార్థము. ప్రాధాన్య ప్రవర్తకత్వము గానఁ బదార్థమున కట్టి ప్రవర్తకత్వము లేకుండుటచేఁ బదార్థము మాత్రమిచట గ్రహింపరాదు. పురాణము లర్థవాదస్వరూపములు (స్తుతినిందాస్వరూపములు) అగుటచే వేదమువలె "ఈకార్యమునట్లు చేయవలయును" అను విధిబలముతోఁ బురుషునకు హితాహితములందుఁ బ్రవృత్తి నివృత్తులను గలుగఁజేయలేవు. ఇంక నేమన మిత్రునివలె యుక్తులతో ననునయించి మహాపురుష గుణవర్ణనాదుల ద్వారా ప్రవృత్తి నివృత్తులనుఁ గలుగఁజేయుచుండును. కానఁ బురాణములు మిత్రసమ్మితములు మిత్రసమ్మితోపదేశమువలనఁ గొంచె మాహ్లాదానురాగములు కలుగుచుండును.

కాంతాసమ్మితము కావ్యోపదేశము. ధ్వని ప్రధానమైన కావ్యమే కాంతాసమ్మితమనఁబడును. ప్రియుని మోహనముగ నుల

కళఁబలుకకఁ గేవలము కటాక్షావలోకనహావభావాదులచేతనే పురుషునిఁ బరవశునిఁజేసి యిష్టానిష్టములందుఁ బ్రవృత్తి నివృత్తులఁ గలుగఁజేయుచున్నదో యట్లే కావ్యమును సహృదయ చమత్కార కారణము, శబ్దార్థోభయ శక్తిమూలమునగు వ్యంజనావ్యాపారము చేతనే "రామాదులవలెఁ బ్రవర్తింపవలయును." "రావణాదులంబోలి ప్రవర్తింపఁగూడదు." అను ప్రవృత్తి నివృత్తులను మనసు నొవ్వకుండ సంతోషపూర్వకముగ సంపాదింపఁజేయును. కాంతోపదేశమువలన సంపూర్ణాహ్లాదానురాగము లుద్భవించును. ఈవిషయమునే విద్యానాథుఁడు "యద్వేదాత్ప్రభుసమ్మితాదధిగతం శబ్దప్రధానాచ్చిరం యచ్చార్థ ప్రవణాత్పురాణ వచనాదిష్టం సుహృత్సమ్మితాత్ । కాన్తాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్య శ్రియా కర్తవ్యే కుతుకీ బుధో విరచితస్తస్యై స్పృహాం కుర్మహే." అనుపద్యముచే వెల్లడించెను. సాహిత్యసారమం దచ్యుతరాయఁడును.

జిజ్ఞాసోః సుందరీరీత్యా కావ్యం సముపదేశకృత్ ।
ఐహికాముష్మికాదేర్యతోఽయమన్వర్థ ఉచ్యతే 1
వేదోపదేశ కావ్యాది శబ్దభేదాత్త్రిధా మతః ।
ఉపదేశో నృపసుహృత్సుందరీ రీతితః క్రమాత్ । 2
నృపాజ్ఞావత్తు వేదాజ్ఞాఽనుల్లంఘ్యేతి వైదికః ।
నృపరీత్యుపదేశోఽసౌ ఫలవివాఽతిసౌఖ్యదః । 3
సుహృదుక్తి కృతే సౌఖ్యం ఫలే నో చేద్భయం నహి
సుహృద్రీత్యుపదేశోఽయమితిహాసాది కర్తృకః । 4
యోఽధికారిసుఖాయైవ శ్రవణేఽనుష్ఠితాఫలే ।
కాన్తారీత్యుపదేశస్స్యాత్సోఽయం కావ్యాది సంభవః ।
సుందరీ స్వేశహృదయం వశీకృత్య స్వసద్గుణైః ।
లౌకికం వైదికంచాఽపి కూజభీష్టం ససాధనమ్ ।

తద్యత్కావ్యాద్యపి శ్రీమన్మహారామాయణాదికమ్ ।
శ్రోతుర్మనో వశీకృత్యహితం వక్తి సహేతుకమ్ ।
అయం సర్వత్రసుఖదః శ్రవణేఽనుష్ఠితావపి ।
తద్గుణాద్యై రసోత్పత్తేః ఫలేత్యేష్టార్థ సిద్ధితః ॥" ౪

అను శ్లోకములచేఁ గావ్యోపదేశాతిశయమునుగ్గడించెను. విశ్వనాథకవి రాజుకూడ సాహిత్యదర్పణమున "చతుర్వర్గప్రాప్తిర్హి వేదశాస్త్రేభ్యో నీరసతయా దుఃఖాదేవపరిణతబుద్ధీనామేవజాయతే। పరమానందసందోహజనకతయా సుఖాదేవ సుకుమారబుద్ధీనామపి పునః కావ్యాదేవ। ననుతర్హి పరిణతబుద్ధిభిస్సత్సు వేదశాస్త్రేషు కావ్యేషు కిమితి యత్నః కరణీయ ఇత్యపి నవక్తవ్యమ్. కటుకౌషధోపశమనీయస్య రోగస్య సితశర్కరోపశమనీయత్వే కస్యవారోగిణ స్సితశర్కరా ప్రవృత్తిస్సాధీయసీ నస్యాత్ ।" అను వచనములతోఁ జమత్కారముగఁ గావ్యాతిశయమును విశదీకరించెను. ఇట్లు కావ్యాతిశయప్రతిపాదకములగు నాలంకారిక మూర్ధన్యోక్తులు వందలకొలది యున్నవి. అందుచేఁ గావ్యోపదేశ ముపదేశాన్తరములకన్న మిన్నయని స్థిరపడుటవలన నయ్యదియే సార్థకము నావశ్యకమునని విశదమగుచున్నది.

(సశేషము.)

# గ్రంథ స్వీకారము.

తిరుమల తిరుపతి దేవస్థానము వారిచే ప్రాచ్యగ్రంథమాల యందు ప్రచురింపఁబడిన నీక్రింది యమూల్యగ్రంథములు మా కార్యస్థానమునకు సాదరముగ నొసంగఁబడి స్వీకరింపఁబడినవి.

(1) కాశ్యపసంహిత- జ్ఞానకాండము. (2) రూపకపరిశుద్ధి (3) ఆంధ్రకువలయానందము. (4) శృంగారసంకీర్తనములు. (5) శ్రీ వేంకటేశ్వరవచనములు. (6) శ్రీ వేంకటేశ్వరలఘుకృతులు.

శ్రీ దేవస్థానమువారు తమకు సంస్కృతాంధ్రాదిభాషలయందును, హిందూమతసంప్రదాయములందును గల యభిమానముతో దిరుపతియందు సంస్కృతకళాశాలను, ప్రాచ్యలిఖితగ్రంథాలయమును, ప్రాచ్యపరిశోధకసంఘమును నెలకొల్పి వానికనుబంధముగ నొక పత్రికను గూడ బ్రకటించుచున్నారు. అందమూల్యములగు వ్యాసములు, సంస్కృతాంధ్ర తమిళ భాషలయందును, నాంగ్లమునను బ్రచురింపఁబడు చున్నవి.

వీరి ప్రాచ్యగ్రంథమాలయందు వైఖానసాగమమును గూర్చిన అత్రిసంహితయందలి సమూర్తార్చనాధికరణమిదివరలో బ్రకటింపఁబడినది. మరల నాయాగమమునకు ముఖ్యమగు కాశ్యపజ్ఞానకాండము ను గ్రంథమిప్పుడు వెలువడినది. వైఖానసీయులకు కృష్ణయజుర్వేదానుబంధమగు కల్పసూత్రము లేగాక వారి సిద్ధాంతములను, దేవాలయము లందలి యర్చనాదులను వివరించు మరీచి, అత్రి, కాశ్యప, భృగు సంహితలును ముఖ్యమైనవి. అందు మరీచికృతమగు విమానార్చన కల్పము, అత్రిరచించిన సమూర్తార్చనాధికరణమను గ్రంథము లిదివరలో బ్రకటితములు.

కాశ్యపజ్ఞానకాండము

పెక్కువిషయముల నుద్ఘాటించుచున్నది. గ్రంథప్రారంభమున భువన నిర్మాణము, జంబూద్వీపవిస్తృతి, ఖండములు మొదలగునవి తరువాత వాస్తువిషయములు, విమానదేవసభాదికల్పనములు, ఆచార్యవరణము, భూమిశుద్ధి, దారుయిష్టకాసంగ్రహణము, బ్రహ్మస్వరూపము [illegible]కారస్వరూపము, శూలస్థాపనము, నిత్యార్చనవిధి, అలంకారాసనస్నపనవిధులు, అనూకార్యముల సంభవించు దోషములకు దగిన ప్రాయశ్చిత్తములు మొదలగునవి గ్రంథాంతమున అష్టాక్షరీమంత్రకల్పము, తన్మహిమయు విశదీకరింపఁబడినవి. ఈగ్రంథమునందలి విషయములు కేవలము వైఖానసులకేగాక తదితరులకు నవశ్యపఠనీయములు. వైఖానసాగమమును గూర్చియు సంహితలను గూర్చియు విపులమగు విమర్శగ్రంథము నాంగ్లమున బ్రకటింతుమని యుపోద్ఘాతమున దెలుపఁబడినది. అట్టి గ్రంథమాంగ్లముననేగాక యందఱకును దెలియునటుల నాంధ్రమునఁ గూడ బ్రకటింపవలయునని పరిశోధనాలయాధికారుల హెచ్చరించుచున్నాము.

(2) రూపకపరిశుద్ధి– ఇది అలంకారశాస్త్రమునకు జెందిన విమర్శగ్రంథము. పండితరాజ దేశికతిరుమలై తాతాచార్యశిరోమణిచే రచింపఁబడినది. ఉపమారూపకాలంకారములను గూర్చి పెక్కు అలంకారగ్రంథముల పరిశీలించి వ్రాయఁబడినది. భోజుని సరస్వతీకంఠాభరణము ననుసరించి, 'సామాన్యాప్రయోగే' అను పాణిని సూత్రవివరణ మొనరింపఁబడినది. సంగ్రహముగ గ్రంథారంభముననే గ్రంథప్రయోజనమును వివరించుచు గ్రంథకర్తలు పాదారవిందమను చో రూపకమని పలువురంగీకరించియుండ, గొందఱు ఉపమయునగునని నిర్వచించియున్నారు. అది సమంజసముగాదు. దాని నుపపాదించుచు సహృదయరంజనమునకై రూపకపరిశుద్ధియను నీగ్రంథమును రచించితినని

తెలిపియున్నారు. ప్రాసంగికముగ దండి, వామన, భామహ, రుద్రటాది ప్రాచీనాలంకారికులమతములను, అప్పయదీక్షిత, జగన్నాథాది యర్వాచీనుల యభిప్రాయములును విమర్శింపఁబడినవి. ఉపమారూపకముల యాదార్థ్యస్థితిని దెలియఁగోరువారికిది మిక్కిలి సహాయకారియగు ననుట నిర్వివాదాంశము. వెల 2 రూప్యములు.

(3) ఆంధ్రకువలయానందము. ఉభయభాషాప్రవీణ కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచింపఁబడినది. విద్యార్థులకుపయుక్తముగ సులభమగురీతిని మూలమునందలి విషయములు లలితమగు శైలి నాంధ్రీకరింపఁబడినవి. కాని క్లిష్టమగు నాలంకారిక శాస్త్రవిషయకములగు చర్చలతోఁ గూడియుండుటచే, మూలము వలెనే కొన్నిస్థలముల పాఠకులకు కష్టసాధ్యములయే చెప్పనగును. ఈ గ్రంథమువలెనే యిటీవల ప్రతాపరుద్రీయ, సాహిత్యరత్నాకరాది గ్రంథము లాంధ్రీకరింపఁబడినవి. కాని 'అనర్ఘ్యే మహాభాష్యే వ్యర్థాపాదమంజరీ' అనినట్లు క్లిష్టతములగు మూలగ్రంథముల నాంధ్రీకరించిన వానిప్రయోజనము సందేహాస్పదమనఁదగును. మూలవిషయములను తగురీతిని సంగ్రహముగ దగిన యుదాహరణముల గైకొని వివరించి, విద్యార్థుల కుపయుక్తముగ స్వతంత్రరచనములనే యొనర్చుట మంచిదని తోఁచుచున్నది. ఈవిషయము నిదమిత్థమని పండితబృందమే నిర్ణయించునుగాక. అయినను విశేషపరిశ్రమ వహించి మూలభావములను శక్త్యనుసారము సులభమగుభాషను వివరింప ప్రయత్నించిన గ్రంథకర్తల ప్రయత్నమెంతయు బ్రశంసనీయము. వెల రు 3-12-0.

(4) శ్రీ వేంకటేశ్వర వచనములు.

(5) శృంగార సంకీర్తనములు.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి యాస్థానమున సంకీర్తనాచార్యులగు తాళ్లపాకవారి నెఱుఁగని యాంధ్రవాఙ్మయాభిలాషు

లుండు టరుదు. వారి గ్రంథములలో ముఖ్యములగు అష్టమహిషీ కల్యాణము, పరమయోగివిలాసము, ఉషాపరిణయము లేగాక, చిన్న కృతులు పెక్కులు గలవు. వానిలో చాలభాగము దేవస్థానమున రాగిరేకులలో వ్రాయింపఁబడి శాశ్వతముగ జాగ్రత్త పఱుపఁబడినవి. దేవస్థానము వారిటీవల ప్రాచ్యపరిశోధనశాలయందు దాంధ్ర వాఙ్మయ పరిశోధకులును, సుప్రసిద్ధ విమర్శకులగు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వర్యుల సాహాయ్యముచే అన్నమాచార్యుల శృంగారసంకీర్తనములను, పెదతిరుమలాచార్యుని శ్రీవేంకటేశ్వరవచనములను ప్రకటించి యున్నారు.

శ్రీవేంకటేశ్వర వచనములను గ్రంథమునకు శాస్త్రిగారు వ్రాసిన విపులమగు పీఠికయందు వచనరచనము, తద్భేదములను గూర్చి సోదాహరణముగను, సవిమర్శముగను వివరింపబడినది. మఱియు తాళ్లపాకవారు రచించిన గ్రంథములు, వారి వంశక్రమము దెలుపఁబడినవి- శ్రీ వేంకటేశ్వరవచనములు కృష్ణమాచార్యసంకీర్తనము లను నామాంతరము గల్గిన సింహగిరివచనముల బోలియున్నవని శ్రీ శాస్త్రిగారు వ్రాసియున్నారు. ఈవచనములు సులభమగు శైలిని పెక్కు వేదాంతవిషయముల బోధింపుచు భక్తిప్రధానములై యల రారుచున్నవి. భావస్ఫురణము, అర్థగాంభీర్యముగలిగి తేటతెనుంగున మధురముగ రచింపఁబడిన యీగ్రంథము ఆంధ్రభాష యందుత్తమ వచనరచన దుస్సాధ్యముకాదని ఘోషింపుచున్నది. సహృదయు లందఱి మాధుర్యమును గ్రోలి యానందింతురుగాక వెల రు 1-8-0

(6) శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు. ఇదియు శ్రీ శాస్త్రిగారి చే బరిష్కరింపఁబడిన గ్రంథము. ఇందు కొన్ని కృతు లసమగ్రము. కొన్నిటికి కర్తలపేర్లును తెలియుటలేదు. అయిననేమి యముద్రితములు. రచనానైపుణ్యముగలిగి సహృదయానందరంజకము లనదగును.

తరిగొండ వెంకమాంబ రచించిన శ్రీ రమాపరిణయమను ద్విపదయు తుదిని జేర్చఁబడినది. ఇందు రఘువృత్తులు 9 గలవు. వెల రు 1-8-0.
పై గ్రంథములు వలయువారు శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయ ముఖ్యాధికారులకు వ్రాయవలెను.

---

7. తోకచుక్క — శ్రీసంతాత్మ్యాల వేంకట సూర్యారామారావు.
వెల 0-6-0 లు.

ఇది ఖగోళశాస్త్ర విషయకమగు చిన్నగ్రంథము. ఇందు గ్రంథకర్తలు తోకచుక్కలస్వభావము, దానికిని సూర్యకుటుంబమునకు గల సంబంధము, ప్రాచీన భూగోళశాస్త్రజ్ఞులు గుర్తించిన ధూమకేతువులు, వానివృత్తాంతము, పునరావర్తనము మొదలగు విషయము లెన్నియో సంగ్రహముగ విమర్శించియున్నారు. సులభమగు వ్యావహారికభాష నీగ్రంథము రచింపఁబడినది. అవసరమైన తావులకొన్ని పదముల కాంగ్లపదములును సులభగ్రాహ్యతకొరకు దెలుపఁబడినవి. గ్రంథకర్త లిట్టి చిన్నగ్రంథములే గాక ఖగోళశాస్త్రమును గూర్చి విపులముగ కథారూపముగ నుండునటుల గ్రంథముల రచింపవలసియున్నది. ఆంగ్లమున సర్-రాబర్టు బాల్ అను ఖగోళశాస్త్రజ్ఞుడు The story of the Heavens ఖగోళ వృత్తాంత కథయను గ్రంథమును కేవలము శాస్త్రజ్ఞులకే గాక సామాన్యులకుగూడ సులభముగ దెలియుటకై రచించియున్నాఁడు. దాని నాదర్శముగ గొని యిటీవల పరిశోధనాఫలితములఁ గూడ జేర్చి హృద్యమగురీతిని పాఠశాలా విద్యార్థుల యుపయోగార్థము మన దేశీయ భాషలయందు గ్రంథములు రచింపఁబడవలసియున్నవి. ఇట్టి గ్రంథముల వలయుచోటుల ఫొటో చిత్రములను గూడ జేర్పవలసియుండును. ధూమకేతువులను గూర్చి యాంధ్రమున దెలుపవలసిన ముఖ్యవిషయముల వివరించిన గ్రంథకర్త ప్రయత్న మెంతయు బ్రశంసనీయము.

# ఛందోదర్పణసమీక్ష.

(అనువృత్తము)

విద్వాన్-రావూరి దొరసామిశర్మకవి.

ఛందోదర్పణంబుపైఁ దరువాతి కవుల సవరణలు,

అనంతుని ఛందమందలి లక్షణములందుఁ గొఱవడినవానిని దోషములని తోఁచినవానిని దరువాతి లాక్షణికులు కొంతవఱకు సప్రయోగప్రదర్శనముగాఁ బూరించియు సంస్కరించియు నున్నారు. వానిం గొన్నింటి నీక్రిందఁ దెల్పెదను.

(1) త్రికారప్రాసము-

సంఖ్యఁ బలుకు త్రికారంబుఁ జనుఁ దకార
సదృశమై త్రికారప్రాస సంజ్ఞ గలిగి
అత్రివిక్రముఁ డభయప్రదాతయనఁగ
వాక్త్రిపథగోజ్జ్వలులు విష్ణుభక్తులనఁగ. (1-45)

అని వ్రాసినాఁ డనంతుఁడు. కస్తూరిరంగకవి రంగరాట్ఛందమున 'సంధిఁబల్కు త్రికారం'బను పాఠమిచ్చియున్నాఁడు, గాని యది సరిగాదు. ఇది సంఖ్యార్థక త్రికారంబుగాన రంగకవి పాఠమున కర్థము పొసఁగకున్నది. అనంతునే యనుసరించిన చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహమున "త్రిలోకస్తుత నీతిజ్ఞయను సంఖ్యఁ బలుకుఁ ద్రికార మగ్రప్రాస సంజ్ఞ"యని రచించెను. అత్రివిక్రముఁడను శబ్దమున కర్థము సరిపడలేదు. ఆ త్రివిక్రముఁ డనియుండును. అత్తఱి నర్థమును సంఖ్యార్థకత్రికారప్రాసంబును సంఘటితములగును. సంధిఁ బల్కను నవపాఠము రంగరాట్ఛందమున గోచరించుచున్నది గాని లక్ష్యమున 'ఆ త్రివిక్రముఁ'డను సత్పాఠమే తెలియుచున్నది. 'వాక్+త్రిపథగ' అను రెండవ యుదాహరణములో సైతము సంఖ్యార్థక త్రికారమే యున్నది.

అప్పకవిసంఖ్యార్థక త్రికారమునకే చెల్లునను నీప్రాసలక్షణము తక్కుం గల ప్రయోగములకు సరిపడమిచేఁ దనగ్రంథమున నీపద్యమును జేర్చుకో లేదుగాఁబోలు !

(2) బిందుప్రాసము- పొల్లు నకారము బిందువై ధకారము మూఁదిన ప్పుడే యీప్రాసమునకుఁ బ్రయోగసిద్ధి యనంతుఁడు ప్రతిపాదించుట సరిగాదని "బిందువై పొల్లనాఁజెందు సంధులను గనందగు ప్రాసంబు బిందువగుచు (లక్షణ-1-65) నని సామాన్యముగా నన్ని హల్లులకుంజెల్లు నర్థమొసంగునట్లు చిత్రకవి పెద్దన సవరించియున్నాఁడు. ముద్దరాజు రామన, కూచిమంచి తిమ్మనలు పరుషసరళ పరకంబగు ద్రుతంబునకు బిందుత్వమాఁనను లక్షణమురచించి లక్ష్యంబు లుదాహరించిరేకాని యనంతుని ధకారమాత్రలక్షణ మును విమర్శింపరైరి. రంగయకవి యనంతుని లక్షణమును జేర్కొని, బిందుపూర్వకంబులగు ధకారేతర హల్లులకును బ్రయోగంబులునూపి లక్షణము వ్రాసెను.

(3) అర్ధబిందుప్రాసము-పటలకుమాత్రమే యనంతుఁడు చెప్పినాఁడనియు, పరుషసరళంబులన్నింటికి ప్రాసము ప్రయోగములందుఁ గాఁ బడుచున్నదనియు, నప్పకవియు నట్లే చెప్పినాఁడనియు ముందే తెలుపఁబడెను. చిత్రకవి పెద్దన 'అఱసున్న గలపక యరయ నిర్బిందువై, తేలినచోటను దెలియ వినుఁడు, దాఁటెఁగేసరిసుతుఁ డేటిగుంపులఁ దేనిఁ జాఁపుగా లంఘించియేపుమీఱ, నన నర్ధబిందువై యమరు ప్రాసంబగు' (1-65.)

అని వ్రాసెను. పటలకుమాత్రమేయని సూత్రింప లేదుగాని యుదాహరణము లనంతుని ననుకరించి పటలకే యిచ్చెను. ఇందు మఱొక యంశము- 'మాటలేటికి మేటితాఁబేటి కనఁగ'నను ననంతుని పద్యమునఁ దాఁబేటిశబ్దమున 'టి' యుపవిభక్తిగాన నయ్యది సార్థ

బిందుకముగాదని ముందు వక్కాణింపఁబడినదిగదా. సార్ధబిందుకమని వాదించినచోఁ బెద్దనపద్యమునందలి 'వాఁడెఁగేసరి సుతుఁడేటిగుంపుల' ననుదళములోని 'ఏటి' (ఏఱు+టి) శబ్దమాపవిభక్తికాంతము గాన సార్ధబిందుకమై 'వాఁడెఁ, ఏఁటి' అను రెండుచోట్ల నర్ధబిందువులుండి యుదాహరణము వ్యర్థంబగు. పెద్దన ప్రయోగమే యాపవిభక్తిక టివర్ణంబు సార్ధబిందుకము గాదని చాటుచున్నది.

కవిజనసంజీవనీకర్త రామన 'అర్ధబిందువు నిర్బిందువగు పదంబు ప్రాసముల దీర్ఘములమీఁదఁ బలుకఁజెల్లు, మూఁడు మూర్తులు నేకమై కూడెననఁగ, సోఁకుమూఁకలనణఁచె నిత్యోకుఁడనఁగ' అనుపద్యమును, దానిక్రింద 'అనంతుఁడు చెప్పినరీతిటవలకు మాత్రమే కాదు అన్నింటికిఁ జెప్పవచ్చును' (ప్రథమతరంగము) అనువచనము వ్రాసి విరాటపర్వములోని 'లోకము వంచింపందగు చీఁకటిరేయొకవె' నను ప్రయోగమిచ్చియున్నాఁడు. సర్వలక్షణసారసంగ్రహకర్త తిమ్మన రామనవలెనే యనంతుని లక్షణము సరికాదనిచెప్పి పై రామననే యీక్రిందిరీతి ఖండించియున్నాఁడు.

అర్ధబిందువు నిర్బిందువగు పదముల
ప్రాసములు దీర్ఘముల మీఁదఁబలుకఁ జెల్లు
ననుచుఁ దగముద్దరాజు రామన వచించె
హ్రస్వములమీఁద నటువలె నలరురుద్ర. (2-19)

తిమ్మకవి రామననే ఖండించినాఁడుగాని 'నిడుపులు నరసున్నలు తమ కెడమునుగల కచటతపల కిఁక ప్రాసములై దొడరును నిర్బిందువులొక్కెడ'నని రామన మతమునే చెప్పిన యప్పకవి లక్షణంబుగూడ దానిచే నపాస్తమగుచున్నది. ఇట్లే యీసందర్భమున లాక్షణికులు భిన్న భిన్నంబులుగా లక్షణములు రచించిరి.

(4) సంయుత ప్రాసము- (అనంతచ్ఛందము)

గీ. పాదు నూఁదు ప్రోలు బహువచనంబులై
పరఁగుచుండు నూఁదిపలుకునపుడు
తేల్చి పలుకునపుడు దీపించు సంయుత
ప్రాసమిది దెలుఁగులఁ బద్మనాభ. (1-55)

గీ. వాళ్లు మనుజులెక్క- నూళ్లుగాఁ దొడఁగెన
య్యూళ్లు మిగుల బలసెఁ బ్రోళ్లుగాఁగ
భాగ్యవంతుఁడేలు వాళ్లకు నూళ్లను
ప్రోళ్లునయ్యెబ్రాతె కూళ్లి చటను. (1-56)

గీ. తెలుఁగునందు లేదు లలిఁగ్రిందినుడి గ్రుచ్చఁ
గ్రమ్మెఁనాఁగ రేఫకొమ్ము గాని
ప్రాసమైత్త్రి చొరదు దా సంయుతప్రాస
మగును రేఫయుతము ననుసరించి. (1-57)

క. ఉక్రిందటి రేఫలు సమ
మై క్రాలుచోఁ జెలి ప్రాసమగు సంయుక్తం
బాహ్రిర సక్రిభయమున
వాక్రివ్వదె గజము భక్తవత్సలునవఁగన్. (1-58)

ఇందుఁ దొలి రెండు పద్యము లొక విషయమును, మరి రెండు పద్యములు మఱొక విషయమును జెప్పుచున్నవి. (1, 2 ప) పాదు, ఊరు, ప్రోలు శబ్దముల బహువచనములు వళ్లు, ఊళ్లు, ప్రోళ్లు. ఇవి సంయుక్తములు. వీనికిఁ బరస్పర ప్రాసమైత్త్రి రెండవపద్యమునఁ జూపఁబడినది, సరియే. నాల్గుపాదములందుఁ బ్రాసమున వాల్లు లేక రీతినుండవలయు; సంయుక్తాక్షర మొకటనున్నఁ దక్కిన చరణంబులందు నాసంయుక్తమే యుండవలయు, ననునవి ప్రాససామాన్య లక్షణములు. పై రెండవ లక్ష్యపద్యము ప్రాససామాన్య లక్షణమందే గతార్థమగును

గాన దీనిని మఱలనేల చెప్పవలయునను సంశయ ముప్పతిల్లదుఁ గాని లక్షణంబును బరికించినచో 'ఊఁదిపలుకునపుడు తేల్చి పలుకునపుడు దీపించు సంయుతప్రాస'మను దళమున కర్థము వేఱుగానున్నది. అనంతుని లక్ష్యంబున నూఁదుతేలు పలుకు సంయుతముల ప్రాసమైత్రిగాన రాదు. అందుఁ గలవన్నియు నూఁదిపలుకఁబడునవియే. ఇవ్విషయము చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహములోని యీక్రింది పాదములచే నిస్సంశయముగా స్పష్టమగుచున్నది.

"పాడునూరునుబ్రోలుఁ బాళ్లు నూళ్లుఁ
బ్రోళ్లును మొగులు మొగుళ్లను నివిమొదల్
బహువచనములైన పట్ల నూఁది
పలికినప్పుడు తేలఁబలికిన సంయుత
ప్రాసంబుద్వివిధమై పరఁగుఁ గృతుల."

ప్రోలుమొగులు శబ్దముల బహుత్వములు ప్రోళ్లు మొగుళ్లు. ఇందు మొదటిది దీర్ఘపూర్వక సంయుతము; రెండవది హ్రస్వపూర్వకసంయుతము. ఇవియే యూఁదితేల్చి పలుకఁ బడునవి. వీనికిఁ బ్రాసమైత్రి ఘటిల్లుననుట సంయుతప్రాసము.

అనంతామాత్యుని సంపూర్ణముగా ననుసరించినవాఁడు పెద్దన. ఇయ్యంశముఁ జూపుటకిది స్థలముగాదు గాన నారచించెడు లక్షణసారసంగ్రహ విమర్శనమునఁ జూపెదను. అనంతుఁడిచ్చిన పాడు-ఊరు ప్రోలు శబ్దములన్ గ్రహించి పెద్దన తేల్చిపలుకు నుదాహరణము లేమిచే మొగులు శబ్దంబొసఁగి కొఱవడిన దోసంబును సవరించినాఁడు. అనంతుఁడు ప్రాససామాన్యలక్షణనిర్దేశంబున "శక్తిగమనఁ దన నధోక్షజుఁడన సంయుతాక్షరాది చెల్లు ననమగురువు" (1-32) అను పద్యమును రచించియున్నాఁడు. ఇందే సంయుతప్రాసంబులోని యభిప్రాయంబు చెప్పఁబడియున్నది. ఇట్లుండఁ బునరుక్తిగా నేల యనం

కుఁడు సంయుత ప్రాసంబు వక్కాణించెనో శోచనీయము. ఏతాదృశం బగు నసంగత మార్గంబును దిలకించియే పెద్దన 'జడ్డయు జడ్డయునను ముఁజేసి ప్రాసముంచుట సమప్రాస నామంబగు'నని సామాన్యలక్షణంబు దెల్పి దానిక్రింద నీవిశేషలక్షణమును (సంయుతప్రాసము) జెప్పినాఁడు. అనంతుని మార్గమును దర్వాతిలాక్షణికు లెవ్వరు ద్రొక్కలేరు. (3,4 ప) తెలుఁగులందు వట్రువసుడి లేదు, కారవడిగలదు. కారవడితోఁ జేరిన హల్లట్టి సంయుతాక్షరముతోనే ప్రాసమైత్రి నొందునుగాని వట్రువసుడితోఁ జేరిన హల్లునకుఁ దన్మైత్రి చెల్లదని దీనిభావము. 'వాకృచ్చు, ఆకృష్ట' యనుశబ్దములో వినికి కేకరీతిగాఁ దోఁచును. వినికిఁ బ్రాసమైత్రి నిషేధమని యనంతుని యభిప్రాయమై యున్నది. తెనుఁగుపదములోని రేఫసంయుతాక్షరము సంస్కృతపదములోని యట్టి రేఫసంయుతముతోడను, రేఫసంయోగమాదియందుఁ గల శబ్దములు రేఫసంయోగము మధ్యఁగల సంస్కృతాంధ్ర శబ్దములతోడను బ్రాసమైత్రినందునని నాల్గవపద్యములోఁగల 'ఈక్రింది ... సమమై క్రాలుచు ... ఆకూర్ర ... వాకృవ్వ' అను నుదాహరణములు దెలియఁజేయుచున్నవి. జడ్డకు జడ్డసమముగా నుంచవలయునను వాక్యముచేతనే యివి గతార్థములగునని పెద్దన సంయుతప్రాసముక్రిందఁ జర్చింపఁడయ్యె. మఱి తరువాతికవు లేరుం దీనిందలపెట్టరైరి. అప్పకవి ప్రాసభేదముల సంఖ్యఁ బెంచుతలంపుగల వాఁడుగాన ననంతుని పద్యములనుకరించి యిట్లు వ్రాసికొనెను.

గీ. సుడులు తెలుఁగులందుఁ బొడమ వాకైవడి
క్రాలు క్రొమ్మ్ర కారవడులు గాన
రేఫయుత సమాఖ్యఁగృతులఁ బ్రాసములగు
సొరిదిఁ దమకుఁదాము సుడులఁబాసి. (అప్ప 3-328)

క. ఈకారిర పలుకనకు సమ
మై కాలుచుఁ దేలి ప్రాసమగుఁ జనతనకే
శ్రీ కొమ్మక్కడి సౌందర్యము
వాకు ప్రవ్వందరమె యారగవరునకు నైజన్ (అప్ప 3-324)

అనంతునిపద్యము లక్ష్యముఁ నుపకరించుచు నప్పకవి సంయుత ప్రాసమనక రేఫయుత ప్రాసమున్నాఁడు. ఉదాహరణ మనంతుని పద్యముం బోలినదే.

(5) ప్రాదియతులు-

క. ధరనుపసర్గలు ప్రాస్వప
దురపాభిప్రతి సుని న్యుదుప పర్యాభిసమ్
నిరతి పరాజ వులిరువది,
పరాజవులుచొరవు తెలుఁగుబాసను నెందున్. (అనంత 1-93)

ఇందుఁ దెలుఁగుబాసయనఁగా దత్సమమనియే గ్రహింప వలయును. అచ్చాంధ్రమునఁ బ్రాద్యుపసర్గలు లేవుగదా! తత్సమ భాగమందు 'పరా, ఆఙ్, అపి అను నుపసర్గత్రయము లేదని యనంతుఁడుచెప్పె 'అపి' తెనుఁగున లేదుగాని 'పరాజులు' గలవు. భీమన యుపసర్గవింశతికి వళ్లుభయము చెల్లునని వ్రాసెనేకాని పరాజ ప్రతిషేధము వచింపఁడయ్యె. సులక్షణసారమందును, కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారమందును భీమన చెప్పినంతయే కలదు. ముద్రిత కవిజనసంజీవనియం దుపసర్గల కుభయయతి చెల్లునని మాత్రమున్నది. చిత్రకవి పెదన యనంతుని మతమువాఁడుగానఁ బరాజప్రతిషేధము వచించె. కడకప్పకవియు నుపసర్గవింశతి పారాయణశ్లోకము రచించి 'ఆంధ్రమునకుఁ జేరని పరాజవులు మూఁడుగాక' యని యనంతా మాత్యుని లక్షణమునే యాధారముగాఁ గొనిచెప్పెను. అనంతునకుఁ

బూర్వుఁడు విన్నకోటపెద్దన 'అప్యాజ్ అను నిరూపణ మప్రసిద్ధ' మని రెంటిని మాత్రము నిషేధించె.

పరాశ్రయ పరాయణాది శబ్దంబులందు 'పరా' యున్నదిగదా? విన్నకోటపెద్దన యిచ్చిన యీక్రిందిపద్యములో 'పరా'యనుట కుదాహరణములుగలవు.

> రిపుల వికసించుచోటఁ బరేతనాథుఁ
> డుర్వి రక్షించుచోటఁ బరోధభుజుఁడు
>
> (కావ్యా-చూడామణి-7-ఉల్లా-49-ప)

రంగరాట్ఛందమునఁ గస్తూరిరంగకవి ప్రాస లిఖ్యాదిటికిఁ బ్రయోగము లొసంగియున్నాఁడు. ఆతని మతమున నేవియు నిషేధము గాదు. పరాజయమునకు (పరా) పరాయణ పరాశ్రయములు (అజ్) అలాపము, (అపి) అప్యయము లక్ష్యములుగా రంగకవి యొసంగియున్నాఁడు ఇందు మొదటిది నిర్వివాదంబు. మూఁడవదానికిచ్చిన యుదాహరణములు:-

> "శయధృతి ఫణివలయ భవా
> ప్యయ విహిత విశుద్ధసంవిదాత్మక"
> "జయ విజయ వినుత జన్మా
> ప్యయ దూరానంద రూప భాసుర"

ముద్రణమున 'అవ్యయ' యనియే కలదు. రంగకవి 'అపి'కి లక్ష్యములుగాఁ బైపద్యము లొసంగియుండుటచే 'అప్యయ' అనియే యుండఁజనును. అప్యయ మనుపదము తెనుఁగు నిఘంటువులందును గొన్ని సంస్కృతకోశములందును గానరాదు. దీనిప్రయోగ మాంధ్రమందప్రసిద్ధమే. ఆప్టేనిఘంటువందు అప్యయము (అపి+అయము), అప్యయనము (అపి+అయనము), అపీతి (అపి+ఇతి) మున్నగు శబ్దములుగలవు. ప్రళయమని వీనికర్థము. వీనికిఁ బ్రయోగములు-

స్వాప్యయాత్ - బ్రహ్మసూత్రము 1 అధ్యా 1 పాద 10 సూ;
అపీతౌతద్వత్ప్రసంగా దసమంజసమ్ - బ్రహ్మ - 2-1-4;
స్వాహ్యపీతో భవతి - ఛాందోగ్యోపనిషత్తు.

రంగకవి యుదహరించిన పద్యద్వయము వరుసగా పెద్దన హరి కథాసుధారస, నాచనసోమన హర(రి) విలాసకృతులలోఁ గలవని యాదు వ్రాయఁబడియె నేతద్గ్రంథములు నామమాత్రావశిష్టములు. ఏది యెట్లున్నను బూర్వలాక్షణికులు చెప్పని యీయుక్త్యుప్రయోగమును బ్రకటించిన రంగకవి పరిశీలన ప్రశంసింపఁ దగ్గది. ఇఁక రెండవ దానికిడిన యుదాహరణములు పరికింతము.

"జాలికడియాన యతి మధు
రాలాపములనియె నాదరణమున వినఁగన్ ..."
(అల్లసాని పెద్దన హరికథాసారము.)

"మానితిలక సజ్జన సం
తాన మహీరుహా! భవత్సుధాలాపము ..."
(నాచన సోమన హర(రి) విలాసము.)

ప్రాదియతి యుభయయతిభేదము. ఉభయయతి యనఁగా స్వరవ్యంజనముల రెంటికి యతిమైత్రినుంచుట 'ఉపసర్గములల తలల స్వరములకిక వాని కవ్వలను గలుచు నచ్చటుగ హల్లులనఁ బ్రాది యతి యనంగ' నని యప్పకవీయములోఁ గలదు. ఉదా- ప్రాప్తి (ప్ర+ఆప్తి.)

అబ్జయోని రజోగుణప్రాప్తిఁ దనరు
పద్మనాభుండు సాత్త్వికప్రాప్తిఁ దనరు. (అప్పకవి)

పై ఆలాపశబ్దములో అజ్ఞుపై స్వరము రాలేదు. ఈ అజ్ మధుర సుధాశబ్దములకుఁ బరముగా వచ్చియున్నది. పై రంగకవి పద్యములందు- ఇది 'భాను సహస్రభాసివృషభాధిపుఁ' డను నఖండ యతింబోలినదే కాని ప్రాదియతి కాఁజాలదు. అజపులకుఁ దగిన ప్రయోగములు

క. "ఆనంద రంగనృపతి య
హీన ధరాభారమున్ భరించుటచే ని
మ్మానవపతినిన్ సారె క
హీనప్రముఖులొనర నుతింతురు ప్రేమన్.

ఇందు భరించు నుతించు యను స్వరము విరుగకున్నను మాత్ర ప్రాసమైత్రి పాటింపఁబడినది. రంగకవి మతము సరియే. కాని, యనంతుని పద్యమునకును దన మతమే యర్థముగా నిర్వహించుట యెట్లో తెలియకున్నది.

ప్రస్తుతము ముద్రితమై ప్రచారములోనున్న సులక్షణసారమందు భిన్నాభిన్నయతులు రెండు ప్రత్యేకములుగాఁ గలవు. అందు ముద్రాప్రమాదములు పెక్కులున్నవి; వానిని జర్చించుట యిందుఁ బ్రసక్తము గాదు. మనకుఁ గావలసిన భాగమాత్రము స్వీకరించి చర్చింతము.

(భిన్నయతి)—

క. అంచితతిలకము శౌరిధ
రించెనన జగణ మధ్య రేఫ విరతియై
యంచిత తిలకము శౌరి ధ
రించెనన భిన్నపదకి నిత్యము నచ్చెన్.

(అభిన్నయతి)—

క. ఇంచియును నచ్చుహల్లు ను
దంచితముగ సంధిగూడు నప్పుడభిన్నం
బెంచఁగ బోలుఁను వారిఁ బలి
కించెనటన్ రెండుఁ జెలు నెలమిఁ గృతులన్.

ఇందు భిన్నయతికిఁ గల యుదాహరణ మనంతుని పద్యమే. అందుత్తరార్ధమునఁ గొంత మార్పుగలదు. సులక్షణసారకర్త 'భరించు' అను శబ్దములో రించుగాగల సంబంధియగు ఇకారమున్నది గాన నజ్ఝల్లు లుభయమును యతిమైత్రి నొందునని చూపుచున్నట్లు దెలియవచ్చెడు. భిన్నయతియందే యుంభయము చెప్పఁబడియుండఁగా మఱల నభిన్నయతి శీర్షిక క్రింద నట్లే 'పలికించు' శబ్దమునకుభయ

యతి చెల్లు ననుటలో నర్థమేమి యని శంకింపవచ్చును. అందులకు సమాధానము వక్కాణించెద. భిన్నయతి యభిన్నయతియను ననంతామాత్య కవుల సరణికి సులక్షణసార కర్తృప్రోక్తంబగు భిన్నాభిన్నయతులు సరిపడవు. ఇంచుకాగమస్వరము పెరుగు (భిన్నమగు) రూపముగల 'ధరించు' ఇత్యాదులకు నజ్ఝల్లు లుభయమును యతిమైత్రినందుట భిన్నయతి యనియు, నట్లించుకైన పెరుగని (భిన్నము గాని) శబ్దంబులలోనైన నుభయమునకు యతింగూర్చుట యభిన్నయతి యనియు సులక్షణసార రచయిత తాత్పర్యమై యుండును. అట్టి మతమే యతని గ్రంథమున వెలయుచున్నది. కాని యందలి పద్యములు దోషభూయిష్ఠంబులు. వానిని సవరించి వివరింపఁ గడంగిన వేఱొక గ్రంథంబగు ఈ భిన్నాభిన్నయతి వివరణ మను నే వ్రాసిన సులక్షణసారవిమర్శనమున విస్తారంబుగాఁ జర్చింపఁబడి యున్నది. మహాకవి ప్రయోగపరిశీలనముచే సులక్షణసార శంకరాభ్యుదయకర్త లనంతాదులం బలెఁ గాక యించుకాగమ సంయుత ధాతువుల కుభయయతి ననుశాసించిరని తలంపవలయు. ఏకీభావమొందఁగినంతలో మహాకవి ప్రయోగములు పెక్కులు గలవు. గ్రంథవిస్తరభీతిచే గొన్నిటిం జూపెద. వీరలు దైవశక్తిఁ బ్రభవించిన వారసు లేమి సందియంబీ రమణీయకాంతి సుషమి వఁగఁ జాలు... (భారత- ఆది - 5)

వసుదియ్యమున నటించిన (నృసింహపురా- 1)

పాటించి ధరించి పొందు ఘటియించి (భాస్కర- యుద్ధకాండ)

ఇరవు గదాధరగాని భజించుట యొప్పున్- (పద్మపురా- 2)

ఏమంట పాదుకలఁ బట్ట గణింపఁగ (భాగవత- దశమ- ఉత్తర)

మించి పెడించిన రిక్కల హా
రించక సత్కీర్తి యీ మహీతల మెల్లన్
నించక దీనులదయఁ బో
షించక ప్రఖ్యాతి గలుగునె నరనాథా (దశకుమారచరిత)

ఎఱిఁగి నిక్షేపమునకు నడఁగించు టుచితమ్ము (పంచతంత్ర-సంధి)
ఇచ్చకు వచ్చినట్టుల చరించెడువారలు (ఉద్భటారాధ్య- 1)
రంగకవి యుదాహరించినవి —
భరించెద గోవర్ధనాద్రి మెలచే (అథర్వణచ్ఛందము)
ఇచ్చ నొకింత యేరియుఁ జలింపక (రాజశేఖర చరిత్ర)
చలింపక యునిలోనఁ దెగిమె నెవ్వఁడు (హరికథాసారము)
(7) యుక్తవికల్పయతి —
నలి జకారహల్లితరానునాసికాఖ్యఁ
గదిసి తత్పంచమముగా వికల్పవిరతి
గలుగుఁ జక్రివల్ల వసుధ్బృజ్మర్థుఁ డనంగఁ
గమలనేత్రుండు సకలదిజ్మహితుఁ డనఁగ (అనంత.)
నలి గకారహల్లను పాఠము సాధువు. ఇప్పాఠమే సులక్షణ
సార రంగరాట్ఛందములఁ గలదు. కకారమునకు (దిక్) ననునాసికము
పరమగుచోఁ (మహిత) దద్వర్గానునాసికము (జ్) వికల్పముగా
నాదేశ మగును. (దిగ్మహిత, దిఙ్మహిత). దిఙ్మహిత యనురూపమున
జకారమకారములకేని, కకారమునకే కాక, కచటతపవర్గాక్షరము
లన్నింటికిఁ జెల్లును. అనఁ తుఁడొక్క కకారమును మాత్రమే పేర్కొ-
నుట యతని పరిశీలనలోపము. ఈవికల్పయతిసూత్రమే యనంతుని
వికల్పప్రాసమునకు నన్వయించుచున్నది చూడుఁడు.
గీ. సానునాసికలా వర్గహల్లులకుఁ దృ
తీయములు వికల్పప్రాసమై మెలఁగు
ప్రాఙ్నగంబుపై రవిదోఁచె నగ్నివోలెఁ
బ్రాఙ్మఖుండై నుతించె నీవాగ్మియనఁగ (1-50)
ఇందు వికల్పసూత్రవ్యాజమున ప్రాఙ్నగ- అగ్నిశబ్దములకుఁ
బ్రాసము సంఘటితమై యున్నది.

అనంతామాత్యుఁడు వికల్పప్రాసమునఁ బైని నారంభించినట్లే వర్గహల్లులకు నన్నిటికిఁ జేర్పకనియేఁ గాని యుక్తవికల్పయతియం దొక్క కకారమే గ్రహించె. ఇది యతని యవిచారమూలకమని తలంచెద.

చిత్రకవి పెద్దన యిట్లు వ్రాసెను.

గీ. సంధులను రెండు రూపముల్ జరగు వర్ణ
మున వికల్పాక్షరయుతులు దనరుఁ గృతులఁ
దలఁపు రాముపై నిడిన సన్మతివి యం వ
భంజితాసురసముదాయ యాంజనేయ (లక్షణ)

పెద్దన కకారమని నిర్దేశింపక వ్రాసెను. ఇందు మఱొక విశేష మున్నది. అనంతుఁడు జగద్ధితాదిశబ్దముల సంహితతో హకారము లోపించుటచే నట్టివానికి హకారమొండె, నాదేశ వ్యంజనమొండె యతి ఘటనాయోగ్యం బగునని వికల్పయతి పేరిడుటచే 'నలిఁ గకారహల్లు' ను దానిని యుక్తవికల్పయతి యనవలసివచ్చె. పెద్దన రెండు వేర్వేరుగాఁ జెప్పక వికల్పయుక్తవికల్పములు రెండు గ్రాహ్యమగు భంగి 'సంధులను రెండురూపము' లను పద్యము రచించె.

అప్పకవి యనంతుని వికల్పయతికి నంత్యోష్మసంధియతి నామంబిడి యుక్తవికల్పమును వికల్పవిరమణమని చెప్పినాఁడు. వికల్పవిరమణమున 'యరోనునాసికేనునాసికోవా' యను పాణినిసూత్రంబును వ్రాసి 'సంధులతుకునవుడు రెండువిధముల రూపంబులుండెనేని రెండు చెల్లు' నన్నాఁడు.

అప్పకవికిఁ దరువాతివాఁడగు కూచిమంచి తిమ్మకవి యనంతుని యుక్తవికల్పయతి మార్గమే మూలముగాఁ గొని యింకను వికల్పప్రాసములోని కకార పరకనకార సంధ్యుదాహరణమును (ప్రాఙ్నగము) గ్రహించి, కకారమునకు 'నమలు' పరంబులగుచోట సంహితయందు వికల్పయతి యగునని యిట్లు రచించెను.

గీ. నలిఁగకారవాల్లు నమలతోఁ బొడలి డి
ఙ్నగము దిగ్నగంబు నాఁగ వాఙ్న
నములు వాగ్నమములు నాఁగ గబ్బముల వి
కల్పయతులు రెంటఁ గలుగునవ.

(సర్వలక్షణసార. 2-56)

(8) అభేదవిరతి- ప్రకట పకారవకార ద్వికమునకుం జను సభేదవిరతి యని యనంతుఁడు పవలకుమాత్రమే యతిమైత్రి నుడివెను. ఈయభేదయతి భీమన విన్నకోట పెద్దనలు చెప్పలేదు. చిత్రకవి పెద్దన 'పఫబభవ' లకు యతిమైత్రి చెప్పినాఁడు.

గీ. పృథివి సుకవులు వపయోరభేదయనెడి
పరఁగుచేఁ బఫబభలవి వారిఁ గృతుల
విరతు లున్నఁగ రవిగా యభేదయతులు...

'వబయోరభేద' యనియే ప్రసిద్ధమయ్యుఁ బెద్దన వపయోరభేదయని పేర్కొనె. రంగరాట్ఛందములోఁ బేర్కొనఁబడిన యాక్రింది నన్నయభట్ట లక్షణసారమున వపయోరభేద యనియే కలదు.

క. వపయోరభేద యనియెడు
నెపమునఁ బఫబభలు వాకు నిలిచిన యెడలం
దుపమింపఁ బవచ్ఛుఁ గృతులం
దుపనిషదుచితార్థ సూక్తియోగరుటవంశా.

ఈపద్యమే ప్రస్తుత ప్రచారములోనున్న సులక్షణసారములోఁ గలదు. గాని తొలిపాదము 'వబయోరభేద' యని యున్నది. అట్లున్నఁ ప్రాసభంగమగు మద్దరాజు రామన 'యతుల వకారపవర్గ ద్వితయాభేదంబు చెల్లు' నని యనంతుని పకారమును పవర్గముగా మార్చెను. ప్రయోగ పరిశీలనంబుచేఁ దరువాతి వారందఱు పఫబభవలు చెల్లునని రచించినారు. "కృతుల పఫబభలు వాకున్ యతినిలుప నభేదవిరతి" (సర్వలక్షణసార సంగ్రహము- తిమ్మకవి) యతిసంఖ్యను పెంచు తలఁపుగలవాఁడగు నప్పకవి వబల కభేదవిరతియనియు, పఫబభవలకు సభేదవర్గయతి యనియును నామకరణము చేసెను. పూర్వలాక్షణి

కులలో ననంతుఁడే తరువాతివారలకీ యభేదవిరతిని జూపుటయందు మార్గదర్శకుఁడనవచ్చు. భారతాదులలో 'పవ'లకే కాక 'వఫబభవ' లకన్నిఁటికిఁ బ్రయోగములున్నను బరిశీలింపక యనంతుఁడు పవలకే యభేదయతి చెప్పెనని గ్రహింపనగు.

ఇట్టి పరస్పరభేదములుండుటచేఁ గొంతవఱకు లాక్షణికుల పరిశీలనలోపము మనకు తప్పినదిగాదు.

(౯) కృత్త్యాది విసర్గనీయ వర్ణాక్షరములు- (అనంతుఁడు.)

క. పురశరరసగిరి రుద్రుల
నరయ నకచటతప లిడుట యనుచిత మత్యు
క్షరములును రసభజంబులుఁ
బరిహారణీయంబులాఁక బంకజనాభా. (I-26)

క. మొదలను కఖజలు చఛడలు
దధలును భయశషలు తగదుపవర్గా
స్పదములు గాకుండిన మే
లొదవించును స్వరములెల్ల నుత్సవకారుల్ (I-27)

ఇందు మొదటిపద్యము సులక్షణసార రంగరాట్ఛందములందు గ్రహింపఁబడి యున్నది. అందుఁ బూర్వార్ధ మిందున్నట్లే యున్నదిగాని యుత్తరార్ధమునఁ గొంత మార్పుగలదు. 'అత్యక్షరములు నరచభజంబులు పరిహారణీయంబులు' అని యుండలిమార్పు.

'పురాస్త్రరసగిరి రుద్రైస్త్వకచటపా మాత్రకా నింద్యాః' అను పాదము నన్నయచింతామణిలోనిదిగా నప్పకవి రచించి వివరించియున్నాఁడు. అనంతుని పకారమున కిందు హాకారమున్నది. ఉత్తమగండచ్ఛందమునఁ గల 'అకచటపా లనఁగ నైదును బ్రకటంబుగ బుత్తుల గిరులఁ బను నొక్కింటన్' అను పద్యము రంగరాట్ఛందమున నుదాహరింపఁబడియున్నది. ఇందును బై శ్లోకమతమే వెలయుచున్నది.

పై అకచట త(హా)లు, రసభజములు- (నరచభజములు)- పద్యాదిని బరిహారణీయములని యనంతుని ప్రథమపద్యోక్తతరదర్థము. ద్వితీయపద్యమున క ఖ జ ఛ ఛ డ ద ధ భ య శ ష స లు.

నని యెఱింగి వారియడుగులు దలఁచి న
మస్కరించి దండి నమ్మురారి
వామనుని గుణాఢ్యు క్షేమేంద్రు నిల
నలంకారవిదులఁ దలఁచి గారవమున. 3

సీ. ప్రత్యగ్ర రచనాతి భాసురప్రాసాద
నిర్జిత గోత్రావనీధరంబు
ప్రాకార శిఖరాగ్ర బంధుర మణిగణ
ద్విగుణిత తారకా విభ్రమంబు
పరిఖాజలాంతర ప్రతిబింబితద్రుమ
స్మారిత పాతాళ భూరుహంబు
వరపుష్ప సౌరభావర్జిత మధుప లూ
స్వీకృతాశా వారణేంద్ర గండ
మప్సరః స్పృహణీయ లీలాతిశయవి
లాసినీజననేత్ర విలాస జనిత
కుసుమశరబాణవైఫల్యమసదృశార్థ
నిర్జితాలక యుజ్జయినీపురంబు.

తే. గీ. తరులువడి యుత్తరాయణ దక్షిణాయ
నముల రవితేర నిడిసిన పరపలట్లు
మెఱయఁ గనుఁగొనఁ గొమ్మలు మింటి కిడిన
కుదురువిధమునఁ దనరారుఁ గోటమీఁద.

చం. కొలఁదికిమీఱఁ బెద్దయగు కోట తనర్చున వస్తుసంతతో
జ్జ్వలతరసత్ప్రభాతరవి చంద్రరుచుల్ సొరనేరకున్న సం
ధ్యలు దివసత్రియామములు తత్పురిపౌరజనం బెఱుంగఁగ
మ్రొలయుచవిన్ విహంగగతిఁ బూవులతావి రతిప్రసంగతిన్.

తే. గీ. ఇజ్జీపావ యిల్కుండేలుకజ్జీయనుచు
జనులు కనుకని పలికెడు చందమామ
నడిమి మచ్చకు నెఱిఁగి పేరిడఁగ నేర్తు
రప్పురమున మేడలపయి నాడుసతులు.

కం. హారగిరి సురగిరి రోహణ
గిరులీనిన కొదమలనఁగ గృహములు పురిన
చ్చెరువగు నకష్మ రత్న
స్ఫురణాల విలసిల్లి తగినపొడవుల తోడన్.

ఆ. వె. నీర నగ్ని యునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్ని కడలి యప్పు
రంబు సొచ్చెనొక్కొ రత్నాకరము మణు
లనఁగఁ జెలువమమరు నాపణములు.

చం. పొడవుగ నెల్లయంగడులఁ బోఁగులువోసిన నూత్నరత్నముల్
కడఁక ననేకవేషములు గైకొనివచ్చిన యర్థికోటికిం
బిడికెఁడు లాదిగాఁగ బలివెట్టుచు రప్పురివైశ్య భామినుల్
గడపక హస్తకంకణ ఝుళంధ్వనులొప్పఁగ నెల్ల యెప్పుడున్.

కం. తరుణ వయస్కుల యౌవన
పరిపాకుల వృద్ధజనుల భటులను నిజసో
దరులను గురులనుగాఁ జూ
తురు పురముపతివ్రతాసతులు పుణ్యవతుల్.

సీ. చూపుల కట్టువుందూపుల చేఁబట్టు
నబలల చూడ్కుల యాయుధములు
కాయంబునకు గండఁగోయిలఁ గూయించు
బాలలపలుకుల మూలమంత్రి

మెదిరికిఁ దేటులనెడ యాటలాడించు
సబలలయలకల యొష్ఠబలము
నవరణకుం జంఝ్రుఁ జాలించు మగువల
మొగముల నేఁకఁ దగిన మొగము
భావ భవునకు నటుగాక బలమె బలము
గాఁగఁ దిరిగనే వీటిచేఁ గాసిబడఁడె
యనగ సౌందర్యసంపద లభినవముగ
వఱలుదురు దత్పురంబున వారసతులు.

ఉ. పూవులపోవ్రుత్రై చిలుకబోదలు గోములపిండు సంపదై
తావులకోవ్రుతై యలివితానము గానము జానకంబునై
కావను బండఁజాలుటఁ బ్రదిగాలినిగల్గ వరంబుఁగన్నయ
ట్టై వనరాజిపొల్పునఁ బురాంతిక భూములనెల్లఁ జూడగన్. 13

చం. మరలఁగఁబోదు రింద్లనను మాపవునంతనఁ జేలకోపుచుం
దిరిగి యొకింతలేఁ తవడఁదేరెడ మోముఁ జెన్ను నేయుచున్
బిరిగొని కాలు ద్ప్రగుహలు పెల్లుగఁజేతటినెల్లఁ బావనం
దెరువరు లక్ష్మిఁగూడఁ బటుతేరఁగఁ బామర భామినీజనుల్. 14

సీ. సుదతులు డస్సినచో నలంతులువోవ
సొబగుఁడై చలిమిరి చూపిచూపి
యువతులు తిలకించియున్నచో వేడుక
గొలఁదిమీరఁగ నొజ్జ గుదిసి కుదిసి
సుభగుల పెనకువచోఁ దానవలఁతియై
యెఱుకువ వాసన కెక్కి యెక్కి
వెలఁదులు ముదమునవిహరించుచో సోయ
గంబున వీధులఁ గ్రాలి క్రాలి

యతులితంబైన శృంగార రతుల రెజవి
భూతిఁ బొందావసేసి తత్పురములోనఁ
బవలు రేయును మదుగర తవిలి తిరుగు
మిండఁడుఁ సుశీల మందానిలుండు లీల. 15

శా. దానాసేకసబృంహితస్వనము గాంధర్వావలీహేషిత
ధ్వానంబున్ మృదువేదనాదమును గాంతానూపురారావమున్
గానానూనరవంబుఁ దూర్యబహుశంఖధ్వానశబ్దంబుఁ బె
ల్లై నీరాకరఘోషమొప్పఁగ నిత్యంబుం జెలంగుం బురిన్ 16

తే. గీ. నూఱు క్రతువులు సేయుచు పాటికిల్లుఁ
గోటిపడగలు లేని కిరాటగృహము
జాతిరత్నంబు గాని పాషాణశకలము
వెదకిచూపిన వీటఁ బొన్నదమా గలదె. 17

మ. కులశైలంబులలో సువర్ణగిరి దిక్కుంభీంద్రవర్గంబులో
బలభిన్నాగము, లోకపాలకులలోఁ బర్జన్యుఁ డుగ్రోరగం
బులలో శేషుఁడు పెంపుగన్న కరణిం బూజ్యాధిపశ్రేణిలో
వెలసెన్ విక్రమసేనభూమిభుఁడు దోర్వీర్యప్రతాపోన్నతిన్. 18

సీ. ధరణీశ లవణాబ్ధి పరివేష్టితక్షితి
వరలిన నేరెడు గరిటి కొలఁది
నాల్గొక్కదిక్కున నాల్గొక్క లక్షయో
జనములు తన్మధ్యమున సువర్ణ
సారమై యున్నది చతురుత్తరాశీతి
సాహస్ర యోజనసంఖ్య మొదలి
వలను పదాఱు వేల్గలిగి వెడల్పు మీఱు
పదిరెండువేలుఁగాఁ బాతులోఁతు

మొదలి వలయమున యంత్రమై తుదిఁ బదాఱు
సేసి వెలుఁగారు మేరువన్ శిఖరి యొప్పు
దానిపై బ్రహ్మపురి చతుర్గళ సహస
యోజన స్థితిఁ గనుగొనఁ జేదగిల్లు. 19

మ. అద్రైకైలాసము దిగ్విలాసము విహాయశ్చారిణీసన్మద
ప్రదవిన్యాస ముదగ్రభాసము మరుద్బాహాసదాధ్యాస మ
భ్యుదయన్యాస మసన్నిరాసము మయూరోదారనిధ్యానభి
భ్యదహివ్రాతకృతప్రణాసము త్రికేతాధివాస ముర్వీశ్వరా. 20

శా. ముత్తాకే కుజముల్ సడల్చె, మొగడల్ మున్నే మహీజంబులం
దొత్తెం,బువ్వులు నిండఁగాఁ బెంగె నేయుర్వీజముల్, పూవులన్
మొత్తంబై విలసిల్లె నేధరణిజంబుల్, కాయలం బండులం
జిత్తానందముఁ జేర్చె శాఖిజముల్ చాల్పొందఁగాఁ జెప్పుమా. 21

సీ. అరుణ పుష్పావళి యగ్నిగా సంధించి
యళుల మొత్కులుగాఁగ నావహించి
దండడిపీతెంచు దక్షిణ పవనంబు
భస్త్రానిలంబుగాఁ బరిఢవించి
చిలుకలుఁ బికములు చేదోడు సేయంగ
మాధవుండను కమ్మరి గడంగి
యంగజుండ శిల్పతి సంఘటించఁబెట్టూని
మొగడల మ్ముల్కుల మొనలుచఱచు
కొలిమి యొక్కొ యనఁగఁ గుసుమపరాగంబు
విస్ఫులింగములుగ విరహుల నలుక
నేచిపూచియున్న యీ యశోకమహీరు
హంబుఁ గంటె మాళవాధినాథ. 22

కీ. శే. బ్రహ్మశ్రీ సాహిత్యవిశారద

# కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

ఆంధ్రసాహిత్యపరిషదధ్యక్షులును సూర్యరాయాంధ్రనిఘంటు సంపాదకులును, పీఠికాపుర సంస్థానవిద్వాంసులునగు బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు 2-1-49 తేదిని మధ్యాహ్నము 2-30 గంటలకాకస్మికముగ దివంగతులైరి. వీరి మరణమువలన నాంధ్రసారస్వత ప్రపంచమునకు దీరనిలోటు వాటిల్లినది. ఆంధ్రలోకమున వీని వీరి సోదరులు సుప్రసిద్ధవిమర్శకులు నగు బ్రహ్మయ్యశాస్త్రివర్యులను దెలియనివా రుండరు. శ్రీ సుబ్బయ్యశాస్త్రిగారు పీఠికాపురకళాశాలయందు సంస్కృతపండితులై తమ పాండిత్యముచే శిష్యబృందమును రంజింపజేయుచుండిరి. వీరు పండితాగ్రేసరులగు శ్రీ ఖాన్ మహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులు వారి ముఖ్యశిష్యులలో నొకరు. వీరికి సంస్కృతాంధ్రములలో విశేషపాండిత్యముండుటయేగాక సభలలో నెట్టి శ్రోతలకైనను రంజకముగ నుపన్యాసము లీయగల యనన్యసామాన్యమగు శక్తియుండెడిది. పండితులు, పామరులు, బాలురు, వృద్ధులు వారి యుపన్యాసమాధుర్యమును, వాఙ్నైపుణ్యమును గ్రోలి సంతసింపుచుండిరి. రామాయణభారతాది మహాగ్రంథములయందును కాళిదాసాదిమహాకవుల నాటకములయందును కావ్యనాటకలక్షణములు, రసపోషకత్వము మొదలగు విషయములగూర్చి శ్రీ శాస్త్రిగారి యుపన్యాసముల నొకపరి వినినచో మరలమరల వినగోరుచుందురు. అందును శ్రీ శాస్త్రిగారికి శ్రీమద్రామాయణమునందు భక్తిగౌరవము లధికము. కావ్యామృతరసాస్వాదనమే వీరి జీవితాశయము. డెబ్బదియైదు సంవత్సరముల వయసునందియు శ్రీమద్రామాయణ పఠన

మున పాల్గొనుచు సభ్యులకందలి విశేషముల నగ్గడించుచు వీరానందరసపూర్ణమనస్కులై సంతసించుచుండిరి.

సంసారవిషవృక్షస్య ద్వేఫలే ఉమృతోపమే
కావ్యామృతరసాస్వాదః సల్లాపః సజ్జనైస్సహ

అనియు,

ఆదిత్యస్యోదయం తాత సౌవర్ణం భారతీకథాః
యిష్టాభార్యా సుమిత్రంచ అపూర్వాణి దినేదినే.

అనియు శ్రీ శాస్త్రిగారు పలుమారులు తమ యుపన్యాసముల దెలుపుచుండిరి. పాశ్చాత్యనాగరకతా వ్యామోహమున బడి యున్న సారస్వత ప్రపంచము నెట్టి విశేషములున్నవో తెలియక యాధునికులు కూపాంధన్యాయమున సంచరించుచుండుట వీరు గర్హింపుచు, మన యపార సారస్వతసాగరమును మథించి యమృతాస్వాదన మొనర్పవలయు ననియు, సనాతనధర్మముల విడనాడవలదనియు హెచ్చరించుచుండిరి.

వీరు శ్రీ రామచరిత్రము నందలి యనురాగముచే సంస్కృతమున రామశతకమును వ్రాసి సోదరుల కంకిత మొనర్చిరి. పెక్కు రామాయణగ్రంథముల పరిశోధించి శ్రీ రామవిజయము, రావణవిజయము మొదలగు వచనగ్రంథములను, సాహిత్యకళల యందు విమర్శగ్రంథములను పెక్కు వ్యాసములను రచించి ప్రకటించియుండిరి. వీరి సంస్కృతాంధ్రపాండిత్యముల గమనించి శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరులు తమ యాస్థానవిద్వాంసులుగ స్వీకరించుటయేగాక వీరిచే సూర్యరాయాంధ్ర నిఘంటువు మూడు నాలుగు సంపుటములును, కళాపూర్ణోదయము, సింగభూపాలవిరచిత రత్నపాంచాలికానాటకాంధ్రీకరణమును, పానుగంటివారి యముద్రితనాటకములను, యింకను పెక్కుగ్రంథముల ప్రకటింపజేసిరి.

శాస్త్రిగారు కావ్యనాటకములు కళాశాలాశిష్యబృందముచే బఠింపఁజేయుటతో తృప్తినొందక, వారి మిత్రబృందము కోరికపై పెక్కుమారులు శాకుంతలము, ఉత్తరరామచరితము, మృచ్ఛకటిక నాటకము మొదలగు నాటకరత్నముల జదివి వారి నానందరసనిమగ్నుల గావించుచుండిరి.

శ్రీ జయంతి రామయ్యపంతులుగారు మృతినొందినతరువాత వీ రాంధ్రసాహిత్య పరిషత్తున కధ్యక్షులై, తత్కార్యనిర్వహణమునందగు సహాయము నొసఁగుచుండిరి. వీరి పాండిత్యమున కాంధ్రవిద్వల్లోకము సాహిత్యవిశారద బిరుదమునొసంగి వీరిని బహూకరించినది. పత్రికలలో ప్రకటించు నొండురెండు వ్యాసములతో తృప్తినొందక శ్రీ శాస్త్రిగారు నిరంతరము సంస్కృతాంధ్రసాహిత్యవిషయములు ముచ్చటించుచు నాయాగ్రంథపఠనమునకై తమ శ్రోతల బురికొల్పుచు సారస్వతసేవ నొనర్చి కృతకృత్యులైరి.

ఆంధ్రసారస్వతాభిమానులగు శ్రీ శాస్త్రిగారియొక్కయు వారి సోదరులయొక్కయు జీవితమునఁగల ముఖ్యవిషయముల గ్రహించి మనము సారస్వతసేవ నొనర్తుముగాక. శ్రీ శాస్త్రిగారి యాత్మకు పరమేశ్వరుఁడు శాంతి నొసంగుగాక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)



కాకినాడ

సర్వజిత్సంవత్సరము

సంపుటము ౩౪

1946–47

# సర్వజిత్సంవత్సరము

# 1946–47

## విషయసూచిక.

-:0:-

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు
పిఠాపురము మహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

౧ శాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

౨ జమారి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

౧ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు,
(కోశాధ్యక్షులు.)

, పిళ్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుఁడుగారు.

,, కోరా శివనాథశాస్త్రిగారు

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుఁడుగారు, బి. ఏ.

,, వెంపటి రామబ్రహ్మముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

, కేశవరపు కామరాజుగారు.

, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ. (ఆనర్సు)

వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

## చతుర్థసంపుటము.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 960 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీ క్రింది వెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలు ప్రతి రు 5 లు.

---

Printed by N. Achutaramayya at the Cocanada Printing Works, Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)


| సంపుటము ౩౭. | సర్వధారి<br>ఆశ్వయుజ-ఫాల్గునములు | సంచిక ౪-౬. |
|---|---|---|




కాకినాడ


పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

1948–49.

శ్రీ సాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)



కాకినాడ

సర్వధారి సంవత్సరము

సంపుటము ౩౭

# సర్వధారి సంవత్సరము.

# 1948—49

## విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ

రెండునెలలకొకసారి ప్రకటింపబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము 32. సర్వధారి సంచిక 4-6.

ఆశ్వయుజ-ఫాల్గునములు

## సౌదామిని

త్రిలిఙ్గపత్రికలో (సం. 32-3 సంచిక) సౌదామని, సౌదామిని పదములనుగూర్చిన విమర్శనమునందు 'సౌదామని'యే సంస్కృతశబ్దమనియు, 'నది తత్సమమై తెలుగునందుగూడ సౌదామినియని వ్యవహారములో కుదురుకొనినది. పదము వికారముగ ఇకారసాహచర్యముచే దానియందలి అర్ధానికూడ ఇకారముగ మాఱినదని' వ్రాయబడినది. సుప్రసిద్ధనిఘంటువులను, సంస్కృతవాఙ్మయమును బరిశీలింప రెండు పదములును గలవని స్పష్టముగ దెలియుచున్నది. సౌదామినియందలి మార్పు ఆంధ్రమునగలిగిన మార్పుగాదు. భాషాశాస్త్ర మర్యాదలచేనేమి, వ్యుత్పత్తి వేఱుగనుండుటచేతనేమి, సౌదామినిపదము సంస్కృతముననే స్థిరపడినది.

(1) అమరసింహుని నామలింగానుశాసనమున దిగ్వర్గమున (3-9) తడిత్సౌదామనీ విద్యుచ్చంచలాచపలాపిచ అని కలదు.

దీనికి భానుజీదీక్షిత వ్యాఖ్యానమున (బొంబాయి 1907 సం)

శ్వేతద్వీపః సుదామా- కాండశేషే ఐరావతపర్యాయే-తేనైకదిక్ (4-3-112) ఇత్యణ్- అన్ (6-4-167) ఇతిప్రకృతి భావా ట్టిలోపాల్లోపౌ న భవతః

సుదామ్నాద్రిణా-ఇతివా సుదామాతుపుమాన్ వారిధరపర్వత భేదయోః

సుదామ్నా మేఘే భవా-సౌదామినీ త్యపపాఠః। సౌదామన్య ప్సరో భేదే తత్సత్ర్యే భదయోః స్త్రియామ్.

ఇందువలన సౌదామినియనునది యపపాఠమని వ్రాయఁబడినది. దీక్షితులవారి వ్యాఖ్యానమునచే శతహ్రదాపద వ్యాఖ్యానమున శతహ్రదాస్త్రియాంవజ్రే సౌదామిన్యాం చ కీర్తితా అను శ్లోకపాఠము దహరింపఁబడినది.

(2) అమరమునకు మాహేశ్వరవ్యాఖ్యానమున (బొంబాయి నిర్ణయసాగర ముద్రణాలయమున 1907 లో ముద్రితము)

సౌదామినీ విద్యుత్ చంచలాచపలాదశకం విద్యుల్లతాయాః-చపలాపి చేతిపాఠః (పుట 17)

(3) క్షీరస్వామి వ్యాఖ్యానమున (Oriental Book Agency 1941 Edited by Dr Har Dutt Sharma and Sardesai) అమరమూలము సౌదామినియనియే ముద్రితము - వ్యాఖ్యానమున సుదామ్నాద్రిణైకదిక్ సౌదామని తేనైకదిక్-ఇత్యణ్-(4-3-112) అని వ్రాయఁబడినది.

(4)తిరువనంతపురమున బ్రకటింపఁబడిన వంద్యఘటీయ సర్వానందుని యమరటీకాసర్వస్వమున సౌదామినీత్యపపాఠః। తథాచ హారి ప్రబోధ యమరకమ్.

క్షేంతంజగాము కాంచనసరస ముసౌదామనీలతా ధామాస్త్రమ్
కేవలయ మిదసరజస్సరస ముసౌదామనీలతా ధామాస్త్రమ్
అను శ్లోకముసాహ్యాతము.

(5) ఆసూరిసరస్వతీ తిరువేంకటాచార్యులవారిచే పరిష్కృతమగు గురుబాల ప్రబోధికయందు

'సౌదామినీ (మూలము)

వ్యాఖ్యా సుదామ్నా ఐరావతేన సహావర్తత ఇతి సౌదామినీ ఇచ్చట సౌదామనీ అనియు పాఠముగలదు.'

పైవానివలన నమరమూలమున సౌదామినియను పాఠముగూడ గలదనియు, గొందఱు వ్యాఖ్యాతలు దాని నపపాఠముగ గైకొనిరనియు నిర్వివాదాంశము. ఇఁక మిగిలిన నిఘంటువులఁ బరిశీలింతము.

(6) వాచస్పత్యము - సౌదామనీ- విద్యుతి - అప్సరోభేదేచ- ఐరావతయోషితి - అనునర్థముల నిచ్చుచు
తత్రైకేపి అశోఽల్లోపే సౌదామ్న్యాత్యపి—శబ్దరత్నావళీ అని సౌదామ్నీ పదవ్యుత్పత్తిగూడ నిరూపించినది.

(7) శబ్దకల్పద్రుమమున—సౌదామనీ, సౌదామినీ, సౌదామ్నీ అను మూడుపదములును గలవు. అందు

సౌదామినీ-స్త్రీ-విద్యుత్-ఇత్యమరటీకా-
(౧-3-౬) యథాఋతుసంహారే (3-12)
నష్టం ధనుర్బలభిదో జలదోదరేషు
సౌదామినీస్ఫురతి నాద్యవియత్పతాకా
తడిద్భేదః - యథామహాభారతే (3-53-12)
తతస్స్మరాజతే భైమీ సర్వాభరణభూషితా

సఖిమధ్యేఽనవద్యాంగీ విద్యుత్ సౌదామినీ యథా
అప్సరోభేదః ఇతి హేమచంద్రః—దేశవిశేషః ఇత్యజయః
సౌదామ్నీ—స్త్రీ సౌదామనీ ఇతి శబ్దరత్నావళీ

శబ్దకల్పద్రుమకారుని మతమున సౌదామిని పదముగలదనియు, దానికి కావ్యప్రయోగము లుదహరింపఁబడినవనియు స్పష్టము.

(8) కేశవకృత కల్పద్రుకోశః.

శమ్పా సౌదామనీ విద్యుచ్చంచలాచ శతహ్రదా
సౌదామినీ చ సౌదామ్నీ హ్లాదినీచాశనిర్ద్వయోః
(బరోడాప్రతి పుట 396 శ్లో 154)

(9) మాహేశ్వరసూరి - విశ్వకోశః

సౌదామిన్య ప్సరోభేదే తటిత్త ద్భేదయోరపి
సౌదామినీ-స్త్రీ - సౌదామిని యను నప్సరస, మెఱువు - మెఱువులో

(10) శహాజీ - శబ్దరత్నసమన్వయ కోశమున (బరోడా ప్రతి) నయిదుస్థలముల సౌదామినీ ప్రశంసగలదు.

సౌదామిన్యాంచ ఖద్యోతే గదితా - పు 48-17 పంక్తి.
విద్యుత్ సౌదామినీ సంధ్యాః 153-13
శతహ్రదాక్షీరాబ్ధి వజ్రీ సౌదామిన్యాంచ గద్యతే 179-12.
సౌదామిన్యాంస్త్రియాం విద్యుదప్సరోభేదయోరపి 207-19.
ఘనవల్లీ నిగదితా సౌదామిన్యాంవిశారదైః 312-9.

(11) ఇరుగపదండనాథుని నానార్థరత్నమాలయందు 1883 సంవత్సరమున మదరాసు వాణీవినోద ముద్రణాలయమున బ్రకటింపఁబడిన గ్రంథమున సౌదామిన్య ప్సరస్యపి—సౌదామినీ అనిముద్రితము.

ఋటీవల వావిళ్ల ప్రతియందు సౌదామన్యప్సరస్యపి యనియే ముద్రితము.

(12) అజయపాలకృత నానార్థసంగ్రహమున (కలకత్తా సాహిత్యపరిషత్ప్రకటితము)

సౌదామినీ పురీభేదే చంచలాయాం ప్రకీర్తితా శ్లో. 652.

(13) సంస్కృత శబ్దార్థ కల్పతరువు —

సౌదామినీ — ఈ కారాంతస్త్రీయాం — అమరః— విద్యుతి - మెఱుపు — ఇకారయుక్త మకారమధ్యాపి

(14) సర్వశబ్ద సంబోధిని.

సౌదామనీ, సౌదామినీ, సౌదామ్నీ అనుమూడు పదములనిచ్చుచు సౌదామినీ పదమునకు దేశవిశేషమను నర్థమును గలదని తెలుపఁ బడినది.

(15) Wilson's Sanskrit Dictionary.

సౌదామినీ — (F) Lightning (2) one of the apsaras or nymphs of Swarga (3) a particular sort of lightning (4) a city so named.

Kittel's Canarese Dictionary యందును సౌదామిని — a particular kind of lightning — Lightning (మించు — మంగరాజ నిఘంటు Mr 43) also సౌదామని.

(16) Apte నిఘంటువు నీమూడు పదములనిచ్చి యర్థముల నిచ్చుటలో

Lightning — సౌదామన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం — మేఘసందేశ — 37

సౌదామినీవ జలదోదరసంధిలీనా — Mk 1-35 Mal Madh 8-14

అని మృచ్ఛకటికమునను మాలతీమాధవమునను సౌదామినీ పదము ప్రయోగింపబడినదని యుదాహృతము.

ఇంక కావ్య ప్రయోగములఁజూతము.

పరిష్కర్తల పూర్వులచే గొన్ని ప్రతులయందు వేర్వేఱు పాఠములు గన్పడుచున్నవి. శబ్దకల్పద్రుమమున సౌదామినీ పదమున కుదాహరణముగ ఋతుసంహార, మహాభారత ప్రయోగములు చూపఁబడినవి.

(1) ఋతుసంహారము — (3-12).

వావిళ్లవారి ప్రతియందును, మణిరాముని చంద్రికావ్యాఖ్యానమునందును (నిర్ణయ సాగరప్రతి) సౌదామిని యనియేకలదు. వియతి ఆకాశస్యపతాకా సౌదామినీ తడిన్నస్ఫురతి నదీవ్యతి — మణిరామవ్యాఖ్య.

(2) మాలతీ మాధవము — (8-14)

ప్రాయేణ బాంధవ సుహృత్ప్రియ సంగమాది సౌదామినీ స్ఫురణ చంచల మేవ సర్వమ్.

ఆప్టే దీని నిట్లే కైకొని యున్నాడు.

త్రిపురారి వ్యాఖ్యయందును 'సౌదామినీ స్ఫురణ వచ్చంచలమ్'

జగద్ధర వ్యాఖ్య — భవిష్య త్సౌదామినీ పార్శ్వ గమనస్యసూచనేన.

జీవానంద విద్యాసాగరునిచే కలకత్తాలో ముద్రింపఁబడిన 1876 సంవత్సర ప్రతియందును సౌదామినీ యనియే ముద్రితము — కాలేపండితుని సంస్కరణమున మూలమున సౌదామనియు, వ్యాఖ్యయందు సౌదామినియు గలదు.

(3) మృచ్ఛకటికము (V.G. Paranjpe's Edition 1937)

సౌదామినీవ జలదోదర సంధిలీనా. మృచ్ఛ — 1-35

నిర్ణయసాగర ప్రతియందు

సౌదామనీవ జలదోదర సంనిరుద్ధా యను పాఠాంతరము ముద్రితము.

(4) భర్తృహరి వైరాగ్యపద్ధతి – శ్లో॥ 36,

భోగా మేఘవితానమధ్య విలస త్సౌదామినీ చంచలాః

అని వావిళ్లవారి ప్రతులయందును, 1928 సంవత్సరమున ముద్రితమగు నిర్ణయ సాగరప్రతియందును, డి. డి. కోశాంబి పండితునిచే భారతీయ విద్యాభవన ముద్రితగ్రంథము (1946) నందును సౌదామినియే గలదు. సౌదామనీ పాఠాంతరముని చూపఁబడినది.

రామచంద్ర బుధేంద్రవ్యాఖ్యానము కొన్నిప్రతుల సౌదామనియే గ్రహింపఁబడినది.

(5) కాళిదాసుని మేఘసందేశమున (శ్లో 37)

సౌదామన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం తమసుచో మల్లినాథునివ్యాఖ్యయందు సౌదామనియే మూలముని స్వీకరింపఁబడినది.

194[illegible] (Paranjpe's edition) స్థిరదేవవ్యాఖ్య.

సౌదామిన్యా — స్నిగ్ధయా సౌదామిన్యా ఉర్వీం దర్శయ – సౌదామిన్యా విద్యుతా

పరిషద్భాండాగారమునందలి (4676) సంఖ్యగల యొక్క ప్రాచీన ప్రతియందును 1947 సంవత్సరమున ముద్రింపఁబడిన నిర్ణయసాగర ప్రతియందును 'సౌదామిన్యా' అనియే ముద్రితము.

Nandargikar's edition (1894) Verse 41-సౌదామిన్యా for సౌదామన్యా in Wilson's edition and Manuscripts G, $G_2$ K, $K_2$ R & M.

అని పాఠాంతరముగల ప్రతులు వివరింపబడినవి. దక్షిణావర్తనాథుని ప్రదీప వ్యాఖ్యానమున సౌదామన్యా యనియేగలదు.

(6) శబ్దకల్పద్రుమమున నుదహరింపఁబడిన మహాభారత ప్రయోగమునకు (3-53-12)

నీలకంఠ వ్యాఖ్యయందు సౌదామని యని వ్యాఖ్యానింపఁబడుట సౌదామనీ మేఘ బంధీయనియర్థముకూడ వివరింపఁబడినది.

సౌదామనీ = ప్రావృషేణ్యామేఘ సంబంధినీ = సుష్ఠుజగతో జీవనం దదతి తే సుదామానో మేఘాః తేషాం సమూహః సౌదామనీః ప్రావృట్కాల తత్సంబంధినీ సాహి అత్యంతద్యోతమానో భవతీతి తత్ప్రసిద్ధమ్ —

పైనవివరింపఁబడిన నిఘంటువ్యాఖ్యాప్రయోగాదులవలన సౌదామిని పదమునుగూడ సంస్కృతనైఘంటికులు తమ తమ నిఘంటువుల జూపించిరనుట స్పష్టము. అర్థవివరణమున 'దేశవిశేషము' పట్టణవిశేషమునుయు విశేషార్థము నొం 13.

కాని వ్యుత్పత్త్యర్థము [illegible] కేవల పాణినీయ సూత్రముల [illegible] లవాణి [illegible] పంబడినవి. సమస్తాముష్టి [illegible] ఫేనాల్లచ్చ అను సూత్రమున (3[illegible]) [illegible] పక్షలః, పక్షిలః — ఉదకలః, ఉదకిలః — ఫేనలః ఫేనిలః — పిఙ్గలః పిఙ్గిలః మొదలగు రూపాంతరములు జూపఁబడినవి. పాంసులః సికతిలః అనునవి ఇలచ్చదేశే అనుసూత్రమున (39[illegible]) సాధ్యములు. పదములకు రూపాంతరములన్వ్యాకరణశాస్త్రముచే గల్గినను గలుగవచ్చును. శబ్దశాస్త్ర పండితులిట్టివానిని భాషాశాస్త్ర మర్యాదలవలన (Philological Principles) గలిగినవని నిర్ధారణ మొనర్చుటయు గలదు.

అయినను సౌదామినీ శబ్దమును పాణిని సూత్రములవలన గూడ సాధింపవచ్చునేమో. సుదామా శబ్దమును వదలిన

సంజ్ఞాయాంమన్మాభ్యామ్ అను పాణిని సూత్రమువలన (5-2-137) దామినీ, హోమినీ, సోమినీపదములు సాధువులే. దీనివలన సుదామినీ శబ్దమును సంబంధార్థమున సౌదామినియు నిష్పన్నమగునని తోఁచుచున్నది. ఇందులకు విజ్ఞులగు వైయాకరణులే ప్రమాణము.

ఆ॥ సా॥ ప॥ సం॥

# ఛందోదర్పణ సమీక్ష

## (అనువృత్తము)

విద్వాన్ రావూరి దొరస్వామిశర్మ కవి

ద్వితీయ పద్యమున కఖజ చఛడ దధభయరశషసలు పద్యాది నుండరాదని యున్నవి. ప్రథమ పద్యములోని యక్షరములు ద్వితీయ పద్యమునం బునరుక్తములుగా నున్నవి. అకచటతపయశషసలు వాయు బీజములు; ఖఛరసలగ్ని బీజములు; జడద (హా) లు భూబీజములు; ఢభలు జలబీజములు; శషలు గగనబీజములు.

మ॥ క్షితిబీజంబులు సంపదల్ పొదలఁ జేయించున్, జలాబీజముల్
సతతంబుం బ్రమదంబొనర్చు, శిఖిబీజంబుల్ మృతుం జేయు, వా
యుల బీజంబులు శోకవార్ధిఁబడఁగాఁ దోయున్, నభోబీజముల్
పతి సత్యాంతరదుఃఖఁ జేయు నెపుడున్ బట్టి నోదించినన్.

అను భీమనచ్ఛందః పద్యము నాధారముగాఁ గొని యరసినచో వాయ్వగ్ని గగనబీజములోని శోకమృతి బాధ్యఫలంబు లొసంగుఁ గాన నవి కావ్యాది నగ్రాహ్యంబులు. భూజలబీజ బులు సంపద్ధనప్రదం బులు గాన జడద (హా-అనంతుని ఛందమునందలేదు) ఢభలు పద్యాది బ్రయోక్తవ్యంబు లేయగు. ద్వితీయ పద్యమున వసంతుఁడు కఖాద్యక్షర ములు పవర్గాస్పదంబులు గాకుండిన మేలొదవించునన్నాఁడు. ఉప వర్ణములన సమీపవర్ణములు. ఉపవర్గాస్పదములనుట కర్థము స్పష్టము మేకాని యిందనంతుని యర్థమేమో దుర్జ్ఞేయమై యున్నది. సంయు క్తాక్షరము కాఁగూడదనియా? స్వరములెల్ల నుత్సవకారులని కడప టఁగలదు. అట్టులే లాక్షణికుఁడు చెప్పలేదు. అఇఉఋలు వానిదీర్ఘ ములు క్రమముగా అనిలానల భూజల గగనబీజములగును. అట్లగు టచే ముందు చెప్పఁబడిన చొప్పున భూజల బీజంబులగు ఉఊఋౠ లు మేలొదవించును, తక్కినవి శుభప్రదంబులుగావు.

ఈపక్షముమాని వర్ణములకుఁ బ్రత్యేక ఫలములు చెప్పినవారి మతమనుసరించినను స్వరములెల్ల సుత్సవకారులు కాఁజాలవు. ఏతత్ప క్షమవలంబించినను ననంతామాత్యుని కచటతపాది వర్ణపద్యాది ప్రయోగనిషేధము పొంది పొసఁగకున్నది. వీనినన్నిటిని జర్చించిన వ్యాసము పెరుగుటం జేసియు, నియ్యవి యద్యతనకాలంబున కనుప యుక్తంబులగుటం జేసియు, నట్టివాని నరయఁగోరువా రప్పకవీయాదు లతో సరిపోల్చి చూతురుగాక యని విన్నవించుచు విరమించు చున్నాను.

అక్షరముల శుభాశుభ నిర్ణయము తరువాత గణసంయోగ విషయముం దెల్పు పద్యములందును మతాంతరములు భాసిల్లుచున్నవి. ఇందుఁ గనఁబడిన వానియందు లాక్షణికుల పరస్పరమత భేదములు వ్యక్తములగుచున్నవి. పద్యలక్షణములందు నలంతిగణయతి భేదములు నక్కడక్కడఁ గలవు. ఇట్టులుంటకుఁ గారణములు ఛందో లేఖకుల ప్రమాదములును దాళపత్రలేఖన శైథిల్యాస్ఫుటతలు గావ చ్చును. ఉత్తరోత్తర లాక్షణికులు తత్పూర్వ పూర్వగ్రంథములందలి యిట్టి ప్రమాదములఁ బరిశీలించి యున్నవానిని సరిపుచ్చి గణయత్యా దుల నియమించుచు వచ్చిరి. వ్యాకరణము నిట్టిచాట్ల కేలోనయినదని వేఱె చెప్పనక్కఱలేదు. ఆర్యాగీతుల లక్షణములం దనంతాప్ప కవు లకు భేదముగలదు, గాని యనంతుని లక్షణములు సంస్కృతవృత్త రత్నాకర లక్షణంబులకు సరిగా నున్నవిగాన నిందు విమర్శింపఁదలఁ చుకోలేదు. వృత్తనామములం దనంతాప్పనలకే కాక తదితరులకు భిన్నత గలిమికిఁ గారణము సైని నావచించినదే యని యెఱుంగవ లయు. వృత్తనామ భిన్నతకుఁ గొన్ని యుదాహరణములు (అనం) మధుమతి-(అప్ప) మదనవిలసితము, (అనం) రుక్మవతి-(అప్ప) రుగ్మ వతి, (అనం) ప్రణవ-(అప్ప) పణవ, (అనం) తోదక-(అప్ప) దోదక (అనం) తోవక-(అప్ప) తోదక, (అనం) గీతాలంబన-(అప్ప) కలికాంత- కాంత (భీమన)

# అనంతుని రచనలోని ఛందోవిశేషములు.

అనంతుఁడు భోజరాజీయము, ఛందోదర్పణము, రసాభరణమను కృతిత్రయము వరుసగా విరచించిన విద్వత్కవి.

భోజరాజీయము ఛందోదర్పణమునఁ బేర్కొనబడి యుండుటచే నది తొలుత వ్రాయఁబడెనని విదితమయ్యెడి. "శ్రీనిధిచక్రవర్తి... అనంతధీమణి లసన్మణి భోజచరిత్ర చెప్పి లక్ష్మీప్రసరసింహుఁ గూర్చిన ప్రసిద్ధుఁడు వేడుకతో నొనర్చె ఛందోనుతి" (ఛందోదర్పణ-4ఆ-130)

అనంతామాత్యుఁడు ఛందోదర్పణమున రచించిన లక్షణములు వానిక్రింది యుదాహరణములందే కాక తనగ్రంథములం దెల్లెడలఁ బ్రయోగించినాఁడు. ఉపాయ, ఉదార, ఉదాత్త, ఉదాహరణ, అనంత, అనేక, ప్రార్థ్య, జనార్దన, రసాయన, అంతరంగ, వృత్తాంత, రుద్రాక్ష, నిరంతర, నిరీక్షణ, సూచన, సంబోధనాంత శబ్దముల కుభయయతియు, భిన్నపోలికసరసబిందు ఋకారాదియతి భేదములు, కేచిత్ప్రాసభేదములు ననంతుని గ్రంథత్రయమునఁ గానవచ్చుచున్నవి. అంతియ కాక యతఁడు చెప్పని కొన్ని ఛందోవిశేషములు, నతని మతమునకు విరుద్ధములైనవియు నతని గ్రంథములం గానవచ్చెడి

(1) అర్ధబిందుప్రాస - పటలకు మాత్రమే సబిందుక నిర్బిందుక ప్రాసము చెల్లునని యనంతుని లక్షణము.

క. నూతుల దరులనులోఁతగు
పాతటి కసువులను నెట్టిపచ్చికయున్నన్
బ్రాఁతిపడి మేయఁబోకుము
మూతినిడకు ముగ్రసత్వములుంగలనీటన్ (భోజ-6-85)

మ. మిగులం జక్కనివాఁడు కాంచనరుచిన్ మీదించిన ట్లంగకాం
తిఁగడుం బొల్పగువాఁడు యావనమదోద్రేకమ్మునందద్దయున్.
(భోజ-3-235)

పైపద్యములం దనంతుఁడు చెప్పని తకార గకారములకు సఖండాఖండబిందుప్రాస సంఘటితమై యున్నది. బ్రాఁతి పార్ధబిందుకముగా నిఘంటువులందుఁ గలదు. ఇది భ్రాంతిశబ్ద భవమని తోఁచెడు నిఘంటులందు దేశ్యముగానున్నది. లక్ష్మీనారాయణీయమునఁ దద్భవముగా రచితము. తద్భవదేశ్యములందిది యేదైనఁగానిండు, అరసున్న విషయమే మనకుఁ బ్రసక్తాంశము. ఇది సార్ధబిందుకమనుటకు నిర్ధారక ప్రయోగము మృగ్యము.

కాంతిఁ గదుఁబొల్పుగువాఁడు; ఇందుఁ గాంతి కర్తగా నెంచినఁ గళయుగుసు. గసడదవాదేశ సంధిజరిగి కాంతిగదుంబొల్పుగునని చెప్పడును. ఇందర్ధబిందువు గకారమునకు ముందుండ నక్కర లేదు. 6-ఆ-241 పద్యములో ...ఏటికి... పూఁట... మూట...చోటికి... అనుచో టకారము ప్రాసముదుఁ గలదుగాన ననంతునికి సమ్మతమేయగు.

క. కాఁగాని మాటలాడెదు
రాఁగూడదు నేఁడు పశ్చరణమై నుఁడం
గాఁగోమలి యిటునిల్వక
వేఁగుము మగవాలికేల యీదుర్గుణముల్ (భో-4-148)

వేఁగు సార్ధబిందుకము గానున్నచో ననంతుని యర్ధబిందుప్రాస లక్షణమునకు భంగముప్పతిల్లు ఈశబ్దము సఖండాఖండములుగాఁ బ్రయుక్తము "విని యతని దనపైనిడికొని వేఁగినిదుమికిఁ దగని ఘోరాత్రి యొనర్చెనవాఁడు" (రాఘవపాండవీయము-1-అ-28 ప) ఇందు రామాయణార్థమున 'వేఁగి-నిదుమికి' అనియు, భారత పక్షమున 'వేన్ + కినిదుమికి' అనియు భేదము.

క. ఆఁ కొనివచ్చిన విప్రులఁ
దాఁకింపక యశనమిడుము తత్పరమతి న
ట్టాఁకలి సేయకు కుడువం
దోఁకొని రావర్వమగు తిథుల మనవారిన్. (భోజ-6-161)

క. తేకువ యలరఁగ నీగతి
దోఁకొని చని చదల రత్నతోరణ దీప్తుల్
ప్రాఁకెడు ఘనగృహముల న
మ్మూఁకల విడియించె రాజముఖ్యుండంతన్ (భో-4-84)

ఉ. తోఁకొనిపోయె నంత నొకతొయ్యలి యయ్యెనఁగ నప్డు పే
రాఁకలి గొన్న బెబ్బులియుఁబోఁ గృష్ణమ్మ గర్భకంబుపై
(భో-8-226)

తోఁకొని నిరర్థబిందుక శబ్దమా, అచ్చుప్రతియందు సార్థబిందుకముగా నున్నది. నిఘంటులందు అనున్నలేదు, శబ్దరత్నాకరకారులు తోకొను శబ్దము నిరర్థ బిందుకముగా వ్రాసి 'నాకారణమున బుద్ధిజుఁ, డేకాంతము నరకమునకు నేగెను వానిన్, దోకొని' అను నన్నయ భారతారణ్య ప్రయోగము జూపిరి ఒక్క శబ్దమే కొందఱి మతమున నఖండబిందుకము, మఱికొందఱి మతమున నఖండబిందుకము. ప్రయోగ సాహాయ్యమున వీని నిందుఁ జర్చింపఁగడంగిన వ్యాసము విస్తరమగు. అనంతుని మతమునఁ గుఁ, తోఁకొని' సఖండబిందుకములుగను 'బ్రాతి, యఖండబిందుకముగ నుండు నేనిగా అట్లు భావింపకున్న పటలకుమాత్రమే యర్థబింబు ప్రాసయతి దేశించిన యనంతుఁడు తెలిసి తానేతది తరములకు నెట్లు ప్రయోగించి యుండును ?

(2) దధప్రాస-ఇది ప్రాసప్రకరణమున ననంతుఁడు వచింపలేదు.

క. మొదలను కఖగఘలు చఛడలు
దధలును భయశషసలుతగ (1-26-ఛందోదర్పణ)

క. ఆదురవస్థకు నోర్వక
యాదైవము మరణమేల రాదఁగ వె యనుచున్
వేధించు నృపతియొద్దకు
నాదరమతి నారదుఁడు రయమ్మున వచ్చెన్ (భోజ-6-171)

దధలనుటయే క్రియమైనను బ్రాసఘటనార్థము 'ధదలును' అని రచితమై యుండవచ్చును. వేధించుశబ్దమును వేదించుగామార్చుకొన్న దధప్రాస నిర్బంధముగలుగదు. బుద్ధిబాధాసనాది శబ్దముల వర్గచతుర్థ వర్ణములు తద్భవమున వర్గతృతీయములుగా మారును. "వర్గంబుల ద్వితీయవర్ణ చతుర్థవర్ణములు తచాదివర్ణతభజించు" నని కవిసంశయ విచ్ఛేదము (3-వ రంగ-6 ప) ఈలక్షణముచే వేధించు—వేదించు గానోపు.

(3) లళడయతి ప్రాసఘటన యతిప్రాసమైత్రిల (ళ) డల కనంతుండు చెప్పలేదు.

4. కాకుస్వరయతి యగునిటఁ
డేకదలక బలధిఁ బవ్వళించె ననఁగ (ఛందోదర్పణ)

చ॥ చెలఁగుచు రంగధామమును జెంది విభావరిపుచ్చి వేకువన్
వెడలి ప్రయాగ కేఁగి సురనిమ్నగయందుఁ బ్రభాత కృత్యముల్
(భోజ-1-134)

పవ్వళించు ననుచోట 'పవ్వడించు'నని పఠించిన డడయతి శంకరాదులదని పరిషత్పత్రిక స్వభాను 3-4 సంచికలో 127 పుటలో వ్రాసితిని.

వెడలు, వెలదుశబ్దములు రూపాంతరములు॥ పైరెండవ పద్యమున వెడలు శబ్దమున్నచోట వెలదురూపమును వ్రాసికొన్న బాధ తొలంగును. నైషధమందు 'చిలుకలు గూయునో చెవులు చిల్లులువో వఁగనంచు నెన్నడున్ వెడలఁడు' అనుపద్యమును ముద్దరాజు రామన లడప్రాసకు దాహరింపఁ గూచిమంచి తిమ్మకవి యది వెడలుగాదు వెలదని తెల్పి రామనమతమును ఖండించెను.

క॥ లడలకు నభేదమనుచున్
వెడగులుగడుఁ బ్రాసములను విశ్రమములు ను
బ్బడరఁగఁ గలుపుదు రది యె
వ్వెడలను భవ్యంబుగాదు హిమకరమకుటా.

(సర్వలక్షణ-2-22)

4. రఱయతి ప్రాసఘటన-'శరమఱవ'లని యొక్కటి యతి యందుఁ జేర్కొనుటచే ర ఱ లు తనతనకే చెల్లును, బరస్పరము మిత్రములుగావని గోచరించెను. యతివిషయమున నింత మాత్రమేని దెల్పెఁగాని ప్రాసవిషయమున వాని మిత్రామిత్రతలంగూర్చి యొక సూచనయు లేదు. ఈక్రింది యనంతుని రచనలందు రఱయతి ప్రాసములమైత్రి గనఁబడుచున్నది.

ఉ॥ పాలుల పేరుచెప్పకొని బానెఁడుపప్పును బాయసంబునై
దాఱుపసంట్ల వఁటకము నాద్యముఁ గమ్మని కూరగాయలున్
జాఱలుదించు వారసతిచొప్పున గోళ్లఁ జిమిటుకొంచు మా
తో రాడగొట్టు నీదగరతోఁ బడఁజాలము వేయుచెప్పినన్.

(భోజ-6-138)

ఉ॥ ఆఱుమొగంబులార్తఁడు మహాత్మజుఁడాతని ముద్దుసేయుచో
నాఱుమొగంబులున్వలయు నంబిక! యేనును నీవుఁ గూడఁగా
నాఱుమొగంబులయ్యెడి రయంబునరమ్మని నీవు నవ్వుచున్
జేరుట యోగివర్యులకుఁ జిత్యాగున్ ముఖపంచకోజ్వలా.

పై రెంట రఱప్రాస. (భోజ-5-201)

ద్విరదగతిరగడ-
ఉరమున వ్రచ్చుగతివ్రచ్చ నఖముల రిపును
రంబు నరసింహుఁడనఁగ్రాలు సంయుక్తయతి

ఇందు రఱయతి, (ఛందో-1-112)

చేరుశబ్దము లఘురేఫఘటితముగా సమీపించు అనునర్థమున గలదు "అప్రీతిఁల్ పల్కిన పాతకంబునకుఁజేరెన్ గాలమిట్వేళ"-జైమిని శకటరేఫఘటితమైనచో సమీపించను నర్థము లేదు. ఇందలి ప్రయోగ మనుసరించి దాని నుభయరేఫఘటితముగా నెన్నవలయునేమో కాద లఘురేఫాదియే. అట్లే ఱంపము లఘురేఫాది. ఱాతి ఱట్టు ఱాయిమున్నగు శబ్దములవలె వీని నుభయరేఫ ఘటితములుగా ననంతుఁ డెన్ని

క॥ మతిసర్వరసోత్కృష్టత
నరయుచు బహుసంపదలకు
మెఱసిన శృంగారరసము
తెఱఁగంతయు వినరింతుఁ దేటపడంగన్. (రసా-౧-21ప)
వరునిదెస వేడ్కయుడుగుట
యరతి, నిజాచార మెడల నందిన ప్రీతు
త్రపఱి లజ్జాత్యాగ మనా
స్మరపరితాపంబు పేరు సంజ్వర మయ్యెన్. (రసా-3-24ప)

ఇట్టి రేఫఱకార యతిప్రాసమైత్రిఘటన యనంతుని గ్రంథయమునఁ గానఁబడుచున్నది. ఎఱుంగు, దుర్గలు, పఱి, మెఱసిన, తఱి యిత్యాదిశబ్దములను లఘురేఫఘటితములుగాఁ బరిగణించుకొన్నచో సాధుప్రయోగములగును. అందుఁ గొన్నింటిని సాధింపవచ్చును. ఇట్టి పట్టులఁగల శబ్దములలోని రేఫములు భయవికల్పములగునని కాని, రేఫఱకార సాంగత్యమనంతాభిప్రేతమని కాని యేదోయొకరీతిగా నంగీకరింపవలసి యున్నదనిమాత్రము చెప్పవచ్చును.

౫. అభేదయతి-వనలకు మాత్రము యతిమైత్రి చెప్పఁబడినది అదియు నెవము నెనమువలె ద్వ్యర్థకములగల శబ్దముగానుండవలసి యున్నదని యిదివఱకు వ్రాసితిని.

క॥ మొగిళులు నలమగు నిటులనె
నగణము నగణమగు నిట్లు నాహవగణముల్
భగణము లిట్లనఁ దండ్రి
భగణము పాళ్లను భలంబు-వాకిళులనఁగన్. (ఛంద-1-22)

ద్వి॥ వాటెఁ బదార్థసంఘములు-భ్రాంతిగ నవ్విభు పెండ్లియాడితిన్
(భో॥-4-102)

పీన్వడఁదోడగుట పిఖ్రిమంబు భయమును బ్రియమున్.
(రసాభరణ-౩-10ప)

భగణము పాళ్లను పద్యమునకర్థము సంశయముగా నున్నదని ఛందోదర్పణమూలమున ముద్రితము. దీని సరియైన పాఠమెఱుంగు వఱకు 'భవ'ప్రాస సాంకర్యమున కిది నిర్ణాయక ప్రయోగము కాఁజాలదు. భోజరాజీయ ప్రయోగమునకు గత్యంతరకల్పన శక్యము గాదు. పాఠాంతర మేదేనియున్నదేమో పరిశీలింపవలయు. అందలి యతిస్థల స్థితభాతిశబ్దము తొలఁకుపల్కు కాని సార్థకముగాదు. రసాభరణములోని పీడ్వడు శబ్దమునకు మూలరూపము 'పీడ్పడు' గావుటంజేసి యీపాఠమును గ్రహించిన నిర్బాధకమగును.

6. అఖండయతి – అనంతుఁడు నుమవని ప్రాదినిత్య సత్య సమాసయతులకుఁజేరని యఖండయతులీ క్రింది పద్యములందుఁ గలవు.

శా॥ ఈశానుం బరమేశు ఫాలనయనున్ హేలాజితానంగు గౌ
రీశుం గేశవతల్పభూషణుఁ ద్రిలోకేశున్ వియత్కేశు న
క్షేశోదంచితు భుక్తిముక్తి ఫలదున్ గీర్వాణ నిర్వాహకున్
గాశీనాయకు విశ్వనాథుఁ గొలిచెం గారుణ్య పుణ్యాకృతిన్.

(భోజ-6-213)

'అక్ష + ఈశ + ఉదంచితు' -అధ్యాత్మమింద్రియే- అనుకోశము ననుసరించి యక్షమన నింద్రియమనియు, అక్షేశుఁడన హృషీకేశుఁడనియు, అక్షేశోదంచితుఁడన విష్ణూపేతుండగు కాశీవిశ్వనాథుఁడనియు యర్థమగును. హృషీకేశశబ్దమువలె నక్షేశశబ్దము నఖండనిత్య సమాసముగాభావించి వ్యంజనయతిమైత్రి ననంతుఁడు పాటించియుండును. ఈక్రింది రసాభరణపద్యమున హృషీకేశశబ్దమునకు స్వరమైత్రి సంఘటితమైయున్నది.

"హృషీ, కేశుఁడు రక్షించు రుక్మిణీశుఁడు మమ్మున్"

(రసా-3-ఆ-21వ)

క॥ ఆఁకొని యఱచెడిఁ బ్రేవులు
నేఁకట వో సమలవలయు నీమాంసము (భోజ-4-211)

ఏఁకట ...... నీ(యొక్క)మాంసము-అని పదవిభాగము. వ్యాఘ్రము గోవుతోఁ బల్కుమాటయిది, నీమాంసముకాని యీమాంసముగాదు.

చ॥ అనుచునఖుండు పల్కుటయు నంకిలిదేఱిన చిత్తవృత్తితో
గను తెలివందలంచి యధికంబుగఁగ్రమ్మెడు బాష్పవారితో
నెనసిన ఱెప్పలెత్తుటయు నేర్పు సుఖాసనుఁ జేసి కన్నుల
ల్లన నఱచేతనత్తి వికలంబగు శోకము చక్కఁద్రోయుచున్.
(భోజ-3-221)

జ్ఞానమునకు యోగ్యమగుట ననుభావంబై (రసా-2-9వ)

అగుటన్ + అనుభావము — సంధివశమున వచ్చిన నకారమునకు జ్ఞాపడి కూర్పఁబడియున్నది.

అఖండవళ్లనంతునికి సమ్మతమే యనినయెడల నీక్రింది వాని నఖండవళ్లుగానే భావింపవచ్చు

ద్విరదగతి-నాకౌకసులనేలు-నముచి సూదనుపూజ
నతఁడుద్రాఁగైకొన్న-నగదగోపాత్మజుఁడు.

ఇది యతిభంగముగా నింతకుమున్ను పరిగణింపఁబడియున్నది (చూ-పరిషత్పత్రిక-స్వభాను సం-౬-పు 165)

అధికశుభంబొదవును భయములును హానిబొందు—
నృసింహా (ఛందోదర్పణము)

పరిషత్పత్రికయందే 172 పుటలో (ముద్రణస్ఖాలిత్య శీర్షిక క్రింద నిది పేర్కొనఁబడినది. 'హానినొందు'నని మార్చిన యతిభంగము తొలంగునని వ్రాయఁబడియె. అనంతుఁడఖండవళ్లు వాడినాఁడని తోఁచుచున్నది. గాన నీపద్యమునందును నఖండవళియని తలంపనగు. అఖండవళ్లు భారతాదులందుఁగలవు. ఇప్పటి ముద్రితప్రతులలో నవి సంస్కరింపఁబడినవి.

మెచ్చునకుఁగొన్ని, విమ్ములమేకసికొడుకులట్టు లరయంగఁజనున్ (ఉద్యోగ)
నామన మూర దీఁగని-నప్పుడె (సౌప్తిక)
చూపె మనంబునఁదలంచు-చుండుదు నేనున్ (ఆది)
ఘు, స్మరుఁడగుచున్నవాని దివి-జారి (అరణ్య)

(7) త్రిప్రాస-ఛందోదర్పణమున సంఖ్యార్థక త్రికారమునకు తకార ప్రాస మనంతుఁడు లక్షణమునఁ జెప్పెనుగదా. ఈక్రింది పద్యమున ననంతుఁడే యింతకుమున్ను (గతసంచికలో) చూపఁబడిన భాస్కర రామాయణములోని దానివలె, కకార క్రకారముల కిఁప్రాస మునూర్చి యున్నాఁడు.

క॥ ఆకర్కటి గర్భమున వి
వేకంబులుపుట్టెఁబిల్ల లీనుచు మృతమై
పోక యిదియేమి కతమున
నాక్రమ్మ అబ్రికికియుండె నొగిఁగర్కటియున్.

(భోజ-6-273)

(8) వృద్ధియతి- ఈయతి యనంతుఁడు ఛందమునఁ జెర్కొ లేదు
ఆనందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీ భామ... ...

(రసా-4 ఆ-41 పుట)

ఇందేకాక 'అడఁజెంచె ఘనోత్తువ ల్పాతువఁగ' అను ఛందోదర్పణ పద్యమునను గలదని గతసంచికయందు వ్రాసియున్నాఁడ. వృద్ధి సంధిలోఁబరపదాద్యేచ్చులకేని, యాదేశములైన ఇచ్చులకేని యతిమైత్రి చెల్లునని వృద్ధియతిలక్షణము కాకునూర్యప్పకవి వచించెను. పైయనంతుని పాదద్వయమున నాదేశైచ్చులకే యతిసంఘటితమై యున్నది

(9) సంధిగతప్రాసము—

పొందెలుఁగ వేకదా నీ

కుందెరువునని విధా తోడి కొండీలు సుమీ (రసా-4-36 వృ)

బిందుప్రాసమున థకారమునకు, సంధిగతప్రాసమున వకారమునకు మాత్రమే లక్షణలక్ష్యములు ఛందోదర్పణమున రచితములు. ఈప్రాస మప్పకవీయాదుల మతమున సంధిగతప్రాసమే యగు. ఛందోదర్పణము తరువాత రసాభరణ మనంతుఁడు రచించుటచేఁ దానులక్షణమున నప్పుడుచెప్పకున్నను బ్రయోగపరిశీలనమున నీప్రాసము గూర్చియుండును.

(10) సంయుక్తయతి—

"ఒక్కెడఁగున విశ్రాంతులు
వెక్కుగుచో సంయుతములు వినుమా శిష్టానుమ
ద్దక్కరములఁ దాని త్రిన
యక్కరమే యూనపదమునయు నిష్టాగఁ గృష్ణా"

అని యనంతకవియే లక్షణము రచించి యాకిందిపద్యమునఁ బ్రమాదమునఁ గాఁబోలుఁ దన్నియమభంగము నాచరించినాఁడు.

మంగళ మహాశ్రీ-దీనికి 9-17 యతిస్థానములు

చిత్తములఁజూపులను - జిత్తజుని శరండ్రిపయుఁ
-జెంది గజదంతి యాతులొందన్,
నృత్తముల తోడఁదరుణీమణులు గానరుచు
-లింపుగను మంగళ మహాశ్రీ.

ఇందు ద్వితీయచరణమున 'నృ' అనుదానికి 'ణీ' యను హల్మైత్రియు, 17-వ చోట నట్టి హల్మైత్రియుంచక నకారములోని ఋత్వమునకు మాత్రము యతిమైత్రియు సంఘటింపఁ బడియె. ఇది సంయుతయతి భంగము. ఇట్టివి పెక్కు మహాప్రబంధములందుఁ గలవు అవి ప్రమాద పతితములు గానోపును. మచ్చునకుఁ గొన్ని:—

క్రౌంచ॥ క్రౌంచ పదీ వృత్తమ్మునఁ జెన్నారఁగఁ బలుకుదురిలఁ గవి
వరులెల్లన్ (అప్పకవీయము)

మహాస్రగ్ధర॥ క్షితి గూలంగోటి సంఖ్యల్-గెడయఁగరివరా-శీతిసాహస్ర
సంఖ్యల్ (ఉత్త-హరివంశ-6-135

స్రగ్ధర॥ బాలవృద్ధా-ర్తస్త్రీ క్షేమంబుగానం-దఱుఁబొలిసిన వె-న్కన్
జయంబేలనాకున్ (భాస్కర రామా-యుద్ధ)

స్రగ్ధర॥ తామాత్మ స్వామిధామ-శ్రిమణి కృశవపు-ర్ల ప్రవిశాంతి కాంతి
(కళాపూర్ణ-7-177)

పైప్రయోగంబులందెల్ల సంయుక్తములోని యొకహల్లునకొకచో, మఱొకహల్లునకు మఱొకచో యతిసంఘటితము.

అఖండయతి క్రిందఁజూపిన 'నాకొకసులసేలు-సముద్రి నూతను పూజ-నతఁడు దాగైకొన్న' యనుదగడలో నాకశబ్దము భయయతి ఘటనాయోగ్యముగానఁ దొలుత హల్లునకు. దరువాత సర్వానకు యతి కైత్రిపాటింపఁ బడెననియు నూహింపనగుచున్నది.

ఎఱ్ఱన నృసింహపురాణములోని యీక్రింది మందాక్రాంతను బరికింపుఁడు- (4ఆ-188వ)

వేలాక్రాంత - త్రిభువనమహా - ద్వీపద్వీపమల్లత్కృసూనాత్మ
స్థూలావిర్భ-స్ఫురితరచనా-దుర్నిరూపాత్మకేళీ
తోత్కాలాకార-క్షుభితవలయా-త్కాల కల్లోలమాలా
ల్లోలాబ్ధింద్రో-ల్లుఠితవసుధా-లోకరక్షా సమక్షా

ఆంధ్ర లాక్షణికులు మందాక్రాంతకుఁ బదవ యక్షరమునై నొక్క-యతియే చెప్పిరిగాని సంస్కృతలక్షణమున మూఁడుచోట్ల యతులు నియతంబులై యున్నవి.

"మందాక్రాంతా జలధి షడగై ర్మ్భౌ నతౌ తాద్ గురూ చేత్"
(నా. వృత్తరత్నాకరము)

జలధి-4, షట్-6, అగ-7, తొలినుండి 4 పై, అటనుండి 6 పై, అటనుండి 7 పై విరతులు. తొలుతనుండి వరుసగా లెక్కించిన 4, 10, 17 అక్షరములపై విరతులని యేర్పడును. పైనృసింహపురాణ పద్య పాద మొక్కటెత్తుకొని వివరించెద.

లోలాబ్ధింద్రో - ల్లు తిత వసుధా - లోకలకౌసమకౌ

(పై పంక్తిలో 10, 17 అను సంఖ్యలు అక్షరస్థానములపై ముద్రితములు.)

సంస్కృతమునందుబడ విశ్రాంతిగాన మూడవ (17) యతిస్థానముతోనె పాదము ముగిసిపోవుననియును దరువాతిపాదములోని దెలుగులో వలెఁ గలుపరాదనియును గ్రహించుకొనవలె. అట్టిచో మన తెనుఁగు వర్ణమైత్రి సాంప్రదాయముచొప్పున , 10 పై యతులుండును నృసింహపురాణ పద్యములో నీయతి నియమము పాటింపఁబడినది. వరిత్సద్యోత్తరార్ధమున సంయుక్తములోని యొక్క వ్యంజనమే రెండుచోట్ల యతిస్థానమునఁగలదు. పూర్వార్ధమునట్టిభంగము ప్రథమపాదమునఁ బడియుండునని యూహింపనయ్యెడు. మొదటిచరణమున 11-వ యక్షరము 'ద్వి' వకారమునకుఁదోల్తను, దకారమునకు నడుమను యతి సంఘటితము. అట్లే ద్వితీయపాదమున 'స్థా' లోని సకారమునకు 4 పై,థకారమునకు 10 పై యతిమైత్రిగలదు. ఎఱ్ఱం సంస్కృతలక్షణమే పాటించినాఁడని తెలియుచున్నది. నన్నయ పృథ్వికి 11 తర్వాత వడి పాటించె. ఆంధ్ర లాక్షణికులునన్నయననుసరించిరి. ఎఱ్ఱన సంస్కృతలక్షణము తెలుఁగున 8 తర్వాత యతి యుంచియున్నాఁడు.

"రమా కుచ పరిష్కియా-ప్రణత దానవిత్యోదయా"

(నృసింహ-3 ఆశ్వాసాంతము)

(11) విద్యున్మాల-

పంక్తి (10) ఛందమునుండి యతి యుండునని సర్వలాక్షణికుల మతమైయున్నది. అట్లుండియు విద్యున్మాల (8-ఛందమునఁబుట్టిన వృత్తము)ను యతి 4-పై సర్వలాక్షణికులుంచి యున్నారు అనంతా మాత్యుఁడు నట్లేవ్రాసె

# గ్రం స్వీకారము.

1. కఠోపనిషద్భాష్యమ్- శ్రీరంగరామానుజముని విరచితము. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారిచే శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య గ్రంథమాలయందు ప్రకటితము. వెల రు 3-12-0

శ్రీ దేవస్థానము వారిదివరలో ఈశావాస్య, కేనోపనిషత్తులను రంగరామానుజభాష్యముతోడను, ఆంగ్లవివరణ భాషాంతరీకరణములతోడను ప్రకటించియున్నారు. ఇప్పుడు కఠోపనిషత్తునుగూడ నారీతిని పీఠిక, మూలగ్రంథము, రంగరామానుజభాష్యము, ఆంగ్లానువాదములతో ప్రకటించిరి. ఇయ్యది యాంగ్లభాషాకోవిదుల కతియుపయుక్తమై విశిష్టాద్వైతభాష్యమునందలి ముఖ్యవిషయములనెఱుగ సహాకారియగుచున్నది. పీఠికయందు దెలిపినటుల శంకరాదుల భాష్యముల కాంగ్లానువాదవివరణములు గలవు. అటులనే విశిష్టాద్వైతభాష్యమున కనువాదవివరణముల రచించునుద్దేశముతో నీగ్రంథము ప్రకటింపఁబడినది. ఆంగ్లభాషావేదుల కిది మిక్కిలి యుపయోగకరము. మిగిలిన యుపనిషద్భాష్యములనుగూడ నిట్లే యచిరకాలమున ప్రకటించి దేవస్థానము వారును ప్రాచ్యగ్రంథ ప్రకాశకులును, పండిత వర్గమును కృతకృత్యులగుదురు గాక.

2. అన్నమాచార్యచరిత్రము-తాళ్లపాక చినతిరువేంగడనాథ ప్రణీతము. విమర్శకాగ్రేసరులగు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి విపులమగు పీఠికతో ప్రకటితము. అన్నమాచార్యులమనుమఁడే యీ ద్విపద గ్రంథమును రచించియుండుటచే నిది వారి జీవితవిషయముల నెఱుంగుటకు మిక్కిలి యుపయోగకరము. వీనితో నన్యగ్రంథముల గల విషయముల జేర్చి శ్రీ శాస్త్రిగారు తమ సహజపాండిత్యముతో నన్న

మాచార్యునిచరిత్రమున గల ముఖ్యవిషయముల పీఠికయందు జర్చించిరి. అన్నమాచార్యుని సంకీర్తనములు తదితర గ్రంథములనుగూర్చియు పలువిషయములుమనకు దెలిపియున్నారు. శ్రీ అన్నమాచార్యులు పెక్కు సంకీర్తనముల రచించియుండుటయేగాక ద్విపద రామాయణము సంస్కృతమున వేంకటాచలమాహాత్మ్యము, పండ్రెండు శతకములను రచించెనట. అందు శ్రీ వేంకటేశ్వరశతకముమాత్రము లభ్యమైనది. సంకీర్తనములు కొన్ని గ్రంథరూపమున బ్రకటితములు (ప్రాచ్య గ్రంథమాల 11 కుసుమము) ఈగ్రంథమును రచించిన చినతిరువేంగడనాథుడను చిన్నన్నయు పెక్కు ద్విపదగ్రంథముల రచించి పొగడ్తకెక్కినవాడు. అష్టమహిషీకల్యాణము, పరమయోగివిలాసము, ఉషాపరిణయమనునవి యీతని యితరకృతులు. కావ్యరచనచే శ్రీ వేంకటేశుని మెప్పించి మకరకుండలముల గొంటినని తనగ్రంథములం దెలిపికొనియున్నాడు. చిన్నన్న ద్విపదకెరుగునను నవీవని గూర్చియే. తాళ్లపాకవారి రచనముల పెక్కింటిని బ్రకటించి యాంధ్రలోకమునకు శ్రీ తిరుపతి దేవస్థానమువారొనరించిన సేవ యతిప్రశంసనీయము. అందును శ్రీ ప్రభాకరశాస్త్రిగారిచే నవి బ్రకటితములగుట బంగారువకు తావియబ్బుటయే. లభ్యములగు మిగిలిన గ్రంథములను సైత మచిరకాలమున బ్రకటింతురుగాక. వెల రు 2-8-0 దేవస్థానము ఆఫీసున దొరకును.

3. విశ్వరహస్యము }
4. చంద్రునికథ } ఈగ్రంథములు రెండును విజయనగర మహారాజావారి కళాశాలలో పదార్థవిజ్ఞానాధ్యాపకులగు

శ్రీ వసంతరావు వేంకటరావుగారిచే రచింపఁబడిన గేయములు. విశ్వరహస్యమునందు పెక్కు వైజ్ఞానికవిషయములు సులభగ్రాహ్యములగునట్లు గేయరూపమున వివరింపఁబడినవి. ప్రపంచోత్పత్తి, మూలపదార్థములు, కేంద్రికములు, వానిమార్పు, జీవోత్పత్తి, జాని పరిణా

మము మొదలగునవెన్నియో గలవు. చంద్రునికథయందుగ్రహముల పరిభ్రమణము, చంద్రమండలము భూమినుండి వేఱగుట, అంతలి వాతావరణము, పర్వతస్వరూపము వర్ణితములు. గ్రంథకర్తలు వైజ్ఞానికవిషయములను వర్ణించుచు నచటనచట మానవప్రవర్తనము విధ్యుక్తధర్మములనుగూర్చి ముచ్చటించి, మనశక్తి సామర్థ్యములపై నాధారపడి దేశాభివృద్ధికై పాటుపడవలయునని పాఠకులను హెచ్చరించుచున్నారు. అతిప్రయాసముపైన తెలిసికొనదగు వైజ్ఞానికవిషయములు సులభరీతిని గేయరూపముగ దెలిపి నూతనమార్గమును ద్రొక్కిన గ్రంథకర్తల నభినందింపవలసియున్నది. వెల మొదటి గ్రంథము రు 1-0-0 రెండవది 0-8-0. వలయువారు విజయనగరమున గ్రంథకర్తలకు వ్రాయనగును.

5. A Descriptive Catalogue of the Telugu Manuscrip's  Vol X1 — Medicine

ఇది గవర్నమెంటు ప్రాచ్యలిఖితభాండాగారాధ్యక్షులచే వైద్యగ్రంథములను గూర్చి ప్రకటింపబడిన గ్రంథపట్టిక. ఈగ్రంథమున 82 వైద్యగ్రంథములు సంగ్రహముగ వివరింపబడినవి. అష్టాంగ హృదయము, వైద్యచింతామణి, బసవరాజీయము మొదలగు సుప్రసిద్ధ గ్రంథములు ప్రతులేగాక ఔషధయోగములు, కాయచికిత్సలు, వైద్యసారము మొదలగు గ్రంథములు గలవు. దీనియందుగల విషయములను ఆయుర్వేదశాస్త్రవేత్తలు సమ్యగ్విమర్శనమొనర్చి ప్రకటింపవలసినవానిని బ్రకటించినచో, దేశీయ వైద్యపద్ధతులకు తగు సహాయకారియగును. వివరణ పట్టికయందు హయలక్షణవిలాసము, అశ్వశాస్త్రము, సహదేవపశుశాస్త్రము మున్నగు గ్రంథములును గలవు. గవర్నమెంటు ముద్రణాలయము మదరాసు వెల రు 6-8-0.

6. South Indian Inscriptions — Vol X Telugu Inscriptions

మదరా సుప్రభుత్వశాసనపరిశోధక శాఖవారిచే ప్రకటింపబడిన యాంధ్ర శాసనసంపుటము. శ్రీ కళాప్రపూర్ణ జయంతి రామయ్యపంతులు గారి గ్రంథమునందలి శాసనములు సంకలిత మొనర్చి దీనిముద్రణము పూర్తిగాకుండగనే క్రొత్తశేషములయిరి. వారి పరిశోధనా ఫలితము నాంధ్రలోకము నేడుగాంచినది. ఇందు విష్ణుకుండి వంశము మొదలు గోలుకొండ నవాబులవరకును గల రాజులశాసనము లీయబడినవి. ఆంధ్రభాషాపరిణామ మెఱుంగగోరువారి కిది యమూల్యమగు గ్రంథము. పెక్కు శాసనములగల సంస్కృతాంధ్రభాగములు జదివి నచో వానినెట్టి కవీశ్వరులు రచించియుందురో మనకు దెలియగలదు. ప్రాచీనాంధ్ర భాషాస్వరూప పరిణామమును నెఱుంగగోరువారి శాసన సంపుటములగల లేఖకప్రమాదములను వదలి విమర్శనాపూర్వకముగ నందలి విషయముల గ్రహింపవలసి యున్నది, వెల 17-0-0.

7. పాల్కురికి సోమనాథకవి - విమర్శకాగ్రేసర బండారు తమ్మయ్య గారిచే రచింపబడి ధర్మగ్రంథమాలికయందు 12 వ బిల్వముగ ప్రకటితము. వెల రు 2-8-0 వలయువారు గ్రంథకర్తకుగాని శివధర్మ గ్రంథమాలా ప్రకాశకులు సికిందరాబాదునకుగాని వ్రాయ వలయును.

గ్రంథకర్త లాంధ్రలోకమునకు చిరపరిచితులు-సోమనాథకవి శైవకవులలో నగ్రేసరుడై బసవపురాణము, పండితారాధ్య చరిత్రము అనుభవసారము, చతుర్వేదసారము, వృషాధిపశతకము మున్నగు పెక్కు తెలుగుగ్రంథములను, బసవాష్టక బసవపంచకాది సంస్కృత గ్రంథములను పంచప్రకారగద్య, నమస్కారగద్య మున్నగు గేయ కృతులను రచించెను. శ్రీ తమ్మయ్యగారిదివఱలో పెక్కు సంవత్స రములనుండియు శైవకవులనుగూర్చి చాలయుపన్యాసముల నొసంగి

యున్నారు. అవి పత్రికలయందును బ్రకటితములు. కాని సమగ్రముగ సోమనాథునిగూర్చిన గ్రంథమొద్దియును లేమింజేసి వీరు శ్రీ జగద్గురు కాశీవిశ్వారాధ్య జ్ఞానసింహాసనాధీశ్వరులును విభూతి పత్రికాధిపతులు నగు శ్రీ పండిత చిదిరిమఠము వీరభద్రశర్మగారి (శ్రీ వీరభద్రశివాచార్య మహాస్వాములు) ప్రేరేపణచే నీ యుత్కృష్టగ్రంథమును రచించి యాంధ్రలోకమున కందజేసియున్నారు. శ్రీ తమ్మయ్యగారి కిన్ని సంవత్సరములనుండియు పడినశ్రమ కిదిఫలితము. కొన్ని విషయములు వివాదాంశములైనను, యీగ్రంథ మత్యుత్తమ మనకతప్పదు. ప్రథమమున సోమనాథుని జన్మస్థలము, వంశము, మిత్రవర్గము, గురుబృందము మున్నగువిషయములను జర్చించి యాతరువాత నతని కాలనిర్ణయ మొనర్చి నాటి యాంధ్రవాఙ్మయస్థితిని వివరించియున్నారు. సోమనాథునికృతులు, వాని పౌర్వాపర్యములు, యాతనిలఘుకృతులు గద్యములు, రగడలు యుదాహరణములను గూర్చియు ముందుగ విమర్శించి, యతని కళాప్రతిభలు కవితావిశేషములు, యసామాన్య ప్రయోగములనుగూర్చి విపులముగ జర్చించియున్నారు. భక్తిపారవశ్యముచే జాను తెనుంగున, జాతీయత నలవరించి దేశీయఛందమగు ద్విపదలో భావప్రధానములై సహజగాంభీర్యము, సుప్రసన్నతయు గలిగి ద్రాక్షాకదళీపాకముల నీకవి తనగ్రంథముల రచించెను. గ్రంథకర్తలు విశేషపరిశ్రమ మొనర్చి పెక్కు నూతనవిషయముల మనకీ గ్రంథమున దెలిపిరి; ఆంగ్లమునగల కవులచరిత్రముల ననుకరింపుచు (Men of Letters Series) గ్రంథకర్తలీ సోమనాథకవి చరిత్రమును రచించియున్నారు. సంస్కృతాంధ్ర కవులచరిత్రముల రచించుటలో వారిగ్రంథములుదక్క మనకాధారములు చాల దక్కువగనుండును. వీరశైవవాఙ్మయమును మథించి వీరొసంగిన సోమనాథకవి జీవితామృతమును సేవించి యాంధ్రభాషాభిమాను లానందింతురుగాక. ఈగ్రంథమున కనుబంధముగ వీరు సోమనాథుని లఘుకృతుల నొకసంపుటమున బ్రకటింపవలయునని మా యాశయము.

8. శ్రీ విజయనగరము మహారాజావారి సంగీత కళాశాలా రజతోత్సవ సంచిక - రజతోత్సవసంఘమువారిచే ప్రకటింపఁబడినది. ప్రథమమున శ్రీ విజయరామగానకళాశాలయని పిలువబడిన శ్రీ మహారాజావారి సంగీతకళాశాల 1919 వ సంవత్సరమున శ్రీశ్రీ విజయరామగజపతిరాజామన్నెసుల్తానుబహదూరువారిచే నెలకొలుపఁబడి నాటినుండియు దినాభివృద్ధిని గాంచుచున్నది. దీనికి గానకళావిశారదులగు ఆదిభొట్ల నారాయణదాసుగారి యనంతరము ద్వారం వెంకటస్వామినాయుడుగారును కళాశాలాధ్యక్షులై యుండిరి. ఈ కళాశాలా స్థాపనానంతరమే మదరాసు అన్నమలై విశ్వవిద్యాలయములు సంగీత కళాశాలల నేర్పరచి యున్నవి. ఈ కళాశాలా రజతోత్సవము 1945 సంవత్సరమున జరుపఁబడినది. ఆరజతోత్సవ కార్యక్రమము సంగ్రహోపన్యాసములు కళాశాలా వృత్తాంతము నీసంచిక యందాంగ్లమునను, తెనుఁగునను వివరింపబడినది. ఇందలి యాంధ్రభాగము శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారిచే రచింపఁబడినది. విజయనగర మహారాజులయొక్కయు, కళాశాలా పోషకులు, అభిమానులయొక్కయు, కళాశాలాధ్యాపకుల యొక్కయు చిత్రపటములు పెక్కులుగలవు. సంగీత సాహిత్యములనుగూర్చి భిన్నాభిప్రాయమెవ్వరికి నుండజాలదు. శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గానరసం ఫణీయని పెద్దలందురు. మఱియు ప్రాచీనకాలమునుండియు సాహిత్యముతోపాటు సంగీతమునకుగూడ నున్నతస్థాన మొసంగబడినది. శ్రీమద్రామాయణము తంత్రీలయ సమన్వితమనియు, పాఠ్యేగేయేచ మధురమ్ అనియు వాల్మీకి నిర్వచించియున్నాడు. గేయరూపమున సుత్కృష్టరచనముల బాడుచు గాయకులు పట్టణంబుల జనపదంబులను పర్యటన మొనర్చెడివారు. అట్టి సంగీతశాస్త్రము తంజావూరు మధురరాజుల యాస్థానమున వృద్ధినిగాంచి కొంతవడి మఱుఁగుజెంది

తిరిగి యున్నతపదవి నందుట ముదావహము. సంగీతము, చిత్రలేఖనము మొదలగు లలితకళలకు ప్రాముఖ్యస్థానమొసంగు కళాశాలలింకను పెక్కులు నిర్మింపబడవలసియున్నవి. 1919 సం॥న స్థాపించినది మొదలు నభివృద్ధిని గాంచుచున్న యీకళాశాల యితోధికముగ వెలయునుగాక.

9. దారాషకో - రచయిత - శ్రీ భమిడి సత్యనారాయణశర్మగారు - కాకినాడ వెల 1-0-0 ఈనాటకము వంగభాషను ద్విజేంద్రలాల్ రాయ్‌గారి షాజహాను నాటకమునందలి యితివృత్తమునే గైకొని నూతన దృక్పథముతో రచింపఁబడినది. హిందూదేశము విభాగము కాకపూర్వము గాంధీమహాత్ముఁడు హిందూమహమ్మదీయ సంఘీభావమునకై తనప్రచారమును సాగించునపుడు, దానికి దోడ్పడునను యుద్దేశముతో నాటకకర్త లిద్దాని రచించిరి. గాని నాటకమును పూర్తిగావింపకనే మతవైషమ్యములు, దాని బురస్కరించుకొని పెక్కుదురంతములు గాంధీమహాత్ముని యాకస్మికమరణము, హిందూదేశవిభజనమును, దేశము నల్లకల్లోలమొనర్చినవి. అయినను గ్రంథకర్తలయాశయము ప్రశంసార్హము. దారాషకోచరిత్రమును రచించిన శ్రీయుత కలికరంజన కానుంగోగారి గ్రంథమునకు తొలిపలుకును వ్రాసియున్నారు. ఈనాటకమున దారాయనతనికి గురువులై షాజహానుచక్రవర్తి కాస్థానవిద్వాంసులై మన్ననగాంచిన జగన్నాథపండితరాయలును మతవైషమ్యముల నిర్మూలనమొనర్చి హిందూమహమ్మదీయ సఖ్యముపై నాధారపడియుండు మహాసామ్రాజ్యమును నెలకొల్పబూనుటయు, రోషనారా, ఔరంగజేబు మున్నగువారల కుట్రలచే నది కొనసాగక పోవుటయు, సోదరులజంపించి యౌరంగజేబు రాజ్యాభిషిక్తుడగుటయు, తుదకు దారావధింపబడిన యనంతరము పండితరాయలు ఢిల్లీసామ్రాజ్యమును వదలి దక్షిణదేశమునకు జనుటయు

మున్నగు చరిత్రాంశములిందు వర్ణితములు. మతమునిన 'మనోవికాసమునకై మాత్సర్యనాశంబుకై వితతజ్ఞానవిభూతికై జగతిలో విశ్రాంతికై ముక్తికై గతియైయుండగ నిట్లు మానవులు యుక్తాయుక్తవిచారన్యాత్ముల్లై వైరంబున జావ వారికెటు సంప్రాప్తించు స్వారాజ్యముల్ ! అని పండితరాయలచే బలికించి గ్రంథకర్తలీనాటకమును బూర్తిగావించిరి. 'హంగామబనోల్లజేసి మసలమానుల మతమందు రసముగదుర బూబునాంచారి కౌగిటజేర్చిన' శ్రీ వేంకటేశ్వరుల కీగ్రంథ మంకిత మొనర్పబడినది.

10. అహల్యాగౌతమము – శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు, కాకినాడ.     మూల్యము 2-0-0

అష్టావక్రచరిత్రము, శ్రీ మహర్షి జీవితకథామృతము, ఆంధ్రకుందమాల మున్నగు పెక్కుగ్రంథముల రచించిన గ్రంథకర్తలీనా తన పద్యకావ్యమును రచించుటకు గల కారణమును పీఠికయందు దెల్పియున్నారు. పురాణేతిహాసకావ్యముల అహల్యాసంక్రందనుల జారత్వ ప్రశంసయుండుటయేగాక యాంధ్రమున శృంగార ప్రబంధములీ యితివృత్తమును బెంచుచు నసభ్యముగ వర్ణించుచు వచ్చినవి. అహల్యాయైజారః అను వేదవాక్యమునకు బండితులు విశేషార్థముల నిచ్చియున్నారు అందువలన రామాయణకాలము నుండియు బ్రచారమునుగాంచినను యీకథను పలువురు సందేహించుచున్నారు. తారాచంద్ర సమాగమము నిట్టిదియే. ఈ యితివృత్తముల కంతరార్థములుగలవేమో? గ్రంథకర్తలీకథను వదలి యహల్యాగౌతముల వివాహము వారి పవిత్రజీవితము తపఃప్రభావమును సులభమగు శైలిని మూడాశ్వాసముల పద్యకావ్యముగ రచించియున్నారు. ఆంధ్రసారస్వతాభిమానులీగ్రంథమును బఠించి యానందింతురుగాక,

11. కమలాకల్యాణము; సత్యాకృష్ణసమాగమము. పానగల్లురాజాగారగు శ్రీరాజా పానగంటి పార్థసారధి రాయనింగారిచే రచింపఁబడినవి. ఇందు కమలాకల్యాణము ఆంగ్లమున షేక్స్పియరు మహాకవిచే రచింపఁబడిన Twelfth Night అను సుప్రసిద్ధ నాటకరాజమున కనువాదము. ఆంధ్రీకరణమున మూలమునందలి పాత్రనామములును భావములును దేశకాలోచితముగ మార్చఁబడినవి. రెండవది గోల్డుస్మిత్ అను కవీశ్వరుని The Vicar of Wakefield అను గ్రంథములోని The Hermit అను పద్యభాగమున కాంధ్రీకరణము. గ్రంథములు రెండును సులభమగు భాషలో దేటతెల్లముగ రచింపఁబడినవి. మూలగ్రంథములందలి కథాసంవిధానము, నుత్కృష్టభావముల నాంధ్రమున దెచ్చుటకు శ్రీకవిగారు ప్రయత్నించిరి. పాఠకులీ గ్రంథముల జదివి యానందింతురుగాక.

12. సీతమ్మ పెండ్లికత- ఇదియు శ్రీ పానగంటి పార్థసారధిరాయనింగారిచే రచితము. ఇందలి యితివృత్తము కల్పితము. ప్రథమమున సంపూర్ణముగ పద్యరూపమున రచింపఁగోరి గ్రంథకర్తలు కొంత భాగమును రచించి, వార్ధక్యముచే నద్దానిని పూర్తి యొనర్పఁజాలక నుత్సాహముతో వచనరూపమున కథనుముగించిరి. కేశవరావు మేనల్లుఁనకుదనకుమార్తె సీతనిచ్చి పెండ్లియొనర్చుటకై మొదటి నుండియు నిశ్చయించిధనాశచే మతిచలించి, కృష్ణరావునకిచ్చుటకుబ్రయత్నించుటయు, వివాహసమయమున నతని విపరీతధనాశనుగుర్తించి, మనసుమఱలించుకొనితిరిగి తన మేనల్లునకేసీతనిచ్చి వివాహమొనర్చుటయు నిందలి యితివృత్తము. మనసంఘమునధనాశతో గొప్పసంబంధములకు బరుగులిడితఱువాతపశ్చాత్తాపమునందువారుపెక్కండ్రుగలరు. కాని కేశవరావు వలెబుద్ధిని మఱల్చుకొనువారఱుదుగనుందురు. పాత్రసంభాషణము

లందు వివిధసాంఘిక విషయములు జర్చింపఁబడినవి. కథాభాగము స్వల్పమైనను నీతిబోధకము.

13. ఆంధ్రాంకములు- ఇది శ్రీరాజునింగారిచే రచింపఁబడి యాంధ్రసాహిత్యపరిషద్రజతోత్సవసంచికయందు బ్రకటింపఁబడి పుస్తకముద్రితమగు వ్యాసము. ఇందు వ్యాసకర్త లాంధ్రగ్రంథములందును వ్యవహారములందును నాంధ్రాంకములనే వాడవలయుననియు, ఆంగ్లరోమను సంఖ్యాంకములను వాడరాదనియు, గణితముల భిన్నాంకములను గూడ నాంధ్రాంకములే యుపయోగింపవచ్చుననియు, స్వకీయమును నిరసించి పరకీయానుసరణ మొనర్పవలదనియు నాంధ్రులకు హెచ్చరించుచు నీవ్యాసమును వ్రాసియున్నారు. ప్రసంగానుపతితముగ నంకము లెట్లు యేర్పడినవో చర్చించియున్నారు. వీరి యుద్బోధన మెంతయు సముంజసము. పాశ్చాత్త్య దేశనాగరకతా విశేషముల నవసరమగు పట్లనే స్వీకరింపవలయుననుట నిర్వివాదాంశము. నేఁటి యాంధ్రవాఙ్మయమును నీ విపరీతానుకరణముచే నస్వాభావికముగ నుండుట లేదు. గ్రంథకర్తలు "స్వస్థానవేషభాషాభిమతాస్సంతో... అస్యాదపహాయ" అనుసూక్తిని గమనింపవలసియున్నది. పైగ్రంథములు మహాదునుగ్రంథకర్తలయొద్దదొరకును.

14. నాటకవిమర్శనము (Dramatic Criticism) శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ పండితులగు శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రిగారిచే రచింపఁబడినది.

నాటకవిమర్శనము పాశ్చాత్త్యదేశములందేగాక మనదేశమునందును మిగుల వర్ధిల్లినది. పెక్కు సాహిత్యాలంకార గ్రంథముల నాటకలక్షణము వివరింపఁబడి సునిశితముగ విమర్శింపఁబడినది. గ్రంథకర్త లిదివరలోక భాషాలా విద్యా... సన్యా... , వానిని గ్రంథరూపమున నిప్పుడు ప్రకటించిరి. ఇందు ప్రథమమున నాటకరచనయును

వ్యాసమున నాట్యనాటకముల సంబంధము, నాటకోత్కృష్టతయు వివరించి, నాటకముల ముఖ్యవిషయములగు కథాసంధానము, పాత్రపోషణము, రసపోషణము, కవిత్వము, తత్త్వోపదేశము అను శీర్షికలక్రింద చర్చించిరి. ప్రాచ్యపాశ్చాత్యనాటక సిద్ధాంతముల గల భేదములను నిరూపించి, యుత్తమనాటకరచన మెట్లుండవలయునో, కథాసంధాన, రసపాత్రపోషణము లెట్లు సహృదయరంజకముగ నుండవలయునో దిఙ్మాత్రముగ దెలిపిరి. మిగిలిన గ్రంథభాగమున స్వప్నవాసవదత్త, ముద్రారాక్షస, వేణీసంహార నాటకములగైకొని పైనాటక లక్షణముల ననుసరించి విమర్శించిరి వానియందలి గుణదోషముల జర్చించిరి నాటకవిమర్శనమునుగూర్చి యాంధ్రమున విపులమగు గ్రంథము త్యావశ్యకము. అందు నాటకరచనమున ప్రాధాన్యము వహించు కథావిధానాదికముల ప్రత్యేకముగ వేఱువేఱధ్యాయములుగ విభజించి ముఖ్యసంస్కృతాంధ్ర నాటకముల నుదాహరణములుగ గైకొని చర్చింపవలగును. గ్రంథకర్త లీగ్రంథమున నేర్పఱచుకొన్న పద్ధతియు కళాశాల విద్యార్థులకు, నుపాధ్యాయులకు నాయాగ్రంథముల నభ్యసింపుచో మిక్కిలి యుపయోగకరముగ నుండుననుట నిస్సంశయము. మిగిలిన ముఖ్యనాటకములగు అభిజ్ఞానశాకుంతలము, ఉత్తరరామచరితాదుల గైకొనివిమర్శగంథమున ద్వితీయభాగ మచిరకాలముననే గ్రంథకర్తలు ప్రకటింతురని యాశింపుచున్నాము.

15. చారిత్రకవ్యాసములు — బౌద్ధయుగము. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిచే రచింపఁబడినది. గ్రంథకర్తలు సుప్రసిద్ధ చరిత్రకారులు, విమర్శకులు శ్రీ కోమర్రాజు లక్ష్మణరావుగారు, వీరభద్రరావుగారు నేర్పఱచిన పునాది పై తమ చారిత్రకవ్యాససౌధముల నిర్మింపుచు నాంధ్రుల కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు. బౌద్ధయుగమునాటి చారిత్రకవిషయములు పెక్కుగ్రంథములనుండి గైకొని వీరి

పటిలో నాంధ్రపత్రిక వారపంచికలలోను, ఉగాదిసంచిక, భారతీపత్రికలలోను పెక్కు వ్యాసరాజముల బ్రకటించిరి. అందు బౌద్ధయుగము నకు సంబంధించినవ్యాసముల నీగ్రంథమున బ్రకటించిరి. భారతీయ ధర్మ సంస్కృతి యాంధ్ర, ఇక్ష్వాకు రాజులకాలమున విస్తరించి దశదిశలకు వ్యాపించినది. కాని క్రతుకలాపమున పశుహింసప్రధానమై జుగుప్సాకరముగనుండి దేశమున యశాంతి యతిశయించుటచే, నట్టి హింసను నిందించుచు సంఘమున బౌద్ధమతము ప్రశాంతవిప్లవము గావించినది. నాటినుండియు బౌద్ధమతము ఆర్యావర్తసీమను దాటి దేశాంతరముల విజయప్రస్థాన మొనరించినది. నాటినుండియు చైనా, బర్మా, టిబెట్టు మొదలగుదేశముల బౌద్ధమతము వ్యాప్తినొంది జనాకర్షణీయమయినది. చీనా హిందూదేశములకుగల మతసంబంధ మతిప్రాచీనమయినది. వానికిగల యనుబంధము, రాజగృహము, అమరావతి, నాగార్జున కొండ స్థూపనిర్మాణాదికములను గూర్చిన పెక్కువిషయము లీగ్రంథమున నాయావ్యాసముల వివరింపబడినవి. మఱియు ప్రాచీన విద్యాసంస్థలు, నాటి విద్యావిధానము, నాలందాతక్షశిలా విద్యాలయములు, హిందూబౌద్ధయుగములగలిగినమార్పులు, శైవవైష్ణవమతములు, గ్రామ పరిపాలనా పద్ధతులనుగూర్చి ప్రాచీనవిద్యాసంస్థలు, వృత్తివిధానమనువ్యాసముల విపులముగ దెలుపబడినవి. ప్రాచీన భారతదేశ చరిత్రము, సంస్కృతిని దెలియగోరువారికీ గ్రంథమత్యంతోపయోగము. శ్రీలక్ష్మణరావు వీరభద్రరావుగారును తమగ్రంథముల రచించినయనంతరము హిందూదేశ చరిత్రవిమర్శనము మిక్కిలి విస్తరించినది. పెక్కు నూతనశాసనాదులు ప్రకటింపబడినవి. సమగ్రముగ నందునటుల వారి హిందూమహమ్మదీయ యుగముల సంస్కరించి ప్రకటించుటయో లేక నూతనగ్రంథము నాంధ్రభాషను రచించుటయో ముఖ్యావసరము. అందువిషయము శ్రీ శర్మగారు తమశక్తి సామర్థ్య

ములనుపయోగించి యాంధ్రభాషను సమగ్రభారతదేశ చరిత్రమును రచించి కృతకృత్యులగుదురని విశ్వసించుచున్నాము. వెల రు 1-12-0

16. ఆంధ్రదేశచరిత్రసంగ్రహము (క్రీ-శ 1857 వఱకు) శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిచే రచింపఁబడినది. శ్రీ శర్మగారు 1947 సంవత్సరమున All India Radio మదరాసుకేంద్రమున నాంధ్రదేశచరిత్రమునుగూర్చి చేసిన ప్రసంగము లీ గ్రంథరూపమున వెలువడినవి. రేడియోప్రసంగములగుటచే నివి సంగ్రహముగ ముఖ్య విషయములనుమాత్రమే తెలుపుచున్నవి. ఆంధ్రదేశచరిత్రము విపులముగ శ్రీ శర్మగారివంటి సుప్రసిద్ధచారిత్రకపరిశోధకులు మన కళాశాలావిద్యార్థుల కుపయోగముగ రచించి ప్రకటింపవలసియున్నది. ఈగ్రంథమున గల పండ్రెండు ప్రసంగములయందును శాతవాహన యుగము మొదలు కంపెనీ పరిపాలనాంతమువరకును గల యాంధ్రదేశ చరిత్రము సంగ్రహముగ వివరింపఁబడినది. ఈగ్రంథ ప్రాశస్త్యమును గమనించి విశ్వవిద్యాలయాధికారులు కళాశాలల దీనిని పఠనీయ గ్రంథముగ నిర్ణయింతురని కోరుచున్నాము. మనవిద్యార్థులు తమ దేశ చరిత్రాంశముల నెఱుగక యన్యదేశవృత్తాంతముల బఠింపుచుండుట నేటి విద్యావిధాన విమర్శకులకు సువిదితము- ప్రతియాంధ్రుడు నవశ్యముగ తనదేశచరిత్రము నభ్యసింపవలయుననియు నందులకు సంగ్రహముగ నీగ్రంథమును, దక్షిణదేశచరిత్రమునకు రంగస్వామి అయ్యంగారురచించిన Pre-mussulman India మొదలగు గ్రంథములు నవశ్యపఠనీయములనియు దలచుచున్నాము. వెల రు 1-8-0 మాత్రము ఆధునిక వాఙ్మయకుటీరము, పురశ్వాకమునకు వ్రాసిన దొఱకును.

17. తెలుఁగుమెఱుఁగులు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే రచింపఁబడినది. శ్రీ శాస్త్రిగారి విమర్శనములను సారస్వతసేవను గుర్తింపని యాంధ్ర సారస్వతాభిలాషులుండుట యరుదు. వీరిదివఱలో

భారతి, యాంధ్రపత్త్రిక మున్నగు పత్త్రికలలో బ్రకటించిన విమర్శక వ్యాసముల నీసంపుటమున బ్రకటించిరి. ఆంధ్రసారస్వతమును గూర్చియు, ప్రాచీనాంధ్రభాషను గూర్చియు పెక్కువ్యాసము లిందు ప్రకటితములు. ఆంధ్రభాషావికాసమును గూర్చిన వ్యాసము తెలుగున భాషాసంప్రదాయములను వివరించుచున్నది, గ్రాంథగ్రాంథులు, అది-ఇది ప్రధానాని భక్తి డు ప్రత్యయము మున్నగు అమూల్యవ్యాసము లిందుగలవు. ఆంధ్రలిపిసంస్కారమందలి చివర వ్యాసము. శ్రీ శాస్త్రిగారు సుప్రసిద్ధ విమర్శకులు. ఈగ్రంథమునందు చర్చింపబడిన విషయములను గూర్చి భిన్నాభిప్రాయము లుండకమానవు. అయినను శ్రీ శాస్త్రిగారి యమూల్యాభిప్రాయములు సమాదరణీయము లనుటకు సందియము లేదు. 'స్పర్ధయా వర్ధతే విద్యా' యనునటుల భాషావిషయముల మథించినగాని నైజస్వరూపము దెలియుట శక్యము. తమ పరిశోధనల నీగ్రంథరూపమున వెలువఱచి శ్రీ శాస్త్రిగా రాంధ్రభాషాపరిశోధకులకు మిక్కిలి యుపకార మొనర్చియున్నారు. వెల రు 2-0-0

ఆంధ్ర గ్రంథమాలా ప్రకాశకులకు వ్రాసిన దొరకును.

---

సీ. దక్షిణపవనంబు తనుగంధమునసూని
మలయాచలముమీఁది మరులుపూనఁ
దివిచిపట్టిన లేఁతచివురుల చాయకుఁ
గరతలంబుల కాంతి వరములొసఁగఁ
గుసుమాల్ గోయుచోఁ గోళ్ల మెఱుంగులు
తనిమొగ్గలకు గవుసెనియ లొసఁగఁ
బిలువంగఁజెలఁగెడు పలుకులు రాజకీ
రములకు నొజ్జతనములు సేయఁ

గురులు నలుపిండు బెరయుఁగ వనమయూ
రముల గతులు వేడ గమనలీల
నవఁగి పెనఁగి ప్రీతి వనకేలి సలిపిరి
వనజముఖులు వేడ్కఁ బనువుసేయ. 28

సీ. ధమ్మిల్లభారముల్ కమ్మపూవులఁతోడఁ
బాదిగొని పెన్నులఁబొలసి ప్రేల
నలికతలంబులఁ బొలుచు కుంతలములు
ఘర్మజలంబులఁ గలసియుంట
కహ్లారదళముల కాంతిమిన్నక కొన్న
చెన్నునఁగనుఁగవ జేగుఱింప
సోలెడు వల్లులఁబోలెడు మేనులఁ
బయ్యెట గ్లాని పరిస్ఫురింప

ఘనపయోధరముల కాశ్మీరచర్చలు
కలఁగ నలసగతులు చెలువమొందఁ
బువ్వుఁబోఁడులంతఁ బుష్పాపచయకేలి
సోలివచ్చిరా నృపాలుకడకు. 29

మ. పరగై యొప్పెసలారు మానికెపు సోపానంబులం బ్రజ్వల
ద్వార వజ్రోపల సైకతంబులను సౌవర్ణారవిందంబులన్
హరినీలాసితవారిజంబులను జక్రాంగాదివాః పక్షివి
స్ఫురణంగల్గు సరోవరంబుఁగనియెన్ భూవల్లభుండయ్యెడన్. 30

క. మొగములు విరిదమ్మలఁ గుచ
యుగములు కోకములఁజూడ్కు లుత్పలముల మం
దగతులు హంసలఁదోల న
రుగుగఁ జొచ్చిరి సతుల్ సరోవర మెలమిన్. 31

చ. కటివడఁ గాడ నీల్గ గసికౌను కరంబుల నొక్కలించి పి
న్నట తరళంబుతోడ నయనద్యుతి భ్రూలతలందె ర్ప నుం
గుటములు మాఁపి నిక్కుచును గ్రొవ్విరిచన్నులచాయ మోమెంచ
క్కటి కెసఁగంగఁ జొచ్చె నొకకామిని తోయజమందమిమ్ముత్రలన్. 32

తే. గీ. బలిమి రాహువు సుధాంశు బింబము వెఱచి
పాఱఁగడుడాసి వెనుకొనుపగిది నొక్క
యెడ సఖులు గూడి చెలరేఁగి యాఁడుచోట
నీలవేణియు మొగమును నెలఁత కొప్పె. 33

తే. గీ. సతులు చల్లఁ బోరాడుచో జలకణములు
నెఱికురులమీఁద నిండి క్రిక్కిఱిసి చెలువ
మమరెఁ గసుగొన నిందినీలములతోడఁ
గలయఁ గ్రుచ్చిన మౌక్తికంబులును బోలె. 34

తే. గీ. క్రాలుఁగన్నులు ముద్దుమొగములుఁ దమకు
నసదృశప్రభావమునఁ జెల్వగుటఁ జేసి
మునిఁగి మీలను దలయెత్తి వనరుహములఁ
దూలఁగఱచిరి వనకేళివేళ సతులు. 35

తే. గీ. అలికలితపంకజము నొక్కయతివ దెచ్చి
చుట్టమగునట్టి వనితకుఁ జూపుటయును
తనకురులు మోము నెదుట నద్దంబులేక
తోఁచెననుచు నమ్ముగ్ధ యద్భుతముఁబొందె. 36

సీ. కేలిదెప్పము సేసి కాలి లీలావతి
నీఁదించుచును నొక్కయింతిదాసి
చేయిచ్చి యిందు విశ్రమియించును దన్వి
నడిపించుచును నొక్కనడఁతి నగాది
ముదితఁజేకూడను ముత్తలాడుచు నొక్క
తరుణికి నిమ్మలఁ దమ్మిరోయఁగి
రమణి పాపటఁ బుష్పరజముఁ బోయుచు నిదె
మిగిలెఁ గొమ్మని యొక్కమగువకిచ్చి
కదలఁబడినట్టు లొక్కతెఁ గౌగలించి
ముంపుమునిఁగి నట్లొక్కతె మోవియాని
లలితనాయక కేలీవిలాస మమర
లీల జలకేలి సలిపె భూపాలసుతుఁడు. 37

సీ. కలయంగ నలఁదిన కస్తూరి పెల్లున
జలములనెల్లను గలఁగఁ జేసి
కుచమండలంబుల కుంకుమచర్చల
నీరెల్ల జేవురు నీరుసేసి
తనులిప్త సురభిచందన కర్దమంబున
వారినెల్లఁ బులకవండు సేసి
మూలల నవపుష్పమాలికావితతుల
వనమెల్లఁ దెట్టువఁ గొనఁగఁజేసి

ఉపలక లలితవీథినంటఁ గన్గవలఁగొ
వెలయఁ గాముచిహ్నాలెల్ల బెలయ
వలరువాతు లసుర జలకేలి సాలించి
కొలను వెడలి రింతు లలసగతుల.

ఆ. వె. భూమినిండి మింటఁబూర్ణమై కరఁగుట
మకర మీనరాశి మహితమైన
హరియశస్సుధాబ్ధి యందుల తుంవురు
లనఁగఁ జుక్కలొప్పె నాకసమున. 39

సీ. ధర వియోగులనెల్లఁ బరిమార్పఁబూని హృ
ద్భవుఁడు గట్టిన వీరపట్టమనఁగ
విరహులపై దండువెడలుచో మదనున
కెత్తిన కెంజివురెల్లి యనఁగ
నలిఁ బ్రోషితులమీఁద గొలిపెడు మరుకరి
ఘుసృణపంకాంకిత కుంభమనఁగఁ
జొత్తిల్లఁ బథికులనెత్తుటఁ దోఁగిన
శంబరద్వేషుచేతి చక్రమనఁగఁ
దూరుకొండ తుట్టతుదిమీఁదువున వేలు
గొమ్మవలుదపూవు గొలకవోలెఁ
గందు బెరసి రాగకాంతిదలిర్పంగ
మస్తమొప్పఁ జందమామ వొడిచె. 40

తే. గీ. అమరు లమృతాబ్ధిలోపలి యమృతరసము
వెండిచేరుల పటికంపుకుండఁ గట్టి
చేఁదుకొనియెదరో నాఁగ శీతరోచి
మెల్ల మెల్లన రుచులతో మిన్నువ్రాఁకె. 41

తే. గీ. తపరి రాగిల్లి ముక్తుఁడై తరతరంబ
నిర్మలత్వంబుఁ బొందుచు నీరజారి
పరమయోగియుఁబోలె సత్పథమునందు
నడువఁగాఁ జొచ్చెఁ గువలయానందమెసఁగ. 42

తే. గీ. ఉదయరాగ మించుంచక యుజ్జగించి
నిండుఁ జంద్రుఁడు గన్నులపండువయ్యె
ధావనానంతర స్నిగ్ధదాక్షిణాత్య
రాజశుద్ధాంత దంతవజ్రములకాంతి. 43

తే. గీ. కమలినీ కాంత యొంతయుఁ గంది వంద
వారుణీసక్తుఁడై వసువ్యయముచేసి
యరిగినట్లు సరాగుఁడై యంబరంబుఁ
దొఱఁగి పశ్చిమజలధిలో నతికెఁ దరణి. 44

క. తరుణుండగు శీతలకరు
మరగి వియల్లక్ష్మి తన్నుఁబాలి ముదుకడున్
ఖరకరుడును వని ద్రొబ్బిన
కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా. 45

చం. నలువగు రక్తి మించినమనంబున నుబ్బునులావుపుట్టి చెం
గలువవికాసవేళ మురుకంబు నటింపఁగఁ బుష్పఁబోడి మొ
క్కలమునఁ బేర్చి నాథు నధికారముఁ గైకొని కేలిసల్పిన
చ్చలమున సిగ్గుచాలమిఁ బూఁ జన్నవహారము లోలిఁ జెప్పఁగన్. 46

తే. గీ. వామనానేకపము చక్రవాళ కుధర
ధాతుతటము గోరాడఁ బోఁ దరులువిఱిగి
కూలుటయు మింటి నెగసెడు ధూళివోలెఁ
బర్వె నఱసంజ పడమర పట్టుకొనుచు. 47

చం. అలరుల పాన్పులం దలిరుటాకుల సెజ్జల హార్మ్యవేదికా
తలముల తీవెయిండ్ల సికతాశయనంబుల మున్నియుక్తమై
నలరుదురివందు కందువల నప్పటికప్పటి కింపుఁ బెంపఁగో
ర్కులు తనివారి వేడ్కఁ బడఁగూడిరి వేడుకతోడ దంపతుల్. 48

చం. పలుచని చంద్రికారసము ప్రన్నని నున్నని తేటక్రొమ్ముఱుం
గులతుదలందలిర్చు నెలక్రొమ్ముత్రల కాంతి పసిండినిగ్గుతోఁ
గలపి యులంతివన్నెయిడి కాయజునిల్పిన రత్నపుత్రిక
న్నలువ సజీవఁజేసె నొకొనాఁ దగు నాతివిభాతి చూడ్కికిన్. 49

సీ. దళమైన చీఁకటి గుళియలు సేసి ప
ద్మాసనుం డాయువు వోసెననఁగ
దొలుకారు మెఱుఁగులు కొలదికి వి
రించి వాల్గనుల నూరించెననఁగ
జంద్రికాసార మబ్జజుఁడు గట్టిగఁ బద
నిడి యాణిపాణియుం బడిసెననఁగ
చాటించి విధిరాగ పరమాణువునఁ బల్ల
వితమూర్తిగాఁగ నిర్మించెననఁగ
బొలుచు నలకలను మదనునమ్ములను ముత్తి
యముల విద్రుమవల్లిక నపహసించుఁ
దరుణియలకలుఁ జూడ్కులు దశనములును
నధరమును బ్రస్తుతింప నాయలవియెట్లు. 50

చ. పరముఁడు కంధర స్థలముపై నిడివేడుక ముద్దులాడఁ గాఁ
గరమున మౌళిఁ గంగయుదకంబులు మెల్పునఁబిల్చి యూఁది శీ
కరములు భూషణేందునకు (శాశ్వ) తారకలీలఁ జేయు త
త్కరివదనుండు మత్కృతికిఁ దానుముఖస్థితితోడఁ దోడగున్. 51

చ. గొనయము తన్మృణాల్ చెఱకుఁగోల ధనుర్లత పూవు లమ్ము లే
టునను నొకమాటు తానతనుఁడున్ మమును నాగ్రజయించి జీవరా
శి నొడుచు లేమిచెప్పనని చేయుననుల్ తగు మోహనప్రవ
ర్తనగతి నామ దీప్తి మదంబున మీకిలఁగామసౌఖ్యముల్. 52

సీ. పరిణత ఫణిలతాపత్రంబుఁ గదిసిన
చిప్పరు నాఁ జెక్కుఁ జేయిచేర్చి
కందర్పు మసకరి కరముపై జగ్గివ
లెఁ గేనఁ దొడఁ గుచ మిఱియు మోపి
దవనంబు పొలకలఁ గవిసిన మమునాఁ
బలుచని చెమట పైఁ గలసి మెఱయఁ
గలువ రేకులు మౌక్తికములఁ గినెపి నాఁ
గన్నుల బాష్పంపుఁ గణములూరలఁ

గీ. వేడినిట్టూర్పు గాడ్పులు విరహవహ్ని
శిఖలు ప్రబలంగ వలవంతఁ దింత నొగిలి
యేకతంబున్నదాని రాజేంద్రతనయఁ
గనిరి లతికా గృహంబులో వనజముఖులు.

సీ. ప్రాణంబులెడల నభ్యాసంబు సేయు మా
ర్గంబన నిట్టూర్పు గాడ్పు లెసఁగ
గవ్యశాలగ నేయి గ్రమ్మకైవడిఁ గామ
శిఖఁ గ్రాఁగి మైదీగ చెమటవొడమ
మదమనమ్మలు నీరు పదను పెట్టినక్రియ
వాలుఁగన్నులు బాష్పవారి మునుఁగఁ
బగ లేదుటయు నెడఁబను రథాంగముచంద
మునఁ జన్నులు ముఖోద్గముగ నదంక

గీ. ప్రాణమొడలి నెఱపు వడి యొడలు
భూషణములతోడి పొత్తువిడిచి
లాఁతురైరి సఖులు లలితులు వాయని
ప్రాఁతలైరి విదర్భరాజ సుతకు. 54

సీ. మకరధ్వజుని విల్లు మనము వాయిని నిడి
నమలింపుగాఁ జేయు నల్లఁజెఱకు
మదను బాణావళి మనము క్రుమ్మఱ్లపైఁ
బాలుపారఁ దుఱిమెడు పుష్పచయము
మనసిజాతుని యెల్లి మనము వినోదార్థ
మై వచ్చి యాడెడు మావిచిగురు
మరుతేరిహయములు మన యిండ్లలోఁ బంజ
రంబులఁ బొరలు కీరవ్రజంబు

గీ. తానసంగుఁ డట్టివాని యలంచుట
యేమి? యతం కడిమియేమి? యతని
బీరమేమి? ధరణిఁ బిచ్చుక యలుకేమి
వాలఁగ.........నేమి వాలుఁగంటి? 55

సీ. ఏపునఁ జెలరేఁగి యేయు మనోజన్మ
చెఱకువిల్ రెండుగా విఱిచిపైతుఁ
బలువలై పలుకు చిల్కల నాలుకల ముల్లు
విఱచి యీరములలో వెడల నడఁతు
ముదమున క్రోయుతుమ్మెదలఁ జంపక లతాం
తములలో మునుగంగ (నిమురింతుఁ)
దగులమై వీతెంచు దక్షిణాశాగంధ
వహు మహేంద్రుని వాతఁద్రోతు

గీ. నేటికులికెదు నాయట్టి బోటికలుగ
వెలఁది! నీమదిలోపల వెఱవకుండు
మమ్మ! ధైర్యంబు వదలకుమమ్మ యెంచఁ
గత్తలము గల్గమేనికిఁ గలదె బాధ. 56

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు



**1947—48**

## సర్వజిత్సంవత్సర ఆయవ్యయ పట్టిక.

# సర్వజిత్సంవత్సరము.

# ఆయవ్యయపట్టిక 1947—48.

| ఆదాయము. | | మొత్తము. |
|---|---|---|
| 1. సంవత్సరాది నిలువ | | 394- 4-8 |
| 2. బ్యాంకివడ్డీ:- | | 651- 6-0 |
| బొబ్బిలివారి వార్ బాండ్ మీద | 399-0-0 | |
| వేంకటగిరివారి గవర్నమెంటుపత్రములు | 252-2-0 | |
| సేవింగ్సుబ్యాంకివడ్డీ | 0-4-0 | |
| | 651-6-0 | |
| 3. పత్రికచందాలు | | 173- 0-0 |
| 4. ఇతరజమలు | | 2-13-3 |
| 5. పుస్తకవిక్రయము | | 1580- 8-9 |
| | | 2802- 0-8 |

| | మొత్తము. |
|---|---|
| 1. ఉద్యోగులజీతములు | 1832-0-0 |
| 2. ఉద్యోగులప్రయాణ వ్యయము | 9- 0-0 |
| 3. పత్రికకు కాగితము | 75- 4-0 |
| 4. పత్రిక ముద్రణము | 255- 0-0 |
| 5. చిల్లర బైండింగు | 51-13-0 |
| 6. నిఘంటు బైండింగు | 620- 5-0 |
| 7 పత్రికలకు చందాలు | 48- 6-0 |
| 8. కొనినపుస్తకములు | 206-11-3 |
| 9. పోస్టువ్యయము | 24-12-6 |
| 10. సాదరు | 108- 4-0 |
| 11. సంవత్సరాంతమున నిలువ | 70-8-11 |
| | 2802-0-8 |

# పుస్తకవిక్రయము.

1. విప్రనారాయణ చరిత్రము 5-8-3
2. జైమినిభారతము 10-13-9
3. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము 7-4-3
4 జ్యోతిశ్శాస్త్ర సారము 2-5-6
5. సర్వేశ్వరశతకము 0-8-3
6. కావ్యాలంకార చూడామణి 1-5-0
7. అకారాద్యనుక్రమిత గ్రంథసూచిక 0-13-9
8. ప్రాకృతభాషోత్పత్తి 1-6-6
9. శివతత్త్వసారము 1-15-6
10. చంద్రభాను చరిత్రము 8-2-3
11. ఆర్యభాషావిభాగము 1 6-0
12 హాస్యరంగపాటలు 0-7.0
13 మన్నారుదాసవిలాస నాటకము 0-8-0
14. కాళిందీకన్యాపరిణయము 1 6-4-0
15. డిటో 11 భా 3-8-9
16. ఆంధ్రధాతుమాల 6-13-6
17. శాసనపద్యమంజరి 1 భా 10-8-3
18. డిటో 11 భా 0-14-0
19. శతకసముచ్చయము 1 2-9-9
20. డిటో 11 2-2-6
21. పరిషత్పుస్తకభాండాగారము 11 భా 1-11-9
22. డిటో 111 0-14-0
23. సూత్రాంధ్రవ్యాకరణము 2-11-9
24. రసాభరణము 4-0-9
25 ఆంధ్రశబ్దచింతామణి 8-7-9
26 షోడశకుమారచరిత్రము 4-0-3
27. హంససందేశము 0-7-3
28 రాయవాచకము 2-4-0
29 సింహాసనద్వాత్రింశిక 1 భా 5-3-9
30. డిటో 11 భా 5-3-9
31. నిఘంటుచరిత్రము 0-11-3
32. ఆంధ్రకౌముది 2-9-9
33 బాలభారతము 1-15-6
34. Dravidian Lexicography 1-3-0
35. Defence of literary Telugu 1-6-0
36. చాటుధారాచమత్కారసారః 1-6-9
37. సాంబోపాఖ్యానము 8-0-3

| | | |
|---|---|---|
| 38. | రసార్ణవాలంకారము | 1–13–0 |
| 39. | కవిజనోజ్జీవనిసమస్యలు | 1– 2–6 |
| 40. | రఘునాథరామాయణము | 3– 2–0 |
| 41. | రజతోత్సవసంపుటము | 7– 0–9 |
| 42. | ఆంధ్రసాహిత్యపరిషద్వృత్తాంతము | 1– 5–0 |
| 43 | అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము | 1– 9–6 |
| 44. | లక్షణసారసంగ్రహము | 0–15–0 |
| 45. | లౌకికన్యాయవివరణము | 0– 7–3 |
| 46. | కావ్యాలంకారచూడామణిపాఠభేదములు | 1–12–0 |
| 47. | సీతారామచరిత్రము | 4–13–0 |
| 48. | ఉత్తరరామచరితము | 17–11–3 |
| 49. | అమరుకము | 4– 7–3 |
| 50 | ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి | 4–10–0 |
| 51. | శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు 1 వ భాగము | 378–14–6 |
| 52. | డిటో 2 | 299– 1–3 |
| 53. | డిటో 3 | 312– 1–3 |
| 54. | డిటో 4 | 325– 9–0 |
| | | 1494– 0–9 |

కిళాంబి రాఘవాచార్యులు,

వింజమూరి వెంకన్నపంతులు,

కార్యదర్శులు.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు



**1948–49**

సర్వధారి సంవత్సర ఆయవ్యయ

పట్టిక.

# సర్వధారి సంవత్సరము (1948—49)

## ఆయవ్యయపట్టిక.

| ఆయము. | | మొత్తము. |
|---|---|---|
| 1. సంవత్సరాది నిలువ | | 70– 8–11 |
| 2. బ్యాంకివడ్డి | | |
| శ్రీ బొబ్బిలిమహారాజు రు–అ పై వారిపత్రములవలన | 399–0–0 | |
| శ్రీ వేంకటగిరిమహారాజు వారిపత్రమువలన | 196–0–0 | |
| సేవింగ్సు బ్యాంకివడ్డి | 0–3–0 | |
| | 595–3–0 | 595– 3– 0 |
| 3. పత్రికచందాలు | | 64– 8–0 |
| 4. చిల్లరజములు | | 1– 6–9 |
| 5. పుస్తకవిక్రయము | | 1298–11–6 |
| 6. చేబదులు | | 200– 0–0 |
| | మొత్తము | 2230– 6–2 |

| | |
|---|---|
| 1. ఉద్యోగులజీతములు | 871– 8–0 |
| 2. ఉద్యోగుల [illegible]యములు | 30– 0–0 |
| 3. ప[illegible] | 85–11–9 |
| 4. పత్రికముద్రణము | 153– 0–0 |
| 5. చిల్లర బైండింగు | 30– 4–0 |
| 6. నిఘంటు బైండింగు | 380– 4–0 |
| 7. పత్రికలకుచందాలు | 37–14–0 |
| 8. కొనిన పుస్తకములు | 114– 1–6 |
| 9. [illegible]స్ట[illegible]లు | 21–15–0 |
| 10. చేబదుళ్లుతీర్చినవి | 255– 8–0 |
| 11. సాదరు | 11– 9–9 |
| 12. సంవత్సరాంతమున నిలువ | 238–10–2 |
| మొత్తము | 2230– 6–2 |

# పుస్తకవిక్రయము. 1948-49 సర్వధారిసంవత్సరము.

| | వివరము. | మొత్తము. |
|---|---|---|
| 1. | విప్రనారాయణచరిత్రము | 3-14-0 |
| 2. | జైమినిభారతము | 8- 4-6 |
| 3. | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 14- 1-9 |
| 4. | సర్వేశ్వరశతకము | 0- 6-0 |
| 5. | కావ్యాలంకార చూడామణి | 1-15-0 |
| 6. | ప్రాకృతభాషోత్పత్తి | 1- 8-0 |
| 7. | శివతత్త్వసారము | 3- 8-0 |
| 8. | చంద్రభానుచరిత్రము | 4- 8-0 |
| 9. | శివరాత్రిమాహాత్మ్యము | 0-12-0 |
| 10. | ఆర్యభాషావిభాగము | 2-12-0 |
| 11. | ప్రాస్వరంగములు | 0- 8-0 |
| 12. | నారసింహపురాణము | 2- 0-3 |
| 13 | మన్నారుదాసవిలాసనాటకము | 1-14-3 |
| 14. | కాళిందీకన్యాపరిణయము 1 భాగము | 5- 8-0 |
| 15. | డిటో 2 ,, | 1- 7-0 |
| 16. | రెడ్లనాటిరెండు శాసనములు | 0- 8-0 |
| 17. | ఆంధ్రధాతుమాల | 1- 8-0 |
| 18. | శాసనపద్యమంజరి 1 భాగము | 28-15-6 |
| 19. | డిటో 2 ,, | 1-15-0 |
| 20. | సూత్రాంధ్రవ్యాకరణము | 0- 8-0 |
| 21. | రసాభరణము | 1- 0-0 |
| 22. | షోడశకుమార చరిత్రము | 3- 4-0 |
| 23. | సింహాసనద్వాత్రింశిక 1 భాగము | 2- 3-0 |
| | | 92-12-3 |

## పుస్తకవిక్రయము. 1948-49 సర్వధారిసంవత్సరము.

| | వివరము. | మొత్తము. |
|---|---|---|
| | బా॥ | 92-12-3 |
| 24. | సింహాసనద్వాత్రింశిక 2 భాగము | 2- 3-0 |
| 25. | ఆంధ్రకౌముది | 1- 8-0 |
| 26. | బాలభారతము | 0-12-3 |
| 27. | Dravidian Lexicography | 0- 4-0 |
| 28. | సాంబోపాఖ్యానము | 4-10-0 |
| 29. | కవిజనోజ్జీవనిసమస్యలు | 0- 8-0 |
| 30. | రఘునాథరామాయణము | 0- 7-0 |
| 31. | | 11- 0-0 |
| 32. | అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము | 0- 4-0 |
| 33. | లక్షణసారసంగ్రహము | 0- 8-0 |
| 34. | లౌకికన్యాయవివరణములు | 2- 4-0 |
| 35. | ఉత్తరరామచరితము | 1- 0-0 |
| 36. | అమరుకము | 2- 0-0 |
| 37. | చంపూరామాయణము | 1- 0-0 |
| 38. | ఆధునికాంధ్రవాఙ్మయ వికాసవైఖరి | 2- 0-0 |
| 39. | శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు 1 భాగము | 349- 4-0 |
| 40. | డిటో 2 | 270-12-0 |
| 41. | డిటో 3 | 277- 8-6 |
| 42. | డిటో 4 ,, | 277- 8-6 |
| 43. | విడిసంచికలు | 0-10-0 |
| | | 1298-11-6 |

కిళాంబి రాఘవాచార్యులు,
వింజమూరి వెంకన్నపంతులు,
కార్యదర్శులు.

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

## చతుర్థసంపుటము.

---

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, [illegible] పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యుపసర్గాదియుక్తంబులుగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁ గలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'ఙ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'ఞ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'ట' మొదలు 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువులన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు నను తలంపుతో నీ క్రింది వెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు.

---

Printed by N. Achutaramayya at the Cocanada Printing Works, Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

# శ్రీ
# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౮. { విరోధి. చైత్ర-భాద్రపదములు } సంచిక ౧-౩.



కాకినాడ

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

1949—50.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౮. { విరోధి. చైత్ర-భాద్రపదములు } సంచిక ౧-౩.



కాకినాడ

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

1949-50.

# విషయసూచిక.





శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాంస్థితిమావహన్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయస్త్రిపురుషాః సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకన్ధరాశ్శ్రేయసే.

# స్వవిషయము.

పరిమళపత్రికను బ్రకటించుట కొన్ని యనివార్యకారణములచే నాలస్యమైనందులకు సహృదయులైన పాఠకులు క్షమింతురుగాక.

ఈ పత్రికయందు బద్దెనరేంద్రుని నీతిసారముక్తావళిని బ్రకటింప నారంభించితిమి. ఇది యముద్రితమగు నొక ప్రాచీనగ్రంథము. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు దీనిని బ్రథమమునఁ బ్రకటించి యాంధ్రలోకమునకు బరమోపకార మొనర్చియున్నారు. వారి యొక్కయు, చిత్రాడలో బ్రకటితమైనట్టియు ముద్రితప్రతులును, మా భాండాగారమునందలి తాటియాకు ప్రతియు దీని కాధారము లైనవి. మడికి సింగనార్యకృతమగు సకలనీతిసమ్మతమున నుదహరింపఁబడిన పద్యములతో నీ గ్రంథభాగములను సరిచూచి పాఠభేదముల నిచ్చితిమి. గ్రంథము లభించినరీతిని ప్రకటించుటయే మాయుద్దేశము. పండితులిందలి గుణదోషములవిమర్శించి సంస్కరించుకొందురుగాక.

సాహిత్యవిమర్శనములందు విషయము ప్రధానముగాని వ్యక్తి దూషణముగాదు. ఎన్నడో సాహితీప్రపంచమున దమ శక్త్యనుసారము భాషాసేవ యొనర్చి కీర్తిశేషులయిన శ్రీ వేదమువారి యొక్కయు తదితర ప్రాచీన పండితబృందముయొక్కయు పాండిత్య నిరసనాపూర్వకముగ నింకను బత్రికలయందు వ్యాసములు ప్రకటింప బడుట కడుంగడు శోచనీయము. శ్రీ వేదమువారు నేటివిమర్శక బృందమునకు బాడితుర్లే గాకపోవచ్చును, వారి రచనలు దోష పూరితములు గావచ్చును. అయినను వారినింకనుదడవి నిందింపనేల? శ్రీ వేదమువారును యితర పండితులు నొండొరుల గ్రంథములపై తీవ్రవిమర్శనము గావించిన కాలము నొక వాదోపవాద యుగ మనవచ్చును. వారి సారస్వతసంఘర్షణముల నాంధ్రలోకమున నొక యపూర్వమగు నలజడి కలిగినది. పెక్కు గ్రంథము లా దినములలో టీకలతో, వ్యాఖ్యానములతో బ్రకటింపఁబడినవి. నేఁడాంధ్ర గ్రంథముల జదివి పాఠకులు రసాస్వాదన మొనర్పఁగలుగుట వారి వారి యమూల్యగ్రంథ ప్రకటనముననే యనుట మనము విస్మరింపఁదగినది కాదు. వారి ప్రకటనములగల దోషముల మన ముచితరీతిని సంస్కరింపవలెను గాని వారిని నిందించుట తగదు. మఱి యొక విషయము. ఒకే గ్రంథమును బలువురు బ్రకటించుటలో నన్యోన్య దూషణ మేందులకు? పూర్వ ప్రకటిత గ్రంథములగల దోషముల సంస్కరించి మాగ్రంథమున మెఱుఁగుపెట్టితిమని వ్రాసి కొనిన జాలదో? ఇంతకును భాషావిషయముల నిదమిత్థమని నిర్ణయింప గలుగుటయు సుకరము కాదు. కొన్ని యాధునిక విమర్శనముల జూచుటచే మాకుగలిగిన యనుతాపమును పండితలోకమున కెఱుక పఱచుటకై వ్రాసితిమి. యిట్లు తీవ్రవిమర్శనానలసంతప్తులై కాబోలు కవితాప్రపంచమున మహాకవులు సైతము

తే. బోధమల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతినిష్ప్రచ్ఛరంబు మచ్ఛరము ఘనము
కూప మండూకములుబోలెఁ గొంచె మెఱిఁగి
పండితంమన్యులైన వైతండికులకు.

తే. నికటమునసుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నడరి కాకులు బిట్టు పెద్దఱచినప్డు
డుడిగి రాయుంచ యూరక యుంటలెస్స
సైఁక రాకున్న నొండేనిఁ జనుట యొప్పు.

అని నిరాకరణ మొనర్చుచుండిరి. భర్తృహరియు దన సుభాషితమున

శ్లో. బోద్ధారో మత్సరగ్రస్తాః
ప్రభవః స్మయదూషితాః
అబోధోపహతాశ్చాన్యే
జీర్ణ మఙ్గే సుభాషితమ్.

అని వ్రాయవలసివచ్చినది. విమర్శకులు న్యూనతాపాదకము లగు నిందావాక్యములవదలి వాఙ్మయవిమర్శనముల మాత్రమే విమర్శింపవలయునని మా యాశయము.

# గ్రంథస్వీకారము.

1. అభిషేకనాటకము:—శ్రీ బులుసు వెంకటేశ్వరులు గారిచే రచింపఁబడినది. వెల రు 2—0—0 లు,

ఇది సుప్రసిద్ధభాస నాటకమున కాంధ్రీకరణము. గ్రంథకర్తలు పాఠకులకు చిరపరిచితులు. అష్టావక్రచరిత్రము అహల్యా గౌతమము అను పద్యకావ్యములను, మహాపురుషులు, శ్రీ మహాత్మ జీవిత కథామృతము అను వచన గ్రంథములను వీరిదివఱలో రచించిరి. దిఙ్నాగకృతమగు కుందమాలనుగూడ నాంధ్రీకరించిరి. వీరు సులభమగు శైలిని దమ గ్రంథముల రచించియున్నారు. ఆంధ్రీకరణము మూలానుసరణముగ నున్నది. గ్రంథమున నుపోద్ఘాతముగ భాసమహాకవినిగూర్చి పెక్కు విషయములు విపులముగ జర్చింపఁబడినవి. తిరువనంతపుర నాటకముల కర్త సుప్రసిద్ధప్రాచీననాటకకర్తయగు భాసుఁడే యనియు నతనికాలము క్రీ. పూ. 4,5 శతాబ్దములై యుండుననియు నిర్ధారణ మొనర్చిరి. కాలనిర్ణయమున భిన్నాభిప్రాయములు గలవు. వీరి నిర్ణయానుసారము భాసుఁడు పతంజలికి పూర్వుఁడును పాణినికి కొంచెము తరువాతి వాఁడునగును. అందులకు గొన్ని యడ్డంకులు గలవు వానిని దెలియగోరువారు భాసునిగూర్చి వ్రాయఁబడిన గ్రంథములఁ జూడనగును. గ్రంథకర్తలు విశేషపరిశ్రమ మొనర్చి భాసుని గూర్చిన వాదోపవాదముల సంగ్రహముగను స్పష్టముగను మనకు దెలిపియున్నారు. వీరి యాంధ్రీకరణమును పాఠకులకు దెలుపుటకై రెండు పద్యములు:—

మ. రమణీయంబగు నే యశోకవనిలో రాజిల్లు [illegible]ంబు పై
తము మండోదరికూడఁ ద్రుంపఁబడి సౌందర్యంబు క్షీణించు న
న్నమహాద్రిన్, హనుమయానిలసూనుబు లతలన్ బాహుద్రుమంబున్ యథే
చ్ఛము పోకన్ పెఱికించి కొట్టివని ధ్వంసంబాటయాశ్చర్యమా.(3-1)

చ. అసిత భుజంగమంబు సరియౌ ననఁబోలిన యేక వేణితో
నసనగు నట్టి నెన్నడుము నాత్మవిభుస్ దలపోయుచుండదము
చ్ఛ్వసితము సశ్రుపూరితము వక్త్రముతో కృశ దేహయష్టినిం
పెనఁగును సూర్యతేజము నెందిన సారసమాలయోయనన్.(2-7)

(2) దక్షిణదేశ భాషా సారస్వతములు — దేశి. మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర ప్రధానోపన్యాసకులగు శ్రీ కోరాడ రామకృష్ణయ్య ఎం. ఏ. గారిచే ప్రకటింపఁబడినది. వెల రు 2—8—0.

ఆంధ్రభాషాస్వరూపవిమర్శకప్రపంచమున శ్రీ రామకృష్ణయ్యగారిని వారి యమూల్యమగు వ్యాసములను జదువని వారుండరు. వీరు ద్రావిడభాషాస్వరూపనిర్ణయపరిజ్ఞానమున సిద్ధహస్తులు. ఆంధ్రము, తమిళము, కన్నడము, తుళు మొదలగు ద్రావిడ భాష లొకకుటుంబమునకు జెందినవనియు, నాకుటుంబము సంస్కృతాది భాషాకుటుంబమునకు భిన్నమనియు వీరు కాల్డ్వెలు మున్నగు విమర్శకాగ్రేసరులతో నేకీభవించి, యా సిద్ధాంతములను స్పష్టముగ నిరూపించుటకై భాషాచరిత్రము, సంధి మున్నగుగ్రంథములను, పెక్కు వ్యాసములను బ్రకటించిరి. ద్రావిడభాషాకుటుంబముకూడ సంస్కృత ప్రాకృత భాషాజన్యమను వాదమును లేకపోలేదు. వాదోపవాదముల సారమును భాషాస్వరూప విమర్శకు లెఱుంగుదురు. ఈ గ్రంథమున గల వ్యాసము లిదివఱలో భారతి మున్నగు పత్రికలలో వెలువడియున్నను వానిని దగురీతిని సంస్కరించి గ్రంథరూపమున నొక విలక్షణత కలుగునటుల గూర్పఁబడినవి.

సంస్కృతాద్యార్యభాషాసంప్రదాయముల ననుసరించినపద్ధతి మార్గపద్ధతియనియు, నాంధ్రము, తమిళము మున్నగు దక్షిణదేశభాషల నాయాభాషాస్వరూపముల నెఱుకపఱచు పద్ధతి దేశిపద్ధతి యనియు వ్యవహరింపఁబడుచున్నది. ఆంధ్రకన్నడభాషల నేఁడు బ్రకటితమగు సారస్వతమున మార్గపద్ధతియే హెచ్చుగఁ గన్పడుచున్నను దేశిపద్ధతి ననుసరించు యక్షగానోదాహరణములు, షట్పదులు, ద్విపదలు, ఏలపాటలు, పదములు మున్నగునవి పెక్కులుగలవు. కేవలము భాష యందేగాక ఛందస్సునందు నవి విలక్షణమార్గముల నడచినవి.

ఈ గ్రంథమున భాషాలక్షణములనువ్యాసమున గ్రంథకర్తలు తమ వాదానుసారము ద్రవిడభాష లేకకుటుంబజనితములని నిరూపించుటకు పెక్కు యుపపత్తుల నిచ్చియున్నారు. ద్రవిడభాషావిశేష లక్షణములు సోదాహరణముగ నిందు నిరూపింపఁబడినవి. వీరితో నేకీభవింపని ప్రాకృతజన్యవాదులు సైతమిందలి విషయముల బాగుగ గమనించి తమ తమ సిద్ధాంతముల బలాబలములను విమర్శించుకొన వలసియున్నది. సారస్వతలక్షణములు, ఛందస్సాహిత్యరీతులు మున్నగు నితరవ్యాసముల జాను తెనుఁగున గల ద్విపదలు, పాటలు మున్నగు వాని ప్రత్యేకత చర్చింపఁబడినది. కేవలము మాత్రాగణబద్ధములగు గేయములు సంస్కృతాదిభాషలయందును కొన్నిగలవు. శ్రీరామ కృష్ణయ్యగారు చిరకాలపరిశోధనాఫలితముగ భాషాస్వరూపమును గూర్చి వ్రాసిన విషయము లమూల్యములు. అందలి గుణదోషనిర్ణయమునకు భాషాస్వరూపవేత్తలే ప్రమాణము.

# అనంతుని ప్రశస్తి

(విద్వాన్ రావూరి దొరస్వామిశర్మకవి)

అనంతామాత్యుఁడు పంచమవేదమైన భారతము దెనుంగు బాస నభిరామముగా రచియించినట్టి యున్నతచరితుండు తిక్కనకవి నాయకుఁడాదట మెచ్చి భవ్యభారతీయశుఁ బేరుగన్న కవిరత్నము. బయ్యనమంత్రికి ముమ్మనుమఁడు.

అనంతుని ఛందోదర్పణము తదితర కృతులకన్న నాంధ్రవాఙ్మయమున నెక్కువ వన్నెకెక్కినది. ఇక్కవి తరువాతి లాక్షణికులెల్లరచేఁ బేర్కొనఁబడియె. చిత్రకవి పెద్దన 'త్ర్యక్షవరప్రసాద కవితాఢ్యుని వేములవాడ భీము నయ్యక్షరలక్షణ ప్రతిభ క్రొవ్విస్ఫుర దవంతు ననంతుని' వని తనసర్వలక్షణసారసంగ్రహమున లాక్షణిక కవిస్తుతి పద్యమునఁ బేర్కొనియె

మఱియుఁ బెద్దన యితనిఛందమునే చాలవఱకాధారముగాఁ గొని గ్రంథము రచించె. ముద్దరాజు రామన కవిజనసంజీవనిలో సఖండాఖండబిందుప్రఘట్టమున ననంతుని మతమును విమర్శించెను. ఇంక నేయే కవుల ననంతుని బేర్కొనెనో ప్రస్తుత ముద్రిత కవిసంజీవని యసమగ్రమగుటచేఁ జెప్పవీలులేదు. సులక్షణసారములో లింగమగుంట తిమ్మకవి యనంతుని ఛందములోని యనేకపద్యములు గ్రహించెనని కవుల చరిత్రలో వ్రాయబడియున్నది. ఇది యముద్రిత సులక్షణసారవిషయము. ప్రస్తుత ప్రచారములోనున్న ముద్రిత సులక్షణసారమున రమారమి 40 పద్యము లనంతుని ఛందములోనివి యెత్తి వ్రాయఁబడియున్నవి. ఇవ్విషయము నారచించిన సులక్షణసార విమర్శలో స్పష్టముగా నిర్దేశింపఁబడియున్నది.

అప్పకవీయమున ఛందోదర్పణ పద్యములు పది గైకొనఁబడి యున్నవి. (చూ. అప్పకవీయములోని యుదాహృత గ్రంథముల పట్టిక). అందేమఱి పూర్వగ్రంథనామ సంగ్రహమున ననంతుని ఛందము పేర్కొనఁబడియె. పంచాశద్వర్ణనిర్ణయసందర్భమున ననంత మతము ఖండింపఁబడియున్నది. భీమన పడిచెప్పె ననంతామాత్యుండు చేసెవెనుక యతులిరువదినాల్గని యతిపరిచ్ఛేదాది యందుఁ గలదు. వెండియుఁ బద్యపరిచ్ఛేదాదియందు హరభక్తుండగు భీమసత్కవి ననంతామాత్యునిం బెద్దసద్యతినిం దాతనఁ గాచిరాజు బసవప్పన్ భైరవున్ శ్రీధరున్ బరమోత్సాహముతో మదిం దలంచి చెప్పంబూనితిన్ వారిచేత రచింపబడినట్టి ఛందముల చందంబెల్ల నందంబుగా" నను పద్యమున ననంతుఁడు స్తుతింపబడియె.

సర్వలక్షణసార సంగ్రహకర్త కూచిమంచి తిమ్మకవి యనంతుని యర్ధబిందు ప్రాసపద్యమును జర్చించియున్నాఁడు. మఱి యందే యొకచో భోజరాజీయ పద్యము స్వీకరించెను.

కస్తూరిరంగకవి యానందరంగరాట్ఛందమున నప్పకవిని పేర్కొనఁడయ్యెఁగాని యనంతునిఁ బేర్కొని, యతనిఛందములోని పద్యములఁ బెక్కింటి నుదాహరించె "చనునుత్తమ గండాధర్వణ హానుమదనంతనకవి రాఘసజయ దేవనుత శ్రీధరగోకర్ణ నీలకంఠాది భీమనచ్ఛందంబుల్" అను పద్యములో దశవిధచ్ఛందంబులం దనంతచ్ఛంద మొకటిగాఁ బరిగణింపఁబడియున్నది. వెండియు ననంతచ్ఛందమున నిరువదినాల్గు యతులున్నట్లు, ఆర్యాగీత్యాదులు చెప్పఁబడినట్లు పేర్కొనఁబడియె. రంగకవి ఛందోదర్పణమునుండి ౮౩ పద్యములు గ్రహించియున్నాఁడు. అనంతచ్ఛందములో నివిగా నందుఁ బేర్కొనఁబడిన యీ క్రింది నాల్గు పద్యములు ప్రస్తుత ముద్రిత చ్ఛందోదర్పణమునఁ గానరావు.

(1) ఇత్యాదిత్యజ లను నిలవధ్గోముఖములు (ర౦X–2–184)

(2) మీఁదిముఖములైన మిడింబుంచు (ర౦X–2-185)

(3) పద్మాసమానయగు (ర౦X–3–110)

(4) కృష్ణుఁ డిచ్చె నాలుగేసి కోకలు (ర౦X–3–259)

మొదటి రెండు పద్యములలోని విషయము పరికింప ఛందోదర్పణమున నవియుండవని స్పష్టమయ్యెను. మూఁడవ పద్యము కథా సందర్భమున నేదో కావ్యమునకుఁ జేరినదిగాఁ దోఁచెడి. ఆపద్యము పూర్తిగ క్రింద రచించెద.

క. పద్మాసమానయగు మన
పద్మావతిఁ జూచి ధరణిపాలక సుతుఁడు
ద్యన్మోదంబునఁ దనముఖ
పద్మము నలరించెననుచుఁ బరిజనులలరన్.

ఈపద్యత్రయమే గ్రంథస్థములో? నాల్గవది కావ్యచింతామణిలోనిదని యప్పకవి చెప్పెను.

రాఘవపాండవీయవ్యాఖ్యలో 'ప్రథమాంత విభక్తులపై' అను ననంతచ్ఛందః పద్యమును రెండుచోట్లను, పోణిమిశ్రమునకు లక్షణముగా 'తీవతీఁగయను' చను పద్యమును ముదరాజు పెదరామన యుదాహరించెను. తీవతీఁగయను పద్యము నేఁటి ఛందోదర్పణమున లేదు. ఆపద్యము శైలియు కృష్ణసంబోధనము పరికింప ననంతుని పద్యముగా నుండనగునని తోఁచెడి. అట్లున్న జతుర్థాశ్వాసమున వ్యాకరణభాగములో నుండును. చిత్రకవి యనంతన 'ప్రథమాంత విభక్తులపై' నను పద్యమును దన హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్యలో నుదాహరించె.

మఱికొందఱు కవులు తమ కృతులలో నినసినుతించిరి. చారు చంద్రోదయకర్త చెన్నమరాజు 'అధికలక్షణసంపన్నులై తనరు భైరవుననంతు భీమునిఁ బ్రణుతిచేసి' యని వ్రాసెను.

'నన్నయభట్టు భీమన ననంతు నథర్వణుఁ దిక్కహోత్రి' యని కవిస్తుతియం దభ్యాత్మరామాయణమునఁ గాణాద పెద్దన పేర్కొనెను. ఇంక నెందఱనంతునిం జెప్పినారో! శ్రీనాథుఁడు, పోతన, నిశ్శంక కొమ్మన, మడికిసింగన, జక్కన, గౌరన మున్నగు కవులు మనయనంతునికి సమకాలికులు. అనంతామాత్యుఁడు లాక్షణికుఁడు ప్రబంధకవియునై విశ్వవినుతికిఁ బాత్రుఁడైన యజరామరకీర్తిశరీరుఁడు.

—ఛందోదర్పణోపోద్ఘాతపరామర్శనము—

శ్రీ గిడుగు వేంకటసీతాపతిగారు తమ యుపోద్ఘాతమునఁ జర్చించిన విషయములు గొన్నిటితో నామతం బేకీభవింపకున్నది. ఆయంశములను నామతభిన్నతకుఁ గారణములను గ్రిందఁదెలిపెదను.

(1) సీతాపతిగారిట్లు వ్రాసిరి "అనంతుఁడు భీమకవినిగాని కవిజనాశ్రయమునుగాని ఎరిగిఉన్నట్లు కనబడదు. అనంతుని ఛందోదర్పణమును ఎదుటనుంచుకొని అప్పకవి కొన్ని వృత్తములకు లక్ష్యములు వ్రాసినట్లు స్పష్టముగా కనిపించుచున్నది...... ఈలాగున అనంతుడు కవిజనాశ్రయము ఎదుటనుంచుకొని తనఛందోదర్పణమును వ్రాసియుండునేమో అని ఎంత పరిశీలించిచూచినను పద్యములలో పోలిక ఎక్కడనయినను కనబడలేదు" (6–7 పుట)

భీమనానంతనల పద్యములనుఁ బోలికలున్నవని యీక్రింది పద్యములవలన స్పష్టపడును:—

క॥ హృద్యానవద్యకావ్యము
గద్యము పద్యమని చెప్పఁగా ద్వివిధమగున్
గద్యంబ పాదపదనిక
రద్యోతిత నవరసార్థరచనలఁ జెల్లున్.

క. నాలుగు పాదంబులచే
నాలుగు ప్రావళ్లు గూడినం బద్యము

పద్యావళియు నిరుదెఱంగె చెను
నోలిని వృత్తములు జాతులో...రం

క. కమనీయ వృత్తములు గణ
సమక నిబద్ధములు శేషజాతులు మాత్రా
సమక నిబద్ధములగు నొ
కట-మాత్రి లఘువై ద్వమాత్రికము గురువయ్యెన్.
(భీమనచ్ఛందము-సంజ్ఞాధికారము)

క. హృద్యంబుగఁ గవితచందమేర్పడఁ గృష్ణా.

గీ. వరఁగుఁ గవిత గద్యపద్యంబులన పాద
కల్పనంబువలదు గద్యమునకు
పాదనియతినొప్పఁ బద్యంబు...వియు వృ
త్తములు జాతులనఁగ నమరుఁ గృష్ణ.

క. వృత్తంబులు గణబద్ధము
లుత్తమమగు జాతులెల్ల నొనరఁగ మాత్రా
యుత్తంబులు లఘువగుఁ బురు,
షోత్తమ యొకమాత్ర గురువునొనవు ద్విమాత్రన్.
(అనంత-1ఆ-5, 6, 7 పద్య)

గీ. మొదల నడుమను దుదగురు వొదవెనేని
భజస లగునట్లు లఘువును బరఁగెనేని
యరతలగు నట్లు మాఁడేసి గురువులున్న
లఘువులున్నను మగణంబు నగణమగును॥
(భీమ-సంజ్ఞ-16-పుట క్రింది పాఠము.)

గీ॥ గురులఘువులోలి మూఁడేసి కూర్చిన మన
లాది మధ్యావసానంబులందు గురువు
లొందు భజసలు లఘువు లొందిన యరత
లనఁగ నయ్యష్టగణము లొప్పుచు నుండు. (అనంత 2-12)

క. కరువడి గురు లఘు లఘు గురు,
గురులఘువులు గల పదాదులగున్ మఱి దీర్ఘ
స్వరయుక్తమై యున్నను గా
క్షరములు తద్గణము రెండుగా నెన్నఁబడున్. (భీమ-సం-21)

క. గురువును లఘువును లఘువును,
గురువును నాలుగు గలవు గురులఘు సంజ్ఞల్
వరుసను గగ లల గణములు,
కర యుగ వర్ణములు ద్విగుణమై యొప్పుహరీ. (అనంత-1-15)

(భీమన చెప్పిన గురు లఘు పునరుక్తిని దీసివేసి గలలు గురు లఘు సంజ్ఞలని యనంతుఁడు మార్చి వ్రాసె.)

గీ. జాకు వడిచెల్లు రత్నకంకణ మనంగ
ఙాకు వడిచెల్లు బర్హి పింఛంబనంగ
ణాకు వడిచెల్లుఁ గనకమండపమనంగ
నాకు వడిచెల్లు దివ్యగంధంబనంగ
మాకు వడిచెల్లు విజిత శంబరుఁడనంగ. (భీమ-సం-69)

ణాకు నిట నాల్గు చెల్లుఁ బాండవసభాయు
నాకు నిటనాల్గు చెల్లుఁ గందర్పజనక.
మాకు నిట నాల్గుచెల్లు సంపదలరాజ. (అనంత-1-116.)

(ఞా, ఙా ల తోడి శబ్దములు లేమింజేసి యనంతుఁడవి మానెను.)

క. ధర ఞ ఙ లను నీ రెండ
క్షరములు విశ్వ యతి లేదు శబ్దములు గొందఱు
మరలవములను నేన
క్షరములు తమ తమకె ళ్లు కమలాధీశా. (భీమ-సం-72.

క. ధర నెక్కటి వల్లె తగు శరమాలసలు (అనంత-1-118.)

(యతిర మాలి:వ యిత్యాది భీమన పాదములుగలవు గాని పై పాదమే పెద్దనానంతాదు లాహరించుటచే నదియే గ్రాహ్యము.)

వినయముం,బు నయముం,బు నయు, జ్ఞనకున్. (భీమ-వృత్త-7.)
వినయముం, బొనరిం, తునవం, తునకున్. (అనంత-2-13.)

ఉద్యన్మాత్రాగాయుక్తంబైనన్,
విద్యున్మాలావృత్తంబయ్యెన్. (భీమ-వృ-25.)

మాద్యద్భక్తి న్మాత్రాగాయుక్తిన్,
విద్యున్మాలా వృత్త బొప్పున్. (అనంత-2-22.)

చిత్రజోపమ బాలముఖి
వృత్తమయ్యెను రనసలన్. (భీమ-వృ-82)

చిత్రజాతుని గురునికై ...
పొత్తుగా బాలముఖమగున్. (అనం-2-24)

మత్తావృత్తంబగు మభసంబు
ద్వ్యత్రేజ స్వీగయుతముగాంగన్. (భీ-వృ-87)

మొత్తంబారున్ మభసములు నితో్య
డాత్తంబై సస్ఫురితగకారా
మత్తావృత్తంబగు మహింగృష్ణా. (అనంత-2-27)

నందితప్రియరసంబుపై రవం
బొంది వచ్చిన రథోద్ధతంబగున్. (భీమ-వృత్త-44)

నందగోపవరనందనున్ రమా
నందుఁ బ్రస్తుతియొనర్చి షష్యతిన్
అందమై రనరవావ్యయంబు లిం
పొందఁజెప్పిన రథోద్ధతంబగున్ (అనంత-2-37)

సమూజ్జ్వలాంగా జతజంబురేఫతో
సమర్ప వంశస్థ సమాహ్వయంబగున్.

(భీమ-వృత్త-54)

నమోనమో దేవజనార్దనాయతే,...రమించు వంశస్థ వి
రామముద్రిలన్, సమంచితంబై జతజంబురేఫయున్ అనం-2-499
జలరుహావక్త్రి) నజాయగణంబుల్, వెలయఁగ దోదకవృత్తమం
జెప్పన్ (భీమ-వృత్త-56)

దెలఁగి నజాయఁ జెందిన ... వెలయఁగ దోదకవృత్తరీతిన్.

(అనంత-2-46)

అనంగసన్నిభ రుచిరాహ్వయంబగున్
ఘనంబుగా జభస జగంబులందినన్
అనంగకోటి విలసదంగ వైభవున్,... ...
కనన్ జభంబులు సజగాసుసంగతిన్ (అనంత-2-
సారంబుగాఁ దభజజంబు వసంతరాజా
కారా వసంతతిలకంబగు గాయుతంబై (భీ-వృ-
ధీరోత్తముల్ గిరియతిన్ దభజాగగల్ పెం
పార న్వసంతతిలకాఖ్య మొనర్తురొప్పన్ (అనం-2-68)
ననరసలగముల్ పెనంగిన సద్యతో
ధన వినుమపరాజితంబగు రేచనా (భీ-వృ-70)
చనునననయుతమై రసంబు లగంబులై
తనరఁగ నపరాజితం బహిరాద్యతిన్ (అనం-2-66)
శ్రీనివాస రనభావలిఁ జెంది గగంబుల్
భాసితంబుగ నొడంబడి భాసితమయ్యెన్ (భీ-వృ-74)
శ్రీనివాస పురుషోత్తమ సింధువిహారా
భాసితంబు రనభాగఁబొందిగ యుక్తిన్ (అనం-2-

క. ఏను వసతి వసతి దప్పక
వసముసఁ గావిప్ప వచ్చివచ్చి
వసఁగను నభీక్ష్ణ మిమ్మ్రి
మ్మ్రానఁ గాఁగృతులన్ గ్రిను

(భీమ-దోషాధికార-7)

సీ. ఈ వెన్నముచ్చు దానిల్లిల్లు దప్పక
చొచ్చుఁ బామ్మరవ పిన్నసాంపుమిగుల
ఇటు వచ్చివచ్చి నీవేలనిల్చితి
నాథత్వంబు
కౌరికి నిమ్మ్రపందనఁ
బు ప

(అనంత-4-10)

క. పరఁగ నికారోపరి త
త్స్వరము యుకారంబుతోడ నద్వితముగా న
వ్వారి యుల్లిది యుట్లన కె
వ్వారి దిల్లిట్లనఁగుసంధివర్గంబయ్యెన్.

క. స్వరగణముగూడి కృతిఁ త
త్స్వరమైన నకార మొందివ్రాయై చనఁగా
దొరపివ్వు నజూఁడు ననరేఁచు
దొరవి వున్నజూఁడు ననిన దుస్సాధితముగున్.

(భీమ-దోష-14-15)

క. మొదల నికారముపై న
చ్చొదవి యుకారముగ దీరయొంత యుండిది యు
ట్లొదవె ననక దీనొదటుఁ
డిదెట్లొదవె ననఁగుసంధు లినశశినయునా.

క. క్షితి స్వరసంధి నకారం
బతిశయముగ నతఁడు నతఁను ననుచో నతఁడు
న్నతఁడు నని యూఁది పలికిన
నతతము దుస్సంధియండ్రు సత్కవులు హరీ (అనంత-౩-19-

క. వెలయఁగఁ జెప్పా కవిలుగాని
తలరమ్ములు చేతఁబట్టి యుంగఁజాఁడు వీరా

దొలమెలయఁగ ననిఁగాని దోషంబయ్యెన్.

క. ఋతఁడు నృపస్య నగరం
యాతియునంజనిన సుప్తిజంతంబులు కృ
త్యాతిర్యాజత్యాయన
బ్యాఁతిగ నీక్రియలు బొదవు భాషాకృతులన్.

క. వితతసుకవివాక్యంబన
గతమై కవరూపసంతి కావ్యంబనిన
తత్కృతి నీక్రియఁబెట్టించిన,
నతిశయమ్మై యుండు సుప్తిజంతంబయ్యెన్.
(భీమ-దోష-23, 24, 25

క. పొలుపుగ పాగాడదండలు,
లలనముడిచినన్ మకారలాంఛనుఁ డొందెన్
జలహావఁ జెప్పాతివిల్లన
నలనిడుదలఁ గాకుదోషమండ్రు మకుందా.

క. సత్యము సస్పృహస్యపకం
గత్యాయూతఁసు నిహాత్మ కంటకులకు
భూత్యామెలఁగేసు నన్నఁగ
విత్యావిదులు దుష్ప్రయోగవిధమండ్రు హరీ.

క. నిక్కముగు సుప్రయోగము
దిక్కృతదురితాయ భగవతేస్తు నమోయం
చక్కడనీకను నమరులు
మొక్కుదురని తెల్పుబంతములఁ గూర్పహరీ.
(అనంత-4-అ-24, 26, 28 ప)

క. అని యిట్టివిశదదోషము
లనఁజనఁ గృతినివియ పెండి యతిశయతరమై
చనుఁ గొన్నియెడల ధీరుల
మనములరఁగఁ జెప్పిరేని మల్లియరేచా.
(భీమ-దోష-84)

క. ఇట్టివి దశదోషములనఁ
బట్టగుఁ గృతులందునివియ భాసురముగఁ జే
పట్టుదురు ధీరులొక్కొక
పట్టున దండనమ్ములలరఁ బలికనఁగృష్ణా.
(అనంత-4-84)

ఈపై పద్యంబులయందు సమపద ప్రయోగము, సమప్రావ ప్రారంభణము, సమవిషయచ్ఛాయ, సమానుకరణము భీమనానంతుల ఛందములందు సమప్రకరణంబులం జక్కఁగాఁ బొడకట్టుచున్నవి గదా! ఇంకనిట్లే సూక్ష్మముగా విచారించినకొలఁది తోఁచగలవు.

మఱియు మానినీకవిరాజవిరాజితములకు మూఁడెడల వళులు, వళ్ళపేళ్ళు, ప్రాసభేదములు, సీసభేదములు మున్నగు విషయములందు గొంతవఱకుఁ గవిజనాశ్రయమును జూచియే యనంతుఁడు వ్రాసికొని యున్నాఁడని యాయుభయ గ్రంథముల నొకచోటఁ బెట్టుకొనిచూచిన వారికి స్పష్టపడఁగలదు. అందుఁ గొన్నిఁటికి సూచనః— స్వరవర్గ ప్రాది బిందు సంయుక్త ఎక్కటిపోలిక సరసయతుల పేరులవట్లే భీమనంజూచి

యనంతుఁడు గ్రహించి మఱికొన్ని యెక్కువగాఁ జేర్చియుండును. భీమన చెప్పిన షడ్విధశబ్దాలంకార ప్రాసముల ననంతుఁడు చెప్పె. అందు భీమన సుకరప్రాసమును విడిచిపెట్టి యనంతుఁడు చతుష్ప్రాసము క్రొత్తగాఁ జెప్పె.

దుష్కర ప్రాసములోని యాభయగ్రంథముల విసర్గప్రాస సామ్యముం దిలకింపుఁడు—

స్వఃకాంతా సమరోపాపిదు, రఃకృతరతిచిహ్నదుష్కరప్రాసంబు (భీమ)
దోఃకీలితమణికోటకము, రఃకలితరమాభిరామరంజిత (అనం) సీసములు-

కవిజనాశ్రయమున సమ, విషమ, అవకలి, ప్రాస, అక్కిలిప్రాస, వడి, అక్కిలివడి సీసములను సప్తభేదములుఁగలవు. కావ్యాలంకార చూడామణిలో భీమన చెప్పినవి మాత్రమే కలవు. అనంతుఁడు భీమన రచిత సీససప్తకముతో మఱి మూఁడుక్రొత్తభేదములు కల్పించి మొత్తము పదివిధములుగా వ్రాసె. అవి సర్వతః ప్రాస, వృత్తప్రాస, సర్వలఘుసీసములు. భీమన పెద్దన కాలములకు ముందున్న గ్రంథములందు లేక వారి యనంతరకాలీనుఁడగు బమ్మెరపోతన కృతియందుంటచే సర్వతః ప్రాస సర్వలఘు సీసలక్షణము లనంతుఁడు చెప్పినాఁడని యూహింపనగును. భీమన లక్షణమును బోలియున్న యనంతుని విషమ సీసలక్షణము చూడుఁడు.

ఊహ నేడుగణములుగను నొనర నగణమొండెఁ ద
త్స్నేహ చర్యమొండె గురుక సహితముగ నొనర్ప ను
త్సాహమయ్యె నిదియును బ్రశస్తముగ నొనర్పను
త్సహితోరుచరిత యాదియు విషమ సీసమై చనున్.
బ్రాలువట్టు లీలనోలిని నిలిపి యా
గణముకాని యొండు గణమునిడక
యభిమతార్థ రచన యభినుత మైయుండఁ
జెప్ప విషమ సీసమొప్పుఁ గృతుల (భీమన)

సాహచర్యమమర సప్తపవిత్ర వర్గమును సహా
త్సాహమొక్క నొక్కగురుఁడు చరణములు భజింపఁగా
నీహితప్రదాన లీలలెసఁగు కమఠమూర్తి సు
త్సాహరీతులుల్లసిల్ల సంస్తుతింతు రమ్యతుర
ప్రాసములును వడులు భాసురంబుగ నిట్లు
విలసితముగ నాటవెలఁదియందు
నుత్సుకత నొనర్చి యుత్సాహమదినిల్పు
విషమసీస నుమరు విపథిశయన (అనంత)

భీమనానంత చ్ఛందంబులందిట్టి పోలికలు కనుపించు ననిగాఁబోడ గట్టుకుండ శ్రీసీతాపతిగారట్లు నుడువుట యెంతయు వింతగానున్నదని చెప్పక తప్పదుగదా! సీతాపతిగారు చూపిన యానందాప్పకవుల పోలిక పద్యములు —

అజశివ చక్రి నిరంతరార్చిత పద్మయుగున్
భుజగకులాధిపతుల్పొఁ బూని నుతింపఁగా
సజయుతినొందె సజాభరార్చితమై చనున్
ఋజువగు నుర్వి మనోజ్ఞ ఋష్యనురాగమై (అనంత)
అజమృడ వాసవసంతతార్చిత పాదపం
కజయుగళున్ హరి నిర్వికారు మనోజ్ఞ నా
ఋజువగు వృత్తమువందుఁ బ్రీతినుతింపఁగా
సజజభరంబులు పొల్పువచ్చిన దిగ్యతిన్ (అప్పకవి)

ఇట్టిపోలికలు పైనా చూపిన భీమనానంతుల పద్యములలో లేవా చదువరులే నిర్ణయించుకొందురుగాక. మీఁదు మిక్కిలి పై మనోజ్ఞ వృత్తము ముద్రిత భీమనచ్ఛందమున వృత్తాధికారమునఁ గానరాదు గాని ప్రక్షిప్త పద్యములలో నిదొకటిగా నిరూపఁబడియున్నది. అనవ్య

యున్నది. పదిసీసమునకు లక్ష్యము కవిజనాశ్రయములో లేదఁట. 'వృత్తంబునకువలె' యను పద్యమే సమసీసమునకు యున్నది. ఇది యవకలి సీసమునకు లక్ష్యముగా నున్నదని వారు వ్రాసిరి. "అవకలికి నిట్లు (అర్ధమార్గమునకు) ప్రాసంబు (పేత్ర) లతికయిల్లు" యనికదా యీపద్య మందే లక్షణము చెప్పఁబడియున్నది. అలక్షణ మీపద్యమున నించుకయు నన్వయింపదే.

భీమన వృత్త ప్రాససీస నామమును చేర్కొనలేదనియు సమసీసమునకు లక్ష్యము రచించినాఁడనియు నేర్పడినది. "సీసభేదములను చేర్కొన్న గద్యలో నీ రెండుభేదములు చేర్కొనలేదు" అని సీతాపతిగారు. ఈరెండనఁగా వృత్తప్రాస సమసీసములు.

వృత్త బునకువలెనను పద్యమున వృత్తప్రాససీసమును చేర్కొనియున్నఁ గదా భీమన మఱి గద్యలో దానిం జేర్కొనుట ? ఇఁక సమసీసము — భీమన సీసంబులు విషమ సమసీసంబులని రెండు తెలుఁగులయ్యెననియు, మఱి సమసీసములు నేను దెలుఁగులయ్యెననియు గద్యములో రచించె. ఇట్లగుటచే సమసీసమునొక భేదమని గ్రహింపవలయు. విషమసీసములు రెండు, సమమున నైదు క్రొత్తభేదములు కలిపిన నేడగు సీస సామాన్యలక్షణము తొలుత రచింపఁబడియున్నది. అదియే సమసీస లక్షణము. కవిజనాశ్రయ పాఠములో నేది కవి రచితమో నిశ్చయముగాఁ జెప్ప వీలులేదు. అందే వృత్తంబునకు వలె యనుపద్యము పిదప నొక ప్రతిలో "ఈ క్రమసీసము, పదిసీసము, అక్కిలి పడి సీసము, అవకలి సీసము, సమసీసము అనఁగా నాలు తెలుఁగులయ్యె" ననియుఁ బిదప విషమ సీసపద్య లక్షణముగలదనియు 67 పుట యడుగున ముద్రితమైయున్నది. ఈగద్యము న్యాయాహారుఁ గేలూఁత యొసఁగుచున్నదిగదా!

'వృత్తంబునకు వలె' నను పద్యమున ప్రాస, అక్కలిప్రాస, వడి, అక్కలివడి, అవకలి, పదు, విసమను మూలేదును, 'అగు సమప్రాస' మను పద్యమున సమప్రాస, వృత్తప్రాస, సర్వతఃప్రాసములు మూఁడును, సర్వలఘు శ్లోకంబును, జేర్ప 11 సీసములగును. అనంతుఁడు పేర్కొన్నవి 10 సీసములే కదా. అనంతుని పద్యములను బట్టి చూచిన ప్రాససీస వృత్తప్రాస సీసములు రెండొకటియేయని తెలియుచున్నది. "వృత్తంబునకువలె నెలయు నాల్గడుగులఁ బ్రాసముల్నిల్పి విరతు లనుపఁబ్రాస సీసములగు; నాలుగింటఁ (ప్రాసములు) వృత్త ప్రాస నామసీసము." ఛందోదర్పణముద్రితప్రతిలోఁ బ్రాస వృత్త ప్రాస సీసములున్నవి, ప్రాససీసమున 6 చరణములందుఁ బ్రాస మున్నది గాన 'అగు సమప్రాససీస మాఱడుగులందు' అను ననంతుని లక్షణమును బట్టి యది సమప్రాససీసమే యగు. అత్తఱిఁ బ్రాససీసము పేరితోఁ బ్రత్యేక పద్యము లేదనవలసి వచ్చు. కాన నీపద్యము అనంతునిది కాదనవలసియున్నది. దీనికిఁ బాఠాంతరము లేవేని కలవో! సీతాపతిగారుపోద్ఘాతమునఁ బ్రాససీస మనుదానినే సమప్రాస సీసమని సీసముల వివరణపట్టికలో (పు-88) వ్రాసియున్నారు. అప్పుడు 'వృత్తంబునకు......ప్రాస సీస ములగు' అనుభాగము వ్యర్థమే యగునుగదా!

భీమన యొకసీసము రెండు సీసభేదములకు లక్ష్యములుగా నొసఁగెను. పాదంబు నాలుగు పాదములఁ గాఁజేసి (భీమ-జాతి-15) యను పద్యమవకలి సీసమునకు మాత్రము లక్ష్యముగా ముద్రింపబడి యున్నదిగాని యందు 'నిప్పాట సమసీసములు చెప్పఁడయదంగ' వని యు 'అవకలి సీసమిప్పాటఁ జెప్పఁబడిచె' నని యుఁ గలవుగాన సమావ కలి సీసద్వయంబున కదిలక్ష్యమని తెలియుచున్నది. భీమన మతమున సమసీసమునొక భేదమే. కాన విస్తరంబుతోఁ బనిలేదు. 'వృత్తంబు

నకు వలె' అను పద్యమందలి ప్రాసాక్షరమె ప్రాససీసము నడి యక్కిలివడి సీసములు, అవకలి సమసీసముల లక్ష్యములు లొకటికొక టొకటి చెప్పఁబడినవి. అన్నే లక్ష్యములందును మూఁడు జాతులు క్రమము దప్పక కూర్పఁబడియున్నవి. కావ్యాలంకార చూడామణిలోను భీమన ప్రోక్తసప్తవిధ సీసములేయున్నవి. ఒక్కొక్క విధమునకు నొక్కొక్క సీస లక్ష్యమందున్నను భీమన జాతులలోఁగల పూర్వాపర సీసభేదముల క్రమము దప్పక యుండియున్నది. ఈవిషయములన్నియుఁ జూడఁగా వృత్తంబున కను పద్యము భీమనదేయనియు, ఛందోదర్పణములోనిది గ్రహింపఁబడినదనియు నూహింపవచ్చు. అనంతుఁడా పద్యముతో మఱి రెండు పద్యములు చేర్చియుండును. కాకున్న ఛందోదర్పణమున నీపద్యము ప్రక్షిప్తమై దీనికిముందు వెనుక యితర పద్యములుండవలయు నననొప్పదు. ఇఁక నొకటి విచారింపవలయు. వృత్తంబునకువలె నిత్యాది పద్యంబులచే ననంతుఁడు 11 సీసములుచెప్పిన వాఁడగునని పైనిఁజెప్పితి. 10 సీసములే యనంతుఁడు చెప్పినట్లు లక్ష్యములవలనఁ దెలియవలగుచున్నది. 10 సీసములకే యా పద్యార్థమెట్లు సరిపడునో మఱియది భీమన మతమున కెట్లు పొసఁగునో యించుక వివరించెద. "వృత్తంబునకువలె నెలయు నాల్గనుగుల వెసఁ బ్రాసములువిల్చి విరతు లునుపఁబ్రాస సీసంబగు" (భీమన) క్రింద గీతలుగల పదముల యేకవచన ప్రయోగమును గమనింపుడు. వృత్తమువలెఁ ప్రాసముగలది ప్రాససీసమని యర్థము. భీమన మతమున సీసభేదములలోనిది యొకటి. "వృత్తంబులకుఁబోలె వెలయు నాల్గడుగులఁ బ్రాసములిల్పి విరతు లునుపఁ బ్రాససీసములగు." (అనంత) ఇందలి బహువచన ప్రయోగము దీనికి తోడు. సీసములు లుపజాతులు. వీనికి వృత్తనియమము లేదుగదా. అట్లయ్యు వృత్తంబులకువలెఁ బ్రాసయతు లునిచి వ్రాసినఁ బ్రాససీస నామకంబులగును. ఆప్రాస సీసాం

మఱియు నొకేవృత్తలక్షణములు రెండుగ్రంథములందు నొకే ప్రాసములతో వ్రాయఁబడియున్నవి. అందుకొన్ని—

సరసిజము (అనం) మాళిఁబిల్లంగో లోఁచేతన్.

(పెద్ద) చాళుక్యక్ష్మాపాలవరేణ్యా.

క్రౌంచపద (అనం) అంచిత లీలన్మించిన శౌరిన్.

(పెద్ద) అంచిత మయ్యెం గ్రౌంచపదాఖ్యన్.

లయహారి – (అనం)–పదునొకఁడు నగణములు దిసి సగమెనయు
భువి విదితముగ బుధులు పలుకుదురు లయహారిన్.

(పెద్ద) – పదునొకఁడు నగణములుఁ బొదలి సగణము గురువు
మృదుల పదరచనఁదగి యొదవి మితి వ్రాలన్
ముదమొసఁగు సభల నని చదువుదురు కవివరులు
హృదయముఁ జతురతలు గదుర లయహారిన్.

ఇంకను మానినీ కవిరాజవిరాజిత యతులు, సీసభేదములు మున్నగు వానిముందనంతుఁడు పెద్దనంబూది కూడ రచించెనని తోఁచుచున్నది.

(౨) గ్రంథప్రచారము – 'ఇంబు' అనే ప్రయోగమునకు ఆ ఆదర్శము (రాఘవపాండవీయాదర్శవ్యాఖ్య) లోనే "ఇంబడరఁగా భజసనంబులని యనంతుని ఛందఃప్రయోగము" అనికూడా ఉన్నది. ఇది అప్పకవీయములో లయగ్రాహి లక్ష్యలక్షణ పద్యముగా కనిపించుచున్నది; గాని ఛందోదర్పణములో కానరాదు. అయితే అప్పకవి "పదునేడవ శతాబ్దమధ్యమునందుండిన లక్షణవేత్త" అని వీరేశలింగము పంతులుగారు వ్రాసినారుగదా; అప్పకవిపద్యము ముద్దరాజు రామన ఎట్లుదాహరించియుండును? – అని సీతాపతిగారు వ్రాసిరి. (పుట 10)

రాఘవపాండవీయాదర్శములో 'ఇంబడరఁగా భజసనంబు' [illegible] ఇది ఛందోదర్పణమున [illegible]

యథార్థమే. సీతాపతిగారన్నట్లు పాండవీయమున గలదనియు రామన యప్ప కవికిం బూర్వుండగుట నతండుదాహరించుట సరిపడదనియు నుడివిరి. కాని యీపద్యభాగము భీమనచ్ఛందమునంగలదు.

భీమన – "ఇంబడరంగా భజనసంబులు కడన్ భజనసంబులు
భకారము నొడంబడ లయుగాగ్రహింబరంగంజెప్పు"
(వృత్తాధికారము. 127)

అప్పకవి – "ఇంబడరంగా భజనసంబుల తుద న్భజనసంబుల
పదంపడి భయంబులు లయుగాగ్రహింబరంగంబాగ్రసవిరమంబులు"
(4 ఆశ్వాసము)

రాఘవపాండవీయాదర్శములో "ఇంబడరంగా భజనసంబు" లను వఱకే యుండుటచే భీమనాప్పకవుల ఛందములయందది సమానము కావుటంజేసి యుభయగ్రంథములలో దేనిని బేర్కొన్నను బాధకములేదు. రామన తనకుం బూర్వుండగు భీమనపద్యము దాహరించెననుట సమంజసముగును గాని యనవసరముగా నప్పకవీయము లోనిదని చెప్పి కాలము సరిపడక తికమకలు పడనేల ?

వీరేశలింగము – ముద్దరాజు రామన్నకుం గట్టపెట్టినారు వీరేశలింగము పంతులు. అట్లువ్రాసికొన్నారు సీతాపతిగారు. "ప్రథమాంత విభక్తుల పై నను పద్యమునే 16 వ శతాబ్దాంతమున నుండినవాడని వీరేశలింగము పంతులుగారు చెప్పిన ముద్దరాజు రామన్న రాఘవ పాండవీయాదర్శములో రెండుచోట్ల ఉదాహరించినాడు" (పు-9)

సూక్ష్మముగాం బరిశీలించిన సిద్ధాంతప్పని తెలియంగలదు రాఘవ పాండవీయాదర్శగద్య "శ్రీమన్మదన గోపాల కృపాకటాక్ష సం ప్రాప్త సార సారస్వత సంపదానంద సందర్శకలక్షీర పారావార తారకాసుధాధామ ముద్దరాజ రామనామాత్య ప్రణీతంబగు

ప్రణీతం" బనియు, కవిజనసంజీవని గద్య "శ్రీమన్మదన గోపాల కృపాకటాక్షప్రసాదాసాదిత సకల సంవిధానానంద సంపదభిలాలంకార ముద్దరాజు గణపయామాత్య పుత్త్ర పెదరామ సచివ సోదర రామభద్ర ప్రణీతం" బనియుఁగలవు. ఆదర్శకర్త ముద్దరాజు పెద రామయ్య; కవిజనసంజీవని కర్త పెదరామయ్య సోదరుఁడు రామ భద్రుఁడు మఱియుఁ గవిసంజీవని యువతారికలో నిట్లుగలదు.

(సీ-గీ) అనుచు బుధులెల్ల వినుతింప గలరు ముద్ద
రాజు గణపయ్య గర్భవారాశి పూర్ణ
చంద్ర పెదరామ చినరామ సచివమణుల
కనుఁగుఁ దమ్ముఁడ రామభద్రాఖ్య కవిని.

(ప్రథమ తరంగము)

ముద్దరాజు గణపయామాత్యునకుఁ బెదరామయ్య, చినరా మయ్య, రామభద్రుఁడను సుతత్రయముండెను. కవిజన సంజీవని కర్త కడగొట్టు కొడుకు; ఆదర్శకర్త జ్యేష్ఠుఁడు. ఇట్లుండ జ్యేష్ఠకనిష్ఠ సోదరులిర్వురు నొక్కరేయని పైనారభిప్రాయపడుట ప్రమాదవశము ననేయని విదితమగుచున్నది. ఇది మునుపు ప్రస్తుతముయ్యుఁ గవుల పేరు లందుఁ బొరపాటు తటస్థించినది గాన దానిందెలుపుట వాఙ్మయచరిత్ర సంశోధకులకు మేలునేఁ తయగుఁ గదాయని తెలిపినాఁడ.

ఆభాగముననే సీతాపతిగారిట్లు వ్రాసిరి. "చిత్రకవి అనంతయ గారి హరిశ్చంద్రనలోపాఖ్యానప్రకాశికలో ద్వితీయాశ్వాసాంత మున (వావిళ్ళప్రతి) నరుకుట ప్రత్తినాఖ్యలో 'కొలిశాద నాదిదేవు (అప్పకవీయము)' అని (లక్షణము) ఉన్నది. ఈగ్రంథము మొదట అచ్చొత్తించిన పూండ్ల రామకృష్ణయ్యగారో పూర్వలేఖకులో అప్ప కవియు పద్యమును ఈనాఖ్యానములో దూర్చి ఉండవలెను......"

పూండ్ల రామకృష్ణయ్యగారి ప్రతులకన్న పూర్వలేఖకులచే భావ్యమని వ్రాతలందు అదియును గాదు క్రొత్తగా చేర్చియుండరు. 'కొలిచెద నంతగోప సుతు' నని యనంతుని ఛందమున నారబ్ధము. అనంతా ప్రతులిర్వుర నర్కుట లక్షణము 'కొలిచెద' అనుపదముతో మొదలు పెట్టఁబడియె. 'కొలిచెద'నని యుండుటచూచి లేఖకులు కాలాదికములఁ జింతింపక తనకువచ్చియున్న యట్టి పద్యమే యనుకొని వ్రాసియుండవచ్చునని తోఁచెడి.

(౮) వళిభేదములు - సంస్కృతయతికిని తెనుఁగువళికిని భేదము కలదు. 'యతిర్విచ్ఛేద సంజ్ఞకః' అనియే నిర్వచనము. తెనుఁగువళి ప్రథమాక్షరమునకు యతిస్థానస్థితాక్షరమునకు మైత్రి గూర్చుట యగును. 'ఆద్యోవళిః' అను సూత్రమునుసరించి 'చరణాద్యక్షరమే వడి' యిత్యాదిగా లాక్షణికులు రచించినను యతి పర్యాయపదములు వడికిని సంబంధించుననియే వారి తాత్పర్యము. యతిపదములకు వారు భేదము చెప్పలేదు. సీతాపతిగారు "వాసవగల మొదలివ్రాయి వడియనఁ బరఁగు" నిత్యాది సందర్భమున వడికి బదులుగా యతివిరతి మొదలైన పర్యాయపదములలో నేదియేదిన్ని వాడకూడదన్నట్లే తోఁచు"నని వ్రాసిరి.

ఆద్యోవళిః సూత్రమునకు నాంధ్రలాక్షణికులు దమయనువాదమున వళీ శబ్దాంబే చెప్పుచున్నను తరువాత మధ్య మధ్య వళియతుల రెంటిని వాడియున్నారు. అప్పకవి "చరణ చరణమున నాద్యక్షరములు వళులయ్యె" నను పద్యము తరువాత "విరతి విశ్రాంతి విశ్రామవిశ్రమములు, శ్రాంతి విరమము విరతి విరామయతులు ననఁగ నివితొమ్మిదియు వళిశాఖ్యలయ్యె"నని వివరించెను.

'పూనినచో నఖండ యతిపొల్పగు' అని భీమనయు, 'నజభజ జారవర్గము దనర్చి దిశాయతి, నేమముగా నడినిల్చిన పెక్కులు' అని

విన్నకోట పెద్దనయు, 'సప్తవింశతియతుల్ సత్కవుల్పవిగొన్న కరణి వళ్ళన్నియుఁ గానరాఁగ' అన చిత్రకవి పెద్దనయు, వళులమరుగణిత రీతి హాయులకు, అనఁగ యతు, లిడనగుఁ గృతులందు" అని ముద్దరాజు రామనయు వళియతుల నేకార్థమునసే పర్యాయములుగా వాడి యున్నారు.

అప్పకవియేకాక మన యనంతమాత్యుఁడును యతివళులు పర్యాయపదములని యే రచించెను. "విరతులు విశ్రాంతులు మఱి విరామములు విశ్రమములు విశ్రామంబుల్, విరమంబులు యతు లనఁగా, విరమణములు నాఁగవళ్లు వెలయు మురారీ (ఛందో 1-77) మఱియుఁ బొలికవడి, ఎక్కటివడి, నిత్యయతి, స్వరయతి, యిత్యాదిగా నుభయశబ్దములు పర్యాయములుగా నుపయుక్తములై యున్నవి. అప్పకవియు యతిప్రకరణమున నుభయమును వాడెఁగాన యతిపర్యాయ పదములు వడికి వాడకూడదను శాసనము నిలువఁ జాలదని నాయభిప్రాయము.

వళ్లభేదములు దెల్పుచోటఁ గావ్యాలంకార చూడామణిలో 12 విధములు కనుపట్టుచున్నవని యున్నది. అవి (1) స్వరజలు (2) వృద్ధివళి (3) వర్గజలు (4) మకారవళి (5) ఇతరేతర వర్గజలు (6) సబిందువర్గజలు (7) ఏకతరయతి (8) ప్రాదియతి (9) ద్వ్యక్షర త్ర్యక్షరపురాక్షరవళి (10) ఆదేశవళి (11) దేశీయవళి (12) మాచనజవరాలు. (వీనికి నుభయయతి యనుట).

12 యతిభేదములు కవిలోకసంజీవని యందును 16 యతులు కావ్యాలంకార చూడామణియందును నున్నట్లు కస్తూరి రంగకవి చెప్పియున్నాఁడు.

"సిద్ధిరాజు అలంకారంబున (కావ్యాలంకార చూడామణి)
యతులు స్వరవర్గ పరస గుణిత విభాగ
బిందు కాకుస్వరాఖండ భిన్నవృద్ధి
దేశ్యములు ప్రాది యొక్కటా దేశములును
బదాఱు."

(రంగరాట్ఛందము-3-10)

ఈగీతము ముద్రిత కావ్యాలంకారమున లేదు. మఱి యీ యతి పేళ్లును భిన్నములుగా నున్నవి. రంగకవి గీతములోని యతులకు ముద్రిత చూడామణిలోని యతులకుం గల పోలికం బరికింతము.

| రంగకవి — చూడామణి. | రంగకవి — చూడామణి |
|---|---|
| (1) స్వరయతి — స్వరజలు | (9) భిన్నయతి — — |
| (2) వర్గయతి — వర్గవళి | (10) వృద్ధియతి - వృద్ధివళి |
| (3) పరసయతి - ఇతరేతరవర్గజలు | (11) దేశ్యయతి - దేశీయవళి |
| (4) గుణితయతి - గుణితస్వరవళి | (12) ప్రాదియతి - ప్రాదివళి |
| (5) విభాగయతి - — | (13) ఎక్కటియతి - ఏకతరవళి |
| (6) బిందుయతి - సబిందువర్గవళి | (14) ఆదేశయతి - ఆదేశవళి |
| (7) కాకుస్వరయతి-ప్లుతాక్షరవళి | (15) పోలికయతి - ముకారవళి |
| (8) అఖండయతి - — | (16) గూఢస్వరయతి - — |

ఇందు విడిపోయిన వానింగూర్చి కొంత వివరణము:—

(5) విభాగయతి — 'ఏసి'తో సంధిగలిసినప్డు దుభయయతి.

(9) భిన్నయతి — ధరించు, ధరియించు అను నించుగాగమ యుక్తరూపంబులందు హల్లునకు వచ్చువకుంగ్రమముగా యతి.

ఇవి రెండు ముద్రితచూడామణిలో లేవు. అనంగా వీనికి సరి యగు యతులు నామాంతరముచేనైనం జెప్పంబడలేదని గ్రహించునది.

(8) అఖండయతి - సంధిగూడిన శబ్దములు నఖండములుగా భావించి యచ్చులు హల్లుల కుభయముసకు యతిగూర్చుట. చూడామణిలోని

చెన్నకేశ-కు, కడలాలుంబవరాలును (సస్త-70-71) అను పద్యము లీయతికిఁ జేరును.

(16) గూఢస్వరయతి - అదంతసాంకేతములమీఁద నత్తుమొదలనుగల శబ్దము సంధిఁగూడినఁ బదాంతమందలి అకారస్వరము గూఢమై లోపాత్వంబగును. అట్లువచ్చినను గూఢస్వరంబగు అకారమునకు వళి గూర్పవచ్చునని దీనిలక్షణము. అన్యోన్య శబ్దములో అకారము గూఢస్వరము. 'అన్యోన్య విరుద్ధ భాషణములాకినఁ దత్ఫలమాతఁడందెడున్' అనులక్ష్య మప్పకవి యీయతిభేదము క్రిందఁ జూపెను. అన్యోన్య శబ్దమున అకారమునకేకాక ఓకారమునకు హల్లునకు వళులు చెల్లునని యప్పకవి నిత్యసమాస విశ్రాంతిక్రిందఁ బెద్దన పద్యమునే యుదాహరించెను. చూడామణిలోని "విసుమన్యోన్య పదంబున కొనరింతురు కవులు కొందఱోనోలాయున్' అనులక్షణము, 'ధన్యుఁడు విశ్వభూవిభుఁడను లక్ష్యము గూఢస్వరయతి యందుఁజేరును.

(4) గుణిత స్వరవళి, ద్వ్యక్షరత్ర్యక్షరవళి యను రెండువిధములు ముద్రిత చూడామణిలోఁగలవు. ఇందు దేనిని గుణితవళి యన వలెనో నిర్ణయింప వీలులేదు. గుణిత శబ్దమునకు నిఘంటువులందు "హల్లులతో అచ్చులను హల్లులను జేర్చి చెప్పుట" యను నర్థముగలదు. ముద్రిత చూడామణిలో ద్వ్యక్షర త్ర్యక్షరపు తాక్షరవళియని యొకటిగా శీర్షిక యుంట చేతఁగాఁబోలు సీతాపతిగారు వళిభేదపట్టికలోఁ బై సమాసమొక యతిభేదముగానే భావించి కాకుస్వరయతి పంక్తిలోఁ జేర్చినారు. (చూ-ఛందో-ఉపోద్ఘాత-16-పుట). ద్వ్యక్షరత్ర్యక్షరవళిని సంయుక్త యతియందుఁ జేర్పవలయు. ఇంతవఱకుఁ బరిశీలింపఁగాఁ దేలిన యంశము రంగకవి యున్నదనిచెప్పిన 16 యతులందు భిన్న విభాగములు రెండు చూడామణిలోఁ గానరావు. అవియు నొకవేళ నుండి మొట్లోవదలిపోయెనేమో. యతులు స్వరవర్గగుణితతి పద్యము

చూడామణిలోఁ గానమిచ్చే కనే యిట్టిసందేహము. ముద్రిత ప్రతియందు 'వరసారుపల్లు నాలుగు' వనియే యున్నది. అంతయేల? అనంతుని ఛందమునను 24 అక్షరములు పేర్కొనఁబడిన పద్యము గానరాదుగదా.

యతి వివరణములో "అనంతుఁడు వపలకుమాత్రమే మైత్రి చెప్పి దీనికి అభేదయతి అనిపేరు పెట్టినాడు. వబలకు అభేదమున్నది గాని వపలకు లేదుగదా? గనుక, ఈ పేరు వీటికి సార్థకము కాలేదు" అని వ్రాసినారు సీతాపతిగారు (పు-19)

వబయోరభేదయని యే ప్రసిద్ధమయ్యె వపయోరభేదయని యున్నట్లు నన్నయ లక్షణసారమున 'వపయోరభేదయనియెడు నెప మున' నను పద్యమునఁగలదు. (చూ-ఛందోదర్పణముపైఁ తరువాతి కవుల సవరణలు. (8)

అభేదవిరతియందు వపలకు, ఏకతరయతియందు లళలకు రూపాంతరములున్నప్పుడే చెల్లునని గ్రహించునది. ఇట్లే నకారము నకు వ్యాకరణ వశమునఁగలిగిన యాదేశణకారమునకుఁ జ్రాసమైత్రి సందర్భించునవియు, సిద్ధణకారమునకు నకారము ప్రాసస్థానమునఁ జెల్లదనియుఁ గొందఱు అభిప్రాయము. నానాఁటి కిట్టి నిర్బంధములు సడలిపోయెను.

19 పుటలో సీతాపతిగారు "మకారయతికి లక్ష్యముగా అప్పక వీయములో భీమన చాటుపద్యము (గరళపుముద్ద...... సంహరణ గుణాభిరామఁగు మైలమ భీమన ఖడ్గపుష్టికిన్) ఉన్నది. ఈ భీమనే కవిజనాశ్రయకర్త అయితే ఈ పద్ధతి తన లక్షణగ్రంథములో ఎందుకు చేర్చలేదో" అన్నారు.

అతని యూహ సరియైనదే. లక్షణగ్రంథరచన తరువాత నెప్పుడో యీ చాటువు చెప్పి యుండవచ్చు. పన్నయాదులు తమ లక్షణగ్రంథములఁ జెప్పని గానిని తరువాత గ్రంథములఁ బ్రయో

గించియున్నారు గదా? అంతయేల; మనయనంతుఁడే తన ఛందము నఁ జెప్పని శకార తకారార్ధబిందుప్రాస, ఖండయతి, దధ ప్రాస, రణ యతి ప్రాస, అఖండయతి, త్రికారేతర ప్రాస, అభేదయతి (వ—బ), వృద్ధియతి మొదలయినవి ప్రయోగింపలేదా?

పృథ్వీవృత్తమునకుఁ గొందఱు 4 తర్వాతఁ గొందఱు 11 తర్వాత యతులనిరి. "తాతఁభట్టు మతమున 13 తర్వాత" అని సీతాపతిగారు వ్రాసిరి. అనఁగా సులక్షణసారమని యాతని యభిప్రాయము కాఁబోలు. "త్రయోదశ యతింగృతిన్ జన జసల్ జతంబై యవల్, దయాజలనిధీ చెలంగునిన్ పృథ్వీఛాత్రిందగన్" అను పద్యము ముద్రిత సులక్షణసారమునఁ గలదు, దీని కర్తపేరు లేదు. అవతారి కలో టీకాకారులు 'కవి శిరోమణియగు తాతంభట్టు రచించినాఁ'డని తెలిపియుంటయే యిందుల కాధారము. తాతంభట్టు కవిచింతామణి మాత్రమే రచించె. సులక్షణసారకర్త లింగమగుంటతిమ్మనకవి. ఈ యంశము కవుల చరిత్రమందుఁ గానవగును. ముద్రిత సులక్షణ సారము నిక్కమగు సులక్షణసారము గాదని పెక్కురమతము. నా మతమునదియే. పరిషత్తునందుఁగల సులక్షణ సారపు వ్రాఁతప్రతి యందలి విషయమునకును ముద్రిత ప్రతి యందలి విషయమునకుఁ బోలికయే లేదని శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు కావ్యాలంకార చూడామణి పారభేదముల పీఠికయందు వ్రాసియున్నారు. వాఙ్మయ పిపాసువులకీ సంశయము దీఱుటకు సత్యముద్రిత సులక్షణసారమును వెలువరుపవలసియున్నది. సులక్షణసార కర్తృత్వము, తద్గ్రంథముం గూర్చిన యాశయములు విస్తరముగా సులక్షణసార విమర్శనాఖ్య గ్రంథమున రచించియున్నాను సులక్షణసారకర్త తిమ్మకవిగానఁ దాతంభట్టు మతమనరాదు. సులక్షణసారమునఁ 13 తర్వాత యతి యున్న దనుటకీ యుదాహరణమే గానఁబడును.

4. తమ్ములు - భక్తిమ్మరహార; తమ్మని లక్షాంతముల కమ్మినసిరియను నన్నయప్రయోగముగలదు.

5. దధ, ంధ - ంథ; కాదన కిట్టి పాట్టి యవకారము తత్కాం డేకవిప్రసంబోధనం జేసిచేసె (నన్నయ) దీనికి విప్రసంపాదనేత్యాది పాఠాంతరములు గలవు.

దీనికిఁ దిక్కనాది ప్రయోగములు గలవు.

6. లఘ్వలఘు యకార ప్రాసము - ఇది సంధిగత ప్రాసము నంజేరుటచే వేఱుగా జెప్పనక్కఱలేదు. కాని యనంతుఁడొక ప్రకారమునకే సంధిగత ప్రాసమున నభ్యనుజ్ఞ నిచ్చియున్నాఁడు. ఇందు 4, 5 మాత్ర మనంతుఁడు పరిశీలింపక వదలెనని చెప్పవచ్చును.

(5) యతిప్రాసములు - వీనింగూర్చి శ్రీ జయంతి రామయ్య పంతులుగారి వాక్యములు (చూ. కవిజనాశ్రయ పీఠిక) సమీచీనములుగా నున్నవని నాయభిప్రాయము.

వానిపై సీతాపతిగారి యాక్షేపము- "యతిప్రాసముల నియమములను త్యజింపవలయుననిగాని త్యజించరాదనిగాని శాసించి నిర్బంధించకూడదనిన్ని...... నాయభిప్రాయము ఈనియమములు శబ్దాలంకారములవలె ఐచ్ఛికముగా వాడుకోవచ్చును. లేదా ఇవి విడిచిపెట్టి...... రసవంతములుగా కావ్యములు చెప్పవచ్చును. సంస్కృత శ్లోకములకు తెలుగు పద్యములలో ఉండవలెనన్న నియమములు లేవు. అంతమాత్రాన కాళిదాసాది మహాకవుల కావ్యములకు ఏమిలోటు కలిగినది? వాటికంటె తెలుగు కావ్యములకు వళ్లవల్లను ప్రాసముల వల్లనూ వచ్చిన ఘనత ఏమి" (56-పుట)

ప్రాచీనులు నియమించిన నియమములను త్యజింపవలయునను వాదమునకర్థము లేదని నామతము. త్యజింప

రాదనియేల శాసింపరాదో? శబ్దాలంకార ప్రాసము లైచ్ఛికములుగావచ్చు, వడిసీసాదు లైచ్ఛికము గావచ్చు; యతి ప్రాసము లైచ్ఛికములగునో? అనైచ్ఛికములన్న, నీక భాషాప్రయోగాదులు, వృత్తగణాధిరచనలు సర్వమైచ్ఛికమే యనవలసివచ్చును. తరువాత దేనికి నియమము. ఎవరిమట్టుకు వారే - ఎవరికి వారే యమునాతీరే - భవతు; కన్నడమునఁ బ్రాసము, తమిళమున యతి ప్రాసములు లేవా? సంస్కృతమున లేనంత మాత్రమున మనము వానికి స్వస్తి చెప్పవలసినదేనా? సంస్కృతమున లేకపోవుటచే నేమిలోటు లేదుగదా? తెలుఁగున నుంటచే నేమియు లోటులేదు. ఆయాభాషా ఘనత దానికున్నది. యతిప్రాస నియమము సంస్కృతభాషకంటె విలక్షణముగా నుండుటయే మన తెనుఁగునకు ఘనత. యతిప్రాస నియమము వదలక నన్నయనాఁటినుండి నేఁటివఱకు వ్రాయుచున్న కావ్యములు రసవంతములు కావా? తిక్కనాదుల కావ్యములందు యతిప్రాస నియమమున్నదిగదా? సంస్కృతకావ్యములకన్న వీరి కావ్యములు రసవత్తరములని విజ్ఞులనుచున్నారే.

మఱియు వారే యిట్లువ్రాసిరి. 'శబ్దస్వరూపము నిర్ణయించుట కత్యంతోపయోగకరములని రామయ్యపంతులుగారి అభిప్రాయము. వడి ప్రాసములు లేకపోయినా సంస్కృత భాషాశబ్దస్వరూపము వేదకాలమునుండి నేటికిని ఎక్కువ చక్కగా నిర్ణయించవచ్చునుగదా."

సంస్కృత భాషయందుఁ బాణినీయాదులవంటి బృహద్వ్యాకరణము లుంటచేతను, వేదవేదాంగాదులు శ్రుతులగుటచేతను శబ్దస్వరూపము చక్కగా నిర్ణయింపవచ్చుఁగాని, తెనుఁగున నేఁటి దనుక సర్వ వ్యాకరణములు మచ్చునకేని పుట్టమిచేతను. సంస్కృతమందువలె శ్రుతిపరంపరగా రామిచేతను బూర్వము పుట్టిన నేఁడుపుట్టిన నేఁడు పుట్టుచున్న ముందు పుట్టఁగల తెనుఁగులక్షణ గ్రంథములు ప్రాచీన గ్రంథములలోని వళిప్రాసగణముల సాధనములవల్లనే రచియింపన్

యుంటచేతను, వళిప్రాసములఁ ద్యజింప వీలులేదు. సంస్కృతము వ్యాకరణమునకు లొంగిన భాషయై వ్యవహారభ్రష్టమైనదిగాన నాఁటికిని నేఁటికిని మాఱకయున్నది. తెనుఁగు జీవద్భాషగాన దిన దినము మాఱుచుండును. ఇందు శబ్దస్వరూప నిర్ణయమునకు వళి ప్రాసములకు మించిన సాధనము లేదు.

"ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికి నియమములు బాధకములుగా నుండియుండక పోయినవని రామయ్యగారి యభిప్రాయము. నన్నయ తిక్కన మొదలయిన మహాకవులు నయితము వడిప్రాసముల కొఱకు పొల్లుమాటలు వాడుక చేసినట్లు వందలకొలఁది ఉదాహరణములు చూపింపవచ్చును." అని సీతాపతిగారు వ్రాసిరి.

ఒక్కొక్క భాషలోఁ గొన్ని నియమములుండితీరును. వానికి లొంగి తదనుగుణముగా రచియింపవలసినవారుకవులు. తన్నిమిత్తము కొన్ని సందర్భములందుఁ బొల్లుమాట లుపయోగింపవలసివచ్చును. గద్యముగా వ్రాసికొన్నచోనే నియమము లేదు. వళి ప్రాసములు నిర్బంధ ములన్నచో గణములుగూడ నంతో నిర్బంధములుగావా? ప్రారంభించిన పద్యమున మనము కొన్ని శబ్దము వేయవలయునన్నచోటనే యట్లు వ్రాయ వీలుండదు. కాన గణములు వళిప్రాసములవంటి నిర్బంధ విధానము లేకదా. అంతయేల; యతిప్రాసనిర్బంధములు లేని సంస్కృతభాషయందుఁగూడఁ బద్యములందుఁ బదములను గ్రమముగాఁ గుదుర్పలేక దూరక్లిష్టాన్వయ రచనలుసేయుట, తుహి చవైఅపి శ్యాద్యసంఖ్యాకనిరర్థకపదము నెకనెడఁ గూర్చుట మన మెఱుంగనిదిగాదు. దీనికిఁ గారణము గణనిర్బంధమే కదా. ఇట్టి వాదముచే నింకఁ బద్యరచనగూడ మానవలసివచ్చు. ఈనియమములు వలదనుకొనువారు గద్యమున రచన సాగింపవచ్చునని నాయభిప్రాయము.

* తుహిచస్మహవై పాదపూరణే - అమరము.

క్రౌంచపదము :-

ల

సుంచి రచింపఁ గ్రౌంచపదంబి యొప్పెగి భమసభనననులనయ
మొందున్ (ఛందోదర్పణము.)

గణములు - భమసభనననయ - ఇది 24 ఛందములో బుట్టిన వృత్తముగానున్నది. పూర్వార్ధమునఁ బ్రాసయతి యుత్తరార్ధమునఁ బ్రథమాక్షరముతో మైత్రిగల రెండుయతులుగలవు. ఇట్టి లక్షణమే భీమన విన్నకోట చిత్రకవి పెద్దనాదులు రచించిరి. తిక్కన యిట్టి లక్షణవంత మగు పద్యమేరచించె. అప్పకవి పూర్వార్ధమునఁ బ్రాస విశ్రమము వదలెను నన్నెచోడుఁడు ప్రాసవిశ్రాంతియు, ద్వితీయార్ధమున యతి ద్వయముంచెనుగాని ప్రథమాక్షరములో నాయతులకు సంబంధము లేదు.

"చంచుల నాస్వాదించుచు లేఁ దూం -
డ్లకరువు ప్రియులకు - నలఁదుచు మైరో."

ఇందుఁ బ్రథమార్ధమునఁ బ్రాసనియమము, ద్వితీయార్ధమున యతినియమముగలవు సీసమునందువలెఁ బ్రథమాక్షరమునకు ద్వితీయార్ధయతులు సంబంధపడకున్నవి।

సంస్కృతమున నీక్రౌంచపదము 25 ఛందమునఁబుట్టి నట్లున్నది. తెనుఁగు నందలి రెండు కడపటి గురువులు సంస్కృతమున నగణముగానున్నది సంస్కృతమున వళిప్రాసములు తెనుఁగునందు వలె లేవుగదా.

నీలావతిగారు చూపిన సంస్కృత క్రౌంచపద లక్షణము—

" క్రౌంచ పదా భ్మౌస్భౌనన నాన్గా విషుశరవసుముని విరతిరిహ భవేత్" —ఈలక్షణ ప్రకారము 5-5-8-7-యతి స్థానము లని తెలియుచున్నది.

క్రౌంచ పదాభ్మౌ స్భౌనన నాగ్గా — అనియుండవలయు-ఛందోదర్పణోపోద్ఘాతమునఁ బైసూత్రమే యున్నది; అచ్చు పొర పాటేమో.

తెనుఁగున 10-18 పై మాత్రమే యతులు కైకొనఁబడియె. మఱికడపటిది పాదాంతమును తెల్పును. సంస్కృతమున నొక పాదాంతమును దరువాతి పాదముతోఁ గలుపరాదని విరతి యుండవలెనని దానియర్థము. మనకట్టి నియమము లేదు. అక్షరమైత్రి ప్రధానముగాఁగల మనయతికి దానితో సంబంధము లేదు. ఇఁక మొదట 5 తర్వాత యతియొకటిగలదు. అందులకే కాఁబోలు మనవారు 5 తర్వాతనే ప్రాసయతి పాటించినారు. కన్నడమునఁ బై సంస్కృతలక్షణలక్షిత పద్యమే గ్రహింపఁబడినది. అందుఁ బూర్వార్థమునఁ బ్రాసయతి గలదుగాని, వారిమతమున యతి లేదుగాన నుత్తరార్థమున యతులు చెప్పఁబడవు.

ఇందు పాల్కుర్కియంశము గమనింపఁదగ్గది; వృత్తరత్నాకరమునఁ గ్రౌంచపదలక్షణము సీతాపతిగారు వ్రాసినట్లు గాక యీక్రిందిరీతిగా నున్నది— “క్రౌంచ పదాభ్రౌభ రౌనన నానగౌ ముని శరవసుశర విరతియుతా”

గణములు- భత భర న న న న గ; యతులు- 7, 5, 8, 5. వృత్తరత్నాకర వ్యాఖ్యాతలలో నొకఁడగు నారాయణ పురోహితుఁడు పై పాఠమే గ్రహించి వివరించి యీక్రింది యుదాహరణము నొసంగెను.

“పాండుసుతేభ్యో మహీంతు నరేంద్ర దేహి శకుని మాతులతసకలభృత।
నైవహి చేత్త్వం రణాయ కురుష్వ బుద్ధిమతుల విపుల ధనుర్గుణ [illegible] ।
యాదవనాథే తదేతి గిరైవ మహావదతి సనసిరిపు[illegible] నరపతిః ।
క్రౌంచపదాక్రాంతగాంచ ధరాం నవాత్ర ఖిలతి మతిరతినగిరముదాత్॥

పై లక్షణమునకీ లక్ష్యము సరిగానున్నది.

శ్రీనాథుఁడను మఱియొక వ్యాఖ్యాత క్రౌంచపదలక్షణ మిట్లు గ్రహించినాఁడు— "క్రౌంచపదాభ్యాం స్త్రీ స్నానసనానగా విషుశరమునివసు యతిరిహాభవేత్" – (భమసజననననగ)

సీతాపతిగారు 'క్రౌంచపదాభ్యాం నససనానగా' విషు అనుచోట '1' అను గుర్తుంచుటకుఁ గారణము తెలుపలేదు.

క్రౌంచపదవిషయమున నిట్లు సీతాపతిగారిలక్షణమునకును వృత్తరత్నాకరలక్షణమునకును ఛందోవ్యాఖ్యాతృలక్షణమునకును దేశంగులాంధ్రకవులలక్షణములకును మాఱుభేదములున్నవి. వీనిం గూర్చి యింకను శోధింపవలసియున్నది.

ఆనందరంగరాట్ఛందము దీనిని బంచశరవృత్తమని పేర్కొనుచున్నది.

'మించిన యుద్ధప్రౌఢిని బందామ్మిత్రటను యతితగి మెఱసిన యాంతన్,

బంచశరంబా రంగనృపాల ప్రభుతిలక భమసభ ననన యాప్తిన్."

భీమన ఛందమున 'పంచశరాఖ్యాయుంచితవృత్యా' యను లక్షణమును జూచి పంచశరవృత్తమన్నాఁడేమో. రంగకవియు నప్పకవివలెఁ బ్రాస యతి యుంచలేదు.

త్రిభంగి:—దీని లక్షణములో నచ్చు తప్పులతో నున్నదని విన్నకోట పెద్దనాప్పకవులు చెప్పిన చోట్లనుఁ గొంత మార్చి సీతాపతిగారు తమ యుపోద్ఘాతమున వ్రాసిరి వారిపాఠమునఁ గొంతభాగము.

న న న న న న స స + లును భ మ స గ లును + దసరి నటింపఁ గణంకన్ వలువంకన్ బెంపు దొలంకన్.

మునుకొని నఖ ముఖ + మున వెడఁ గదలుపఁ + జనుగడు
నొప్పగు వీణల్ సరజాణల్ వేలుపు గాణల్.

అప్పకవిలోని పాఠము:—

న న న న న న న న + న (శుభ) మన గ లును + దనరి నటింపఁ
గణంక నలువఁకం బెంపు దొలంకన్,
మునుకొని నఖ ముఖ + ములు వెడఁ గదలుపఁ + జను గడు
నొప్పగు వీణ నెర జాణల్వేలుపు గాణల్,
వనరుహాజనితుని + తనయులు మొదలుగ + ఘనమతు
లాడట తోడ స్తుతి బాడ స్వామినిఁ బాడన్,
వినఁగలిగిన నది + జననము ఫలమగు + మునిజను లిందు
శుభాంగుఁ డగుభంగిఁ జెప్పఁ ద్రిభంగిన్.

ఉత్తరార్ధ మనుసరించి చూచిన యతులకు మాఱు ప్రాస యతులే యుండవలెనని తేలుచున్నది. ఇతర లాక్షణికు లట్లే చెప్పిరి. అచ్చు ప్రతిలోని పద్యమునఁ జెప్పఁబడిన గణము లా పద్యమున్న వైఖరికి సరిగానే యున్నది. సీతాపతిగారి సవరణకును ముద్రిత ప్రతి పాఠమునకును బ్రధానముగా నొక గణముందే భేదము. 'కణంకన్' అని పఠించిన 'కన్నలు' భగణమగు; 'కణంక' అని పఠించిన 'కనలు' నగణమగు భీమన త్రిభంగి క్రొత్తగానున్నట్లు మానవానంతుని త్రిభంగిగూడఁ గొంత విలక్షణముగా నున్నదని యేల యొప్పుకొనఁ గూడదు ?

"న న న న లును స స భ మ లును స గ యుక్తము లైనన్ మృదువైనన్ బ్రస్తుతమైనన్ - అని భీమన. ఇందు న గణ ద్వయము లోపించి యున్నది.

అచ్చు ప్రతిలోనున్నట్లే యుంచి ప్రథమ ద్వితీయ పాదముల లోని యతి స్థాన స్థితి పదముల నించుక సవరించిన సరియగునని తలంచెద; సవరణ:—

"న న న న న న న న + లును న మ స గ లును + తనరి నటింపఁ
గణంక నలువంకిం బెంపు దొలంకన్,
మునుకొని నఖ ముఖ + ముల వెడ...... (తక్కినవి ముద్రిత
ప్రతి పాఠములోనివి.)

(7) టిప్పణి:—

గీ॥ ఒక్క నెలవున నెనిమిది రెండేసి నాల్గు
రెండు లఘు నెక్కినవి నాల్గు వీనిలోన
నగణ పునరుక్తి నొక్కటి దిగిచె నాల్గు
దొంతి పదునాల్గు [illegible] (సుగణ 1—20)

దీనికి సీతాపతిగారిట్లు వ్రాసియున్నారు "ఈ పద్యములోని నాల్గవపాదము చక్కగా అర్థముకాలేదు. 'నగణ పునరుక్తి నొక్కటి దిగిచె' అంటే చంద్ర గణములు ప్రస్తరింపగా కడపటి ||||| (న ల లను) ఒక లఘువు తక్కువగా రెండు నగణములని అర్థము కావలెను. 'ఇరువది తొమ్మిదింట' అనుట అర్థము పొసగలేదు." పై పద్యమునకు సీతాపతిగా రూహింపఁ గడంగిన యర్థము సరిపడదు. అందులకు సరియగు నర్థము దెల్పెద. ఈ పద్యము గణాష్టక ద్వ్యక్షరగణ సూర్యేంద్ర చంద్రగణములు దెల్పిన తరువాతనున్నది. ఇది యన్నిగణములు చేర్చిన [illegible] దెల్పును

ఒక్క నెలవున నెనిమిది - మ య ర [illegible]

ఒకట నాల్గు - గగ, లల, హ, వలు.

రెండి లఘు నెక్కినవి నాల్గు - సూర్యేంద్ర గణప్రస్తారమున మొదట లఘువున్న గణములకు రెండియు మూఁడు లఘువున్న గణములకు రెండియు మూఁడు లఘువులుండవలయు. ఆట్టివి నాల్గు - సూర్యగణముల నగణము, ఇంద్రగణముల నల, నగ, సలలు - మొత్తము. నాల్గు - వీనిలోన నగణ పునరుక్తి నొక్కటి దిగిచె - గణాష్టకమందు న గణమున్నది, సూర్యగణముల నగణమున్నది. నగణ పునరుక్తిని దీసివేయవలయును. (4—1) 3

దొంతి పదునాల్గు చంద్రగణములు. 14

ఈ 29 గణములయందే నాల్గైదుమూఁడక్షరగణములు పైత మంతర్భవించును. ఏకాక్షరగణద్వయమును జేర్చి 31 అన్న బాగుండును. గ-ల- వీనిని ప్రత్యేక గణములుగా ననంతుఁడు చెప్పక యివి గణములకు మూలభూతంబులగుటచే 29 లోఁ జేర్పక విడిచెఁ గాఁబోలును.

ప్రథమాశ్వాసములలోని 21-22 పద్యముల కర్థము సంశయముగా నున్నదని మూలములోఁ బుట యడుగున ముద్రితము. సీతాపతిగారు వరవస్తువారి ప్రతిలోని పద్యములను జూపి వాని యర్థముస్పష్టముగా నున్నదని తెల్పిరి. కాని యచ్చుప్రతిలోనివే స్పష్టములుగా నున్నవని క్రిందఁ జూపెద.

జగణము నలముగు, గ (ల) గములు
భ (వ) గణములగు, గలము నగణభావంబుఁ గనున్
గ గ ము భ గ జ స గణములగుఁ,
ద గణము స (భ) ల మగును సంజాతముఁ దీర్చినచోన్

వివరణము:—

I∪I-IIII, ∪∪-∪II, ∪I-III, ∪∪-∪II-II∪,
∪∪I-II∪I-($\cup^{I}$II).

గ (ల) గములు భ (వ) గణములగు = గలములు వ గణములగు నను పాఠము సరిపడదు. గలమే నగణ నామాంతరము కలది. గ గములు భ గణములగు నను పాఠ మంగీకరింపవచ్చుఁగాని వ్యుత్పత్తిగా మూఁడవ పాదమున గగము భగణ సగణములగునని కలదు గాన గగములు గణములగు నను పాఠము సరిపడునేమో! లేదా 'గ గములు భ గణములగు' నను పాఠమేగ్రహించి, మూఁడవ పాతమున 'గగము హ గణ స గణములగునని మార్చుకోవలె. నాల్గవ పాదములో సలమన్న భలమన్న బాధకముగాదు. 22 వ పద్యము పైపద్యమున కుదాహరణముగా నుండును. అన్నిటికందుదాహరణములు లేవు. నడుమ నే పద్యమేని లోపించెనేమో. సీతాపతిగారు మార్చిచూపిన 'మొగిళులు నలమగు' అను పద్య చతుర్థపాదమున (లగణము వాకిళ్లుభలము వాకిళులనఁగన్) యతి భంగమేర్పడుచున్నది. నాపాఠ మిక్రిందిది. నిజమైన పాఠ మూహించి రచించుట కష్టము.

"మొగిళులు నలమగు, నిటులన నగణము, హాగణమగునిట్లు నా,
హాన గణముల్,
భగణము లిట్లనఁ, దండ్రి, భగణము వాకిలి భలంబు వాకిళులనఁగన్,"

సీ. శ్రీజాచే పుట్టక యొగ్గాన బట్టక

చక్రి

బాయనాఁ గట్టక వెట్టక

వారువములు

గా

ట్టి టి

కడచీల దట్టక ఘనముగా మెట్టక

ఇందుశేఖరుఁ డానంద మందియుండు
మనల గరుణావిధేయుఁడై మనుచుగాత.

(రంగనాథుడు)

సీ. తొలికల్కి మునికోలఁ దోఁచు వారువములు
వారువములఁ గన్న సారథియును
సారథిఁ గన్న యస్త్రము శస్త్రమును మోఁచు
గరి గరితోడ దొడరెడు నారి
నారిమీఁదటి తేరు తేరిమీఁదటి విల్లు
నావిల్లుపై బంటు నడుగు పథము
మెఱుఁగుఁ జిప్పలజోడు మొయిజోడుపై గతుల్
గతులపై బిజ్జోడు కెంద్లు గండ్ల
సరి వెలుఁగుచున్న మూలికయు సంఘటించి
విషమ లక్ష్యముల్ సహసృష్టి విరుగనేసి
జయము చేకొన్న విలుకాఁడు చక్రవర్తి
కరుణదళుకొత్త మనలను గాచుఁగాత.

(భాస్కరుఁడు.)

సీ. సారథి శతవృద్ధు చక్రంబు లోనగూడి
జరగవు రథమున సంఘటించి
యమకరంబు చోకున కోర్వని యురదంబు
చేరిః విఱుసైన హాత్రివిల్లు
గటిలాను కోర్వక గడగడ వడకుచు
మువ్వంక వోయెడి దివ్యనారి
మేపు నీరునాశే మొదలాడనోవక
వర్ణహీనంబైన వారువములు
నిట్టి సాధనములు నీకు నెట్టులొదవె
త్రిపురములనెట్లు గెలిచితి దేవదేవ
యనుచు నగజాతచెలు లాడ నలరు శివుడు
చిత్త మిగురొత్త మనల రక్షించుగాత. 5

(దిమ్మపూడి అమరేశ్వరుఁడు.)

సీ. తలకమ్మి కొండయు విలుకమ్మి కొండయుఁ
గడయును నమముగాఁ గలుగు తేరు
సరసిజముకుళంబు సద్వాక్య సకలంబు
మాతయు నాలియు మాతలియును
మిన్నులఁజనువాఁడు కన్నులవినువాఁడు
నంక పర్యంకంబులైన శరము
చల్లని పవనంబు నెల్లయిన భువనంబు
మేఁపును మోఁపుగా మోఁగు నారి
వాఁక కోర్చువిల్లు ? అతిల గుత్తాలు
పగలు రేయునుఁ దిరుగు బడి కండ్లు
గలుఁగఁ బురజయంబుఁ గైకొన్న నిసుఁగొల్తు
చిరశుభాంక సోమశేఖరాంక. 6

(పాలకురికి సోమయ్య)

త్రిపురవిజయము.

సీ. తివిరి రాశికి నెక్కు తిరుగు చక్రంబులు
మెట్టులఁ బదిలమయి మెఱయు తేరు
జగముఖంబులనేర్పు వచరించు సారథి
వ్రాసి చూపగరాని వారువములు
గట్టియై పీఁక వక్క అదీర్పు విలుకమ్మి
శ్రుతిహితంబుగ మ్రోఁత చూపు నారి
విజయానుకూలంబు విలసిల్లు బాణంబు
సరిలేని కోటు లసంఖ్యజలము
దనకు నబ్బుటయునుఁ బురత్రయము గెలిచి
లవి. గైకొన్న
జయమునఁ దేజంబు భూతియుఁ బ్రియమొలర్ప
మనలఁ గరుణావిధేయుండై మనుచుఁగాత.

(కానుకొల్ని అన్నమరాజు.)

సీ. పరఘోటములు నూతు పదనంబునని చూచు
నూతుండు కార్ముక స్ఫురణ నూచు
కార్ముక మరదంబు గదియంగ నవిచుంచు
నరదంబు బాణంబు నందఁ జూచు
బాణంబు గరిబట్టియాడఁగఁ జూచు
గరి మార్గిచిత్తంబు గలఁపఁ జూచు
మార్గి చక్రంబుల మాయింతునని చూచు
జక్రిమల్ భటకోటి జయము చూచు
గాన యేమి సెప్పఁగా నిట్టిగతి చోద్య
వేద్య మొదునయిన వినఁగఁ గలదె
త్రిపురవిజయధామ నీరతాగుణాభీమ
రథికసార్వభౌమ రాజమాళి. 8

(పెరమరాజు జక్కన.)

సీ. కొండంత హేమకోదండంబు విలసద
     హీనగుణంబున నెక్కువెట్టి
హరినీలమణికాంతి యగునమ్ము శరధి పొం
     దెడలించి వలచేత నేర్పుపట్టి
స్వరముల సవళించు వారువంబుల గుణా
     ధార ఘాతంబగు తేరc బూన్చి
నలుదిక్కులను జూడ్క లోలయంగ సకలంబుc
     గనువాని సారథిగా నొనర్చి
కడcగి రథచక్రములు తన కన్నులట్ల
యేమఱక యేcగి త్రిపురంబు లేర్చి సకల
లోకములు నెమ్మిc బ్రోచు పినాకపాణి
మనcగ రుణాబ్ధిధేనుcడై మనుచుcగాత 9

(సూరన)

సీ. జడినట్టుc బడగలు పడగల మీcదిచోc
     గదలెడి కండ్లును గండ్ల నడపు
నూత్రించు జోడును జోడుపై జరియించు
     బంట్లును బంట్లకుc బాయరాని
ధనువును ధనువుతోc దగిలిన యరదంబు
     నరదంబు క్రిందికి నరుగు నారి
నారి నిద్రించు బాణము బాణమొదవించు
     నూతుండు నూతసంజాతహరులు
గాcగ నద్భుతార్థకరపదార్థావళి
యుల్లసిల్ల నొప్పుచున్నదిపుడు
త్రిపురహరణకరణధృతదత్తవీరము
నోరథంబు దేవ నీరథంబు. 10

(నిశ్శంకుని కొమ్మయ.)

క. కదలదు తేరు రథ్యములు గట్టవశక్యము సూతుఁడంటివా
ముదుసలి చక్రముల్ సరసమోవవు విల్లు బరళ్లు నారియున్ ?
గుదిగొను నమ్ము శార్ఙ్గమునకుం బనుపడ్డది గాన వింతపెం
పొదవఁ బురత్రయంబు నెటులోర్చితివో త్రిపురాంతకేశ్వరా. 11

(త్రైతరాజ మూల్యస్తుతి విష్ణుకథానిదానము.)

# అర్ధనారీశ్వరము.

ఉ. పాముసు హారము న్నెలయుఁ బాసటసేసయు సేలు మల్లికా
దామము తోలు దువ్వలువు దట్టపుభూతియుఁ జందనంబు నై
సామునఁ జాలనందముగ సన్నిధిసేసినఁ జూడఁ గంటినే
నామదిలోఁ గుమారగిరినాథుని శైలసుతాధినాథునిన్. 1

(రావిపాటి త్రిపురాంతకుఁడు.)

సీ. తల్లిదండ్రులతోడి తగు లొల్లకుండియుఁ
దల్లితండ్రుల తోడి తగులు వలచి
కందర్పు మీఁది యుక్కటికంబు సెల్లియుఁ
గందర్పు మీఁది యుక్కటిక మొదవి
సంసార కేలీప్రసక్తి వోఁదట్టియు
సంసార కేలీప్రసక్తి గలిగి
సగుణవిశేష యోజన మొల్లటించియు
సగుణ విశేష యోజనము మరఁగి
సగము పురుషుండు రెండవ సగముగాఁగ
నర్ధనారీశ్వరాకృతి నమువు వటించి
హరుఁడు లింగమధ్యంబు నందునుండి
హరివిరించుల కంటఁ బ్రత్యక్షమయ్యె. 2

— విశ్వంభరుని శ్రీయుక్తయు.)

సీ. కెంజాయ జడముడి కేశపాశంబును
బాలచందురుఁడును బూవుదండ
యురగకుండలములుఁ దరళతాటకంబు
వనజాప్తుఁడగు కన్ను వాలుగన్ను
ముదు (ఁబుగ) లపేరు ముత్యాలహారంబుఁ
గడుఁ గొంచెమగు జన్ను ఘనకుచంబుఁ
బులితోలుదుప్పటి వెలిపట్టుచీరయుఁ
బాముపెండెంబునుఁ బసిఁడియందె
మృదువుఁ దెలుపును నగుభూతి మృగమదంబు
నింతయొప్పెనె కుడివంక నెడమవంక
నిమ్మహాదైవమున కని యిచ్చమెచ్చి
యర్ధనారీశ్వరునిఁ గొల్తు రఖిలజనులు.

(పెదపాటి సోమయ - కేదారఖండము.)

## శివస్తుతి

సీ. కల్హారమకరంద కలితమందాకినీ
లహరీపరీతకోలాహలంబు
బాలేందుచంద్రికా పరభాగశోభావ
రాగసంభావితారగ్వధంబు
సేవాసమాసన్న సిద్ధసీమంతిని
తాలవృంతోత్తాలతాండవంబు
కాత్యాయనీదత్త కర్ణావతంసక
కర్పూరఖండామోదపూరితంబు
మారుతంబు నా ముందట మలసియాడఁ
గలుగునో కో యొకనాఁడని కన్నులార
శివునిఁ జూచెడి పుణ్యంబు చింతమెఱయ
మొదలివేలుపుఁ బొడఁగంటి ముక్కఁగంటి

(సోముని హరివంశము—2.178).

సీ. గరళకూటవినీలకంఠాయ శంభవే
మదనాంతకాయోన్నమఃశివాయ
కాద్రవేయాధిప గ్రైవేయభూషాయ
మధుజిత్సఖాయోన్నమఃశివాయ
కుంభినీధరసుతాకుచకుంభ పరిరంభ
మహాలోలుపాయోన్నమఃశివాయ
వేదాదినిశ్శేషవిద్యావధూమౌళి
మణికలాపాయోన్నమఃశివాయ
గంధదంతావళజలంధరాంధకాది
విబుధపరిపంథివాహినీనిబిడగర్వ
బంధఘోరాంధకారసంహారకిరణ
మాలినే శాశ్వతాయోన్నమఃశివాయ

(శ్రీనాథుని భీమఖండము 8-211)

ఉ. వాలినభక్తి మ్రొక్కెద నవారితతాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్
బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్

(బమ్మెర పోతరాజు—భాగవతము)

సీ. పాతాళకుహరంబు పరగు సొమ్ములపెట్టె
వెలుకుగుబ్బలి పెద్దకొలువుమేడ
కలశపాథోరాశి కరమొప్పు వంటిల్లు
తులగి పారెడి నీరు మ... ... ... ... ...
శరధికూఁతురు గుబ్బచనుదోయి కవదోన
విద్దుఁ జాపసునెమ్మొ వింటిబద్ద

## శివస్తుతి.

జనోర్ణేందు దితికుక్షి చీరలడించిగం
    బింట గట్టని కొండ యెక్కరింత
బూవుఁ జందిరిఁ నలువ నెమ్మోమ్ముదమున్న
లక్ష్యకాలలున్నై నీకు నమరుఁగాదె
    వర్ణితానూన చిద్భావ వామదేవ

లయగ్రాహి :

సింధుర నిశాటమద సింధుఘట జన్మ సుర
    సింధు కనకాంబురుహ గంధవిచరత్పు
ష్బంధయుతవిలత్యసిత బంధుర జటాపటల
    బంధ విలసత్కుముద బంధు (బి)మదాన)
(ప్మంధ) లలితాంగు నసు సంధిత జగత్కళలుఁ
    గంధర వినీలతర కంధరును(దార)
స్కంధ వృష వాహనుఁగబంధమథనప్రియు జ
లంధరహరుం గొలి(చెనతఁడంధకవిరోధిన్)
(పోతరాజు భైరవుని శ్రీరంగ మాహాత్మ్యము)

సీ. ఎనిమిది రూపంబు లేకమై కనుపట్టి
    దీపించు నెవ్వాని దివ్యమూర్తి
గణుతింపఁదగు దేవగణముల యాఁకలి
    వెసదీర్చు నెవ్వాని నోసలి కన్ను
రాజసంబున జొరరాని చోటులు చొచ్చి
    పడిమొయి నెవ్వాని వాహనంబు
నాణెమై యురుపది నాల్గుపీఠములందు
    రాణించు నెవ్వాని రాణివాస

మనఁగనుంగొనఁ జాయరానట్టి మోహ
మిచ్చు నొదవించు నెవ్వాని యిల్లువిల్లు
తెరయు నెవ్వాని పలుకులు జేసియగుచు
నెందు నెవ్వాని సేవింతు రెల్లసురలు

(నిశ్శంక కొమ్మయ.)

సీ. దీపించు నేవేల్పు దివ్యాలకంబులఁ
కాళీకుచాంగరాగంబు భూతి
కొమరొందు నేవేల్పు గురుజటాభరసీమ
నమృతాంశుఖండంబు నభ్రగంగ
కదుమించు నేవేల్పు గాత్రవల్లిక చుట్టు
వ్యాఘ్రచర్మము వారణాజినంబు
కరమొప్పు నేవేల్పు కంఠపీఠంబున
భుజగేంద్రహారంబు పునుకపేరు
నట్టివేలుపు శంకరుండాదిమూర్తి
వేదవేదాంతవేద్యుండు విశ్వభర్త
వికసితోజ్జ్వలవదనారవిందుఁడగుచు
నుచి (తరితిఁ) జేరొలగంబున్న యంత

(శ్రీ గిరన్న—శ్రీరంగమాహాత్మ్యము).

సీ. కొఁదలం జదలేటి లేఁదరంగంబులు
బాలచందురుని సూర్యాల (లూఁదఁ)
దొడవుల తలలఁ జెన్నడరు మానికముల
చాయ దిక్కుల నెఱసంజవఱుపఁ
దోరంపుటేనికతోలి యుత్తరికపు
కత్తుక కఱతోడఁ బొత్తు సేయ
బూడిద పూతల బూదర సరచిన
పునుకలపే రురంబునఁ జెలిర్ప

మూడు లోకంబులును గావ మొనసినట్లు
చేత ముమ్మొన కైదువు (చెన్నుమీఱ)
వేల్పుఁబదువుచూడ్కికిఁగడువింత వేడ్క
సేసె ముక్కంటియున్న యాచెలువుపెంపు

(శ్రీబం హరివంశము ఉత్తర-౬-౩౩

సీ. తమ్ముల జెనరించుఁ దళుకువెన్నెలసోగ
కన్నె గేఁదగి ఱేఁకు గారవింపఁ
బదినూఱు పడగలఁ బలిస్సైన పదకంబు
నవడి ముత్యపుబన్నసరముఁబోవ
మిసమిసమనమించు భసితాంగరాగంబు
వరలుగుజందనచర్చఁ బరిఢవింప
మెఱయు మువ్వన్నె లమరువుట్టముఁబొంగు
చెఱఁగులునునుబట్టుచేలఁబెనుప
మించి తలమీఁద నురువుపై మేనఁగట్టి
యాఁడుదోడుగ నామతోడఁ గూడి జగము
లెల్ల రక్షించు నిను భజియింతు మెపుడు
భయదమరితలతాదాత్ర ఫాలనేత్ర

కరాజు వీరయ్య—(త్రిపుర విజయము).

**శివతాండవము :**

ఉ. కరఢక్కారవ వాద్యమింపొదవ సంగాతుంగరంగత్తరం
గరవత్స్ఫుటతాళసమ్మిళిత తక్కాజాతపుంజస్ఫుర
ద్వరవృంధయమందరధ్వనులు గీతంబొప్పఁ దార్యత్రికం
బిరవైయుండఁగ నీదు తాండవమునం దేపారు సర్వేశ్వరా.

(జైతరాజు ముమ్మయ - విష్ణుకథానిధానము)

శివస్తుతి.

ఉ. ఆడఁగ గంజడల్ దొలఁకి యాడఁగ జాహ్నవి దిక్కులెల్ల వ
ల్లాడఁగ భూతధాత్రి యసియాడఁగ నాకము నాకసంబు నూ
టాడఁగ ముజ్జగంబుఁగొనియాడఁగ నిచ్చట నీవు తాండవం
బాడఁగ గౌరి విస్మరసమాడఁగ జేయునటే మహానటా.

శా. ఆడెంబాండవ మార్భటిన్ పటహలీలాటోప విస్ఫూర్తి సం
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడాఘాటకరోటికోటరకటీకోటీలుఠద్భృందు వీ
చీడోలాకటలీపరిస్ఫుటతరస్ఫీతధ్వనిప్రౌఢిమన్.

ని భీమఖండము – 4-148.)

సీ. కపిలజటాజూట గంగాసముత్తుంగ
వీచీఘటలు మిన్ను వీఁకఁదాఁకఁ
బ్రబల బాహార్గళ పరికంపిత స్ఫార
ఢక్కా ధ్వనిని దిశల్ పిక్కటిల్ల
జ్వాలాకరాళ భీషణ శారదస్థూల
శూల యుద్ధప్రభల్ మార్మ్రోఁ బొడువఁ
బ్రకట బంధుర దీర్ఘ పటువట్రి నిష్ఠుర
పదఘట్టనము లుర్వి యదలనొదవ
విమల శార్దూల చర్మాంచలము లూల
మహిత మండన ఫణిఫణామణులు గ్రాల
ననఘ రౌద్రరసావేశము వహింప
నారభటి భూరితాండవం బాచరించె.

(పోతరాజువీరయ – త్రిపురవిజయము.)

# అంబికాస్తుతి

చం. చులుకన జాపముందిగుచుచోఁ గటకాముఖపాణిమీఁదఁ బె
ల్లొలయు నఖాంశుపుంజ మసి యొప్పెడు గుంజగురాను గుత్రిచే
నలపడి కర్ణపూరమున నంటినతుమ్మెదపోని పార్వతీ
లలనకటాక్షదృష్టి మసలం జరితార్థులఁజేయుఁ గావుతన్.

(కానుకొలను అన్నమరాజు - అమరుకము.)

ఉ. కూడెను వెండ్రుకల్మిడుద కూకఁటఁ బోఁవఁగఁ బోదు పైవళుల్
(జాడగ) దోఁసఁ గొ్రమొత్తంబ చన్నులమించు దలిర్పసిగ్గునం
జూడఁగ నేరవు లెక్కలంచుఁ జూపులనీనహిమాద్రియింట నీ
వాడుట శూలికిన్ మనము వాడుటగాదె తలంపనంబికా.

(త్రిపురాంతకుఁడు - అంబికాశతకము)

సీ. ప్రణవపీఠిక నెక్కి భాసిల్లు నదేవి
యామ్నాంత హేమహర్మ్యాగ్ర్య వీథిఁ
జరియించు నదేవి సహజారుణజ్యోతి
రానందమూర్తియై బ్రహ్మనాడి
నదేవి తపణిల్లు నిచ్ఛాక్రియాజ్ఞాన
శక్తిభేదమున విశ్వంబునిండి
తోడునీడయుఁబోలెఁ దులకించు నదేవి
యెల్లకాలంబు విశ్వేశుఁగూడి
యట్టిదేవి జగన్మాత యఖిలవంద్య
నిఖిల విద్యాధీశ్వరి నిత్యమహిమ
నొక తెఱను శ్రీగిరిక్షేత్ర ముల్లసిల్లు
నలఘుకల్యాణశుభగాత్రి యద్రిపుత్రి.

(నిశ్శంకుని కొమ్మయ - వీరమాహేశ్వరము.)

ఉ. ఆదిమశక్తి యాతరుణి యాద్యకుటుంబిని యాకుమారి ము
త్తైదువ యాతలోదరి చిదాత్మిక యాసతి విశ్వమాత యా
పైదలి సర్వలోక గురుభామిని యా చపలాక్షియుంచు బ్ర
హ్మాదులువచ్చి నిచ్చలు హిమాద్రికి నిన్నుతిఁ జేతురంబికా.

సీ. కాశకర్పూర నీకాశఁగా భావింపఁ
గవితానిరూఢి ప్రఖ్యాతి నొసఁగు
యావకారుణదేహయష్టిఁగాఁ జింతింప
మదకుంభినీయానసిరులు గొలుపు
నీలజీమూతసన్నిభఁ గావిలోకింప
సకలమాయాప్రపంచము నడంచుఁ
కనకచంపకదామ గౌరిఁగా శీలింప
నంహస్సమూహంబు సంహరించు
శంభుదేవి విశాలాక్షి సదనుకంప
యోగిజనసేవ్య యోగ పయోదకంప
శ్రీకరకటాక్ష లేశ రక్షితనిలింప
ముజ్జగంబును మొలపించు మూలదుంప.

(పిల్లలమఱ్ఱి వీరయ్య - పురుషార్థసుధానిధి.)

ఉ. నందుని కూర్మినందన యనంగ యశోదకు సోదరంబు నిం
డందగ నావహించి ప్రకటంబుగ విష్ణునితోడఁబుట్టువై
సుందరి గోకులైకనవశోభనమై జనియించి యే జగ
ద్వందితయొప్పు నయ్యసురదారణి నాదిమశక్తిఁ గొల్చెదన్.

తే. గీ. తనువులందెల్ల నెలసి చేతనయనంగఁ
బ్రజ్ఞయన మాయయనఁగ బూరణి యనంగఁ
బరయనఁగ శాంతియన నొప్పు వారపురంధ్రిఁ
బరమభద్ర దాక్షాయణిఁ బ్రస్తుతింతు.

సీ, చంద్రబింబానన చారునేత్రత్రయ
శోభిని సురముని స్తుత్యచరిత
గాళిఁగాత్యాయనిఁ గంపధిక్కారిణి
నహిత భయంకర నభయదాత్రి
బ్రహ్మవాదినిఁ గామపాలిని సిద్ధస్వా
దామిని రేవతీతరుణి నచల
యోగ ప్రదాయిని యోగిని గంధర్వ
లక్ష్మి సరస్వతి లజ్జఁగీర్తి

శ్రీ

# నీతిశాస్త్రముక్తావళి

## బద్దెనృపాల ప్రణీతము

సీ॥ రాజనీతియు [1]నసద్రాజ లక్షణమును
మంత్రిమార్గంబు [2]దుర్మంత్రివిధము
నధికారవిధియుఁ గార్యవిచారము నుపాయ
గతియును రాజ్యరక్షాక్రమంబు
నిలనరాజకవృత్తి[3] హితసేవకస్థితి
దుస్సేవక[4]క్రియ దుష్టరాజ
సేవాఫలము[5] దానశీలతా[6] మహిమ వి
వేక సంగతియును లోకనీతి

పద్ధతులుచేసిభువి[7] నీతిప్రజ్ఞ వెలయ
బద్దెనీతియుఁ గోమటిపడుచు నోళ్ళ
కతన దబ్బఱ పాఠంబుగదియఁ గవులు
తప్పు లెడలింప నెంతయునొప్పు భువిని. ౧

1 లసద్రాజలక్షణమును (గ) 2 మార్గమును. గ. ప్రతి.
3 యలయరాజికవృత్తి (గ) 4 సేవన (క)
5 బలము (క) 6 దానబలతా (గ)
7 గ. ప్రతి... కవిబ్రహ్మ వ్రాయ
నలరిబద్దెనీతి పామరులనోళ్ళ
దవిలి దబ్బరపాఠమై...ల...
తప్పులెడలించి సత్కవు లొప్పుననగ.

చ॥ పరువడి[1] నాంధ్రభాషఁగల బద్దెననీతియు సంస్కృతంబుతోఁ
బరఁగ ప్రతాపరుద్ర నరపాలునిచే రచియింపఁబడ్డ యీ
నరవరు నీతిసారము వినంజదువం గడుమంచిదంచుఁ జె
చ్చెరఁ గవి నీతిపద్ధతులుచేసె వినోదము బాలబోధకన్.

క॥ శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధ జయలక్ష్మీసం
భావితుఁడ సుమతిశతకముఁ
గావించిన ప్రోడఁ గావ్యకమలాసనుఁడన్. ౧

క॥ రాజవరమకుట మణిగణ
పూజితపదయుగుఁడ హేమ[4]భూభృద్ధైర్య
భ్రాజితుఁడ బద్దెనాఖ్యుఁడ[5]
రాజోచిత నీతులొప్ప[6] రచియింతుఁ దగన్. ౨

1 (గ). పరువడి యాంధ్రభాషగన బద్దెనకావ్యము సంస్కృతంబునై
పరఁగ ప్రతాపరుద్ర నరపాలుఁడు సేయఁగబంచెనద్ది యా
నరవరు నీతిసారము వినంజదువన్ దగినవిధంబుచె
చ్చెరఁగవి బ్రహ్మపద్ధతులునన జగంబున బాలబోధకన్

2 పైపద్యములు బద్దెనకృతములు గావు.

3 ఇది (గ) (చ) ప్రతులలేదు. చిత్రాడప్రతిలో మొదటి యధికారము సుగ్రహింపఁబడలేదు. ఒక వేళనందుండిన నుండవచ్చును.

4 పదయుగళ మేరుభూభృ...(గ)

5 బద్దనాఖ్యుఁడ (గ) (చ).

6 నీతులెల్ల (గ). నీతులెలమి (ప).

క. న్యాయము ప్రజ పెంపెక్కువకు ను
పాయము[1], ప్రజకల్మి సిరికుపాయం బగుటన్
న్యాయమె భండారము నర
నాయకులకు నంద్రుడు కీర్తినారాయణుఁడా—

క. ప్రజఁ దల్లి పెంచు తెఱఁగునఁ[2]
బ్రజలన్ బతిపెంచఁ బెరిగి పదపడితల్లిన్
ప్రజ ప్రోవు సందియము, పతిఁ
బ్రజప్రోవది నిక్కువంబు బద్దెనరేంద్రా. ౪

క. ధాత్రీకుటుంబకత్వజ
గత్త్రాణనిసర్గమతులు గావున శుద్ధ
క్షత్రియులుండఁగ నొరుల న
పాత్రుల నమ్మదురె బుధులు బద్దెనరేంద్రా. ౫

క. పత్నిధరిత్రియ[4] పురుషులె
రత్నము లెప్పుడుఁ[5] బురంధ్రిరత్నములుఁ శిలో[6]
రత్నములు నవని[7] పతులకుఁ
బత్నులె రత్నములె దలఁప బద్దెనరేంద్రా. ౬

1 బ్రాయము (క).

2 ప్రజతల్లి బెనుచు తెరగున (క) ప్రజఁదల్లి పెంచు విధమున (చ)

3 బలిపెంచునదియె (చ) బెనుపవలయు (క) ప్రజఁబలిపెంచునని పెరిగి (ప) (

4 (క) ధరిత్రియె

5 (చ) లెపుడును

6 (క) శిలారత్నములు

7 (చ) లవనీపతులకు

క. స్ఫురిత రుచిరత్నచామీ
కరరచనలు కారణములు[1]గా వొప్పనకున్
బరివారమె[2]మై లక్ష్మియ
నరపతులకునంద్రు[3] రి నారాయణుఁడా. ౭

క. మేదిని కనురాగము సం
పాదించి కృతార్థుఁడైన పతికిని విషయా
స్వాద[4]న భూషణమగు నప
వాదము పెఱపతి కుదారవైరోచనుఁడా. ౮

క. దుష్టజన నిగ్రహంబును
శిష్టప్రతిపాలనంబుఁ జేసిన[5] పతికిన్
దృష్టముగానగు సుగతి[6]య
దృష్టము[7]గావింప నొందు దీక్షితులేలా.[8] ౯

క. భూపగుణ మలిగి చెఱుపఁగ
నోపుట, కరుణించి మనుపనోపుట. జడుఁడై
కోపప్రసాదగుణములు
చూపని[9]పతి పతియె నన్నెచోడనరేంద్రా. ౧౦

విలసితభూషణములు (గ)
వీజనధారణములు (చ)

2 పరివారమ (గ)
పరివారము మెయిలక్ష్మియ (చ)

3 నరపతులకుఁదొడవు (చ)

4 స్వాదము (గ)

5 సేసిన (గ)

6 గననగుసుగతి (గ)
గానఁగఁబడదా (చ)

7 సాధింపనొందు దీక్షలుగలవే (గ)
,, దీక్షలవేలా (చ)

8 ఈపద్యము (గ) ప్రతిలోసంకీర్ణపద్ధతి యందుఁగలదు.

9 సూపని (క)

క. తలవర్గము[1] సామంతుల
బలమున కగ్గలముగల[2] నృపాలున కొప్పున్
బలిమి, పెరనృపతి[3] కాజ్ఞా
బలసంపద[4] యెంతదవ్వు బద్దెన రేంద్రా. ౧౧

క. స్వాయత్తుఁ డుత్తముండు ప
రాయత్తుం డైన భూతలాధిపుకంటెన్[5]
స్వాయత్తుకంటె[6] మేలు భ
యాయత్తుండంద్రు దశదిశాభరణాంకా. ౧౨

క. అనుజులు తనుజులు గురుజను
లనుఁగులు బంధులు ప్రధానులను[7] సిరిపొత్తీఁ
జనుఁగాని యాజ్ఞ పొత్తీ[8]ఁ
జన దధిపతికి[9] న్నరేంద్రచతురాననుఁడా. ౧౩

## 2 దుష్టరాజ పద్ధతి

చ. అలుక ప్రతాపమిూఁగియులవాలము[10] బుద్ధి, పరాపవాదముల్
పలుకుట ప్రౌఢుపోక, ప్రజబాధదలంపమి పేర్మి. ప్రల్లదం
బలవు, వికారమొప్ప[11]వినయంబుమహత్త్వము, చేటు[12]బొంకువా
క్ఫలము,[13] జఘన్యులైన నరపాలురకుం బరపక్షభైరవా. ౧౪

---

1 బలవర్గము (క) (చ)    2 గన (చ)    3 పెరకుమతి (గ) (స)
4 సంపదకెంతదవ్వు (క)(స)  5 భూతలాధీశునకున్ (గ) (చ)
6 కన్న (చె)    7 ప్రధానులని (క)(చ)  8 యాజ్ఞపొత్తున (క)
9 పతికినినరేంద్ర (గ) ఈపద్యము (గ) ప్రతిలో మంత్రిపద్ధతియందుఁ గలదు.
పతికిన్ వివేక (చ) (స)
10 అగవాలము (గ) (ప)    11 మొప్ప (గ)    12 చెయ్యిబొంకు (గ)
13 వాగ్బలము (క). ఈపద్యము (చ) ప్రతిలో లేదు.

క. పరదోషకథ వినోదము[1]
పరపీడోత్పాదనంబు బలిమిఁ బరస్త్రీ[2]
హరణమె. సుఖముగ మనుపతి
పరమోత్పాతంబు ప్రజకు బద్దెనశేంద్రా. ౧౫

క. దోషములేకయ యలిగెడు
రోషాయత్తునకు నెవ్వరును వెఱతురు ని
ర్దోషక్రోధికిఁ బాముని
కీషద్భేదంబు[3] గలదె యేమిట్లనెనన్[4]. ౧౬

## 3 మంత్రిపద్ధతి

క. ఆప్తు నవివేకి నొల్లర
నాప్తుని విద్వాంసు నొల్లరార్యులు మంత్రి
వ్యాప్తికి మంత్రి వివేకియు
నాప్తుడుఁగావలయు దశదశాభరణాంకా. ౧౭

క. పదను దొరఁకొనుడుఁ జెచ్చెర
వదలక వెదవెట్టు హాలికవర్గము రీతిన్[5]
అదను[6] దొరకొనుడు కార్యము
వదలక తా నిర్వహింప[7]వలయున్ బతికిన్.[8] ౧౮

1 కథామోదము (చ) 2 బలిమిఁబరస్త్రీ (చ)
3 కీషద్వేషంబుగలదె (చ) 4 యేమిటనెన్నన్.
కీషద్వైషమ్యమున్నె (చ)
5 కరణిం (చ) వలెనే (గ) 6 హదను (క) పదను (స)
,, (స)
7 పదను దొరకొనుడుఁ జెచ్చెర హదను దొరకునెడ (ప)
వదలక కార్యంబుఁదీర్పవలయున్ బతికిన్ (చ) (స)
8 . (గ) ప్రతిలో నీపద్యము కార్యపద్ధతియందున్నది.

చ. వెడమతియై యుదారగుణ వీరగుణంబులు బీజమాత్రమే
ర్పడినను ఝూగి పోటుఁగరపందగు,[1] దానగుణంబు లోభికిన్,
బొడువఁగనోడు భీతునకుఁ బోటును నేర్పడఁ[2] జెప్పుచుండగా
దొడరిన మంత్రి తానె పగతుండగు నన్నగంధవారణా[4] ౧౯

## 4 దుర్మంత్రి పద్ధతి

క. మానుగ బోరచి[5] నుపశమ
హీనుం జెలిచేసి మంత్రమెఱిఁగించుట యు
జ్ఞానము పతి గరదునకును[6]
బానస మిచ్చినవిధంబు బద్దైన రేంద్రా. ౨౦

క. రోసి[7] తనవలన డెందము
గాసిల్లినవానిఁ జెట్టఁగావగవక[8] తా
నాసన్నవర్తిఁ జేయుట
దోసము[9] పతికండ్రు నయవిదులు[10] బద్దెనృపా. ౨౧

1 నీగినాటుగఅపందగు (క)
నీగిపోటుఁ గఅపందగు (చ)
2 బుట్టగ నెప్పుడు (గ)   3 తాన (చ)
బుద్ధిగనెప్పుడు (చ)
బోటుగుణంబులు (ప)
4 (గ) ప్రతిలో నిది దుష్టరాజపద్ధతిలో నున్నది
5 మానుగభూపతి యుపశమ (చ)
6 పతితునకును (చ).
జ్ఞానంబది గరదునకును (ప)
7 నోసి (గ) (చ)   8 బట్టఁగావగవక (క)   9 దోసము (చ)
జెట్టఁగా వగవక (ప)
10 సిద్ధముగ బద్దినృపా (చ)

క.  స్థిరమతి నేకస్థితిజను[1]
పురుషుని నమ్మినది పెక్కుబుద్ధులమై నూ
సరవెల్లి పొడలుచూపెడి
నరుపొరువునఁబోక యేల నయతత్త్వనిధీ.[2]

క.  ఆప్తులెఱింగిన నాప్తుల
యాప్తులెఱుంగుదురు, తత్తదాప్తశ్రవణ
ప్రాప్తమగుచుండుఁ గావున
నాప్తపరంపరను మంత్రమవియున్[3] బతికిన్.  ౨౩

## 5 అధికార పద్ధతి

క.  తన కెన్నడుండియును[4] ద
క్కని భృత్యులఁ బెనుపమనుపఁగా జనదు[5] ప్రయో
జనమునకుఁ దగిన వెలయి[6]
చ్చునది నరేశ్వరుఁడు నన్నెచోడ నరేంద్రా.  ౨౪

1 స్థిరమతియనఁగా భువిజను (చ)

2 నరుపొరుగేమిటికిఁ గీర్తినారాయణుఁడా. (చ) – ఈ ప్రతిలో 'నరుపొరు వేమిటి' యను పాఠమును జూపఁబడియున్నది.
నరుతెరువున నేలపోక (ప)

3 నాప్తపరంపరలమంత్ర మవనింబతికిన్. (క)

4 తనకెక్కడనుండియు (చ)
తనకెక్కటినుండియు (,,)

5 మనిపిచెఱుపఁగావలదు (చ) బెఱుగమనుపఁగాఁజనదు (స)

6 దగిన మేలిచ్చునది (చ). ఈపద్యము (గ) ప్రతిలో గన్పడదు.

క. సకల వ్యసనికిఁ బుట్టిన
సకు ము    నిష్ఠ    సజ్జను నో
జ్జఁబోటుగాని కర్థా
ధికార మిచ్చుజన దధిపతికి బద్దెనృపా. 25

క. క్షితి జనులకుఁ బరిజనులకు
సతతము ప్రెగ్గడను[2] జూపఁ జనదు
పతి ప్రెగ్గడయై ప్రెగ్గడఁ
బ్రతిహస్తునిఁ జేయవలయు బద్దెనరేంద్రా. 26

క. జనపతి తన ప్రజభారము
తనముఖమున నడిపికొనక తక్కినఁ బాలియున్
బెనుపిచ్చు వారితోడను
చనువార ప్రజల్[3] నరేంద్ర చతురాననుడా. 27

1. కర్థాధిక మిచ్చుట చనదు నయాగతిన్ బద్దెనృపా. (క).
2. ప్రెగ్గడ... బద్దినరేంద్రా. (చ).
3. దిని చెరుతు రతని యిల్లును (సొమ్మును)
జనుబారుసు బ్రజనరేంద్ర చతురాననుడా. (చ) (స)
తిని చెరుతు రతని యనుగులు
జనుబాధం...... నరేంద్ర చతురాననుడా (గ)

క. పరశక్తియు నిజశక్తియుఁ
బరికింపకఁ దొడరునెల్ల భంగములనుఁ బ
ట్టోరుల నతన్న నెఱుంగుట[1]
పరము జ్ఞానంబు పతికి[2] బద్ధనరేంద్రా. 31

క. పతి యిమ్మకాని భృత్యు
ప్రతతికిఁ దనయిమ్ము చనదు పరుసని కార్య
స్థితి యిమ్మకాని భూతల
పతికిం దనయిమ్ము చనదు బద్ధనరేంద్రా. 32

క. ఆద్యావస్థన పరులన్[4]
భేద్యుల జేయునది తదవుసేయుటయు నఖ
చ్ఛేద్యము గూర్చి కుఠార
చ్ఛేద్యంబగు నండ్రు రాజసిద్ధాంతవిదుల్. 33

క. పరులఁ[5]బతి యన్యోపా
యక్రియలం జక్కఁజేయునది[6] దానను ని
ర్వక్రంబు గామి[7] తుది నహ
వక్రియ యుద్ధంబు కీర్తినారాయణుండా 34

1. బ, ట్టోరులందుఁ దన్ను నెఱుఁగుట (క)
బట్టోరులం దన్ను నెఱుంగుట (చ)
2. దలఁప (క)
3. యిమ్ము (చ) యిమ్ము (గ)
4. ఆద్యావస్థన పరులను (గ)
ఆద్యావస్థను రిపులను (చ)
,, నృపతులు ఛేద్యులఁ జేయుచునది... నీతి సిద్ధాంతవిదుల్ (స)
5. పరులని (చ)
6. యన్యోపాయ క్రియలచే చక్కఁజేయునది. (గ)
7. కాని తుద నహవక్రియ తథ్యంబు (చ).

క. సాధింపఁగఁడిఁది శత్రుల
సాధించిన బలిమి[2] వృథ, నిజక్షితిజనులన్
బాధించు కంటకులఁ బరి
శోధింపని[3] నాఁడు నన్నచోడనరేంద్రా. 85

## 8. ఉపాయపద్ధతి.

ఉ. పారని యుక్కుఁజేసి బలవంతుఁడు పైకొని[4] విగ్రహించినన్
దూరము వోవుటొండె, వినతుండయి వానిన చొచ్చు[5] టొండెఁగా
కోరవ మొక్కి కొల్మతివిహీనత నేనుఁగుతోడఁ దాఁకినన్
బోరుట[6]; నీతిమార్గమిది భూనుతరాజతనూజభూభుజా. 86

ఉ. చాలనికృష్టుతోఁ బోడరి సఖ్యము సేయుట మాన[7] నిద్దఱున్
దూలుదు రట్లుగాకధముతోడ[8] విరోధము గన్నను[9] బురుల్
మాలునె కాన[10] బుద్ధిగల మానిసికిన్ దనయోలిగాని దు
ర్బలు నవజ్ఞసేసి[11] వెలిసేయఁదగుం[12] బరవస్తుభైరవా. 87

---

1. సాధింపఁ గడిది... సాధించని (గ)
2. బలిమి (చ)
3. బరిశోధింపనినాఁడు (చ)
4. కడచం బలవంతుడు (క) (గ)
5. వానిని కొల్చుటొండె (గ)
6. ఏనుఁగుతోడ దోఁకలుం బోరగు (గ)
 ,, లావున బోరగు పెన్మచందమని బుద్ధియె రాజ... (క)
7. కొల్వుటి మాన మిద్దఱున్ (క)
8. రట్లుగా కధికుతోడ (క)
 రట్లుగా కధముతోడ (చ)
9. గొన్నదా (గ)
10. మాలుట గాని (క)
11. నవజ్ఞమైన (గ)
12. నవజ్ఞమె యొదఁ సేయఁదగుం (ప)

క. అలుగుచుఁ జెరుపఁగ నయ్యెడు
కోఁది విచారింప శక్తిగాన యొరులకుఁ దా
నలుగుట యె తనకు నలిగిన
యలుకవిధంబండ్రు[1] దశదిశాభరణాంకా. 38

క. చెనవున ధనమున మదమున
జనపతి తమ్ములఁ దదాప్తజనముల గడవన్[2]
మనిమెడు[3] గృహప్రధానుఁడు
తన సంతతికంతకు దానె దాత్రము జగతిన్.[4] 39

1. యొరులకుఁదో
నలుగుట తన కలుగుట యా
యలుకయని ధనంబు దశదిశాభరణాంకా. (చ)
2. తమ్ములను దాఁపు జనులను గడవన్ (క)
తమ్ముల తదాప్త జనములు నడచన్ (గ)
తమ్ములఁ దదాప్త జనముల గూడఁగా (చ)
3. మనిపెడు (క)
4. మను మండలికి బ్రిగ్గడకును
మాను మెలఁగిన మేలుకవకును ముక్పగుఁ బిదపన్ (చ)

# 9. రాజ్యరక్షాక్రి

క. మాత్రుఁ బ్రజవిరచుచు, నోడఁగ[1]
సేరదు సౌఖ్యానకుఁ గాన నృపతి ప్రజను[2] సా
ధారణ రూపంబున నయ
పారఁగుఁడై యేలవలయు[3] బద్దె నరేంద్రా. 40

చ. నయమునఁగాని భూమిఁబ్రజ నమ్మదు, నమ్మినఁగాని యర్థసం
చయమునుఁ దంత్రవృద్ధియును సాగదు, సాగినఁగాని శత్రులన్
జయిగొని[4] యోర్వరాదు, ప్రతిపక్ష[5] ముడంగినఁగాని భూమి యా
త్మయముగ నేలరాదనిరి కావ్యచతుర్ముఖ[7] బద్దెభూపతీ. 41

క. నమ్మ ప్రజమూఁగు, బొంకమి
నమ్మికకును మొదలుగాన[6] నరపతి తన వ
ల్కు-మ్మెయిఁ[9] దప్పక లోకము
నమ్మింపఁగవలయుఁ గీర్తినారాయణుఁడా. 42

1. మాత్రుఁడగ విడుచు నొందఁగ (క)
2. నృపతియుఁ బ్రజసా (క)
3. ధారకుఁడై మెలపవలయు (చ)
4. చాలదు, చాలినగాని (క) (గ)
5. బయిచని (గ)
6. రిపుతతి (చ)
7. కార్య చతుర్ముఖ (చ)
8. మొదలు గాఁగ (క)
   పాతి గాఁగ (చ)
9. వాకిమ్మెయి నడపుచు (చ)

క. పరికింప నీతిమార్గము
నరపతులకు నిదియ[1] బహుజనద్వేషముగా
దొరకొనియెడు లాభంబులు
పరిహరణీయంబు లండ్రు బద్దెనరేంద్రా. 46

చ. నవసిన వారిఁ బ్రస్తవమునన్ స్మృతిఁ బొందిన వారివారి, సా
హసముఖవీరులన్, బనుల ముంపఁ బ్రగల్భులఁ, వేఱులేని బాం
ధవుల, సమజ్ఞులన్[2] బుధులఁ దప్పని కాఁపుల భక్తి[3] యుక్తులన్
ధ్రువముగఁ బ్రోవలేని నృపతుల్ కుపతుల్ పరపక్షభైరవా 47

## 10. అరాజక పద్ధతి

క. పతికంటె నఖిల వసుమతి;
పతి పతిలేకున్నఁ జెడదు; సత్యము[4] ధాత్రీ
పతి లేనినాఁడు సత్య
స్మృతి వసుమతి కండ్రు నన్నెచోడ నరేంద్రా. 48

1. కెల్ల (చ)
2. వివేకులం (చ)
3. శక్తి (గ)
4. జెడుట సత్యము (గ)
జెడుట స్వల్పమె (చ)

# ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు
పిఠాపురము మహారాజావారు, పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, ఉయ్యూరు జమీందారువారు.

## కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు, (కోశాధ్యక్షులు.)

,, పిళ్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

,, కోకా శివనాథశాస్త్రిగారు

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.

,, వెంపటి రామబ్రహ్మముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, మందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు కామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ. (ఆనరుస్)

,, వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

———

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

## చతుర్థసంపుటము.

---

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమ సంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీ క్రింది వెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు.

---

Printed by N. Achutaramayya at the Cocanada Printing Works Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary Telugu Academy, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౮. { విరోధి. ఆశ్వయుజ-ఫాల్గునములు } సంచిక ౪-౬.



కాకినాడ

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0 0.

1949-10.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౮. { విరోధి. ఆశ్వయుజ-ఫాల్గునములు } సంచిక ౪-౬.



కాకినాడ

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

1949—50.

# శ్రీ ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

## విరోధి సంవత్సరము (1949-50)

## విషయసూచిక.



---

# కీ. శే. కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారు

వీరు సుప్రసిద్ధ కవివరులు, కావ్యతీర్థ, స్మృతితీర్థ, అభినవాంధ్ర వాల్మీకి బిరుదాంకితులు, శతాధిక గ్రంథకర్తలు. హాలాస్య మాహాత్మ్యము, లలితోపాఖ్యానము, బ్రహ్మపురాణము, బ్రహ్మాండపురాణము, రామావతారతత్వము, కృష్ణావతారతత్వము మున్నగు సద్గ్రంథముల నెన్నియో రచించి యాంధ్రభాషామతల్లి కలంకారములుగ గూర్చియున్నారు. కవిత్వమునందే గాక జ్యోతిశ్శాస్త్రము, యోగ వేదాంతాది శాస్త్రముల వీరికి బ్రవేశము గలదు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వీరికి కళాప్రపూర్ణ బిరుదము నొసంగి గౌరవించినది. వీరు ప్రథమమున గొంతకాలము అనకాపల్లిలోను, తరువాత కడపలో మునిసిపలు హైస్కూలునందును ప్రధానాంధ్రోపధ్యాయులుగ నుండి 1937 సంవత్సరమున విశ్రాంతి గైకొనిరి. వీరి పాండిత్య మపారము. వీరు ముక్త్యేశ్వర గ్రామమున జరిగిన యాంధ్రసాహిత్యపరిషద్వార్షికోత్సవమున కధ్యక్షులుగ నుండిరి. సరళస్వభావులు. 'శాంతరస మొలుకు బ్రహ్మతేజము'తో విరాజిల్లు చుండెడివారు. వీ రాధునిక యాంధ్రవాఙ్మయ నిర్మాతలలో నొకరనినచో నతిశయోక్తి కాజాలదు. వీరు వికృతి సంవత్సర అధికాషాఢ బహుళ పంచమి స్థిర వారమున బ్రహ్మైక్యము నొందిరి. వీరి యాత్మకు బరమేశ్వరుఁడు శాంతి నొసంగు గాత.

శ్రీయువనగారినాఁబరఁగు చెల్వగుఁ జిత్తమువల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయయని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయితకిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

# గ్రంథస్వీకారము.

శ్రీకాంచీఖండము :— శివశ్రీ పుల్లంపల్లి మల్లికార్జునారాధ్యుల పుత్త్రులును చిట్టిగూడూరు నారసింహసంస్కృతకళాశాలాధ్యాపకులునగు వీరేశ్వరశర్మగారిచే రచియింపఁబడిన యెనిమిదాశ్వాసముల ప్రబంధము. మూలము స్కాందపురాణాంతర్గతమగు కాంచీమాహాత్మ్యము. దీని నిదివఱలో ప్రాచీనకవియగు దగ్గుపల్లి దుగ్గనయు, నధునాతనులలో కొప్పరపు సుబ్బరాయకవియు నాంధ్రీకరించిరి. శ్రీవీరేశ్వర కవి మూలగ్రంథానుసారముగ రచింపక నందలి కథలకు నవ్యత నాపాదింప యత్నించినటులఁ బీఠికయందుఁ దెలుపఁబడినది. దారుకావనవిహారము, దక్షయజ్ఞము, పార్వతీపరిణయము మున్నగు కథలతోఁగూడి ప్రాచీనకవుల దలఁపించు ప్రౌఢకవిత్వధోరణి నీగ్రంథము రచింపఁబడినది. శ్లేషయమకానుప్రాసములనిన గవికిష్టము. సాధీయస్సమిదగ్న... అనిదంపూర్వవచఃప్రభావము, మధ్యేమాళిచంద్రాంకురలు మొ॥ లగు ప్రౌఢకవిప్రయోగములుగలవు. ఒక్కొకచో నీరికవిత్వము సుగ్రాహ్యమైయుండును. ఒక్కొకచో దీర్ఘసమాస కఠినపదోపశోభితము.

శా. సంధ్యారంభకఠోర వళ్ళిమదిశాఖాగ్రన్మహాకాలసం
బంధ్యుగ్రోగ్రక్షపాణరేఖలయి కన్పట్టెన్ శిరశ్చంద్రికల్
వింధ్యప్రాంశుఫణీంద్రభీమఫణావిర్భూతహాలాశ్చటా
వంధ్యప్రక్రియమై తమఃక్షుత్రగవిసె న్యారిన్మహాఘోరమై.

ఈగ్రంథము కవిసార్వభౌములగు శ్రీ చెళ్లపిళ్లవారిచే బ్రశంస నందినది.

మ. సభరసమ్మిత్రిల్ భవపంగమల్ శివనమశ్శబ్దార్థముల్గూడ దే
వ భవత్పాదమునందనిత్యము యువప్రాప్తిమమ్మైగా మాహామా
యుభవా! నీకు నిరంకుశోన్మదమనోవ్యాపారమత్తేభముల్
శుభవస్త్రార్థమువీని గైకొనుము మెచ్చంజూపు సర్వేశ్వరా.

గీ. చెలగి మీపాదపద్మముల్
కేటగీతుల చిత్రాబ్జపత్త్రినిడదు.
ఇట్టివాని యందలి ధ్వని
పీఠికయందు గవి

కం. కేవలమొక యనువాదమె
నావలదీ తెనుగుసేత నానేర్పునటుల్

గావించెద మొదలికవుల గమనముకయుచున్.

అని వ్రాసినది గ్రంథరచనాపద్ధతిని వివరించుచున్నది. సంస్కృతాంధ్రభాషావైదుష్యముచే నలరారు నీగ్రంథము నామూలాగ్రముగ జదివి భాషాకోవిదులానందింతురు గాక.

(౩) శ్రీశంకరారాధ్య చరిత్రము. ఇదియు పైగ్రంథరచయిత లగు వీరేశ్వరశర్మగారిచేతనే రచింపఁబడినది. ఇతివృత్తమాధునికము. పెక్కుధర్మకార్యములొనర్చి శివభక్తిబోధక గ్రంథముల ముద్రింపించి, మఠ్యాలశివపూజరమొనర్చుచు నేక శిలానగరమున దమపేర సత్రమును నెలకొల్పి కృతకృత్యులగు శ్రీ ముదిగొండ శంకరారాధ్యుల వారి జీవితచరిత్ర మిందభివర్ణింపఁబడినది. ప్రాస్తావికముగ నోరుగంటి యందలి ప్రాచీనశిల్పవైభవము వర్ణితము. కవిత శాంచీఖండము నందువలెగాక సులభమై తేటతెల్లముగనున్నది.

మచ్చునకై రెండు పద్యములు.

శా. దీపమ్మొండగ జక్కదిద్దికొనుమీ దేహమ్ము గేహమ్ము నీ
వాపైనిన్ దురపిల్లుటల్ వ్యథలు నిర్మాతాంబు సేతుక్రముల్
'పాపీజీవతి శాశ్వతం నసుకృతీ వర్ధస్వపుణ్యార్జనాభో
దీపాకార' యటన్నఁబ్రాజ్ఞుల బుద్ధినిల్పి నేయుందగున్.

౬. వైద్యనిఘంటువు
రోగదర్పణ విషయము

౭. ధనుర్విద్యావిలాసము

౮. ఖడ్గలక్షణ శిరోమణి.

మదరాసు దొరతనమువారు 1948 సంవత్సరము మే నెలలో శాస్త్రగ్రంథముల గొన్నిటిని బ్రకటింప నిశ్చయించి యందులకొక సంఘము నేర్పఱచియున్నారు. ఆసంఘము మదరాసు ప్రాచ్యలిఖిత భాండాగారమునందును తంజావూరు సరస్వతీమహాలు లైబ్రరీయందు నుగల కొన్ని గ్రంథముల బ్రకటింప నిర్ణయ మొనర్చినది. వారి నిర్ణయానుసారము మదరాసు ప్రాచ్యలిఖిత భాండాగారము నందలి వైద్యాముద్రిత గ్రంథముల బ్రకటించియున్నారు. వీనిలో మొదటి రెండును వైద్యగ్రంథములు గ్రంథకర్తలపేర్లు తెలియవచ్చుటలేదు. ముక్త్యాల గ్రామమున నార్షరసాయనశాలయందలి సుప్రసిద్ధ వైద్యులగు శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారిచే బరిష్కరింపబడినవి. వైద్యపారిభాషిక పదములనుగూర్చి శ్లోకరూపముగు నిఘంటువులు పెక్కులుగలవు.

కాని యాంధ్రమున వాని పర్యాయపదములను దెలుపు గ్రంథములంతగా లేవు. నిఘంటువుల సరియగు పర్యాయపదములులేక నొకవిధమగు మూలిక వృక్షవిశేషము మొదలగు నర్థము లీయఁబడుట యుండదని దెలిసినవిషయము. ఇటీవల వృక్షశాస్త్రజ్ఞుల సహాయమున వృక్షశాస్త్రపర్యాయపదములను దెలిసికొనుచున్నారు. ఆంధ్రదేశమున బ్రచారములోనున్న తేటతెనుఁగు పర్యాయపదముల నీ నిఘంటువు దెలుపుచున్నది. అందువలననిది వైద్యులకేగాక యితరులకుగూడ నుపయోగకరముగ నుండుననుట నిస్సంశయము. ప్రచారముననున్న యితర నిఘంటువుల సహాయమున దీని బరిష్కరించితిమని శ్రీ శాస్త్రిగారు వ్రాసియున్నారు. వెల రు 2-12-0.

ఔషధయోగములు - ఇట్టి గ్రంథము లాంధ్రలోకమున నెక్కువగా గలవు. వాటిలోని ముఖ్యములగు నౌషధములను దేశీయవైద్యులు వాడుచున్నారు. ఇదియు శ్రీ శంకరశాస్త్రిగారిచే బరిష్కృతము. వారు పీఠికయందు దెల్పినరీతిని వైద్యులుగాని సామాన్యజనులుగాని వానిని వాడుట మంచిదికాదు. తగినరీతిని వాని గుణావగుణములను విమర్శించి గైకొనవలసియున్నది. ఈగ్రంథమున నాయాయోగములకు మూలశ్లోకము లీయఁబడియున్నవి. తెనుఁగు వివరణము వ్యావహారిక భాషలోనున్నది. వెల రు 3-12-0.

యోగదర్పణ వివరణము - ఇది యసమగ్రము - ప్రథమస్కంధమును, ద్వితీయస్కంధమున మొదటి శ్లోకములును లోపించినవి. చతుర్థస్కంధ మసంపూర్ణము. మూడవస్కంధము విమర్శస్కంధమనియు, నాల్గవది విభూతిస్కంధమనియు దెలియుచున్నది. గ్రంథకర్తపేరు తెలియదు. దొరకిన గ్రంథభాగము శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే బరిష్కరింపఁబడినది. భావవ్యావహారికము- రెండుస్కంధములగల విషయములను సంగ్రహముగ బీఠికయందు బరిష్కర్తలు దెల్పియున్నారు. ప్రకటింపఁబడిన భాగము స్వల్పముగుటచేతను, సూత్రప్రాయముగు నిర్వచనముచేతను గ్రంథోపయోగము విమర్శనీయము. వెల రు 1-2-0.

ధనుర్విద్యావిలాసము — ఆంధ్రదేశమును బరిపాలించిన రాజులందఱును ధనుర్విద్యను బోషించియుండిరి. ధనుర్విద్యనుగూర్చిన సంస్కృతగ్రంథములు పెక్కులుగలవు. అగ్నిపురాణము, అభిలషితార్థచింతామణి, శివతత్త్వరత్నాకరము మొదలగు గ్రంథముల గొన్నిభాగములు యుద్ధతంత్ర వివరణముతోఁగూడియున్నవి. ఆంధ్రమున నీగ్రంథముగాక పాకలపాటి రాజగోపాలరాజ ప్రణీతమగు ధనుశ్శాస్త్రము గలదు. ఈగ్రంథము మైత్రేయసగోత్రుఁడు నృసింహగురుపుత్రుఁడు నైన కృష్ణమాచార్యునిచే రచింపఁబడినది. గ్రంథకర్త శకుంతలాపరిణయమను పద్యప్రబంధమునుగూడ రచించియున్నాఁడు. ధనుర్విద్యా

విలాసగ్రంథ రచనాప్రేరకులగు శ్రీ తిరుపతిరాయప్రభుని కాలము క్రీ. శ. 1775 ప్రాంతమని నిర్ణయింపఁబడినది. ధనుర్విద్యను గూర్చిన పెక్కువిషయములు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే నిర్మలమగు పీఠికయందు వివరింపఁబడినవి. కృతిప్రేరకులగు పద్మనాయకవంశీయుల చరిత్రమును గలదు. ఇది మూఁడాశ్వాసముల పద్యగ్రంథము. ధనుర్నిర్మాణము మొదలు దివ్యాస్త్రమంత్రతంత్రప్రయోగమువరకు గల విషయములు వివరింపఁబడినవి. శ్రీ తుంగెరాజాగారు ప్రకటించిన ధనుర్విద్యావిలాస మింతకంటె విపులమైనదని శ్రీ శాస్త్రిగారు వ్రాసియున్నారు. అదియును గొన్ని భాండాగారములందున్నదట. లభించుటలేదు. ఈగ్రంథముతో దానిఁగూడ నికరాను ప్రాచ్యలిఖితగ్రంథాలయమువారు ప్రకటించినచో బాగుగనుండును. నేటియుద్ధతంత్రమున ధనుర్విద్యకు ప్రసక్తి లేకున్నను ప్రాచీనుల ధనుర్విద్యాకౌశలమును, శ్రద్ధయు నిట్టి గ్రంథములవలన మనకు విశదమగును. వెల రు 4-14-0.

ఖడ్గలక్షణశిరోమణి— ఇదియు నైకగ్రంథమువంటిదే. ప్రాచ్యలిఖితభాండాగారమున నాంధ్రశాఖాధ్యక్షులగు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారిచే ప్రకటింపఁబడినది. గ్రంథకర్త నవనప్ప - కులగోత్రములు తెలియవు. తంజావూరు రాయరఘునాథనాయకులు, విజయరఘునాథరాయల యాజ్ఞచే నీగ్రంథము రచించితినని గ్రంథకర్త తెలిపికొనియుండుటచే బదునెనిమిదవ శతాబ్దము చివరివాఁడు. గ్రంథమునకుగల యాంధ్రాంగ్ల పీఠికలయందు దక్షిణదేశవాఙ్మయమును గూర్చియు, గ్రంథమునుగూర్చియు పెక్కువిషయములుగలవు. ద్వాత్రింశాయుధములలో ముఖ్యమగునది ఖడ్గముగావున నద్దాని గుణాగుణంబుల వివరింతునని కవి తెలిపియున్నాఁడు. పారశీకాదియన్యభాషాపదములు పెక్కులు గ్రంథమునగలవు. ఇకరాను దొరతనమువారును ప్రాచ్యలిఖితగ్రంథభాండాగారాధికారులును మిగిలిన గ్రంథముల బ్రకటించి యాంధ్రలోకమున కుపకారమొనర్తురుగాక యని యాశించుచున్నాము.

ఉ. మండలనాథు నాజ్ఞకు సమస్త జనంబులు నోడి పాడిమై
నుండక మేరదప్పి బలియుం డబలున్ మననీక పెద్ద మీ
న్గొండిక మీనుమ్రింగుక్రియఁ గ్రొవ్వునఁ జంపుచునుండెనేని[2] య
మ్మండల మేలనిల్చు[3] మతిమంతులకున్ బరపక్షభైరవా. ౪౯

క. మండలము చెడినఁ బతిచెడు
మండలమును బతియుఁ జెడ్డ మాత్రమెచెడు[4] న
మ్మండలముఁ బతియుఁ గావడి
కుండలక్రియ నుండవలయుఁ గొమసుర[5] భీమా. ౫౦

క. నాయకవిరహితమును బహు
నాయకముఖ్యమును[6] బాలనాయకమును, స్త్రీ
నాయకమైనను చెడు[7] నర
నాయకు రాజ్యంబు కీర్తినారాయణుఁడా. ౫౧

1. ద్రాప్రు (క) (గ) (స)
2. జంపుచు నుండిరేని (గ) (స)
   జంపుచునుండ వ్రేక (క)
3. యుండు (గ) (స)
   మేలియుండ (క)
4. మండలమున్ పతియుచెడిన మాత్రమునచెడున్. (గ)
5. కొమరెరభీమా (గ). ఈ పద్యము (చ) ప్రతిలో లేదు.
6. ముఖ్యంబు (గ) (క)
7. స్త్రీ, నాయకమైచెడుపిరి నర, నాయకులకునంద్రుం. (చ)

## ॥ సేవకపద్ధతి

క. నరపతుల లక్ష్మి విద్యా
పరిణయ[1] చతురులకు వీరభటులకు సేవా
పరులకుఁ దక్కఁగఁ దక్కె
వ్వారికి[2] నగోచర ముదారవైరోచనుఁడా. ౧౨

ఉ.అచ్చుగ నాప్తుఁడయ్యు శుచియయ్యు[3] మహాహితుఁడయ్యుఁ బంచినన్
జెచ్చెరఁ గ్రచ్చకాఁగ[4] పనిసేయఁగనోపియు విద్యగల్గియున్
మెచ్చగ నర్థమిచ్చియును మిక్కిలిబీరము గల్గియున్ భటుం
డిచ్చ యెఱుంగఁడేని పతి కేవ[5] యగున్ బరపక్షభైరవా. ౧౩

క. పతికలిగి తానె పొలియును[6]
బతి నలిగించుటయుఁ[7] దానె భంగమునొందున్
బతి హితమె[8] కాని భటునకు
బతితో నాగ్రహము చనదు బద్దెనరేంద్రా. ౧౪

1. లక్ష్మి విద్యాపరిణతి, (చ)
2. సేనా పరిణతులకుఁ బొత్తరయఁగఁ బరుల కగోచరము (క)
ఈ పద్యము (గ) (ప) ప్రతుల లేదు.
3. సఖుఁడయ్యు (గ)
4. గ్రచ్చగాకి (గ) గ్రుచ్చెగాక (క)
5. కేవమగున్ (గ) కేటికగున్ (క)
6. పొలియున్ (క)
7. నలిగించియును (చ)
8. మతమె (చ) ఇది (గ) ప్రతిలో లేదు.

క. నృపదార నిరీక్షణమును
నృపదాసీసంగమంబు నృపనయవిద్యా
నిపుణు లొడంబడ రెన్నడు
నపథ్యములు[1] గాన దశదిశాభరణాంకా. ౫౫

క. నరపతి ప్రస్తవమునఁ దన
పరిభవమునఁదక్క నొండు పట్టు[2]ల నెల్లన్
బురుషులకు నాత్మరక్షా
కరణము సైరణయటంద్రు[2] ఘననీతివిదుల్. ౫౬

చ. విడువక కొల్వఁగాఁదగు వివేకిని యట్టి[3] నరేశ్వరుండు చొ
ప్పడఁ దగఁడేని[4] మల్లకునిఁ బాయక కొల్వఁదగున్ వివేకి నాఁ
బడఁడఁట తాను మల్లకుని[5] భంగియు లేదఁట యిట్లు రెంటికిన్
నడిమి నరేంద్రుకొల్వుగహనంబు[6] బృహస్పతియంతవానికిన్ ౫౭

1. ... నవ్యములై (గ)
నపథ్యములు (క)
2. రమణీయమంద్రు – కార్య విధిజ్ఞుల్ (గ) పట్లను సేవా, పరునకు...... కరణీయ
మంద్రు కార్యవిధిజ్ఞుల్ (చ)
నొండుపట్లను సేవా
పరులకు నిజాత్మరక్షా
పరతయ రమణీయమంద్రు బద్దినరేంద్రా. (చ)
కరణమ రమణీయమంద్రుగద బద్దెనృపా. (ప)
3. వివేకి వివేకి నరేశ్వరుండు (క)
4. చొప్పడరగునేది (ప)
చొప్పడం దగునేని (గ)
5. బడెడియట్టి మల్లకపు భంగియు (గ)
6. గ్రహణంబు (క). ఈ పద్యము (చ) ప్రతిలో లేదు.

# 12 దుష్టసేవకపద్ధతి

ఉ. జీతము లూఁదికొండ్రు పతిచిత్తము గూడఁగఁబోరు పోవలన్[1]
భూతలనాథునిన్ విడచిపోదురు పోవక యుండిరేనియున్
వేతురు[2] విగ్రహవ్యసనవృత్తి భయస్థులుగారు గాన సం
ఘాతమనస్కులై మనుమగల్ ప్రతిపక్షులుగాక భృత్యులే ౫౮

ఉ. చెందియుపాయ[3] మెవ్వరికిఁ జేయఁగనోపని దుష్టవర్గముల్
బొందఁగనేమి నేర్పగుట భూమిప్రసిద్ధము[4] లి ట్లెఱింగియున్
మందవిచారులై నిమిషమాత్ర న[5] పాయము చేయు దోషులన్
బొందఁగ నిచ్చు టెవ్వరికి బుద్ధియె రాజమనోజభూభుజా. ౫౯

క. ఉఱువాని కొల్వకుండియు[6]
నుఱువని తా నాశ్రయించి యుండియుఁ బతిఁ బ
ల్మఱుఁ బఱతు రేని వారల
కొఱగామికి[7] మేర యెద్ది కొమరుర భీమా. ౬౦

---

1. పతిచిత్తముఁ గూడరు తారు స్వేచ్ఛులై (ప)
,, వారు ,, (స)
పతిచిత్తముఁ గూడరు దారు గ్రచ్ఛులై (గ)
2. భూతలనాథు వీడొదలి పోవఁగఁ జూతురు పోవకుండినన్ రేతురు (స)
,, వీడుకొలి ,, ,, వేతురు (స)
భూతలనాథునిన్ దొఁగ ... ండుగబోదురు పోవరేనియున్ వైతురు (గ)
ఈ పద్యము (చ) ప్రతిలో లేదు.
3. యుపాయ మెవ్వరికి సేయఁగనోపెడి భృత్యవర్గముల్ (ప)
యుపాయ మెవ్వరికిఁ జేయఁగనోపడు భృత్యవర్గమున్ (గ)
4. పొందగ నియ్యకుండుటది భూమిప్రసిద్ధమె యిట్లెఱింగియున్ (గ)
భూమిప్రసిద్ధము (ప)
5, నిమిషమాత్ర మపాయము (గ). ఇదియు (చ) ప్రతిలోఁ గన్పడదు.
6. ... రదని కొల్వకున్నది (గ)
ఉఱ రేని కొల్వకుండిన (ప)
7. యుండెడు పతి బల్మఱు లేతున్న యభృత్యుల కొఱగామికి (ప)

క. భేదమున శత్రుజనసం
వాద మనుషించెనేని వధ్యుండు శిర
శ్ఛేదము సేసిన[1] వృత్తి
చ్ఛేదంబున కర్హుఁడండ్రు సేవకు నార్యుల్ ౬౧

## 13 దుష్టరాజపద్ధతి

కోప ప్రసాద గుణములలోఁ
గోపము[2] చూపుచుఁ బ్రసాదగుణ మెయ్యెడలం
జూపని నరపతి[3] గొల్చిన
పాపమునకు మేర యెద్ది బద్దెనరేంద్రా. ౬౨

ఉ. జీవితమీఁదు, మున్గడవఁ జేసినవృత్తి క్రమక్రమంబునం
బోవఁగఁ జూచుఁ దేజమునఁ బుట్టిన[4] లాభముదప్పఁజేయు స
ద్భావము బొంకుగాఁదలఁచుఁ[5] బాయక నేరము రోయుఁగావునన్
సేవకులకు విరక్త నృపసేవ విపజ్జలరాశి ముంపదే. ౬౩

1. శత్రుజనసంపాదన మొనరించలేని వధ్యుడు రాసిచ్ఛేదముసేసియు (గ)
నేని వలను గరాసిచ్ఛేదము (ప). ఇది (గ) ప్రతిలో సంకీర్ణపద్ధతియందుఁ గలదు.
2. కోప ప్రసాదములలోఁ గోపమెచూపుచు (క) (స)
,, గోపము చూపుచు (చ)
3. నృపతిం (చ)
4. బుట్టెడు లాభముదప్పఁ జేయు (చ) (స)
5. బొంకుగా వగచు (క) (గ) (స)

క. గడుసరి లోభుల కియ్యని
నుడువుల విస్తరము విని జనుల్ మతిచెడి చే
డ్వడియుండు టొండుపట్టుల[1]
కుడుపునకును విఘ్నమండ్రు బద్దెనరేంద్రా[2] ౬౪

క. నరనాథు కరుణభృత్యులు
సిరివలన నెఱింగికొనక[3] సిరివెలిగాఁ గ
ర్ణరసాయనములు వల్కెడు
ధరణీపతి కొల్వు[4] విడువఁ దగినది కాదే. ౬౫

క. పెనులేనివాడు నవసిన[5]
జనులం గలయట్టివేళ జనపతిఁబ్రోవ
న్మనుచూడ్కి[6] యీని పతికిని
బనిసేయఁగ భటుఁడు బేల బద్దెనరేంద్రా[7]. ౬౬

క. పనివినినఁ గొలువ వలయును
పని వినఁడేఁ దసకుఁదానె పనివినవలయున్[8]
పని వినని నృపతిగొలిచిన
బని చెడు మనుజాధముండు బద్దెనరేంద్రా[9]. ౬౭

1. మతిజెడి యుండెడి పట్లన్ (గ) 2. కొమరెరభీమా (గ) 3. భృత్యుల సిరవలన న తెలియుగాన (గ) 4. ధరణీతలనాథువిడువఁ దగఁనదికాదే (గ) 5. తన లేమినాడు నరసిన (ప) 6. మనుచుండి (ప)

7. ఈ పద్యము (చ) ప్రతిలోలేదు. (గ) ప్రతిలోని పాఠము.
 ... కూర్మికన్నుల
ధనహీనుండైననాడు తడవటకడకన్
మనుచుండి యీని పతికిని
పనిసేయు భటుండు బేల బద్దెనరేంద్రా

8. దన్నుఁదానె పనిచిన వలయున్
పనివినియు వినని నరపతి
పనిచేయు భటుండు బేల బద్దెనరేంద్రా. (ప)
పని దెలుపక వినవలయును
బనిదెలిపిన యంతనైనఁ బాటింపఁ జనున్ (స)

9. మహీ బద్దినృపా (చ)

క. దొరవడయు[1] వలయు నొండెను
సిరివడయఁగవలయు నృపతిచేఁ భృత్యునకున్
దొరతనము సిరియు[2] వెలిగా
నరపతి తన యెఱుకముద్దె[3] నయతత్త్వనిధీ. ౬౮

చ. అతిహితవృత్తినైహిక సుఖార్థము గొల్చెద రెల్లవారు భూ
పతుల పరత్ర కేఫలము భక్తిపురస్సర మిష్టమైన దై
వతమునుగొల్చినన్[4] మఱుభవంబునఁ బుట్టమి సంభవించు నా
శ్రితజనసేవకల్పకుజసేవయ[5] నన్నన గంధవారణా. ౬౯

క. కెలసము సేసియు నవసియుఁ
గొలిచిన ఋణమెట్లయీని కువలయపతియు[6]
కోట్లు వేల యుత్తరోత్తర
ఫలసారమె రాజసేవ బద్దెనరేంద్రా. ౭౦

1. దొరతనము (చ)
   ధరవడయ (గ)
2. దొరయును సిరియును (చ) (స)
   ధరయును సిరియును (గ)
3. తల యెఱుక (చ) (గ). నరపతులను గొల్పుటేల (ప) (స)
4. భజించినన్ (గ)
5. నాశ్రితజనకల్పసేవ కుజసేవయ (గ)
6. గొలిచినఁ గొదవట్లయేనిఁ గువలయపతిదా (చ)
   కొలిచినఁ గొలువియ్యలేని కువలయ పతులన్ (ప)
   నవసినఁ గొలిచిన కొదవట్లయీని కువలయపతులన్ గొలువేటికి (స)

క. నేరము చేసియు[1] నలుగక[2]
నేరకయుండెడు విరక్త నృపతింగడవన్
దూరస్థులు గాకుండెడు
వారలు దుర్మతు లుదారవై రోచనుఁడా. ౭౧

క. అనవస్థితుఁ[3] డవిచారుం
డను నభ్భూపతికి నాప్తుఁడై కట్టనుఁగై[4]
మనఁ బ్రేతవిభుని ప్రజ గా
ననుచరుఁ డట పోవు దశదిశాభరణాంకా. ౭౨

క. ఆశ్రయణీయుండగు పతి
యాశ్రయ మాశ్రయము గాక యార్యులకు నయో
గ్యాశ్రయమది యాశ్రయమె[5] ని
రాశ్రయ మెట్లట్లు దశదిశాభరణాంకా. ౭౩

1. గలిగిన (గ)
2. వేరమి దొడరిన దిద్దఁగ నేరకయుండెడి (చ)
   ,, నలుగఁగ ,, విరక్త
3. అనవస్థిరు (గ) నృపతుల కొలువుల్ (స)
4. డనదగుభూపతికి నాప్తుడవు వా
   డనుగై మను నోలిక ... ప్రజగా
   కను చరుడెటవోవు ... (గ)
   మననూతి యఱితి ప్రజగానను చరుఁడట (ప)
5. యాశ్రయ మాశ్రయము జనుల కశ్రమముని
   యోగాశ్రయము దలంచిచూడ (క)

# 14 దానశీలతాపద్ధతి

ఉ. దానగుణంబ యెన్నఁగఁ బ్రధానగుణంబది మున్ను గల్గినన్
గాని విశేషమై[2] పురుషకారము నిల్వదు లోభినాఁగఁ జ
న్నని[3] యశంబు సత్త్వము సహిష్ణుతయున్ విభవంబు విద్యయున్
మానము బీరమున్ వృథయ మానిసికిం బరపక్షభైరవా. ౨౪

ఉ. యగుఁ జేలఁ జొప్పడును[4] జేకులు నర్థములీయఁ జొచ్చినన్
బాయుఁడు[6] వెండి లచ్చికి నుపాయము గల్గునొ లేదొ యంచ భి
ప్రాయము పుట్ట లోభిగుణభావముఁ జేకొనెనేని వాని శ్రీ
వాయున కాఁగ నమ్మనది భావన నన్నన గంధవారణా. ౨౫

ఉ. ఎత్తిన కాల కాని[7] సిరి కెన్నఁడు నిల్చిన కాల నిల్వఁగాఁ
జిత్తము లేదు కాన సిరిచెందిననాడ పరోపకారముల్
హత్తి కడంగి సేయఁ డెడరైనఁ బదంపడి వేడుకొందమన్
చిత్తమెకాని యుత్తమను చిత్తము పుట్టునె యెట్టివారికిన్.[8] ౨౬

1. యెందును (గ) (ప)
2. విశిష్టమై (చ)
3. మన్నని (గ) (ప)
4. దనువు మన్ననయున్ వృథ బద్ధిభూపతీ (చ)
5, శ్రీయగుఁ జెల్లఁ జొప్పడఁగఁ జేకులు (క)
6. పాయఁడు (క) ఈ పద్యము (గ) (చ) ప్రతుల గన్పడదు.
7. కాలెకాని (గ)
8. ఇది (చ) ప్రతిలో లేదు.

# 15 లోకనీతిపద్ధతి

క. బలిమికిఁ బాడి తపంబున
కలుగమి సిరికోర్పు విద్యకభిమానము వా
క్ఫలమునకు[1] బొంకు వారయమి
కులమున కాచార మొప్పుఁ గొమరుర భీమా. ౭౭

క. కుల మాచారముఁ దెలుపును[2]
గలిమి శరీరంబె తెలుపుఁ గల పద్యగతుల్
పలుకుల నె తెలుపుఁ[3] గోరిక
కొలఁదులఁ గూడ్కములు తెలుపుఁ గొమరుర భీమా. ౭౮

క. హీనునకుం బలిమి పరా
ధీనునకు సుఖంబు దుర్మతికి శిష్యజయ ము
జ్ఞానికిఁ బరత్ర[4] నలిగెడు
వానికి[5] సైరణ యసంభవము బద్దినృపా. ౭౯

---

1. వాక్ఫలమునకు (గ)
2. చెప్పును (చ)
3. గలిమి శరీరంబె చెప్పుఁ గల విద్యలు దా
బలుకుబడి చెప్పుఁ గూరిమి
కొలఁదులు కూటంబె చెప్పుఁ గొమరుర భీమా (చ)
గలవిద్యలు తాఁబలుకుల నెచూపుఁ గూరిమి కొలఁదులు చెయ్యుల నెచూపు(ప)
4. సుచరిత (గ)
బరమును (చ)
5. యలిగిన (క)
కొలిచినవానికి (గ) (చ)

ఉ. చేతులు వత్సరూపముగఁ జేకొని[1] చేపి యభీష్టవస్తుసం
ఘాతము లెప్పుడున్ గురియు కామదుఘత్వగుణప్రసిద్ధి[2] ధా
త్రీతలధేనువుండఁ దమిదీఱమి[3] నన్యులనాశ్రయించి తృ
ష్ణాతురులైనఁ జొప్పడునె యర్థము రాజమనోజభూభుజా. ౧౦

క. దొరలేనివాని విద్యయు
దరిద్రు మహిమయును మూర్ఖు తపమును బాడిం
బొరయని నరపతి రాజ్యము[4]
పరికింప నిరర్థకంబు బద్దె నరేంద్రా. ౧౧

క. జూదము సహగృహవాసము
వాదము కరిసనము పొత్తు వడ్డికిఁ దొడరన్
గాదిది తమలో[5] విరసో
త్పాదన కారణము లగుట బద్దె నరేంద్రా. ౧౨

క. తలకెడవై యందఱుఁ జు
ట్టలు[6] దోతురు లక్ష్మి పొందుటయుఁ బాయుటుఁ దోఁ
బలుకరు గావున లక్ష్మి
లలనయ చుట్టంబు మనుజులకు బద్దెనృపా. ౧౩

1. వత్సరూపమున చేకొని (గ)
వత్సరూపమునఁ జేకొనఁ జేసి (చ)
2. శుభప్రసిద్ధి (చ)
3. దగతీఱమి కన్యుల (చ)
4. బొరయని రాజ్యము మిగులన్ (చ)
5. వడ్డియు దొడరన్ గా దమలోనను (చ)
గాదు తమలోన (గ)
6. తలవెంట్రుకలందఱు చుట్టలు (గ) (చ) (ప)
7. దోచుటయు (చ)

క. చేరఁబడి చెలులు చుట్టలుఁ
గోరి యభీష్టంబు పంచి కుడువనిసిరి ని
స్సారము నిరర్థకంబు వి
చారింప నపారవిభవసంపన్నులకున్ ౧౪

క. ఎందును గార్యవిచారము
డెందము గలవాఁడె తీర్పు డెప్పరమైనన్
బొందించు నతఁడు గావునఁ[2]
బందకు మతిపుట్ట దంద్రుఁ బద్దెన చేంద్రా. ౧౫

క. ఎంత మతిమంతులకు ధృతి
మంతుల కింతుల కటాక్షమార్గణవర్గం
బంతఃకరణము దూరని
యంతకె ధైర్యంబు దశదిశాభరణాంకా. ౧౬

క. కర ముచితజ్ఞులు జాగులు
నొరు లొరిమెకు నెల్లవారి యుచితజ్ఞతయున్
బురులొప్పఁదమ్మఁ[4] దొడరిన
నరిది యనుష్ఠింపఁ దశదిశాభరణాంకా. ౧౭

1, ఇది (చ) ప్రతిలో లేదు. (గ) ప్రతిలో దానపద్ధతియందు గలదు
2. డెందము గలఁగదు గావున (చ) (ప) ఈపద్యము (గ) ప్రతిలో లేదు.
3. ఈపద్యము (చ) ప్రతిలో లేదు.
4. కర ముచితజ్ఞులచేగమి లొరులొరిమెకుఁ దమ్మఁడా మె. (ప)
ఈపద్యము (గ) (చ) ప్రతుల లేదు.

క. స్నేహలతలు సద్గుణసం
దోహజలంబున నె పెరుగు దుర్గుణయుక్త
స్నేహితులవలన మాత్ర
స్నేహముఁ జెడునండ్రు రాజసిద్ధాంతవిదుల్.[1] ౮౮

క. అలుకయు పగ సౌజన్యమె
చెలి, యూసయు[2]కష్ట, మెప్పె సెగ్గము,[3] విద్యా
బలము గురుత్వము,[4] రాజ్యము
ఫల మాజ్ఞయ యండ్రు బుధులు బద్దెన రేంద్రా. ౮౯

క. క్రూరాహు లెగసి కరచిన
వారిధి యేమేర దప్పివచ్చినఁ బతి దాఁ
గ్రూరుండైనను ప్రజసం
హారముగాకున్నె దశదిశాభరణాంకా.[5] ౯౦

క. ఆయంబు వ్రయము[6]నొడిచిన
శ్రీయగు, సమమైన దశము చెడకుండు, వ్రయం
బాయమున కధికమైనను[7]
పాయదు పేదఱిమి[8] సార్వభౌమునికైనన్. ౯౧

1. నయవిశేష విధిజ్ఞుల్ (గ)
2. మాసయ కష్ట (చ)
   అప్పెకష్ట (గ)
3. మురువు సేవ్యము (గ)
   మప్పసెగ్గము (చ)
4. విద్యాబలమే శీలము (చ)
   ,, వినయము (గ)
5. హారంబగుగాక బ్రతుకునాశయు గలదే (గ) చెన్నపట్టణపు ప్రతి
   హారముగాకుండ నిలుచునా బద్దెనృపా. (ప)
6. వ్యయము (స)
7. బాయమును నొడిచె నేనియు (చ)
8. పాయదు పెనులేమి (ప)
   పాయును సిరియొంత (చెన్న)

క. దళమునకుఁ దగని భోగము
వలసిన యువి మేరదప్పి[1] వచ్చిన చేతం
గల పురులు మేని పురులును
బొలియుం బురుషులకు నంద్రదు[2] భూపదిలీపా. ౯౨

క. పరిభవము దొడరు నెడలను
సురతమునందక్క నెల్లచోఁ బురుషున కా
భరణము సైరణ సతికా
భరణము లజ్జాగుణంబు బద్దెనరేంద్రా.[3] ౯౩

క. చెడినట్లయుండి మనుదురు
చెడని తెరంగున నె యుండి చెడుదురు మనుజుల్
చెడితిమని వగవఁ జెడమని
కడువీఁగఁగఁ జను నె యెఱుకగలవారలకుఁ. ౯౪

క. ఎట్టిది పురుషు పురాకృత
మట్టిద మతిసంభవించు నట్టిర చెలుల్
జుట్టలు నగుదురు కర్జం
బట్టిద వర్తిల్లుఁగడఁక యట్టిద పుట్టుక్.[5] ౯౫

---

1. దళమునకు దగినభోగము వలయున యదిమేరదప్పి (ప)
2. బొలియును భూపతులకంద్రదు (ప) ఈపద్యము (గ) (చ) ప్రతులలేవు.
3. ఇది (గ) ప్రతిలోలేదు.
4. ఇది (గ) ప్రతిలో గన్పడదు.
చెడతినని వగను జెడనని
కడువీగును జెందఁ డెఱుకగల మనుజుడిలక్ (చ)
5. గడఁకలట్టివ పుట్టుక్ (క)

చ. పిసిడియొకష్టుఁ, డాజిముఖభీతుఁడెబూతు, కృతఘ్నువృత్తికిన్
విసువనివాఁడె మాలఁ డవివేకియెచీకు, శఠుండె సోమరి
వ్యసనియ[1] కాతరుం, డనృతవాదియెకల్లరి, మూర్ఖెచిచ్చు ఛాం
దసుడె మృగంబు కొండియడెధాయ దరిద్రుఁడె వేదురెయ్యెడన్

క వలను గలవా రసాధ్యుల
కలుగ రపథ్యముల చవులనాఁగరు లోభిం
గొలువరు విరక్తవనితం
గలువరు దుర్జనుల గోష్ఠి గలయరు ప్రీతిన్.[2] ౯౭

క. సందియము లేమి ప్రాలను
నందము, పురుషానుకూలయగుటకులస్త్రీ
కందము, మగవానికి నిజ
మందము[3] మర్యాద పతికి నందం బొందున్. ౯౮

చ. కులమును పుత్రుచేఁ జెలిమి కార్పమిచేఁ ధనయుండునుద్దుచేఁ
బలుకనృతంబుచే నెలతపానముచే[4] మునిసంగమంబుచే
వలను ప్రతిజ్ఞచే దౌరవివాదముచే పురుషుండు లేమిచేఁ[5]
గలిమిమదంబుచే మది[6]వికారముచేఁ జెడు బద్దిభూపతీ. ౯౯

---

1. శఠుండె దొంగ దుర్వ్యసనియ (చ)
   శఠుండ పామర వ్యసనియ (క)
   శఠుండ మూర్ఖ దుర్వ్యసనియ కావరుండు. (ప)
2. ఇది (చ) ప్రతిలో లేదు. చవులకలకరు (ప)
   చవుల కడఁగరు (చెన్న)
3. మగవానికి నలువందము (గ)
   ,, నలవందము (క)
4. నడత పానముచే (క)
   బిడెము పానముచే (చ)
5. గుణమొప్పలేమిచే (చ)
   తన యొప్ప లేమిచే (క)
6. మతి (క)

క. కడఁగి యగోచర వస్తువు
పడయుదునని యెంత[1] యాసపడఁ దొడఁగ జనుం
డెడ పసి వేదనపడఁ జే
డ్వాడు బేలయనాఁగ నిడుమపడుఁ గడుఁ జెడగన్. ౧౦౦

చ. అమరఁగ విద్యగల్గిన మహాత్మున కెద్దెసవోయినన్ స్వదే
శము, కడవన్ సమర్థున కసాధ్యము యెద్ది కడంగి[2] చేసినన్
సమధురవాణియైన గుణశాలికి నెయ్యురె యెవ్వరున్ బటు
త్వము[3] గలవానికిం గొలువు తద్దనుఅంగట[4] బద్దెభూపతీ. ౧౦౧

క. అగుటయుఁ గామియు విధివశ
మగు టెఱుఁగక[5] తనవశంబె యని డెందములోఁ
వగ చెడుమూఢుఁ[6] గనుంగొని
నగఁడె విధాతృండుకీర్తి నారాయణుఁడా. ౧౦౨

క. కాని యదికాద యయ్యెడు
దాని కవశ్యంబు[7] నన్యథాభావమిలన్
కానేర దింత యెఱుఁగని
మానిసి చింతాసముద్రమగ్నుఁడు కాఁడే. ౧౦౩

1. యాసపడుచుండు జనుం
డెడపడని మనోవేదన
పడుఁగీడ్వాడు బేఁనంగఁబడు నిడుమఁబడున్ (ప). ఈపద్యము (గ) ప్రతిలో లేదు.
2. దొడంగి చేసినన్ (గ)
3. భటత్వము గలవానికిన్ (గ)
4. తద్దమరంగది (ప)
5. మగుటెంచక (గ)
6. ముగుదం (గ)
7. కాని యదిగాదు యెయ్యది దాని కనన్యంబు (గ)

ఉ. మాసినవాఁడెమాల యభిమానియె మేనువు దానధర్మముం
జేసినవాఁడె వేల్పు కృషిసేయనివాఁడె దరిద్రుఁ డాప్తులన్
బాసినవాఁడె బేల యొరుఁబల్కనివాఁడె ప్రభుండు రాజులన్
డాసినవాఁడె ధీరుఁడు దృఢంబది సన్ననగంధవారణా. ౧౦౪

ఉ. వాన సమస్తజీవుల కవశ్యము[1] ప్రాణము ప్రాణమైన య
వ్వానయు బల్మెఱుం గురియవచ్చినఁ దిట్టుదు రెల్లవారలున్
హీనమనస్కులై యొఱులయిండ్లకుఁ బల్మెఱుఁబోవు నేనియుం
మానిసికట్ల[2]వచ్చు ననమానమునూనము మానభంగమున్ ౧౦౫

చ. సిరిగలనాఁడె[3] మేనఁదనజీవము గల్గిననాఁడె కాలముం
దిరుగనినాఁడె తేజమెడఁ ద్రెవ్వనినాఁడె యనేకదుస్థితుల్[4]
పొరయనినాఁడె మానవులు[5] బుద్ధిదలంచి పరోపకారముల్
తిరముగఁ జేయుటొప్పు[9] నదితీరినఁ జేయ విధాతశక్యమే. ౧౦౬

క. అజ్ఞానమహాఘనునకు స
ర్వజ్ఞునకుం దక్క దుఃఖవారణ మత్యా
ల్పజ్ఞులకుఁ బాయదని[7]త
త్త్వజ్ఞులు చెప్పుదు రుదారవైరోచనుఁడా. ౧౦౭

1. కవన్యము (గ)
2. యిండ్లకు నెప్పుడుబోవునట్టి సన్మానికినైన వచ్చు (గ)
3. నాఁడెయనుటకు (చ) ప్రతిలో చోటగలదు.
4. చోటను దుఃఖసంఘముల్ (చ)
5. పొరయనియట్టి చోటఁదగఁ బుద్ధిదలంచి (చ)
6. జేసినకాని యదితీరినఁ జేయను ధాతశక్యమే (చ)
7. దుఃఖవాసరమతి యల్పజ్ఞులకుం గాదని (గ)

క. తీర్థప్రధాన నిజభో
గార్థం బార్జించు[1] నర్థమర్థము ధరన
త్యర్థ ధనలోభివడసిన[2]
యర్థ మనర్థకము దశదిశాభరణాంకా. ౧౦౮

క. ఒనరఁ బురాకృతకర్మకు[3]
ననురూపము చిత్తవృత్తియగుటయు[4] కర్మం
బను సూది పిరిది త్రాడై
చను మతి తనవశముగాదు సర్వజ్ఞనిధీ.[5] ౧౦౯

క. ఆపదఁదూలినఁ[6] బగతుర
చేపడినను జాలలేమిఁ జెందినచోటన్
భూపతి కోపించినచోఁ[7]
బ్రాపగు నాతండు ఘనుఁడు బద్దెనరేంద్రా. ౧౧౦

క. ఆపద్వినీతులగుదురు
కాపురుషులు పరమపురుష[8] కారణికగుణుల్
శ్రీ పాటింప వినీతులు
నాపద్దశకంటె[9] దశదిశాభరణాంకా. ౧౧౧

1. ముపార్జించు యర్థమది యర్థము (గ)
2. వ్యర్థధనలోభి బడసిన (గ)
3. బురాకృతఫలమునక (చ)
4. యగుటను (క) (చ)
5. సర్వజ్ఞునకున్ (గ) (చ)
6. యగుచో వైరులచేపడు నెడ యధిక లేమి జెందిన పిదపన్ (గ)
7. గోపించినతరి......టంబు వలయు బద్దెనరేంద్రా (గ)
8. పురుషకారగుణుల్ శ్రీ। ప్రాపింప వినీతులగుదు। రాపద్దశకంటె (చ)
9. యాపత్సమయమున (గ)

క. నయమున్నఁ బాలుఁద్రావరు
భయమున్న నమేధ్యమైన భక్షింతురు నా
నయము భయంబులలోపల
భయమే నయమండ్రు బుధులు బద్దెనరేంద్రా.[1] ౧౧౨

క. గృహమొప్పు గృహిణిచేతను
గృహమును గృహిణియును నొప్పుఁ గొడుకులచేతం
గృహమును గృహిణియుఁ గొడుకులు
బహుసంపద నొప్పుచుండ్రు బద్దెనరేంద్రా.[2] ౧౧౩

ఉ. సున్నములేనివీడెమును జూడఁగ రంజనలేని వేశ్యయున్
వెన్నెలలేని రాత్రియును వేదముశాస్త్రములేని విప్రుఁడున్
జన్నులులేని జవ్వనము చందమెఱుంగఁగలేని కావ్యమున్[3]
మన్ననలేని రాజ్యమును మానుగ[4] నొప్పదు బద్దెభూపతీ. ౧౧౪

చ. ధరణిపుఁడాజ్ఞచే శుభము దైవముచేతఁ దపంబు శాంతిచే[5]
సురతము ప్రౌఢిచేఁ బలుకు సూనృతుచేఁ గుల మాత్మవేదిచేఁ
బురు[6] లుపకారిచేఁ గవిత పూజ్యతచే సతి సాధుశక్తిచేఁ[7]
బురుషుఁడు తాల్మిచే మహిమ పుణ్యముచే వెలయున్ యశోనిధీ.
౧౧౫

1_2. ఇది (గ) (చ) (ప) ప్రతుల గన్పడవు. బద్దెన కృతముగాదని తోచెడిని.
3. శాంతములేని తపోవిశేషమున్. (క)
4. చిన్నములేని రాజ్యరమ చెప్పగనొప్పదు. (గ)
మన్ననలేని కొల్వు మతిమానఁగనొప్పదె (క)
5. నరుఁడు దైవముచే దైవంబు మర్త్యుచే (చ)
దైవముచేతను వేల్పు మర్త్యుచే (ప)
6. పరులుపకారిచేఁ గలిమి బంధులచే దొర ధర్మబుద్ధిచే (చ)
7. సతి నాథుభక్తిచే (ప)

చ. పలువురతోడి విగ్రహము బాంధవవర్గముతోడి గర్వమున్
గులసతితోడి రాపుడును[1] గ్రూరునితోడి సఖిత్వమున్ మహా
బలయుతుతోడి పోరు[2] పరభామలతోడి రహస్యభాషలున్
దలఁపఁగ హానికార్యములు తప్పవు నన్నన గంధవారణా.[3] ౧౧౬

చ. ధరణియతల్లి తన్గనిన తల్లియ వేల్పు గుణంబు మేనికా
భరణము బుద్ధిరూపు కులభామయ సంపద బొంక వేధ సో
దరుఁడిలఁ బ్రాపు చంపమి యధర్మువు క్రోధము పాతకంబు మ
త్సరమ వినాశహేతువు విచారవె సారము బద్దెభూపతీ.[4] ౧౧౭

చ. అఱమఱలేక చెడ్డయెడ నక్కఱదీర్చిన యట్టిచుట్టమున్
దఱిఁదమకించు భర్తను[5] పతాపము సేయక పొందు కోమలిన్
నెఱయఁగ లేమిఁజూచి కడు నెయ్యము తోడుతఁ బ్రోచు భూపతిన్[6]
మఱతురె యెన్ని[7] జన్మముల మానగుణోన్నత బద్దెభూపతీ ౧౧౮

1. గులసతితోడి పోరు కడుఁ గ్రూరుని (చ)
2. రాపు (చ)
3. కార్యము లుదారగుణాకర బద్దెభూపతీ. (క) ఈపద్యము (ఘ) ప్రతిలో లేదు.
4. ఈపద్యము (గ) (చ) ప్రతుల లేదు.
5. తఱిఁ దగనీని చోటను పతాపము (చ)
6. నెఱయఁ గ్రమక్రమంబెఱిఁగి నెయ్యముఁ జేసినయట్టి భూపతిన్ (చ)
7. కోటి జన్మముల (చ)

ఉ. నేరుపుకంటె విద్య[1] మఱి నీతివిలాసము[2]కంటె బుద్ధి యా
చారముకంటెఁ బావనము సత్యముకంటె[3] సుఖంబు నెల్ల చో
సైరణకంటె మైమఱపుఁ జాగముకంటె యశంబు దుర్జనుం
జేరుటకంటె నెగ్గు మఱి చెప్పఁగలేదు[4] ధరాతలంబునన్. ౧౧౯

చ. [5]కరిసనమోపి చేసినను గర్ణునిఁగొల్చిన హీనమాడినన్[6]
దిరిసన ధాత్రి[7]గోసి పరదేశముపోయిన విద్యఁగల్గినన్
సిరి తనపూర్వజన్మమునఁ జేసినయంతయ కాక కల్గునే
పొరలిన వ్రేలఁబడ్డఁ[8] దలపోతలుపోసిన వెచ్చనూర్చినన్. ౧౨౦

ఉ. శ్రీవిభుఁడైన బద్దెనృపశేఖరు సేసిన నీతిశాస్త్ర[9]ము
క్తావళి శిష్టలోక హితమయ్యెడుఁ గావుత నాడునాటి[10]కిం
దీవర గర్భుఁడున్ శశియుఁ దిగ్మమరీచియు భూతధాత్రియున్[11]
దేవగణంబులుంబుధులుదిక్పతులుం గలయంతకాలమున్[12] ౧౨౧

1. ఈపద్యము (గ) (చ) ప్రతుల లేదు.
   వింత (ప)
2. విచారము (ప)
3 సత్యముకంటె మహావ్రతంబు సం
   సారముకంటె మాయ గుణిసంగతికంటె సుఖంబు దుర్గుణిం (ప)
4. మఱిఁ జెప్పఁగనెద్ది (ప)
5. ఈపద్యము (గ) (ప) ప్రతుల లేదు.
6. కరిసన మొప్పఁజేసి కడకన్ నృపుఁగొల్చిన జూదమాడినన్ (చ).
7. దిరిసిన నిల్లు (చ)
8. మిట్టిపడ్డ (చ)
9. బద్దవిభుచేసిన నిస్తులనీతిసార (చ) నిర్మల (ప)
10. శిష్టలోక హృదయప్రియమై యలరారుఁగాత (చ)
11. హరియుఁ దేజమెలర్పఁగఁ జంద్రసూర్యులున్ (చ)
12. ఇది (గ) ప్రతిలో లేదు.

ఉ. [1]బద్దెననీతి యెవ్వరు ప్రభాతమునం బఠియించిరేని వా
రెద్దెస కేఁగిరేని తమయింట సుఖంబున నున్నయట్ల యా
పద్దశవాయు శత్రులును బంధుల గావున భద్రవాక్యముల్
పెద్దలు పెంపుచేసి కడుఁబెంపుననుండుదు రెల్లకాలముఁ. ౧౨౨

క. పెద్దలనీతుల లోపల
బద్దెననీతియె సునీతి పరమార్థము[2] శ్రీ
పెద్దయగుఁ జదువఁగలిగిన[3]
బుద్ధియుఁ బ్రాజ్ఞతయుఁగలిగి భువిలోవెలయుఁ.[4] ౧౨౩

గద్య. ఇది శ్రీ లక్ష్మీరమావల్లభ పాదపద్మారాధక[6] కమలా-
కులపవిత్ర సన్నన గంధవారణ రాజరాజమనోజాంక[7]
బద్దెనాఖ్యప్రణీతంబైన రాజనీతిప్రకారం[8]బన్నది
సర్వము సంపూర్ణము.[5]

1. ఇది (గ) (చ) (ప) ప్రతులలేదు.
2. నీతియను నీతి పరమార్థము (క)
   నీతియె సునీతి పరమార్థము (గ) (ప)
3. జదువ దొణగిన (గ)
4. శుభము పుణ్యము గలుగుఁ.
5. పద్మారాధన (చ)
6. రాజమనోజ రాజాంక (చ)
7. నీతి సారంబందు లోకనీతిప్రకారం బన్నది చతుర్థాసికారము (చ)
8. (గ) ప్రతిలో గద్యలేదు.

# (ప) ప్రతిలోని యధికపద్యములు

క. అతిమహిమోన్నతియును సం
పతియును జేయునది యర్థభారనియోగ
స్థితి తంత్రములకు మంత్రిన్[1]
బతిజేయుట బుద్ధి[2] గాదు బద్దెనరేంద్రా.

చ. పెఱికినవాని నాటుచును బెంపుగఁ బూచినవానిఁ గోయుచున్
గుఱిగలవాని నొంపుచును గూడినవన్నియుఁ బాయఁజేయుచున్
గఱకుల నెల్ల నేఱుచును గంటకవర్గము వేళ్ళ నెత్తుచున్
మఱవనిరాజు వర్ధిలును మాలకరింబలె బద్దెభూపతీ.[3]

క. శ్రీ తన్వీచిత్తజయా
పాతి[4]శయోన్నతుఁడ బద్దెనాఖ్యుఁడ బుధసం
ప్రీతి మనస్కుఁడ సేవక
నీతులు రచియింతు[5] సభమనీషులు పొగడన్.[6]

క. విను పేదఁ గూర్మికన్నులఁ
గని నిర్ధనుఁడైననాడు కడవక క్రేవన్
మనుచుండి యీసి పతికిని
పనిసేయఁగ భటుఁడు బేల బద్దెనరేంద్రా.[7]

---

1. నత్యర్థమార్గభార నిమగ్నస్థితియును దంత్రము మంత్రికి (చ)
(గ) ప్రతిలో (ప) ప్రతిలోని పాఠమే కలదు. స్థితియును దంత్రము మంత్రిని (స)
2. బతియిచ్చుట నీతిగాదు (చ)
3. ఇది (గ) (చ) ప్రతుల లేదు.
4. శ్రీతన్వీ భూషితవిద్యాతి. (చ) శ్రీతన్వీవిభూసుత. (చ)
5. వివరింతు (చ)
6. మెచ్చన్. ఇది (చ) ప్రతిలో సేవకనీతి ప్రకరణమందు మొదటిపద్యము.
7. ఇది (గ) (చ) ప్రతుల లేదు.

క. భానుకులభూషణుండను[1]
భూనుతవిక్రముఁడ బద్దెభూపతిఁ గవి స
న్మానితుఁడ లోకనీతు ల
నూనోక్తి నొనర్తు నధికనూత్నప్రౌఢిన్. [2]

క. పరివారము వలపెట్టికి
నరవాథుఁడువాకుఁ గూర్చునా పలదుసుమీ
నరనాథు కూర్మికంటెను
బరివారము కూర్మి మేలు బద్దెనరేంద్రా.

క. చేతనగువాఁడు వైరుల
కేతెఱఁగున వంగెనేని హీనుండగునా
యేతము సిడిదా వంగదె
పాతాళము నీరు తేను బద్దెనరేంద్రా.

1. దీపకుండను (చ)
2. లోకనీతులు, నేనర్థినొనర్తు నధికనిపుణత్వమునన్ (చ)
ఇది (చ) ప్రతిలో లోకనీతి ప్రకరణమున మొదటిపద్యము.

క. సతియును బతియును జెలిమియు
వితతముగా నడవ దేని విడువఁగవలయున్
సతి రంభ యైనఁ గానియుఁ
బతి యింద్రుండైనఁ జెలిమి ప్రాణంబైనన్.

ఉ. ఏలినవాని నారభము నింతిని జీవధనంబు విద్యయున్
దేలఁగబుచ్చి మైమఱచి త్రిమ్మఱి నిత్యముఁ జూడకుండినన్
బోలఁగ దీవెయట్ల తనుఁబొందిన మ్రానును బొందునట్ల య
ప్పాలసుఁడైన నొండ్లకును బాల్పడు నన్నగంధవారణా.

క. సుతుకడకును దన కూర్చిన
సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
బతికడకు రిత్తచేతుల
మతిమంతుల కేఁగఁజనదు మహి బద్దెనృపా.

చ. ఒరుసతితోడి కూటమియు నుత్తముతోడి విరోధమున్ మహా
నరపతితోడి హాస్యమును నాగముపై శయనించు నిద్రయున్
గురుల నవజ్ఞగాఁ బలుకు క్రూరుని నెచ్చెలి సేయువారికి[1]
న్మరణము శీఘ్రమే కలుగు[2] మానగుణోన్నత భద్రభూపతీ.

క. నెలనెల కొక్కొకపరి క్రొ
త్తలుఁ బ్రాతలు నగుట నవ్విధంబున ధరణీ
శుల కిల నూత్నప్రియముగఁ
గొలుచుట భటులకును నీతి కొమరుర భీమా.

---

1. క్రూరుల నాప్తులఁ జేసికొంటయున్ (చ)
2. మరణము దెచ్చు శీఘ్రగతి (చ)

క. చాఁజాలినఁ దగజీతం
బీఁజాలని రాజు గొలుతురేల రణములోఁ
బోఁజాలక నిల్చిన యటు
పోఁజాలక తిరిగనేనిఁ బ్రోతురె నృపతుల్.

క. నరపతి చెడఁడే తప్పని
పరివారముఁ గాఁపువారుఁ బారక విద్యా
ద్వారకవి గాయక నర్తక
పరిహారములేనినాడు బద్దెనరేంద్రా.

క. తగఁ బ్రోచువాఁడె దైవము
తెగఁబలికినవాఁడె వెఱ్ఱితిమిరుండెంతే
సెగఁబెంచువాడె చుట్టము
జగముల నరులకు వివేకచతురాననుఁడా.

ఉ. పట్టము లంచముంకువయు వైద్యము వేశ్యయుఁ బూట[1]కూలియున్
జెట్టియు మెట్టయున్నగతి చేగము[2] భోగము పన్నిదంబుఁ బై
ఫుట్టములుం గవీంద్రుఁడును[3] ఫుంగృషినాఁడిన నాఁడికోలుచే
పట్టున నబ్బఁగాని బడిబాలిన నబ్బదు బద్దెభూపతీ.

క. క్షితి నవ్వుధనము దాఁచఁగ
నతిశయముగఁ దనువు దాఁప నవ్విధి నవ్వున్
సుతు ముద్దాడఁగ నవ్వున్
బతిఁ జూచిన జారకాంత బద్దెనరేంద్రా.

1. జోస్యము గొజ్జ కూలియున్ (చ)
2. జట్టియు బొట్టకూలియును జాగము భోగము పన్నిదంబుచే
పట్టుటయున్ గవిత్వమును పన్నును సుంకము నాఁడికోలు చే
పట్టునఁ గోలుపోయి తరివాసినఁ జేరదు భద్రభూపతీ (చ)
సాగము (చ)
3. చేపట్టులముల్ గవీంద్రులును (చ)

చ. కొలువఁగఁ గొల్వఁగాఁ బతికిఁ గోపమువచ్చినఁ గాణయాచికై
నిలువఁగ నిల్వఁగా ఋణము నిక్కమువచ్చిన నక్కఱైనచోఁ[1]
బిలువఁగ బిల్వఁగా సఖుఁడు వీఁగుచు[2] బోయిన మానఁగాఁదగున్
గొలువును గాణయాచియును గూర్మి సఖిత్వము గొబ్బుగొబ్బునన్.

క. పదివేల సురలు గొల్వఁగ
బ్రదికెడు నింద్రునకు నేలఁబాఱెడు క్రిమికిన్
మదిలోని మరణభయమును
బ్రదుకాసయు నొక్కఁడీటె బద్దెన రేంద్రా.

చ. వెరవరి గానివానిఁ గడు వేసరుచుండెడివాని మాటలన్
సరసుఁడుగానివాని మతిచాలనివానిని లంచమిచ్చినన్
బొరసెడువానిఁ బోయినెడ పొందికెఱుంగని[3] వాని ధీరుఁడై
పరఁగనియట్టివానిఁ బనిఁబంపినఁగీడు వివేకభూషణా.

ఉ. అక్కజమైన భాగ్యనిధియైన నరుం డొకరుండు పుట్టితే
నొక్కనివంక వేవురు ప్రయోజనులౌదురు వాఁడుచిక్కితేఁ
జిక్కుదు రర్విలో గణనఁ జేయగఁ బెట్టినలెక్కఁ బెంపగాఁ
జిక్కిన సున్న లాకృతిని జేవదొలంగి వివేకభూషణా.

1. కూర్మి గల్గుచో (చ)
2. ప్రియుఁడు......విడువగా వలెన్ (చ)
3. బొరసినవానిఁ, బోవునెడఁ బ్రొద్దులు పుచ్చినవాని, భీతునిన్
బరసనివాని రాజు పనిపంపుటకీడు ... ... (చ)

ఉ. క్షీరము నీరికై తన విశేషగుణంబు నొసంగె నీయనా
నీరును బాలకై దహననిష్ఠురకీలలనింకె నిండ నా
నీరువియోగమైన పగ నేఁ దెగటార్చెదనంచుఁ బొంగె నా
నీరు మరల్చిన న్మరలె నెయ్యము లిట్టివి రాజభూషణా.

క. అనఘా విను ముద్యోగికి
ధనమొండెను కీర్తియొండెఁ దగుచావొండెన్
వినుము నిరుద్యోగికి మఱి
ధనకీర్తులు లేవు చావు తథ్యంబరయన్.

క. గోరంట బావినీళ్ళకు
నీరంటిన తలకుఁ దేగమీయని దొరకున్
మూరంట బడ్డబండ్లకుఁ
బారంటనె తొలఁగిపొమ్ము బద్దెనరేంద్రా.

క. పతి యెఱుఁగక చెప్పిన మన
వతి విషమంబుగను దోఁచు నది యెట్లన్నన్
సుతుఁ జంపఁ జూచుఁ గామిని
పతిగలయం జేరువేళ బద్దెనరేంద్రా.

క. తనమనవి తానె చెప్పిన
మనుజుని కందేమి ఫలము మహిలో వనజా
నన తనకుచములు తానే
పనిగొనె నందేమిసుఖము బద్దెనరేంద్రా.

ఉ. వేదముకంటె విద్య మురవిద్విషు[1]కంటెను వేఱదైవముల్
జాదులకంటెఁ బువ్వులును జాహ్నవికంటెను బుణ్యతీర్థముల్
జూదముకంటె వాదమును సుంకరికంటెను బాపకర్మముల్[2]
లేదనుకంటెఁ గష్టమును[3] లేదు మహిం బరపక్షభైరవా.

---

1. పురవద్విషు (చ)
2. సోదరుకంటెఁ జుట్టమును జూదరికంటెను బాపకర్ముఁడున్ (చ)
3. బాపమును (చ)

ఉ. న్యాయము వాయుదుర్[1]నృపతినాఁడు సమస్తము పాడు సజ్జనుల్
పాయుడు నూరుపాడు, కులభామిని వాయుదు నిల్లుపాడు, లేఁ
బ్రాయము రూపసంపదయుఁ బాయుడు దేహముపాడు, ధర్మముల్
వాయుడు మూడులోకములు పాడగు నన్నన గంధవారణా.

## (గ) పరిష్కృతిలోని యధికపద్యము

క. జవ్వన మంకురమైనను
పువ్వుల నేమగును నెలమిప్రు... నైనన్
నవ్వులకైన దాసము
క్రొవ్విరులకునైన నొప్పు గొమరురభీమా. (102)

## (చ) చిత్రాడవారి ప్రతిలోని యధికపద్యములు

క. శ్రీరామారమణీయును
మారామారమణు వాగ్రమాహృదయేశున్
గౌరి మురారిఁ బురారి న
ఘారి హృషీకేశు నీశు నజుఁగొల్తు మదిన్. ౨–౧

క. ఆలిని భృత్యునిఁదగ దయ
నేలినపతి పెద్దయగును నేర్పటి[2]యింటన్
మాలుదు రతడొల్లనినాఁ
డాలూర్వశియైన భృత్యుఁ డగ్గునుఁడైనన్. ౩–౮

క. ఒరుసిల్లరిగెడు కాంతకు
వరవున కనురక్తమైన వనితకు విషయా
తురలై క్రుమ్మరు[3]సతులకుఁ
బరిభవములు వచ్చునండ్రు బద్దినరేంద్రా. ౧౪

1. దప్పినా నృపతి (చ)
2. నేర్పరికంటెన్.
3. క్రమ్మరు

క. నీరికిరుచి శైత్యం బా
హారమునకు వేఁడి రుచియు నంగజకేళిన్
దారుచి యనుకూలస్త్రీ
సారంబగు చెలిమి రుచి రసజ్ఞులకెల్లన్. ౪-౧౭

ఉ. తక్కువపేదవానిఁ తగుదానము దానము, పెద్దవారిలో[1]
నెక్కటిబూని యగ్గలిక నేగు చలంబుచలంబు; పోరిలోఁ
బెక్కువిధంబులం బొడుచు బీరముబీరము, రాత్రియేకతం
బొక్కనియాలుపైఁబడినవాల్లని శౌచము శౌచము[2]ర్వరన్ ౪-౧౮

క. రిపుపొత్తు పాముపొత్తును
గపటుండగు విప్రుపొత్తు గడుసరిపొత్తున్
విపరీతభార్యపొత్తును
నెపమునఁ దావిడువకున్న నేరమువచ్చున్. ౪-౨౨

ఉ. ఏనుఁగు దోమఁ జేయు గుణహీను గుణోన్నతుఁ జేయు సింహమున్
బూని యజంబుసేయు మగపోల్ల బరాక్రమశాలిఁ జేయు స
న్మానుని హీనుఁ జేయు గడుమందునిఁ జాలవివేకిఁ జేయుఁదా
గాన ధరిత్రి దైవమును గాదనరాదు వివేకభూషణా. ౪-౨౪

క. ఖ్యాతిగ బద్దెన చెప్పిన
నీతియకడునొప్పు సకలనీతులలోనన్
భాతి యొనర్చుచు భువిలోఁ
బూతసుబుద్ధియు యశంబుఁ బుణ్యము[3]నిచ్చున్. ౪-౩౨

1. పెద్దవారిలో
2. పర్వను
3. గల్గున్

# సకలనీతిసమ్మతమున నుదాహృతములైన యధికపద్యములు

గీ. తడవు బెంప నేర్చి తమకాలముల వృక్ష
ములును బశువులు ఫలములును బాలు
నొసఁగునట్లు రాజు పొసఁగఁగఁ బ్రజఁబ్రోవ
బ్రజయుఁ బిదపఁ బతికి ఫలములిచ్చు. ౧౦౬

క. జనపతికిఁ బ్రజాపాలన
మున సద్గతిగలుగు నర్థమునునగుఁ దప్పి
డనమున ధర్మక్షయమును
ధనహానియు నపజయంబుఁ దగ సిద్ధించున్. ౧౧౦

క. వ్యవసాయము కొలఁదియు దే
శవిధముఁ గాలంబుఁ బూర్వసంచితమగు సొ
మ్ము విచారింపక యుబ్బునఁ
దివిరి వ్యయముసేయు నరుఁడు దీనతఁ బొందున్. ౧౩౦

గీ. తనకు నాయమైన ధనములో నాలవ
భాగ మొండె మూఁడుపాళ్ళ పాల
నొండె నర్థమైన నుచితంబుగాన మి
క్కిలి వ్యయంబుసేయ వలవదధిప. ౧౩౧

క. ధనధాన్య వాహనములెడఁ
జనవీఁదగుఁ గానియట్టి చనవరికైనన్
వనితలయెడ భూప్రజయెడఁ
జనవిచ్చుట బుద్ధిగాదు జనపాలునకున్. ౧౨౩

క నృపరాజ్యాంగము లందొక
విపరీతాంగంబ రాజ్యవిభవముఁ జెఱుచున్
నృపమంత్రులకును భేదము
చపలస్థితినొదవ సకలజగముం బొలియున్. ౧౨౪

క. కొండియము విన్నపములు
దండువ యర్థార్జనంబు తరుణులె భృత్యుల్
నుండుచు నునికి యెలావుగ
నుండెడి భూవిభుఁడు ప్రజను నుత్పాతమిలన్. ౧౩౦

క. నుడివిన జీతంబెప్పుడుఁ
గడపక తాఁబెట్టు నృపుడుగా నొకచక్రిన్
గడువర్జించిన నైనను
విడువకు సద్భృత్యులెపుడు వినువకు కొలువన్. ౮౧౮

క. భూపతి విరక్తుఁడైనను
నాపత్కాలమున విడుచు టవినీతి యగున్
ఆపదపై కొను నయ్యెడ
నోపివిడువకుండు నాతఁడు తముఁ డరయన్. ౮౧౫

క. దవ్వులనెయుండి శాత్రవు
లెవ్వని తేజమున కులుకరె కాలము వాఁ
డివ్వసుధ తల్లి యొప్పెడి
జవ్వన మది సెలుచుకొలకు జనియించుటగున్. ౭౭౨

గీ. శత్రుశోణితమున శాత్రవకామినీ
చారునయన బాష్పసలిలములను
నవనిఁ దడపఁడేని యారాజు లావును
జీవనంబు వేఱచెప్ప నేల. ౭౭౩

# పద్యసూచిక

| | | | | |
|---|---|---|---|---|
| 122. | బద్దెనసీతి యెవ్వరు ప్రభాతమునం | | | |
| 123. | పెద్దల నీతులలోపల | 103 | | |
| ప | అధికపద్యములు | గ | చ | |
| 1. | అతిమహిమోన్నతియును | 15 | 2-15 | 405 |
| 2. | పెఱికినవాని నాటుచును | | | |
| 3. | స్త్రీతస్వీ చిత్తజ రూపాతిశయో | | 3-1 | |
| 4. | వినువేదఁ గూర్మికన్నుల | 58 | | |
| 5. | భానుకులభూషణుండను | | 4-1 | |
| 6. | పరివారము వలపేటికి | | | |
| 7. | చేతనగువాఁడు వైరుల | | | |
| 8 | సతియును బతియును జెలిమియు | | 3-13 | |
| 9. | ఏలినవాని నారభము | | | |
| 10. | సుతుకడకును దన కూర్పిన | | | |
| 11. | ఒరుసతితోడి కూటమియు | | 4-20 | |
| 12. | నెల నెల కొక్కొకపరి | | | |
| 13. | చాఁజాలినఁ దగజీతంబీఁజాలని | | | |
| 14. | నరపతి చెడఁడే తప్పని | | | |
| 15. | తగఁబ్రోచువాఁడె దైవము | | 3-21 | |
| 16. | వట్టము లంచ ముంకువయు | | 4-11 | |
| 17. | క్షితి నవ్వాధనము దాఁచఁగ | 82 | | |
| 18. | కొలువఁగఁ గొల్వఁగాఁ బతికి | 109 | | |
| 19. | పదివేల సురలు గొల్వఁగ | | | |
| 20. | వెరవరి గానివానిఁ గడువేసరు | | 2-35 | |
| 21. | అక్కజమైన భాగ్యనిధియైన | | | |
| 22. | క్షీరమునీరికై తన విశేషగుణంబు | | | |

(చ) ప్రతిలోని యధిక పద్యములు



(గ) ప్రతి



సకలనీతి సమ్మతములోనివి.

శ్రీ

# ప్రగడపువారి కందములు

శ్రీ రమణీ కుచలిప్త సు
సౌరభఘనసారగంధసారవనీరా
సారఘనసారసారస
సారరజోవత్స వత్ససారవిదారీ

క. ఇమ్మహి నిరసించుట కగుఁ
గిమ్మో ? నవఘుళించె నేవగించెను బలుమే
లమ్మాడెఁ దెగడె నెకస
క్కెమ్మాడెఁ దుఱంగలించెఁ గేడించెననన్. 2

క. పేరొప్పను మరుభూమికి
మోరప్పురతనాలమెట్ట మొఱకుబువియ నా
వారిజము [1]శాడిసము నిం
డారును గంకేళిపేరు లంబురుహాక్షా. 3

క. వెలుగన్నఁగఁ గంపకోటన
నిలఁ బ్రాచీనంబుపేరు తెన్నగఁ [2]బ్రాప్యా
చలిపందిర నీర్వోటుడు
వలిచప్పర మనఁగ నవ్యావనజదళాక్షా. 4

క. కవపరుగన గవ్యూతియు
గవిదిడ్డి యనంగఁ బయికంబున కాఖ్యల్
బవిరి వేడెంబు చుట్టన
నివి వలయాభిఖ్యలయ్యె నిభరాడ్వరదా. 5

1. బాడిదము 2. బ్రపయా అని యుండదగును.

క. నెత్తంబు దరి యనంగాఁ
గొత్తళ[1]మన బురుజనంగ గుముజులనంగా
నిత్తఱి నట్టాలకముగుఁ
జిత్తజశతకోటిరూప జితరిపుచాపా. 6

క. విడిదియనా నుపకారిక
కడపయు గుమ్మంబు గడప గమిసనఁగా నీ
నుడి దేహళీ సమాఖ్యలు
గడియనఁ బే రర్గళంబు కమలదళాక్షా 7

క. కోణిగన్న మదనకై[2]నా
నొనసుం గోపానసికిని నుర్వీస్థలిఁ జూ
రనఁగ వలీకంబున కగుఁ
కనదున్మీలాంబుజాక్ష కౌస్తుభవక్షా. 8

క. చీఁకటిప్రమాననఁ గానుక
ప్రమాఁకనఁ దాపించఘునకు మహిలో నెలయున్
దాకొ[3]ప్పు గోస్తనియనం
బోఁకలగు గువాకనాఁగ భూసురవినుతా. 9

క. అందుగన సల్లకీతరు
వందును గుందములు మల్లియలు మొల్లలనన్
బిందంబు చాలు నాఁగను
బృందంబున కాఖ్యలయ్యెఁ బృథ్వీరమణా. 10

1. క్రొత్తడము 2. మదనచేతులని నిఘంటువుల గలదు. 3. గాక-ద్రాక్ష శబ్దభవము

క. గురుపోతు నాఁగ గవయము
రురుదుప్పి యనంగ గొఱియ రోహిషమనఁగా
మఱి యేదు ముంటిశలలము
చిఱుతపులి మృగాదనంబు (శ్రీ) నరసింహా. 11

క. దిట్టకఱిపక్కి కాటుక
పిట్టమ్ముత్రపులుంగు మందపిచ్చుక యనఁగా
నిట్టొప్పు ఖంజరీటము
పిట్ట పులుఁ గనంగఁ బక్షి పేరు రమేశా. 12

క. భూరి కలవింక మగు బం
గారపుఁ బిచ్చుకయు గిజ్జిగాఁడు ననంగా
సారసము బెగ్గురనఁ గా
నీరేజదళాయతాక్ష నిగమాధ్యక్షా. 13

క. రాఁ బులుఁగు మల్లెజేగుఱు
నా బోరువ నాఁగఁ గంక నామంబులగుఁ
గూబనఁగా ఘూకంబగు
జాబిలిరాబోమడికంబుచాల్గలసామీ. 14

క. కొంగన బకంబగున్ సా
రంగంబన వానకోయిలకుఁ బేరిలలో
నం గాలకంఠకము గు
డ్లంగియుఁ గూపరనఁ బద్మదళకనదక్షా. 15

సీ. పిన్నగ్రద్దయు బిండిపిట్టయు దోచిగాఁ
డనఁగ వాతాపివిహంగమునకు
గ్రుడ్డికొక్కెర పేరు కోయష్టికము గంప
ఘలుగునా కుంకుభ[1] మలరుచుండు
వర్తికయగు మీలవల్లంకి[2] వెలిచెనాఁ
గారండవంబనఁ గన్నె లేడి
కూఁకటి ముఱఁగనాఁ గొఱలుఁ గళింగంబు
నాడెలన శరారి నీడజంబు

పట్టు జీనువు లకుముకి టిట్టిభంబు
కొనరు బిసకంఠికయు వెల్లకొక్కెరనఁగ
మద్గు నీర్కాకి నీర్కోడి మఱిప్లవంబు
రాజహంసాక్ష సంస్తవ రాజహంస. 16

సీ. వెలయఁ గాపట్యంబు బేలుఁదనంబు నా
సంచు సంపద సాతు సంతగుంపు
మాంసహీనపు డొక్కమరుఁ గరంకమునాఁగ
గలిమంబు మాంసంబు గరువులనఁగ
గర్భచిహ్నంబులు గండరువన శిల్ప
కర్మంబు మణుగు బాగంబునడుగు
లన నంగసంధులు చను నుదిలవిచార
మల్లులు భుజములు చెల్లు కొడిమె

1. కుక్కుభము 2. మీనవల్లంకి.

లనఁగ నపరాధములు దాఁచయనఁగ నీచుఁ
డోలమన గోపనము గర్తమోదమనఁగ
నలుగులన భృంగములగు నీవలి నురుత్తు
డంబుకరి వేల్పు పక్కిసిడంబు డాల్ప. 17

క. తీవె మొడనూలు కెంచెన
గ్రైవేయకహా బలంతికయుఁ బతకంబు
న్నేవలమనఁ గాఁ గొలుసనఁ
గా వరప్రాలంబిపేరు కమలదళాక్షా. 18

క. నెరిసూడిగంబు ముంగా
మురి పోచీ పారిహార్యమునకుం బేరుం
గరమున బటువన నూర్మిక
ధరణిం బాసికము పారితథ్యంబు హరీ. 19

క. ధారుణిఁ గర్ణిక కమ్మనఁ
బేరు తులాకోటికొప్పుఁ బెండెంబనఁ గే
యూరమన దండకడియము
నారదసన్నుతచరిత్ర నారదగాత్రా. 20

క. పేరొప్పు నందెయన మం
జీరంబనఁ గింకిణీలు చిఱుగంటలనం
బారదము గజ్జెయన నిం
పారంగా క్షుద్రఘంటికాఖ్య రమేశా. 21

బరణి కరాటముఁ గ్రోవియుఁ
గరవటము కరండమునకుఁ గంకతి యనఁగా
నెరిదువ్వెన కొంగి వీవన
వరవ్యజనంబునకుఁ బేరు వారిరుహాక్షా. 22

క. ఒజ్జలి కొఱనాకర్మకం
బొజ్జలు కరచలనఁ బేరునాగి సూరులకుఁ
హజ్జయనఁ జరణమొప్పును
సజ్జికమన సుందరంబు సారసనేత్రా. 23

క. లాయంబు మందురాభిధ
గాయంబును గంటి గురియ గాతబెనకు పైఁ
బాయనఁ బుండన వ్రణముగుఁ
కాయజదశకోటిభానికాయదకాయా. 24

క. వరచరపాత్రికగుఁ గొ
ప్పెరబొక్కెనఁ దణగమన్న బిస్తీయనఁగా
జరిబాబ[1]నఁ గుతినీయన
ధరకౌశేయమున కాఖ్య ధవళాబ్జాక్షా. 25

1. జరబాజు

క. గుఱి సూటి యనఁగ లక్ష్యము
గఱియన[1] వాజంబు గొఱక కాండంబనఁగా
సరిగనఁగా బలకయు ము
ద్గర మొప్పను గుదెయనంగఁ గంజదళాక్షా. 26

క. వసికొయ్యయు సెలకట్టెయు
నెసఁగును శల్యంబునఖ నీటె సురియనా
పసగాంచుఁ గుంతమునఖను
నసిపత్రియుఁ జూరకత్తి కంబుజనేత్రా. 27

క. పెను నినుపకట్ల గుదెయగుఁ
బనిదగు పరిఘంబు భిండిపాలము సెలగో
లనఁగాఁ బొల్చును నేజా
యనఁ దోమరమునకుఁ జెల్లు నంబుజనేత్రా. 28

క. నెరి తులువ వాలనంగాఁ
గరవాలము పట్టిసంబు గజమనఁ బరఁగుం
బరుజుపిడి పుంఖ మొప్పను
క్షురియను పిడియను కటారి సూరినుతాంఘ్రీ. 29

1, బాణము ఱెక్క

క. తెఱగు వఱా యూరజమును
గరణియు జాడ్యనుదెఱంగుఁ గ్రైవడిచొప్పౌఁ
గరమొప్పు భంగి కాఖ్యలు
మఱియు బిడీబిడీయనంగ మహీఁ గ్రమముహరీ. 30

క. రబ్బసమనంగ గొలమగు[1]
జొబ్బిలుటయు నిర్గమంబు సొరిదిగ సిలలో
నుబ్బెనన గుబ్బటిలెనన
నిబ్బరమున నంకురంబు నీరజనేత్రా. 31

క. కణిక కలము పేనాయనఁ
గను దూలికయందుఁ బేరు కంపంబనఁ గొం
కనవడఁకు వణ్కుఁ జెల్లును
ఘనతప్తసువర్ణచేలకరిరాట్పాలా.

క. బమ్మెడి గొనె[2] మ్రాన్పడెనన
సిమ్మహి నిర్జీవమొందు నెసఁగును బేరుల్
కమ్మ పరమాన జాబగు
నుమ్మలికన దుఃఖమగు మనోజనిభాంగా. 38

1. రబ్బసమనఁ గలకలమగు ననియుండును. 2. బిమ్మిటిగొను

క. కరిమురి బంధనమున పే
రటిముటి పడుగుంట యొగ్గమనఁగాఁ జెల్లున్
గరములు నెత్తైలు నూఁదులు
వరజలచరబంధనములు వారిరుహాక్షా. 34

క. కనదాఖ్య లొప్పునవుటా
లెను బెంపెసలాడెఁ[1] దొంగలించెను దులకిం
చెనునాఁగను బోరామియు
నెనరనఁగాఁ బ్రియముపేరు నీరజనాభా. 35

ఈయెడ నర్మగు పేరా
సయన వలపు రన బాతినీయనఁగ నిషా
రాయనఁ జెలువము పొలుచును
సోయగమన నవకమనగ సుందరముహరీ. 36

ఇందులో బాతినీ, ఇషారాశబ్దములు ప్రయోగ మహితములు గావు.

క. ఎలప్రాఁప లేఁత దవ్వాయుఁ
గలికియు లే కోడెఁనాగఁ గను నూతనముల్
జిలిబిలి చదురులు కందువ
లలరుఁ జమత్కార్యవాక్కు లంబుజనేత్రా. 37

1. పింపిసలాడు

క. జత బాసటయుఁ బరోసన
లతనాఁగ సహాయమునకు రాజిఁలు బేరుల్
సుతి తిత్తియుపాంగంబును
రతిపతిశతశతసహస్రరమ్యశరీరా. 38

క. కలపయును దుక్కియును నాఁ
గలి యేఁరన హాలమ నకును గాంచును బేరుల్
పులుగన మచ్చన మరుతన
వెలయును లాంఛనముపేరు వేంకటరమణా. 39

క. తేజి రవా[2]ల్కుత్తళమన
వాజికి నాఁ బేరు గడ్డవంకన నదియుం
జాజనగా శోభాఖ్య బి
డౌజసురానీకపాలుడవు జలజాక్షా. 40

క. నెల చందు మాసమగుఁ దా
పలుఁ జీడీల్నాఁగ మెట్లు పడికట్లును నా
వెలయును సోపానాఖ్యలు
నిల నేకతమన్న గోప్య మింపారుహరీ. 41

1. గుఱుతులేక మఱక - కావలయును.
2. రవాలు — రవగాలు — అశ్వగతివిశేషము అవి శబ్దరత్నాకరము — అశ్వము — సాంబ. నిఘం. ప 71.

క. పూరించుటకగుఁ బేరు వె
లారిచె పీలిచెనన నలరుఁ జిత్రం బిం
పారబ్బుర మక్క్రజమన
వారికి నీళులనఁ బొల్చు వారిజనయనా. 42

క. బోదెలుఁ గుదురులు గనిమలుఁ
బాదులనాఁ బేరు లాలవాలమ్ములకున్
జాఁదుట రుద్దుట త్రోముట
నాఁదగు గర్షణము పేరు నలినదళాక్షా. 43

క. తోడిబోడ్దు నీరె జంపుల
కడియనఁగా దంతు కందుకంబున కాఖ్యల్
మెడజడ్డిగ మజితనఁ బే
రడరు గళంబునకుఁ బేరు లంబుజనాభా. 44

క. కోరడి కట్టయు సుద్దియు
సారువయున సేతువునకుఁ జనుఁ బేళ్లవనిన్
సౌరు వహి మంజులంబును
సారసదళనయన చారుసారసఘటనా. 45

క. పారకడచుట వాకట్టుట
నరయఁగ వాగ్బంధనమ్మునకుఁ బేరొప్పున్
బరవస మనఁగా ధైర్యము
సరిపణి యనవెడదఁగోలున జలజదళాక్షా. 46

క. సాము గరిడీ ఖళ్ళూఁగిక
నామంబగు ఖురళియందు నసికినినా ఖం
డా మొహదా తరవారన
నౌమహీ చషకంబు కప్పెరనఁగ మహేశా. 47

క. పలక కేడెంబు కేవడ
మలరును ఖేటంబు పేరు లఘుకోటమియుం
గలగుండునాఁగఁ గాతర
మలతాకు కరళ్లు వీచి కలరు రమేశా. 48

క. బొమి కెముక యెమ్ము కీకస
మమరును జొబ్బలె వెలార్చెనా నిర్గమముల్
దుముదారన దళక రయు
విమలగుణవికాస దివ్యవినుతరమేశా. 49

క. అలరనఁగను సూనంబౌ
నలరనఁగాఁ బేరనొప్పు నానందంబుల్
అలరనఁ గా లాలితమును
నలరుఁ బ్రకాశించెననుట కంబుజ నేత్రా. 50

క. సారె కులాలచక్రము
సారెయనఁగ నక్షమొప్పు సారెకునిలలో
సారె విపంచీతంతువు
సారె ముహుర్ముహురటంట సారసనేత్రా. 51

క. కందనఁగ డింభకంబును
గందును వీక్షింపుననుట కరమొప్పుఁ జుమీ
కందనఁగా మాలిన్యము
కందనఁగాఁ గందుననుట కమలదళాక్షా. 52

క. కట్టనఁ గంటన గొప్పును
గట్టనఁగా బంధనంబు గాంచును బేరున్
గట్టనఁగా సునితాంతము
కట్టనఁగను గండికట్టు కనులదళాక్షా. 53

క. కమ్మియు నాఁ గ్నికయగుఁ
గమ్మియనా సౌరభంబు గాంచును భువిలోఁ
గమ్మియునాఁ బత్రికయగుఁ
గమ్మియనాఁ దాళశాఖ కంబుదళాక్షా. 54

క. కన్నులన లోచనంబులు
గన్నులు భస్మాన్నతిపకంబులు భువిలోఁ
గన్నులు పర్వంబులు దగుఁ
గన్నులు జంద్రకములొప్పుఁ గాయజజనకా.

క. కటిక యనఁగఁ గర్కశమును 55
గటికయనఁగ సాంద్రమునకు గాంచును బేరుల్
కటికయనఁగఁ బులిందుడు
కటికయనఁగ సౌవిదల్ల కమలదళాక్షా. 56

క. ఘురియనఁగా బర్హంబును
బురియన సూత్రంబు పేరు భూవిశాస్థలిలో
సరియనగా హారంబును
సరియనఁగ సమానమునకు సారసనేత్రా. 57

క. దళమనఁగా నిబిడంబును
దళమనఁగా సేన పేరు దనరుచునుండున్
గలమనఁగాఁ దూలికయగుఁ
గలమనఁ గాఁ దరణమునకుఁ గంజదళాక్షా. 58

క. పొడి యనఁగాను బరాగము
బొడియనఁగాఁ రత్నమునకు బొల్చును బేరుల్
కడలియనా వారాశియుఁ
గడలియనఁగఁ గ్రామమునకు గంజదళాక్షా. 59

క. కడిమి యన విక్రమంబును
గడిమియనఁ గదంబమునకుఁ గాంచును బేరుల్
వడనానవప్రాప మొప్పును
వడనాగ నిదాఘమునకు వారిరుహాక్షా. 60

క. గోలయనఁగ ముగ్ధాంగన
గోలయనఁగ గలకలంబు కుంభినిలోనన్
రాలునన నిర్గతంబును
రాలనఁగా శిలలపేళ్లు రాజీవాక్షా. 61

క. వెన్నెల యనఁగాఁ జంద్రిక
వెన్నెలయన నతికిఁ బేరు వేడుకతోడన్
మన్ననఁగ జీవించుట
మన్నియనఁగ బ్రభువుపేరు మన్మథజనకా. 62

క. సింగిణులనఁ జాపంబులు
సింగిణులనఁ గోళకములు చెలువలరంగా
నంగళ్లనంగ షండులు
నంగళ్లనఁగాను విపణు లంబుజనేత్రా. 63

క. బటువనఁగా వర్తులమును
బటువనఁగా నుంగరంబు భావింపంగాఁ
గటువనఁగా దుర్భిక్షము
కటువనఁగా శవధురంబు కాయజజనకా. 64

క. లగ్గనియనఁగను శుభమగు
లగ్గు బలాత్కారగభుక్తి లాలితమొప్పన్
బుగ్గలనఁగ బుద్బుదములు
బుగ్గలనంగాఁ గపోలములగు రమేశా. 65

క. కేరళ మనఁగా దేశము
కేరళము[1]న నిండకొప్పు గీశనుతాంఘ్రీ
వారిజమనఁగాఁ గ్రవ్యము
కారిజమన[2] నీడజంబు కమలదళాక్షా. 66

క. దిద్దనఁగా దేశఁబును
దిద్దుటలంకారమునకుఁ దేజిలుఁబేరుల్
ముద్దుగ యనంగఁ బ్రియమును
ముద్దుగనం బాణసంజ్ఞ మురదైత్యహరా. 67

క. ససియనఁగా సస్యంబును
ససియనఁగా సుష్ఠుపేరుఁ జను భువిలోనం
బసియనఁగా గోధనమును
బసియన నాఖేటసంజ్ఞ పద్మదళాక్షా. 68

క. గంటనఁగా ఘంటికయగు
గంటన శరమూలమొప్పు ఘనతరలీలన్
దంటయనఁగ యుగ్మంబును
దంటయనఁగఁ బ్రౌఢుపేరు ధవళాబ్జాక్షా. 69

క. పాప యనఁగఁ బృథుకంబును
బాపయనఁగ భుజగమునకు భాసిలుపేరై
క్రేపనగా వత్సంబును
గ్రేపనఁగా శృంగమునకుఁ గీశనుతాంఘ్రీ. 70

1. కేగడము. 2. కేఁజము, కేర్జము.

క. ఒడ్డనఁగాఁ దీరంబును
నొడ్డనఁగ సమావ్యాయము[1]న కొప్పు రమేశా
గిడ్డి[2]యనఁ గ ఖర్వంబును
గిడ్డియనఁగ దేవగవియుఁ గీశనుతాంఘ్రీ 71

క. వెల్లియనఁ గ ధవళంబును
వెల్లియుఁ బ్రవహించుటొప్పు వేడ్కఁదలిర్పన్
వల్లెయనఁ గ వసనంబును
వల్లె సమీచీనమనెడు వాక్యంబు హరీ 72

క. వలపనఁగా మోహంబును
వలపనఁగా గంధమునకు వర్తిలు బేరుల్
వలఱేఁ డన ధీవరుఁడు
వలఱేఁడన మన్మథునకు వారిరుహాక్షా 73

క. రసదాడనఁ బుండ్రేక్షువు
రసదాడి యనంగ నొప్పు రంభావిధమున్
నిసువనఁ గా నంకురమును
నిసువ[3]నఁగా డింభకుండు నీరజనేత్రా 74

1. ద్యూతము 2. గిడ్డ యగుచు 3. శిశువు.

క. నెత్తంబనఁగా ద్యూతము
నెత్తమ్ము ప్రదేశమునకు నెగడుం బేరై
హత్తియన వారణంబును
హత్తియనఁగ సక్తమయ్యె ననుట రమేశా 75

క. కైవారమనఁగ వినుతియుఁ
గైవారము వర్తులంబు గాంచును బేరుల్
దైవాఱు నన నితాంతము
దైవాఱుననన్ సమగ్రతయగు రమేశా 76

క. బొలసనఁగా మత్స్యంబును
బొలసనఁగాఁ గ్రవ్యమునకుఁ బొల్చును బేరుల్
వల[2]యనఁగా మోహంబును
వలయనఁగా జాలమునకు వారిరుహాక్షా 77

క. వాఁతయనఁగ రక్షాభిధ
వాత[3]యనఁగ వక్త్రమునకు వర్తిలు బేరై
బాతులనఁగ బక్షులకున్
బాతు బుభుక్షా సమాఖ్య పద్మదళాక్షా 78

1. నాఁకు - వాతులు - వక్త్రార్థమున వాతశబ్దము వ్యాగ్యము.
2. సాంబనిఘంటువు ప 22 అన్యదేశ్యమని యాంధ్రవివరణము.

క. కాననఁగా విపినంబును
గానన వీక్షించుననుట కాంచును బేరుల్
కోనయనఁగ విపినంబునుఁ
గోనన గోబృందమునకుఁ గొఱలు రమేశా 79

క. ఏడ్తెఱయు సాంపరాయము
నేడ్తెఱయు నితాంతమునకు నిలఁ బేరొప్పున్
దోడ్తోనన సంప్రతియగుఁ
దోడ్తోనఁ బూర్వమునకుఁ దొడరు రమేశా 80

క. సారువ యనఁ గేదారము
సారువయన సేతువునకుఁ జనుఁ బేరవనిన్
బూరుగ యన శాల్మలియును
బూరుగ[1] యనఁ గాహళంబు భూసురవినుతా 81

1. సాంబనిఘంటువు ప 90 కాహళి కొక చెట్టు కలరు బూరుగయన - అని యున్నది. కాని కాహళమను యర్థమున బూరగ యనియే కలదు. లక్ష్మీనారాయణీయమున బూరుగయన బూరయని యర్థమీయఁబడినది.

సకలతీర్థములం జతుర్దశి షష్టిం బూర్ణ
మాశిఁ బంచమి మహనీయమహిమ నంబి
ధ్రువఁ దపస్విని సావిత్రి దృష్టిశాంతి
దేవమాత భక్తిప్రియుఁడలఁతు భక్తి.

అష్టాదశయోగపీఠకులకం—

సీ. లక్ష్మికొల్లాపురి లంక శాంకరి విశా
లాక్షి కాశికను వింధ్యమున దుర్గ
గన్యకన్యాకుబ్జఁ గామరూపంబునఁ
గామాక్షి కాంచిని గాళికోటి
మండలిఁ బుండ్రక మాణిక్య దత్తహా
టమున నార్యావర్తకమునఁ ద్రిపుర
జ్వాలాధరంబున జ్వాల హాటచ్ఛత్రి
పురిమహాయోగ శ్రీగిరిని భ్రమర
విరజవిరజహుంకృతిపీఠ సింహ
శమున నరసింహికను గాశ్మీరమున వాణి
యుజ్జయిని మహాంకాళిని యున్నతముగఁ
జూచువారలు జమపురిఁ జూడరెందు.

వినాయకునికి—

ఉ. అల్లన తొండమెత్తి శివునాఁదల యేటిజలంబు పుచ్చి సం
పుల్లతఁ బాదపీఠము పొంతనయున్న సహస్రనేత్రుపై
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోక్షణ సేయునట్లు శో
భిల్లు గజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన్.

(విజయసేనము)

శా. గీర్వాణాచలసాను వాత్సురటన క్రీడాహతంబైనన
య్యుర్వీరంధ్రముసం దనంతఫణిరత్నోద్యత్ప్రభల్ పర్వి వ్యా

శ్వర్యంబై పొడిగట్టిపేర్చిన మదిం గంబంబ యొంటూం గన
ద్గర్వోన్మీలితనేత్రుఁడై మొరయు వేదండాననుం గొల్చెదన్.

శా. జేజేయంచు భజింతు నిష్టఫలసంసిద్ధుల్ మదింగోరి ని
ర్వ్యాజప్రౌఢి కృపావలంబుని గటప్రస్యందిదానాంబునిం
బూజాతత్పరదేవదానవకదంబున్ బాలకేళీకలా
రాజత్కౌతుకరంజితోరగపతిప్రాలంబు హేరంబునిన్.

(శ్రీనాథుని నైషధము)

శా. విఘ్నధ్వాంతనిరాసవాసరపతిన్ వేదండరాజాననున్
విఘ్నాధీశ్వరునిం గపోలఫలకావిర్భూతదానచ్ఛటా
నిఘ్నాళిన్ నిరుపాధిబాధికకృపానిర్వ్యాదదోషఘ్నుఁ గ్రాం
చఘ్నజ్యేష్ఠు భజింతుఁ గావ్యరచనాచాతుర్యసంసిద్ధికై.

(భావనపెమ్మనంగారి అనిరుద్ధచరిత్రము)

ఉ. తొండము నేకదంతమును దోరపుబొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లనిచూపును మందయానముం
గొండొకగుజ్జురూపమునఁ గోరినవిద్యలకెల్ల నొజ్జయై
యుండెడు పార్వతీతనయు నోలి గణాధిపుఁ బ్రస్తుతించెదన్.

శా. క్రీడాలోలత దంతకోరకశిఖం గీలించి భూచక్రముం
గ్రీడగ్రామణి మించియెత్తి ఫణి లక్షుద్రానుమోదంబునం
జూడాభోగము లెత్తిచూడఁగ దిశాశుండాలరాణ్మండలిన్
వ్రీడంబొందఁగఁ జేయు దంతిముఖు నిర్విఘ్నార్థమై కొల్చెదన్.

(శాకమూని గంగాధరుని బాలభారతము)

ఉ ఆదరమొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతాహృదయానురాగసం
పాదికి దోషభేదికిఁ బ్రపన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేషజగజ్జననందవేదికిన్
మోదకఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్.

(బమ్మెర పోతరాజు - భాగవతము)

ఉ. అంకముఁజేరి శైలతనయాస్తనదుగ్ధములానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలి చన్గబళింపఁ బోయి యా
వంకఁగుచంబుగాన కహివల్లభహారము గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్.
(అల్లసాని పెద్దన్న - మనుచరిత్రము)

కుమారస్వామికి—

చం. చనవున రెండువక్త్రములు చన్నులపా ల్గుడువంగనొక్కమో
ము నగంగ నొక్కయాననము ముద్దునటింపగ నొక్కయాస్యము
న్గనఁగ నిదేమి పల్కుదని యాలపనంబునఁ జెక్కలించు న
బ్బిన నగు షణ్ముఖుండెలమిఁ బొంది త్రిశక్తులు మాకు నీవుతన్.
(విక్రమసేనము)

చం. తమకముతోడఁ దల్లియును దండ్రియు నొక్కట ముద్దువేడ సం
భ్రమమున వచ్చి తల్లిముఖపద్మము తండ్రిమొగంబులైదు వే
గమ తనయాఱుమోములను గైకొని ముద్దిడు మేటివేలుపుం
గొమరుఁడు నాదువాణికి నకుంఠిత శబ్దములిచ్చుఁ గావుతన్.
(విష్ణుకథాసిధానము)

సీ. తల్లిదండ్రుల పొందుదప్పి యొండెడ నార్యు
రువిదలపొదువ నొదగినతఁడు
కదుపడిఁ బలుగొండ గాఁడిపారిన మేటి
ఘనసాయకము గేఁగ్రాలునతఁడు
కమియాడగాఁ జాపకపణంబు దినియాడు
రెక్కలతురగంబు నెక్కినతఁడు
భోగిపాన్పున నిద్రభోగించు దేవునిం
దరిమిన రక్కసు నరచినతఁడు

నవడి
జోడుమాటలు సరివడనాడు నతఁడు
దంతిముఖు గూర్చితమ్ముఁడై తనరునతఁడు
కదలె బలములనడపింపఁ గ్రౌంచవైరి.

భైరవునికి—

మ. తమకాలంబున సింధుసాగరరసాస్వాదాతిరేకంబునన్
నయనాబ్జంబులు ఘూర్ణితంబుగను సంధ్యాకాళరాత్రీకర
ద్వయతాళానుగతిప్రమోదమున మత్తల్లీమహానృత్తముల్
ప్రియమొప్పారఁగఁ జేయు భైరవుఁడు గల్పించు నమ్మహైశ్వర్యముల్.

ఉ. వ్యాలవిభూషణాళియు దిగంబరమున్ గదయుం ద్రిశూలమున్
వేలెడుగంజెకల్ గగనవీధికిఁ జాఁగిన యుగ్రరూపు నా
భీలచతుర్భుజంబులు సభేద్యకరాసియుఁ జంద్రఖండమున్
ఫాలవిలోచనంబుగల భైరవుగాంచి విభుండు మ్రొక్కెన్.
(గోపరాజు - భేతాళపంచవింశతి)

వీరభద్రునికి—

సీ. ఎవ్వాఁడుదాచేతి క్రొవ్వాడిపళ్ళుకులఁ
జదిమె పూషాదేవి చిగురుమూతి
కనకమేఖల గుబ్బిబ్రికట్టె నెవ్వాఁడులీల
బిరుదుక్తిఁ బూషాస్యమెఱుఁగు బండు
కోసరకెవ్వాఁడు పదాంగుష్ఠ భాగంబున
సురరాజుపొట్ట గుజ్జురుకనూరె
తరిగ నెవ్వాఁడు ఖడ్గధారాంచలంబున
నగ్ని నాలుకలేడు నంటఁదరిమి

మొరదిన వ్యాధు ముప్పదిమూడుకోట్లు
వేలుపులఁ బారఁబార వెన్నంట దగిలె
నట్టి శ్రీవీరభద్రుఁ డీయద్రిమీఁద
భద్రకాళియుఁ దానుండుఁ బ్రమదమొదవ

(శ్రీనాథుని కాశీఖండము)

సీ. కూలి కన్నుఁ గెంపుఁ జూపిన రౌద్రంబు
పాతాళ మందరిదెసఁ బొడమినతని
భువనభయంకరమూర్తి పెంపెసలార
శరభావతారకం బరగినతని
పన్నంపు సిరికోన పాగజూచిన కాలఁ
జేకొని తలవంపు జేసినతనిఁ
చళతళమని మించు చుళగించు గైదువుల్
కరముల బడినూటఁ గలిగినతని
సురలు నసురలుఁ బలుమారుఁ జూచి బెదర
బిరుద పెండెంబు డాకాలఁ బెట్టినతని
భద్రకాళి మహాశక్తిఁ బరమభక్తిఁ
బాయకుండెడు శ్రీవీరభద్రుఁ దలఁతుం.

(పోతరాజు వీరయ్య - త్రిపుర విజయము)

భృంగీశ్వరునికి: —

శా. ఖామ ఖామ... నిష్కట ప్రకటవక్షఃపీఠముం బాండుర
ఖామక్షామవయవంబులైన వికటాకారంబులో నవ్వులై
చాముండా కరతాళవృత్తిక స్థానంబుగా నుబ్బుచున్
ప్రేమాడంబుగఁ జేరణీవిధమున నృత్తించు నమ్మహాభృంగియున్.

(అనిరుద్ధచరిత్రము)

తే. గీ. కన్నుఁగవకాటుకయుఁ బోఁడికచ్చడంబు
భూతి రుద్రాక్షమాల త్రిపుండ్రకములు
ధవళదంతపాటికాస్థాపుటములు
సంగవిశ్రుతియు సజ్జాతి భృంగిరిటికి.

తే.గీ. గజ్జపఱఁ ద్రొక్కి జూపెఁ దాగడవిధంబు
గీతమున కాడఁజేసె సంకీర్తనంబు
పాడె సూదాదిగీతప్రబంధవితతి
భృంగి పంచాంగకంబైన పేరణమున.

నందికేశ్వరునికి:—

మహాస్రగ్ధర. కనిరాబ్రిష్ఠాచ్యుతాదుల్ఘనకనకలతాగ్రంథిసంబంధిజూటా
వనిఖేలద్బాలచంద్రస్వయముపచయకృద్వర్ణప్రభాసం
జనిభాస్వద్ఫాలభాగస్థలసితభరితస్థాసకశ్రీసమగ్రా
ననవద్మం బుణ్యపద్మ స్మరణనతవిపన్నాళు నా నందికేశున్.
(వీరమాహేశ్వరాచార సంగ్రహము)

సీ. తుహినధాత్రీధరోత్తుంగగాత్రస్ఫూర్తిఁ
బరిపూర్ణచంద్రికాప్రభలుమాయ
కలినబంధురతరస్కంధఘంటాధ్వని
నెదిగి దిశావలు లెదురుమ్రోయ
పవిచండనిష్ఠుర పటుపాదఖురహతిఁ
బరి వైరియై మహీభాగ మగల
వరభోగభోగీంద్రవాలవాతోద్ధతిఁ
జెదరి ధారాధరశ్రేణు లవియ
వర్ణ కాయతశృంగతీవ్రక్షతములఁ
బెల్లుగొని పద్మజాండంబు చిల్లులొలయఁ
జండగతివచ్చు కైలాసశైలమనఁగ
నెసగు పడివాగతో వృషభేంద్రు డమరె.

సీ. పాటించు నెయ్యది బహుళ నిర్మలధర్మ
గంభీరమగు మూర్తిగౌరవంబు
కావించు నెయ్యది కాంతిమై దిశలకు
వాడని చంద్రికావైభవంబు
గర్జించు నెయ్యది ఖణిలు ఖణిల్లన
ఘోరమై కేయుల గుండె లవల
మెచ్చించు నెయ్యది మీనకేతనవైరి
వాహ్యాళి కావల్గువల్గనముల
నది రణంబున నవ్విభునగ్రవీథి
నిర్భరారూఢినొప్పఁ బ్రాదుర్భవించెఁ
బృథులపద పాతనిర్ఘాతభీతపన్న
గేశ్వరంబైన శ్రీవృషభేశ్వరంబు.
సీ. గురుగోత్రతటములు గోరాడ నును మొక్క
వోయిన వలిగొమ్ముదోయి మెఱయ
ఘనమేఘతలములు గాల్ద్రివ్వ క్రొమ్మెఱుఁ
గులపసమూనిన గొరిసెలొప్ప
భూరిదిగ్భిత్తులతో రాచికొన సన్న
గలుకెక్కు కప్పరు కంఠ మొప్ప
నలఘు వాయుస్కంధములు దాఁకి కారలు
దొరుగ నాడెడు నిడుదోఁక యులర
కారశిఖరి గిలించిన మేచకశకల
మనఁగ ధవళాంగకల్పితంబైన పసిఁడి
పల్లమును రత్నకింకిణీ పరికరంబు
నమర వృషభేంద్రుఁ డాయితంబై తనర్చె

(ప్రెగడగారి హరివంశము)

విభూతికి :—

సీ. భసితంబు వేదోక్త పదనిరూఢంబగు
భసితంబు మునిజనప్రాణపదము
భసితంబు సర్వేశుభక్తి కాధారంబు
భసితంబు సకలశుభప్రదంబు
భసితంబు దుష్కర్మఘనపటలానిలంబగు
భసితంబు లోకైకపావనంబు
భసితంబు భవరోగభంజనౌషధమగు
భసితంబు ప్రత్యక్షభర్గమూర్తి
భసిత మనవరతాశేషభయాపహారంబు
భసిత మసమానసుజ్ఞానవైభవకరంబు
భసిత మాభరణము యోగివిసరమునకు
భసితమహిమ వర్ణింపంగ బ్రహ్మతరమె

సీ. కపిలవర్ణము గోవు కడునొప్పు నందనాఁ
జనియించె దద్గర్భమున విభూతి
నల్లని మొదవు వర్ణనకెక్కు భద్రనాఁ
దద్గర్భమున భసితంబుపుట్టె
నెఱ్ఱని ధేనువు నేపారు సురభినాఁ
గలిగె భస్మంబు తద్గర్భమునను
పొగచాయగల యావు పొలుచు సుశీలనాఁ
క్షారంబు వొడమె దద్గర్భసరణి
చిత్రవన్నియలను సురుచిరమై దాల్చు
కర్త్రీ మనోభిధాన మంగీకరించుఁ
బ్రభవమొందె దదీయగర్భమున రక్ష
పంచముఖముల నిట్లుద్భవించె భూతి

(కుంటముక్కల తిమ్మకవి - శైవాచారసంగ్రహము)

శా. ఆజ్ఞాసిద్ధికరంబు ముక్తిదము చిత్ప్రాసాదసంధాయియై
వజ్ఞానాంకురశిష్టబీజము ప్రభావప్రౌఢసంవిత్కళా
జిజ్ఞాసావిభవప్రదాయకము శక్తిశ్రీకారణాంబూర్జిత
ప్రజ్ఞామూలము భక్తలోకమునకుం బంచాక్షరీమంత్రమున్

(వీరమాహేశ్వరము)

సీ. కమలజాండంబులు కందుకంబులు సేసి
కొండొండ లాటింపనోపువారు
విలయమహాగ్నిఁ బట్టి కెసవండలుగఁ గ్రుచ్చి
యురమున ధరియింప నోపువారు
తివిరిసంహారభైరవునైనఁ బోరి వోవ
నొకమాత్ర వసిమాల్పనోపువారు
కాలచక్రక్రియాఘటనంబు ద్రిప్పి
యొండొకలాగు గావింప నోపువారు
ప్రమథవీరులు వివిధరూపములతోడ
హసనలను ఘనదావనాద్యలఘుగతులు
వెలయ గోటానకోటులు కొలిచి... ... ...
రతఁడు హరుగొల్వ సేతెంచునవసరమున

బ్రహ్మకు :—

చ. వలపెటువంటిదో మసలివాఁడె పవచ్చునె యుద్దిరయ్య వె
న్నెలజవరాలు దాఁ జదువులోన జపంబులలోనఁ బాయక ద
గ్గలముగ నెల్లప్రొద్దును మొగంబున గట్టిన యట్టులుండు నీ
నలువకునంచుఁగాముకులు నవ్వువిధాతకు భంబు లీవ్రతన్

(జైతరాజు మునుమంత్రము - విష్ణుకథానిధానము)

సీ. పైఁడిచాయలతోడి పక్షసంపుటముల
మెలఁగుదేజాల తీరు గలుగునతని
మొకరితుమ్మెదలకు నొకరంజనసధార
లొసఁగు బీరమున గూర్చుండునతని
సత్కవీంద్రుల మానసములలో విహరించు
గోమరాలి కింపులుగులుకునతని
దిక్కులు నాల్గింట లెక్కదప్పకయొప్పు
నాననంబుల మాటలాడునతనిఁ
గనిరి యింద్రాగ్నిలాంతకదనుజవరుణ
పవనధవసఖేశాన పూర్వకములుగాఁగ
సురలందరు మధుకైటభాసురేంద్ర
మదవిమర్దకనాభిపద్మజుని నజుని

(నిశ్శంకుని కొమ్మయ)

సీ. మహనీయతర యజమాన సూత్రంబులు
జపియించు ముఖచతుష్టయముదనర
పావననవనీతపరిలేపనంబున
మెఱుగెక్కియున్న క్రొమ్మేను వెలుఁగ
బహుచిత్రమృదుసూక్ష్మపక్ష్మశోభితమైన
హారిణాజినోత్తరీయంబు మెఱయ
శ్రీవత్సలాంఛనశ్రీమూర్తిచింతనా
సంభృతానంద బాష్పములు దొరఁగ
శారదాదేవి సావిత్రి శ్రద్ధ తుష్టి
మఱియుఁ గుళసూత్రికాంచి ధామములు వెట్టి
నెమ్మిఁగొలువంగ దర్భాసనమ్ము మీఁదఁ
జూడ నొప్పుఁ బితామహసోమయాజి

(కుడిచెర్ల తిప్పరాజు - కాంచీమహాత్మ్యము)

సీ. వేదాదులగు మహావిద్యలెల్లను గూడి
మూర్తిమంతంబులై మొనసి కొలువఁ
క్రతుమరీచ్యంగిరశ్శనకాదిసంయముల్
బలుమారు గనుసన్నఁ బనులు సేయ
సురసిద్ధకిన్నరగరుడవిద్యాధర
హాహాహూహూదు లంతంత నభినుతింప
నారదవిశ్వసనత్కుమారాంగిర
శతరుతు లుభయపార్శ్వముల మెఱయ
భావతోఁ గూడి యానందభరితుఁ డగుచు
సత్యలోకేశ్వరుం డుండు సంస్తుతింప
నిమ్మహాసృష్టి కెల్లను నిరఁతు గర్త
చూడుమీ బ్రహ్మలోకంబు సుభగమూర్తి

(వెదపాటి సోమయ - కేదారఖండము)

సరస్వతికి :—

చం. అమృతమువంటితల్లి కవితాలాపము బట్టవు దేవి వేదశా
స్త్రముల విహారభూమి కలపాణులకెల్లను బల్కుదోడు వి
శ్వమున సమస్తవిద్యల విశారద శారద నాదువక్త్రప
ద్మమున వసించి మత్కృతి చమత్కృతి పుట్టఁగఁ జేయుఁ గావుతన్

ఉ. వెన్నెలరూపు గప్పురపువేలుపు వజ్రపుబొమ్మ తెల్లఁ దా
బన్నిన నొప్పు తెప్పమునఁ బంకజపాత్రమునందుఁ బొల్చి క్రీఁ
గన్నుల బ్రహ్మ చూచి చిలుకఁ బలికింపుచునున్నవాణి యు
త్పన్నవశబ్దభావరసతత్త్వము మత్కృతి కిచ్చు నెప్పుడున్

(గంగరాజు చౌడన్న - నందచరిత్రము)

సీ. సింహాసనము చారుసితపుండరీకంబు
చెలికత్తె చలువారుబలుకుచిలుక
శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు
పసిఁడికిన్నెరవీణె పలుకుఁదోడు
వలువనెమ్మామిడమ్మలు కేళిగృహములు
తళుకుటద్దంబు సత్కవులమనసు
లు విహారణస్థలములు

చంద్రచందనమందారహారవర్ణ
శారదాదేవి మానసకాంతవీథి
నిండువేడుక విహరించుచుండుగాత

(శ్రీనాథుని నైషధము.)

ఉ. చీటికిమాటికిన్ మొగుడు చేతులు మాళిఘటించి మ్రొక్కఁదన్
హాటకగర్భుబోటికి మహావిశాంక్షితకల్పకాటవీ
వాటికిఁ దారకాహ్వయవల్లభమంజులపుష్పమంజరీ
జూటికి వల్లకీస్ఫురితసద్ధవరాటికిఁ వాగ్వధూటికిన్

(భావన పెద్దన - అనిరుద్ధ చరిత్రము)

విష్ణుస్తుతి.

సీ. ఎవ్వాని పొక్కిట నీరేడు జగములు
జన్మిప విభుఁగన్న పద్మమలరు
నెవ్వాని యురమున నిందిర సవతియై
చిరలీలఁ గౌస్తుభ శ్రీ వెలుంగు
నెవ్వాని చేతుల హేతు లాఁగఁగ గదా
కరవాల శంఖ చక్రములు మెఱయు
నెవ్వాని యంఘ్రి సన్నిటి పాపములు బాయు
గంగపుట్టిన పుణ్యకథలు వొల్చు

నట్టి పరమపురుషు నాదినారాయణుఁ
బుండరీకనయను భుజగశయను
విష్ణురూపాత్ము హరి హృషీకేశుఁ గేశవు
నిను భజింతు రఖిలమునులు సురలు.

(భాస్కర రామాయణము - యుద్ధకాండము)

శా. శ్రీరామాస్పదమైన పేరురము నా శ్రీవత్సచిహ్నంబు దా
నారూఢంబుగఁ దాల్చి శ్రీకిఁదగు చిహ్నంబొప్పఁగ వాఁడౌటసాం
పారం బెల్లను జేయు దేవుఁడు కృపావ్యాసక్తుఁడై మామక
ప్రారంభంబు నిరంతరాయశుభసాఫల్యంబుగాఁ జేయుతన్.

ఉ. శ్రీకి నిరంతరంబుఁ గడుఁజెన్నుపలారఁగ రాగలీల ను
త్సేకముఁ బొందియున్న తనచిత్తమునా వెదు మాడ్కి నిత్యర
మ్యాకృతినైన కౌస్తుభము వక్షమునందు ధరించు నుత్తమ
శ్లోకుఁడ పాంబశేషుఁడు త్రిలోకుఁడు లోకముఁ గాచు గావుతన్.

(ఎఱ్ఱాప్రెగడ నరసింహ పురాణము)

ఉ. శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభనూతనార్కరుచిగర్భితనాభిసరస్సరోరుహా
ప్రస్తుతమత్తభృంగరవనాగరశోభనభోగిభోగత
ల్పాస్తరణుండలంచు సుకృతాత్ము లపాస్తకిల్బిషుల్.

శా. శ్రీరామాకుచమండలామిళితకాశ్మీరాగ్రవక్షంబుతోఁ
బారావారతరంగసంగతలసత్పర్యంకనాగంబుపైఁ
గారుణ్యామృతపూరపూరితకటాక్షశ్రీలఁ బెంపొందు గం
భీరస్వాంతుఁ డనంతుఁ డాశ్రితజనాభీష్టప్రదుం డెల్లెడన్.

(అనంతని ఛందము)

శా. శ్రీరామాకృపాలిప్తసన్మృగమదశ్రీఁ బొల్చు వక్షంబునన్
శ్రీవత్సంబు వెలుంగఁ గౌస్తుభము లక్ష్మీదీపమై యొప్పఁగ

ద్వేషిక్షీలనలోలదీక్షుఁడగు శ్రీదేవుఁడు కృష్ణుండు
సద్భావంబొప్పఁ గృపావలోకనమునం బాలించుఁ ద్రైలోక్యమున్.

(రెడ్డిపల్లె ముద్దమరాజు-అష్టమహిషీకల్యాణము)

శా. ఓనారాయణ యోమురాసురహరా యోభక్తచింతామణీ
యోనీలాంబుదవర్ణ యోగుణనిధీ యోలోకరక్షామణీ
యోనీరేరుహపత్రనేత్ర కృప నాయుల్లంబులో నుండవే
యోనావే భవబంధముల్ దెరుపవే యోదేవకీనందనా.

శా. ఓలక్ష్మీపతి యోపురాణపురుషా యోపుణ్యసంకీర్తనా
యోలోకేశ్వర యోగజేంద్రవరదా యోద్వారకావల్లభా
యోలీలామనుజావతారపటనా యోకృష్ణ యోయచ్యుతా
యోలి న్నాదు మనస్సరోవరములో నోలాడవే యోహరీ.

మ. జయనారాయణ పుండరీకనయనా శార్ఙ్గీ జగన్నాయకా
జయపీతాంబర భక్తవత్సలవిరించిస్తోత్రపాత్రక్రియా
జయ జంభారివిరోధివిక్రమకళాశ్లాఘావిఘాతక్రియా
జయగోవింద ముకుంద మందరధరా శౌరీ మురారీహరీ.

చం. అసదృశసర్వశాస్త్రనిచయంబుల సొంపుఁ బురాణపంక్తిలో
మిసిమిసమస్తవేదముల మీఁగడ మంత్రచయంబులోని యు
య్యాసురు విశిష్టధర్మముల యుక్తితపంబులచేవ యుంచుని
పెనఁగఁగ నీదునామము మునీంద్రులు సెప్పుదు రగ్గి నచ్యుతా.

ఉ. అంగజగాల మోవదకు వ్యాధులకెల్ల బొజుంగు భీతికిం
గొంగ దరిద్రపుత్తముకు గొయ్య యఘంబుల వేరువిత్తు దు
ష్సంగతి వెన్నుసమ్మెట విషప్రకరంబుల దెత్తి త్రోవ నీ
మంగళనామధేయము సమాశ్రితభక్తివిధేయ యచ్యుతా.

(జైతరాజు మమ్మయ - విష్ణుకథావిధానము)

సీ. నారాయణునకుఁ బ్రణామంబు గావింతు
నడుగులకెరఁగుదు నచ్యుతునకుఁ
గైటభారికి నమస్కారంబు పాటింతు
మ్రొక్కుసేయుదు నాదివరాహమునకు
వందనం బాచరింతు వాసుదేవునకును
దండమొనర్తు గదాధరునకుఁ
బ్రణుతిసంపాదింతుఁ బరిపూర్ణమూర్తికి
నంజలి ఘటియింతు నఖిలపతికి
ననుచు నానందభరితులై యమరదైత్య
మునినరోరగసంఘముల్ వినతులగుచుఁ
గొలువనొప్పు జగత్పతిఁ గొలుతునిన్ను
నఖిలభూతాత్మ యాదినారాయణాత్మ.

సీ. అరఁగాఁబండిన నల్లనేరెడుపండు
మెఱుఁగున మెఱుఁగారు మేనివాఁడు
పెద పెద విరిసిన విరిదమ్మిరేకులఁ
దెగడు కన్నులుగల మొగమువాఁడు
మెండైన యేనికతుండంబు మెచ్చని
యిరుదోయి చేతులం బరగువాఁడు
దొమ్మదిరూపుల తుమ్మెదవాయని
పువ్వుదామరగల బొడ్డువాఁడు
కలిమిముద్దియ యురమునఁ గలుగువాఁడు
కడగిమిన్నేటిసెలయైన యడుగువాఁడు
వన్నెగల పైడిచీరల వన్నెకాఁడు
నేఁడు నాచూపునకుఁ బట్టమై నిలిచెననుచు

సీ. కమలజాదుల్ కన్న గోపాలుఁడవు గూడి నీ
మూర్తియుఁ గీర్తియు మోదలింపఁ
చతురాస్య జదువులఁ జననియుఁ గూడ నీ
యానికియు ఘనికియు నుపచరింప
హారుశిరోమాల్యంబు వరధనుప్రభయు నీ
యడుగును మడుఁగును నంగలింప
శివుని రథంబును జెనికుండలములు నీ
యజ్జయు సజ్జయు ననుసరింప
ననుసరింపఁగ స్తుతి సకలజగము
జగము లాగిఁబోవ నిల్పిన జలదధీశ
యీశ వాణీశ నిర్మలహృదయవాస
వాసుదేవ జగత్త్రయావాసదేవ.

సీ. సూర్యబింబోలు గౌస్తుభము పైఁ బ్రాలంబ
మనియెడు బరిసేవ మతిశయిల్ల
మేఘంబు సరియైన మేనిపైఁ బీతాంబ
రప్రభయును దటిత్ప్రభలు మెఱయ
నిండుఁ జందురు నవ్వునెమ్మొగంబున సుప్ర
సన్నతయును సుధాసారమమర
జలజంబుఁ దెగడెడు చరణంబునను దివ్య
దీర్ఘికయును బుట్టుదేన దొరయగ
హస్తముల శంఖచక్ర గదాంబుజంబు
లమర ధర్మార్థ కామమోక్షముల మాడ్కి-
నఖిలలోకేశుఁ డాద్యుఁడవ్యయుఁ డమేయుఁ
డమ్మహాత్ముండు మెఱయు నారాయణుండు.

సీ. ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నులఁ
బాలుద్రాగిన ప్రోడబాలుఁ డితఁడె
వ్రేల్మిడిఁ జాణూరువిరచి లోకములు మె
చ్చించిన యాజగజ్జెట్టి యితఁడె
దుర్వృత్తుఁడగు కంసు దునుమి యాతని తండ్రిఁ
బట్టంబుగట్టిన ప్రభువితండె
సత్యభామకు పారిజాతంబు పైఁగల
కోర్కెదీర్చిన రసికుండితండె
వెన్నలును గోపికాచిత్తవిత్తములును
సరసి మ్రుచ్చిలనేర్చు నా హరి యితండె
శ్రుతిశిరోభాగములఁ దన శుభగచరణ
సరసిజామోదమూన నూను జతురుఁ డితఁడె.

(సోమయాజి యుద్యోగము)

సీ. తొమ్మండ్రు కొడుకులఁ దొలివేలుపుల జేయు
బొడమించెనే దేవు బొడ్డుదమ్మి
మూడుత్రోవలఁ బాఱు మున్నీటి కర్తనాఁ
బరగు నే దేవుని పాదతటిని
వండ్రెండు రూపుల పగలింటిరాజు దా
వలతి యే దేవుని వలనుఁ గన్ను
వేయిమోనికవుదివ్వెలతోడఁ బడగల
మ్రోల్చు నే దేవుని మలక పాన్పు
మునుల కెల్ల నే దేవుని మూర్తి వెలుఁగు
హృదయగేహంబులో దీప మొత్తినట్లు
హరి మురారి యద్దేవు మహానుభావు
మానసులోఁ గంటి భవములు మానె నంటి.

సీ. పుండరీకములతోఁ బురుడించు కన్నులఁ
గారుణ్యమును తేనె గడలుకొనఁగ
మందారశాఖతోఁ మలయుఁజాలెడు కేలఁ
బాంచ జన్యంబను వందుమెఱయ
నుదయాద్రితటముతో నుద్దించు నురమునఁ
గౌస్తుభంబును దివాకరుఁడుఁ దోఁపఁ
నాకలోకంబుతో నవ్వు పాదంబున
నాకాశనది యను నమృతమొప్ప
నమృత ధారాధరము మాటలాడినట్లు
భాగ్యదేవత రూపు చేఁబట్టినట్లు
లలితగతినున్న సద్గుణాలంకరిష్ణు
విష్ణుఁబొడగంటి భవములు వీడుకొంటి.

సీ. పన్నగంబుల రాజుఁబగవాఁడుఁగూడి నీ
కయనంబుఁ బయనంబు సంతరింప
దుగ్ధవారాసికూతురు నాలుఁగూడి నీ
కరణంబుఁ జరణంబు నవదరింపఁ
చందురు చెలికాఁడు సైదోడుఁగూడి నీ
యుల్లంబు మొల్లంబు నుపచరింపఁ
దామరపగవాఁడు దయితుండుఁగూడి నీ
బడినూపు గుడినూపుఁ బరికరింపఁ
గంపమానమనోద్యానగతులుగాన
సేకతంబున్న మునులను సేకతంబు
లేక పొడగానవచ్చునీలీలఁగావ
నన్నుఁడేనాటి ధన్యుండొ యంబుజాక్ష.

(సోమడు)

నీలాద్రి దనరు మాణిక్యపు శిఖరంబు
క్రియ నూత్నరత్నకిరీటమెసఁగ
గగనంబు నడిమిచక్కటినొప్పు నరుణాంశు
కరణిఁ గౌస్తుభము వక్షమున వెలుఁగ
జలరాశి బొదివిన సాంధ్యపయోదంబు
క్రమమున పీతాంబరము దలిర్ప
మేచకాభ్రంబున మెరయు సురేంద్ర చా
పము లీల వనమాల ప్రస్ఫురిల్ల
వల్లవానుజాయుత మేనొప్పఁ దెల్లదమ్మి
విరుల సిరిగన్న కనుదోయి యరుదుగాఁగ
నమరు జగదీశు సకలహితార్థజన్మ
జన్మవిరహిత వసుదేవజాతఁ గాంచి

(ప్రగడగారి నరసింహపురాణము)

దశావతారములకు - భీమన చెప్పినది.

శ్రుతి సుధాత్మాభక్త సురజననీ వధూ
మల్ల శంకర ధర్మమహితబుద్ధి
కనకాక్షమర్దికిటి నరమృగకుబ్జ రామరా
మానంత బౌద్ధ కల్క్యాహ్వయముల
నముచిమాంతకకరదానవబలార్జునపంక్తి
ముఖనష్టికక్లిష్టి విముక్తఖలుల
పుచ్ఛాగ్రవృష్టవిస్ఫురదంష్ట్రనఖగుణ
పరశుబాణకరాంగఖురపుటముల
జెరిచి దార్చి యెత్తి చీరి బంధించి ని
ర్జించి యేసి యార్చి చెరిచి వాట్ట
గడఁగనున్న శౌరి కరుణాకరుఁడు శుభా
కరుఁడు మాకు భీమపరుఁడు గాత.

ఆంధ్రకవి రామయ్య - విష్ణుకంచీమాహాత్మ్యము

సీ. శ్రుతులును నిర్జరస్థితులును మఱుఁగుడింప
నిగుడింపఁజాలు నీనేర్పుకలిమి
ధరణియు రిపుగర్వసరణియు ధరియింప
హరియింపఁ జాలునీయాలవుకలిమి
ధాత్రి పర్మిలిగన్న మాతను బాలింపఁ
లాలింపఁజాలు నీలావుకలిమి
గేహాని రవిసుతావాహిని సాధింప
భేదింపఁ జాలునీ పేర్మికలిమి
జనులఁబాతకజనులనుజగుపనుగుప
నెఱయ నీనేర్పుకలిమి దివ్యములు నీకు
మత్స్యకూర్మ మహీధర మనుజసింహ
ఖర్వ రామ త్రయీబుద్ధ కలికిగతులు.

శ్రీలక్ష్మికి - ఎఱ్ఱాప్రెగడ నరసింహపురాణము.

ఉ. చందనచారుపత్రకము సంస్తుతకౌస్తుభకర్ణికంబున
స్పందితలాంఛనభ్రమరసంజమనోజ్ఞము నై తనర్పుగో
విందు నురస్స్థలంబ యరవిందముగా సొగయించియున్న యా
య్యిందిర మాచుగాత కృపనింప భుజాఫల భక్తసంతతిన్.

పోతరాజు భాగవతము - దశమస్కంధము

మ. హరికిం బట్టపుదేవి పుణ్యములప్రోవర్థంబు పెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీగిరిసుతల్ తో నాడు బూఁబోడి తా
మరలందుండెడు ముద్దరాలు జగముల్మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములఁబాపు తల్లిసిరి యిచ్చున్నిత్యకల్యాణముల్.

సుదర్శనము — వీరమాహేశ్వరము.

సీ. దైతేయకాంతల తెలుపుఁ గెమ్మోవుల
విటకాశ్రీలకు విడుకోలు
వేల్పుటిల్లాండ్ర కొప్పిండవు జన్నులమీఁది
యాకుపు పయ్యెదలకు నిలువనీడ

విశ్వజగత్త్రయీ విజయలక్ష్మీ గాథ
బిరుదోత్సవములకుఁ బెండ్లివిందు
పరిపంథివాహినీ పరిచిత పరాభవ
ప్రాప్తి సంకథలను బాయుద్రోవ
సేసియయ్యది విలసిల్లుఁ జక్రమహిమ
నది ప్రయోగింపనత్తె నయ్యచ్యుతుండు
విలయసమయసముద్భూతవిపులదహన
దారుణ స్ఫుర్జనంబు సుదర్శనంబు.

పోతరాజు భైరవుని శ్రీరంగమాహాత్మ్యము.—

సీ. ప్రళయమార్తాండ మండల చండతర సము
ద్భూతభూరిప్రభాపుంజమగుచు
ఘన సహస్రార నిర్గత మహోగ్రానల
జ్వాలావలీఢ దిగ్జాలమగుచు
సహజ తేజోవిశేష క్షణాంతరోద్భూత
సర్వ దివ్యాస్త్ర విస్తారమగుచు
గళిత నిర్ఘాత సంఘాత భీషణఘోష
నిర్భిన్న రాక్షసీ గర్భమగుచు
సకలశుకముఖ్యమునియోగిజనసమగ్ర
మహిత నిగమార్థ సంస్తూయమానమగుచు
వచ్చు మానసవేగమై వనజనాభ
దాసభయకర్శనంబు సుదర్శనంబు

భావన పెమ్మరసంగారి అనిరుద్ధ చరిత్రము.

సీ. రక్షోవధూవృత్త వక్షోజ పరిలిప్త
కుంకుమక్షోదంబు గ్రొవ్వడంచి
శక్రారి మదవతీ వక్రాలకా భోగ
ఘనతమః పరిభాగ గరిమనడంచి

భావన పెమ్మరసంగారి అనిరుద్ధ చరిత్రము.

సీ. ఘనపక్షవిక్షేపజనితవాతాహతిఁ
బర్వతశ్రేణుల పాదుగదల
విపులాస్యకర్ణికావిర్భూతదీప్తుల
మలయాద్రి యవ్వల వెలుఁగఁబార
శతకోటిశరచండజవభవారవముల
శరధులు ఘూర్ణిల్లి బరలుగడవ
వితతాద్భుతాపాది విభ్రమోదితకాంతి
దెసల హేమద్యుతి దీటుకొనఁగ
సిద్ధచారణగణనుత శ్రీ(దన)ర్చ
మింటఁబరగు రెక్కలతోడి మేరువనఁగ
పచ్చఁదనరాక కపిలంబుఁ బిచ్చలింపఁ
బక్షిదేవుండు బుండరీకాక్షుకడకు.

ప్రగ్గడ పారివంశము.

సీ. సర్వ(వధీనుఁడై) చను పతంగుండు గ
లఁడో కాక యరయ నన్యూనబిగమున
నెఱకలు వడసి యొయ్యెడఁ బ్రవర్తిల్లెడు
మేరఁగాంచెనో కాక మేరుశిఖరి
అంబరశ్యామక యంబుధి పొగరుగా
భ్రమసి యెక్కెనో గాక బాడబాగ్ని
హైమమై పరగు బ్రహ్మాండంబు పక్వమై
తగఁబుట్టెనో కాక ఖగ మొకండు
నైన కేయుండు నీతృశవ్యాప్తిదీప్తుఁ
డాతఁడో కాక యితఁడని యఖిలజనులు
బహువిధానుమానారంభపరతఁజూడ
నరుగుదెంచెఁ బక్షిప్రభుఁ డభ్రవీథి. (అ౬-141వ)

ఆంధ్రకవి రామయ్య – కాంచీమాహాత్మ్యము.

సీ. గజ కచ్ఛపంబులె... రుని ...
కుతుకలో నికిని రాజభీతు
సకల లోకములు నే జవసత్త్వసంపన్న
ఖురళికాయాత్రకు గోష్పదంబు
బలభేది వజ్రమే యాలఘు రెక్కలలోనఁ
జిక్కెఁ బెంపె ... ... చితపుల్ల
కద్రూతనూజవర్గంబులే మహాసియు
నాగ్రహోగ్రులకుఁ జొక్కఁకు వటువ
యాతఁడు హరిఁగొల్వ నచ్చోటి కరుగుదెంచె
శంఖచూడాసుదత్కుంఠమపరోష
హాహానోదారకాభీలసాహసైక
జనితదార్ఢ్యుఁడైనట్టి వినతపట్టి.

భైరవుని శ్రీరంగ మాహాత్మ్యము.

ఉ. ఆయతచండతుండనిహతాహినికాయుని సత్తవోటక
ఛ్ఛాయుని సర్వవేదమయసన్నుతకాయుని దేవదానవా
జేయుని సప్రమేయుని నశేషవిహంగకులాధిపత్యధౌ
రేయునిఁ బ్రస్తుతింతు సుచరిత్రవిధేయుని వైనతేయునిన్.

భాగవతము – దశమస్కంధము.

క. అ[illegible]కనకసన్నిభ
పత్త్రయుగోద్భూతఘోరపవమానమహా
విక్షేపకంపితాశా
కక్షోణిధరేంద్రుఁడగుచు గరుడుఁడు వచ్చెన్.

భాస్కరుని రామాయణము - యుద్ధకాండము.

సీ. కుప్పించు సురపడి కుంభిని వడిగ్రుంగి
సర్పాధిపతితలల్ చదియనడుము
నెగయు నూఁకున మీఁదికెత్తిపారిన తరు
శ్రేణులు చుక్కలం జెదరనడువ
నెఱులు సారించునెపునం గడలెత్తి
యేఁగువారాసులు నెడములొత్తఁ
బరుచు బల్విడి పక్షిపంక్తులు సుడిఁగొంచు
వలయుంపుఁగొండ యువ్వలికిఁదూలఁ
పర్వతములు వడఁక బ్రహ్మాండకోటర
మద్రువ గగనవీథి నరుగుదెంచ
రఘుకులేంద్రబంధవిఘటితశ్వరితాంత
రంగుఁడగుచు నవ్విహంగవిభుఁడు.

భైరవుని శ్రీరంగమహాత్మ్యము - విష్వక్సేనునికి.

కం. శ్రీరమణచరణసేవా
చారనిరూఢావధాను సత్కారిజయ
శ్రీరాజమానుదానవ
వీర ఖగశ్యేనుఁదలతుఁ విష్వక్సేనున్.

రామకవి రామయ్య - కాంచీమహాత్మ్యము.

శా. ఇష్వాసక్రకచాదిసాధనవరాహీనప్రభాంగీకృతా
భిష్వంగద్యుమణిద్యుతిప్రకరుఁడై పీతాంబరాలంకృతున్
విష్వక్సేనుని గౌస్తుభాభరణు నుర్విన్ శ్రీయుతుఁగొల్చియా
విష్వక్సేనుఁడు పంచరించు గణరాడ్విఖ్యాతుఁడా చక్కటిన్.

నన్నయభట్టు ఆదిపర్వము – శేషునికి.

చం. జనములు వనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహితమహామహీతల మజస్రసహస్రఫణాలిదాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన యు
ద్ధ్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్.

భైరవుని శ్రీరంగమహాత్మ్యము.

మ. శయనం బై యుపధాన మై నిలయ మై సచ్ఛత్ర మై పాదుకా
ద్వయ మై మంగళపీఠ మై మృదులవస్త్రం బై సమీపోచిత
క్రియలం జక్రికి నిత్యసంహితమూర్తిం బొల్చు శేషాహి న
న్నయమేధానిధిఁ గావ్యలక్షణకళాచార్యుం బ్రశంసించెదన్.

హనుమంతునికి – భైరవుని శ్రీరంగమహాత్మ్యము.

చం. పరిచరుఁ గాఁగ జేరె నిరపాయచరిత్రుని శత్రుకానన
స్ఫురదురువీతిహోత్రుని సముజ్జ్వలమేరుసమానగాత్రునిన్
బరమపవిత్రుని న్మునిసుపర్వకృతస్తుతిపాత్రునిన్ మనో
హరఫలకేసరీకబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్.

చినమల్లు శ్రీగిరన్న – శ్రీరంగమహాత్మ్యము.

శా. సంతోషంబునఁ బొందితే విమలస్వాంతు న్మహాదానవ
ధ్వాంతవ్యూహవిదారణోజ్జ్వలవివస్వంతున్ యశఃపూరితా
శాంతున్ సాహసవంతు నిర్భరజయాయత్తైకవిశ్రాంతు ధీ
మంతున్ భర్మనగేంద్రకాంతుని హనూమంతున్ జవాత్యంతునిన్.

రాయసం గణపయ – సౌగంధికాపహరణము.

శా. అంతంతం గబళింపఁగాఁ గడఁగి బాలార్కున్ ఫలభ్రాంతిచే
నంతోల్లంఘనకేళి దాఁటెను సరస్వంతు న్మహాదానవా
క్రాంతారామమహీరుహంబుల మదక్రీడం దుంచెన్ హనూ
మంతుం డున్ గపి యున్నవిం గపులె సామాన్యాటవీచారముల్.

భాగవతులకు – మఱికి సింగరాజు పద్మపురాణము.

సీ. హరిసేవనామృతాస్వాదుఁ బ్రహ్లాదును
సన్నుతచారిత్రు శక్తిపుత్రు
సంగీతవిద్యావిశారదు నారదుఁ
బుణ్యాత్మశ్లోకుఁ బుండరీకు
భారతసంహితాభ్యాసు వేదవ్యాసు
నతులపావనవేషు నంబరీషు
నవిరళజ్ఞానవిద్యాసమున్నతు శుకుఁ
గ్లిష్టాఘశర్దమగ్రీష్ము భీష్ము
నరు విభీషణు సనకు సనందుఁ గపిలు
వాయునందను శేషాహి వైనతేయు
లాదియగు భాగవతులను నాళువారిఁ
బరమభక్తిఁ దలంపుదుఁ బ్రతిదినంబు.

భైరవుని శ్రీరంగమాహాత్మ్యము.

ఉ. వినుతింతున్ హరిభక్తిపెంపున జగద్విఖ్యాతులై పుణ్యకీ
ర్తనులైనట్టి పరాశరుం గపిలు వేదవ్యాసుఁ బ్రహ్లాదు న
ర్జును రుక్మాంగదు నంబరీషుని వసిష్ఠుం బుండరీకుం బురు
త్రనయున్ భీష్ము విభీషణున్ సురమునిన్ దాల్భ్యున్ శుకున్
శౌనకున్

నారదునికి:-

సీ. ఉదయార్కబింబంబుఁబోర నొలచిగోష్పట్టి [illegible]
[illegible] గోపనము [illegible]
[illegible] జరిగొన్న [illegible]
యజ్ఞోపవీతంబు లరుతఁబోలయు

నను రైనకుసుమఁ బెట్టిన పల్లవంబుల
చాయ సన్నపు గుజ్జుజడలు గ్రాల
గందువోఁ జనశేటిఁ గడిగిన శశిరీతి
యొడగలి ముత్యంపు గొడుగుననర
జగతిఁ దనుకాంతి యనపమచంద్రికావి
భాతిఁ బ్రసరింప దివినుండి పార్థివేంద్ర
కొలువునకు వచ్చె సభయెల్ల నెలమిఁజూడ
నారదుఁడు సర్వలోకవిహారశీలి

బమ్మెరపోతరాజు భాగవతము – ప్రథమస్కంధము.

సీ. తనచేతివల్లకీతంత్రీచయంబుల
సతతనారాయణశబ్దమొప్ప
నానాకవంగీతహారిగీతవరసుధా
ధారల యోగీంద్రతతులుచొక్క
కపిలజటాభార కాంతిపుంజంబుల
దిశలు ప్రభారత ధీ (తదీధితి) వహింప
తనులగ్నతులసికాదామగంధంబులు
గగనాంతరాళంబు గప్పికొనగ
వచ్చెమింటనుండి వాసవనందను
గడకు మాటలాడ ... తోడ
భవ్రవిముక్తిపారగుం డారూఢ
నయవిశారదుండు నారదుండు.

పిల్లలమఱ్ఱి పినవీరయ్య – శాకుంతలము.

సీ. కర్పూరనవపరాగవిపాండుతనుకాంతి
యాకదోరచారుచంద్రికలుగాయ
వికటారకూటపల్లవదారముల
బద్ధమగుటంబు రేయెండ చిగురులీన

పాటీరాజినోత్తరీయచ్ఛాయ బ్రహ్మకే
జటికృశానుని పొగచాయ నెఱయ
కుటిలమావిర్మహీకుబ్జలాంఛంబు
నొసలిపై జేఁగటి నూఁగువార
నచతుగానవపద్మజుం డనలికాంత
శంకరుం డచతుర్భుజచక్రపాణి
యఖిలలోకైకసంపూజ్యుఁ డరుగుదెంచె
నారదుఁడు శాంతిజితశరన్నీరదుండు.

గాకుని కొమ్మయ – వీరమాహేశ్వరము.

సీ. కడిదియుద్ధంబుల గదిసి యొఁకలిదీర
మించు జూపుల నారగించువాఁడు
గడియసేపైన నొక్కెడ నూరకుండక
త్రిభువనంబుల సంచరించువాఁడు
మారుతంతులవీణె నూతనంబగు క్రియా
హేవాక మొప్ప వాయించువాఁడు
గోర్లుదాటించి నిర్నిమిత్తంబుగ
పీకున బోరుగావించువాఁడు
మునివరేణ్యుండు పద్మగర్భునికి నింపు
గొనలుసాగంగఁబుట్టిన కొడుకుగుఱ్ఱ
చనియె శర్వాణిఁగొలువంగఁ దనువిలాస
శారదాంబుదవర్ణుండు నారదుండు.

చంతలూరి చిన్నన్న – నాచికేతూపాఖ్యానము.

సీ. ప్రాలేయకిరణబింబస్ఫూర్తి దలపించు
విశదంపు దనుకాంతి దిశలు వ్రాఁక
జగినిండ దాల్చిన జాజుకటాకులసాంపు
పాటించు ఘనజటాభరము మెఱయ

కాంచనమౌంజీవిలాసంబు గడకూడి
చెలువునారూపుచు మృగాజినము దనర
కమనీయకోమలకరపయోరుహమునం
బ్రకటితమగు విపంచిక దలిర్ప
హారికథాలాపశోభితమైన యట్టి
యౌవనంబు ప్రసన్నత నలరుచుండ
గగనమునుండి సమవర్తి కడకువచ్చె
నమరసంయమివరుండు విద్యాగురుండు.

కవిస్తుతి.

కవులకు - వాల్మీకిస్తుతి - శాకమూరి గంగాధరుని

బాల భారతము.

శా. శ్రీరామాయణకావ్యకల్పక వరించి స్వాదమ్ముంటావ గ్రం
థారప్రౌఢమనీషిసర్గమునిమార్తాండుండవఃకీర్తి ల
క్ష్మీరమ్యున్ భువనైకవంద్యుఁడగు వాల్మీకిం గవిగ్రామణిన్
ధారాళస్థిరభక్తియుక్తిఁదలతుం దత్త్వజ్ఞచూడామణిన్.

రెడ్డిపల్లి ముద్దరాజు అష్టమహిషీకల్యాణము.

ఉ. రామకథాసుధారసము బ్రహ్మపయోంబుధి మగ్నమైయుండగా
నేమునివాక్యమందరమహీధరసమ్మథనంబుచే సము
ద్దామత సంగ్రహించి విబుధప్రకరంబున కిచ్చె వర్థమై
నామహితుం బ్రచేతసుని యాత్మజుఁ గొల్చెద నాదిసత్కవిన్.

శ్రీనాథుని భీమఖండము.

శా. శ్లోకంబుల్ శతకోటి కాండములుగా నూటిడ్రించి రామాయణం
బేకాకాతర మెల్లపాపముల మాయించంగ నిర్మించి సు
శ్లోకుండైన పురాణసంయమివరుం జూతు న్మనోవీధి వా
ల్మీకిన్ బ్రహ్మపదావతీర్ణకవితాలీలాసతీవల్లభున్.

రాజశేఖరభారతీజహ్నుకన్యక
సూక్తిబిందులకు భావశుద్ధిఁ జేయు
శ్రీఘనవాణీశ్రీశకూర్పుతగతి సాగ
కృతులకు రోమహర్షణంబుఁ జేయు
దని నుతించి వారిఁ గుణగుణంబులు దలఁచి వ
ర్ణించి దండి నమస్కరించి
వామనుని గుణాఢ్యు క్షేమేంద్రు నిల నలం
కారవిధుఁ దలఁచి గౌరవమున.

కవినుతి - నన్నయభట్టు  గంగాధరుని బాలభారతము.

కం. శబ్దార్థరసవిశారదు
శాబ్దికచూడార్థన్యు శబ్దశాసనబిరుదున్
ర
శబ్దఘటారభటి నన్నపార్యు నుతింతున్.

శ్రీనాథుని భీమఖండము:—

కం. నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయు సార్వభౌముఁ గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘన సమర్థు (పటిష్ఠ) గాఢప్రతిభున్.   (అ1–౧౪)

కవినుతి – తిక్కనసోమయాజికి – గంగాధరుని బాలభారతము.

ఉ. ఆంధ్రకవిత్వతత్త్వసముదంచితకీర్తిని దిక్కయజ్వ నీ
రంధ్రతరప్రభావనిధిఁ బ్రస్తుతిసేయుదు నుల్లసత్
కంధరగభీరమంజుతరగర్జితవిభ్రమభవ్యభంగి నై
రంధ్రికమైన చాటుమధురస్ఫుటబంధురవాగ్విజృంభికన్.

ఉ. పంచమవేదమైపరఁగు భారతసంహిత నంధ్రభాషఁ గా
వించెఁబదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యున కఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకావ్యవైభవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్.
(భీమఖండము 1–9)

కవిస్తుతి – తెలుఁగుకవుల సమూహమునకు ౭౮ ౬

రామయ్య శాంతీశాస్త్ర్యము.

సీ. శబ్దశాసనకావ్యసంఘట్టనక్రియా
నందిత బుధవర్యు నన్నపార్యు
నుభయభాషారచనోన్నిద్రభద్రవ
చోరాజి దిక్కన సోమయాజి
లక్ష్మీలతాంతనికాలంకారసౌభాగ్య
పరిపాకవ్యవిన్యాసు శంభుదాసు
ఛందోనిబంధన చాతురీధౌరేయు
వాగ్ధాము వేములవాడ భీము
రసికజనపద్మదిననాథు రంగనాథు
వికటకృతికర్త్రనిస్తంద్రు భాస్కరేంద్రు
నమితరసభావు శ్రీత్రిపురారిదేవు
సూక్తినిధాను నాచనసోముఁ దలఁతు.

వసిష్ఠుఁడు – పద్మపురాణము – మడికి సింగరాజు.

చం. కనియె శ్రుతిస్మృతిప్రకరగాఢతరార్థపటిష్ఠు దివ్యబో
ధనపదవీమహాత్మ్యసముదగ్రసమగ్రుఁ దపోవిశేషసం
జనితనితాంతపుణ్యగణసంచయనవ్రతనిష్ఠు శేముషీ
జనితహితప్రభావమునిసంఘవరిష్ఠు వశిష్ఠు నయ్యెడన్.

చం. పరమవివేకసాగరుఁడు పంకజసంభవసంభవుండు స్వా
మరహితవహ్నితుల్యుఁ డసమానతపోనిధి విష్ణుభక్తిత
త్పరుఁ డఘదూరుఁ డాఢ్యుఁడు కృపారసచిత్తుఁడు దివ్యబోధను
స్థిరుఁడగు నవ్వసిష్ఠుఁ డరుదెంచె వనీపనృపాలు పాలికిన్.

భారతము – (వ్యాసుఁడు)

ఉ. ప్రాంశుపయోదనీలతనుభాతు సుజ్యోలదండధారుఁ బిం
గాంశు జటచ్ఛటాభరణు నాగముపుంజపదార్థతత్త్వని
స్సంశయశాలిఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవిసర్జనుం ద్రిదశవందితు సాత్యవతేయు గొల్చెదన్.

అగస్త్యునికి - భీమేశ్వరపురాణము - శ్రీనాథుఁడు.

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిద్ధాంతు లీఁకించె
గంభీరకంఠహుంకారగర్జ
ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబు
నెవ్వాఁడు శివునిచే నాగికొనియె
గడసిల్లుధరయొద్ద గడచిన నెవ్వాఁడు
క్రోసుచుఁ గటిఁ జందమామవఁగచె
వంభోధు లేడింటి నాపోశనంబె తి
కలిగించె నెవ్వాఁడు క్రిమ్మఅంగ
భీమనాథేశ్వరుఁడు గారిఁబె డ్రియాడి
దక్షిణాముఖకల్యాణదగ్రపమున
వత్సరము వత్సరమున నెవ్వానిఁజూచు
నతఁడు గగనాగ్రగామిణిక్ష మాగుగుదెంచె

కాశీఖండము:—

సీ. ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబు
కడదాఁక నెఱిఁగిన కఱదలాని
వాతాపిదైత్యు నిల్వలునితోఁ గూడంగ
జఠరాగ్ని వేల్చిన సవనకర్త
కోపించి నహుషుని గుంభీనసంబుగా
హుంకారమిచ్చిన యుగ్రతేజు
వానకాలమునందు వండువట్టిన నీటి
కాలుష్యముం దెలుపు కతకఫలము
పాండుభసిత త్రిపుండ్రాంక ఫాలభాగ
భద్ర రుద్రాక్షమాలికా భూషితవక్షు
భార్యయును దాను నేతెంచు పరమశైవుఁ
గాంచె వింధ్యాచలేంద్రంబు కలశభవుని.

దండములు పెట్టెదము మోడ్పెదము కరములు
సేవ యొనరించెదము మమ్ముఁగావు ప్రోవు
యాగవేదికివిచ్చేయుము మారగింపఁ
బ్రిథమజన్మలయింటి కల్పద్రుమంబ.

వీరమాహేశ్వరము—

సీ. కలికిచీకటుల మూఁకలు సగ్గుమాయఁగా
మరిది మూఁకత్రాగు నెరతసంబు
బొట్టెటిరాయని చోళపుంబు గదలించి
వాహ్యాళిగదలెడి వైభవంబు
క్రతుభాగములుదెచ్చి కైతప్పగాకుండ
వేల్పుల కందించు వెరవుసొంపు
మూడుమూర్తులుదాల్చి మారువుతోఁజన్నంపు
వేదిపై గొలువుండు విభ్రమంబు
నీకుఁజెల్లు నోరులు నీతోడిసాటికి
బేరుగ్రుచ్చి యెన్నలేరు జగతి
వశమెనిన్నుఁబొగడ సాక్షాద్వధూకుచా
భ్యున్నతప్రకాశ యోమహాశ.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## కాకినాడ.



**1949-50**

## విరోధి సంవత్సర ఆయవ్యయ

## పట్టిక.

# విరోధిసంవత్సరము (1949-50)

## ఆయ వ్యయ పట్టిక.

| వివరము. | | మొత్తము. |
|---|---|---|
| 1. సంవత్సరాది నిలువ | | 238-10-2 |
| 2. బ్యాంకినుండి వచ్చినవడ్డీ | | 700-10-0 |
| శ్రీబొబ్బిలివారి పత్రముల పై | | |
| మూలవలన | 400-0-0 | |
| శ్రీవెంకటగిరివారి ,, | 300-0-0 | |
| చిల్లరజమా, వడ్డీ | 0-10-0 | |
| | 700-10-0 | |
| 3. పత్రిక చందాలు | | 18- 0-0 |
| 4. పుస్తక విక్రయము | | 1998- 0-9 |
| 5. కొత్తపల్లి సుబ్రహ్మణ్యముగారి ఖాతాకుజమ | | 3- 7-0 |
| మొత్తము | | 2958-11-11 |

## 1949-50 విరోధిసంవత్సరము ఆయవ్యయపట్టిక.

| | వివరము. | మొత్తము. |
|---|---|---|
| 1. | బ్యాంకి వ్యయములు | 3- 8-0 |
| 2. | బదుళ్లుతీర్చినవి | 500- 0-0 |
| 3. | పోస్టువ్యయము | 19- 2-9 |
| 4. | ఉద్యోగుల జీతములు | 658- 8-0 |
| 5. | ఉద్యోగుల ప్రయాణవ్యయములు | 5- 0-0 |
| 6. | పత్రికలకు కాగితము & ముద్రణము | 167- 3-0 |
| 7. | చిల్లరబైండింగు | 62- 3-0 |
| 8. | నిఘంటుబైండింగు | 702-13-0 |
| 9. | పత్రికలకు చందాలు & కొనిన పుస్తకములు | 196- 1-3 |
| 10. | సాదిలు | 87- 6-0 |
| | | 2352-13-0 |
| | సంవత్సరాంతమున నిలువ | 605-14-11 |
| | మొత్తము | 2958-11-11 |

# పుస్తక విక్రయము

| | | మొత్తము |
|---|---|---|
| 1. | విప్రనారాయణ చరిత్రము | 2- 6-0 |
| 2. | జైమినిభారతము | 17- 7-0 |
| 3. | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 10- 0-0 |
| 4. | జ్యోతిశ్శాస్త్రసారము | 0- 8-0 |
| 5. | జ్ఞానప్రసూనాంబికా శతకము | 0- 4-0 |
| 6. | సర్వేశ్వరశతకము | 0-15-0 |
| 7. | కావ్యాలంకార చూడామణి | 0- 8-0 |
| 8. | అకారాద్యముద్రిత గ్రంథసూచిక | 0- 8-0 |
| 9. | ప్రాకృతభాషోత్పత్తి | 0-12-0 |
| 10. | శివతత్త్వసారము | 5- 8-0 |
| 11. | చంద్రభానుచరిత్రము | 2-11-0 |
| 12. | శివరాత్రిమాహాత్మ్యము | 5- 5-6 |
| 13. | ఆర్యభాషావిభాగము | 0- 8-0 |
| 14. | హాస్యరంగములు | 0-15-0 |
| 15. | మన్నారుదాస విలాసనాటకము | 2- 4-6 |
| 16. | కాళిందీకన్యాపరిణయము 1 భా | 5- 2-0 |
| 17. | డిటో 2 భా | 2- 7-0 |
| 18. | రెడ్లనాటి రెండుశాసనములు | 0- 4-0 |
| 19. | ఆంధ్రధాతుమాల | 0-12-0 |
| 20. | శాసనపద్యమంజరి 1 భా | 13- 1-9 |
| 21 | డిటో 2 భా | 1-10-9 |
| 22. | శతకసముచ్చయము 2 భా | 1- 4-0 |
| 23. | పరిషత్పుస్తకభాండాగారము 2 భా | 0- 8-0 |
| 24. | డిటో 3 భా | 0- 8-0 |
| 25. | సూత్రాంధ్రవ్యాకరణము | 1- 0-0 |

| | | మొత్తము |
|---|---|---|
| 26. | రసాభరణము | 0- 3-0 |
| 27. | షోడశకుమార చరిత్రము | 0-15-0 |
| 28. | ఆంధ్రీకృతహంససందేశము | 0- 8-0 |
| 29. | రాయవాచకము | 1- 7-3 |
| 30. | సింహాసనద్వాత్రింశిక 1 భా | 6- 4-9 |
| 31. | డిటో 2 భా | 5- 9-0 |
| 32. | నిఘంటుచరిత్రము | 1- 8-0 |
| 33. | ఆంధ్రకౌముది | 1- 0-0 |
| 34. | Dravidian Lexicography | 0-12-0 |
| 35. | Defence of Literary Telugu | 0- 8-0 |
| 36. | చాటుధారాచమత్కారసారః | 1- 0-0 |
| 37. | సాంబోపాఖ్యానము | 6-10-0 |
| 38. | రసార్ణవాలంకారము | 0-15-0 |
| 39. | కవిజనోజ్జీవని సమస్యలు | 0- 4-0 |
| 40. | రఘునాథరామాయణము | 1- 7-0 |
| 41. | రజతోత్సవ సంపుటము | 3-14-0 |
| 42. | అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము | 0- 4-0 |
| 43. | లక్షణసారసంగ్రహము | 0- 8-0 |
| 44. | లౌకికన్యాయవివరణము | 1- 0-0 |
| 45. | కావ్యాలంకారచూడామణి పాఠభేదములు | 0- 8-0 |
| 46. | సీతారామచరిత్రము | 2- 9-0 |
| 47. | విడిసంచికలు | 9- 0-0 |
| 48. | ఉత్తరరామచరితము | 1-14-0 |
| 49. | అమరకోశము | 1-14-0 |
| 50. | చంపూరామాయణము | 1-14-0 |
| 51. | ఆధునికాంధ్రవాఙ్మయ వికాసవైఖరి | 1-14-0 |

| | | | మొత్తము |
|---|---|---|---|
| 52. | శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు | 1 భా | 559-12-0 |
| 53. | డిటో | 2 భా | 485-12-0 |
| 54. | డిటో | 3 భా | 481-12-0 |
| 55. | డిటో | 4 భా | 429- 4-0 |
| | | | 1998- 0-9 |

కిళాంబి రాఘవాచార్యులు

వింజమూరి వెంకన్నపంతులు

కార్యదర్శులు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు
పిఠాపురము మహారాజావారు, పరిషదగ్రాసనాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, ఉయ్యూరు జమీందారువారు

## కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (కోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.

,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

,, వెంపటి రామబ్రహ్మముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుంగూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు రామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రశాస్త్రిగారు, ఎమ్. ఏ. (ఆనర్సు)

,, వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

# శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు.

## చతుర్థ సంపుటము.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 960 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియగుదుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు రెండవసంపుటమున 'క' మొదలు 'ఙ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటెను ఇది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు నను తలంపుతో నీ క్రింది వెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము వెల రు 5 లు, ద్వితీయ సంపుటము రు 4 లు, తృతీయసంపుటము రు 4 లు, చతుర్థ సంపుటము రు 4 లు.

Printed by N. Achutaramayya at the Cocanada Printing Works Cocanada and Published by K. Raghavacharyulu, Sec●retary Telugu Academy, Cocanada.